శ్రీ

కృత్యధీశ్వరి.



శ్రాణ ప్రాణ కళామణి ప్రసరవిభ్రాజత్ కిరీటా! కళా
వీణానాద! కృపావలోకమధుమూర్తీ! శుకహారోల్లసత్
పాణీ! జ్ఞాన సుధాకరాస్య! నటన ప్రావణ్య మంజీర వి
క్వాణాంచత్పదపద్మ! మన్నుయువ పర్యాకార! వాగ్దేవతా!

ఓం నమోభగవతే శ్రీరమణాయ. శ్రీ భారతీ దేవ్యైనమః.

# కృతి సమర్పణము

౧

శ్రీవాక్ప్రాణ నిగూఢమూర్తి హితశక్తిస్పంద సౌందర్య వి
ద్యా విద్యోత రస స్వరూపిణికి, రమ్యానందగమ్య స్వరూ
పావిష్కారసుఖానుభూతికి, తదీయాద్వైత సంభావనా
భావాలోక విశోక, మీతెలుఁగు ధ్వన్యాలోక, మర్పించెదన్॥

౨

ఏనాడో జగదంబ! నా బ్రతుకు నీకే యర్పణంబిచ్చి యు
న్నా. నీవే నను బుద్ధియున్ భవదధీనంబంచు నిర్భీతి ను
న్నా, నైనన్ నిరవద్యనిస్తుల కృపానాట్యాత్మవౌ నీవు నా
లో నర్తింపవు పక్షపాతమిది నీలో నీకె వాగీశ్వరీ!

౩

ఓంకార ధ్వనిరూప! సామమయగానోద్దీప! ఋగ్జాప! సత్
సంకల్పోక్త పురాణసూత్రి గురుశాస్త్ర జ్ఞాపకాలాప! సా
లంకారప్రియ వాక్సమీప! పరిపూర్ణ శ్రీవిరాడ్రూప! ఆ
తంకాశంకలనిస్తరింప, గృప విద్యాశక్తి సంధింపుమీ!

౪

కృతిమూర్తిన్ విని, కావ్యదర్శనము నిర్మింపంగ సూత్రిధ్వని
శ్రుతిమూర్తిన్ గని, తత్పరిష్కృతికి నాలోకాకృతిం బూని, సం
స్కృతి మూర్తిన్ గొని, లోచన ప్రసృతినున్మేషించి, రమ్యప్రభా
మతి మూర్తిన్ మను కావ్యవాణి నెద సంభావించి-సేవించెదన్॥

౫

శ్రుతిమధురార్థ శబ్దమయి, సుందరి, సంఘటనా గుణౌచితీ
చతురకథా విభావిత రసధ్వనిమూర్తి, అలంక్రియా విభూ
షిత రుచిరాంగ దీధితి, విచిత్ర వివిక్త హితోపదేశ శా
శ్వత-నియమ ప్రవృత్తి, కవిభారతి,-మమ్ము నను గ్రహించెడిన్!

# గురుపూజ

౧ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి గురుదేవప్రశంస.

నీయమృతోక్తి-బీజముగ, నీ పరిశీలన-రక్షగా, జల
పాశ్రియము, లోచన ప్రకృతి-పాశ్రిణముగా, నుదయించి-భామతి
ధ్యేయము, పేయమౌచు-వికసించిన యీసుకృతిప్రసూనమున్,
రాయడుశాస్త్రిదేవ! అభిరామముగా సమనుగ్రహింపవే!

౨ శ్రీ నౌడూరి వేంకటశాస్త్రి గురుమూర్తి ప్రశంస.

మాయా దుర్ణయపూర్ణమైన కలిలో మాత్సర్య నిష్కాసితా
లై యాథార్థ్య, సునీతి, శాంతి, గుణ, విద్యా, శీలముల్, తన్ను ని
ర్మాయున్ జేరఁగ నాశ్రయించిడిన నిర్మాత్సర్యు, శాస్త్రోదిత
న్యాయున్, వేంకటశాస్త్రి, మద్గురువిభున్ నౌడూరిజున్ గొల్చెదన్.

[చతురస్రగతి] ౩ క్రొవ్విరి... [అపూర్వమగు జాతీయపద్యము.]

అత్యాశ్చర్యసుకీర్తివి! విధాతకంతేవాసివి! విద్యామూర్తివి!
నిత్యానంద రసోపదేశ రమణీయ నాట్యవేదకృతి స్ఫూర్తివి!
సత్యనిగూఢ చతుష్కృతి నిర్గత చతుర్విధాభినయామృతవర్షి!
స్తుత్య కళామయ జగదాశ్రయ కృతిశోధనహర్షివి! భరతమహర్షీ!

[ఖండగతి] ౪ జయభద్ర. ఆనందప్రశంస.

ఆనందమే విభావాదిసంవలితచిత్తె రసంబగుచుండునని విశేషించితివి
ఆనందరసమె-ధ్వన్యాత్మగ నిరూపించి, ఆరసధ్వనియె-కావ్యాత్మగ విధించితివి
ఆనందులయ్యు కావ్యాత్మమూఢులగు కావ్యార్థవేత్తలకు ధ్వన్యాత్మ రూపించితివి
ఆనందవర్ధన! కిళానందవర్ధన! ప్రజానందవర్ధన! నమస్తే, నమస్తే.

అ భి న వ ప్ర శం స.

సీ॥ వరనరసింహగుప్తను, వ్యాకృతియయి,
భట్టేందురాజార్య, సాహిత్యమగుచు,
ప్రథితోత్పలతనూజ-లక్ష్మణగుప్తనాథ,
బుధేశ్వరుల, త్రికదర్శనమయి,
వామనాథుని, ద్వయాద్వయతంత్రిమై,
భట్టతౌతార్య, నాట్య వేదార్థమగుచు,
భూతిరాజాచార్య, భూమవిద్యా స్వరూపమయి,
తత్తనయు, శైవ మతమగుచు.

గీ॥ ఆశ్రయించి పృథక్ పృథక్కాగు నుపాధు
లందు భిన్నాత్మయగు-శారదాంబ-వారి
శిష్య నినుఁజేరి-ఏకాత్మసిద్ధిఁబడసె,
గురుకళామోద! అభినవగుప్తపాద!

అమృతతరంగ మా భవదపాంగము చందనలేప, మానిమే
షమునసె జ్యోతిఁజూపఁగల సాధనమాయరుణాద్రి నీమహో
సముఖమునన్ గనుంగొనిన సౌఖ్యమె-సౌఖ్యము. దానినే ప్రభూ!
రమణమహర్షి! నిల్పు, మభిరామ మకామము నక్షరంబుగన్॥

ఓమ్, తత్, సత్.

ఇట్లు-సద్గురు విధేయుఁడు,
ఆంధ్రీకృతికర్త.

# ఆశీస్సు.

ఓమ్

శ్రీమద్గురు సార్వభౌములగు

'మహామహోపాధ్యాయ' 'కళా ప్రపూర్ణ'

కీ. శే. బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రులవారి

ఆశీః పూర్వకమగు — అభిప్రాయము.

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే "ఆంధ్ర ధ్వన్యాలోకము" అను పేరిట రచింపఁబడిన ధ్వన్యాలోకాంధ్రీకరణమును నేను సమగ్రముగ వింటిని. ఇతఁడు నాయొద్దఁజదివి యుండుటచే విశేషించి ప్రశంసోక్తులను వ్రాయుటకు నా మనస్సు అంగీకరించి యుండలేదు. పుత్రాదుల ఉత్కర్షోక్తి ఆత్మప్రశంసారూపమై వికత్థనమగునని నే ననుకొనుచున్నాను.

వీరి యీ గ్రంథరచనను గూర్చి కవిసార్వభౌములును, మహామహోపాధ్యాయులును, కళా ప్రపూర్ణులును, శ్రీకృష్ణభారత గ్రంథ నిర్మాతలును, అగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులు గారును విద్వత్కవీంద్రులును, శతాధిక సంస్కృతాంధ్ర గ్రంథ నిర్మాతలును, కళా ప్రపూర్ణులును అగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారును, ఇతర విద్వాంసులును, సంతోషపూర్వకముగా నభిప్రాయముల నిచ్చియున్నారు. కాని యవియుఁగూడ ఈ గ్రంథము యొక్క ఘనతను సాకల్యముగా చెప్పలేకపోయినవేమోయని తలంచుచున్నాను. ఘనమైన వస్తువును సాకల్యముగ నిరూపించుట కష్టసాధ్యము గదా!

నేను చెప్పవలసిన దొక్క విషయము :—

సంస్కృతభాషలో ఆరితేరని ఆంధ్రవిద్వాంసులకు సంస్కృత ధ్వన్యాలోకాపేక్ష అక్కరలేకయే ఈ గ్రంథము కవితాతత్త్వమును బోధింపఁగలదని తలంచుచున్నాను.

ఈ గ్రంథకర్త-చిరాయువుఁగలిగి, యిట్టివనేక గ్రంథములను రచించి-ఆంధ్రలోకమున కుపకరించునటులు భగవంతుఁడను గ్రహింపుఁగాక! అని ఆశీర్వదించుచున్నాను.

విజయనగరము,
2—2—42.

ఇట్లు
'మహామహోపాధ్యాయ' 'కళా ప్రపూర్ణ'
తాతా సుబ్బారాయశాస్త్రి.

---

సాహిత్య శిరోమణి
శ్రీ కట్టి, శ్రీరామమూర్తి శాస్త్రి
ప్రధాన సాహిత్యాచార్య.

మహారాజ సంస్కృత కళాశాల
విజయనగరము,
తే 10—8—1954 ది.

## అభినందనము.

బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు నాతోడి యుపాధ్యాయులు. వీరు సాహిత్య విద్యాప్రవీణులు, ఉభయభాషా ప్రవీణులును. మృదు మధుర కవితాధారయు, వైరాగ్యసంపత్తియు, వీరికి భగవద్దత్తములగు అలంకారములు.

చిరకాలమునుండియు శ్రీ శాస్త్రిగారు చేయుచున్న సాహిత్య సేవ సహృదయుల మన్ననలను అందుకొనుచునే యున్నది. వీరి

యుపనిషదాంధ్రీకృతులును, ఆంధ్రధ్వన్యాలోక ప్రథమభాగమును, విఖ్యాత చరములు. సాహిత్యతత్త్వమును వేదాంతసారమును మథించుట యందు వీరికి ప్రీతిమెండు.

ప్రకృతము వీరి రచన-ఆంధ్రధ్వన్యాలోక ద్వితీయభాగము రసికవరుల కరపల్లవములను అలంకరింప సిద్ధముగనున్నది. పండితలోకమున గ్రంథ-తత్కర్తలకున్న గౌరవమునుబట్టి నాయట్టివాని అభిప్రాయ నివేదనమునకిట ఆవశ్యకతలేదని నానిశ్చయము. అయినను కొన్ని మాటలను వ్రాయకతప్పదని నేటి సంప్రదాయముల ననుసరించి శ్రీ శాస్త్రిగారు కోరినారు. కాదనలేక పోయినాను.

ఆనందవర్ధనుఁడు సాహిత్యవేత్త లందరకు సాక్షాదానంద వర్ధనుఁడు. "ధ్వనినాతిగభీరేణ..........ఆనందవర్ధనః కస్య నాసీదానంద వర్ధనః". అతని ధ్వని సాహిత్యసారఖని. అద్దానిని త్రవ్వి వెలలేని రత్నములను బయటపెట్టిన యాతఁడు మహామాహేశ్వరాచార్యుఁడు అభినవగుప్తుఁడు "ఆలోక లోచనముల" సంబంధము అనిర్వర్ణ్యము.

ధ్వన్యాలోకమును శ్రీ శాస్త్రిగారాంధ్రీకరించుట యెంతయు యుక్తము. వీరి ఆంధ్రగీర్వాణ పాండిత్య సుపర్ణమునకు సుకవిత ఆమోదమయినది. మఱికొన్ని యాంధ్రీకరణములు జరిగినను, జరుగనున్నను. ఈ రచనకుఁగల వైశిష్ట్యము వేరుగ భాసించుచునే యుండఁగలదు. మూలమందలి పద్యమునకు పద్యము, వచనమునకు వచనమును ఆంధ్రమున తయారగుటయేగాక, లోచనచంద్రికా దీధిత్యాదిప్రాచీనాధునిక వ్యాఖ్యలందలి మర్మములుగూడ తెలుఁగున పొందుపడుట, సూక్ష్మతత్త్వములు -"ప్రభామతి" యను పేరఁ బరగు నూత్న వివరణమున వెలుగొందుటయు ఇందలివిశేషములు.

సంధి సంధ్యంగవివేకము, ఔచిత్యచర్చ, శాంతరస సమర్థనము, రసవిరోధవిచారము మున్నగు ఘట్టములలో శ్రీ శాస్త్రిగారి

యాంధ్రీకరణమందలి మెరుగులు సహృదయులను ఆకర్షింపఁగల వని నావిశ్వాసము.

శాస్త్రీయగ్రంథముల ఆంధ్రీకరణ మెప్పుడును విపుల వ్యాఖ్యారూపముననే యుండుట బహుళ ప్రయోజనకారియని అనుభవజ్ఞుల యభిసంధి. అద్దానికి చాలవరకు ఈ గ్రంథము లక్ష్యము కాఁదగియున్నది.

ఎంతటి యవధానముతో భాషాంతరీకరించినను సంస్కృత పద్యములందలి సారళ్యము, మాధుర్యము, సౌకుమార్యము మొదలగు ఆస్వాద సహకారులగు గుణములు భాషాంతరీకరణములలోనికి సంక్రమించుట అరిది. అందును శాస్త్రగ్రంథములందలి పద్యముల విషయమున ఇది అతి ప్రయాససాధ్యము. ఈ విషయమున సంస్కృతమునందలి సారళ్యాది గుణములను భాషాంతరములోనికి సంక్రమింపఁజేయుటయందుఁగూడ శ్రీ శాస్త్రిగారు కృతకృత్యులయినట్లు గ్రంథ పరిశీలకులకు తోచకమానదు. సౌలభ్యాధిక్యమునకయి మూలమునుగూడ చేర్చి యచ్చొత్తించుట యుక్తతరమేమో అని నా వలకు నా కనిపించినది.

భవతు-శ్రీ శాస్త్రిగారు ఇతోఽధిక కృషిసల్పి పెక్కు గ్రంథరత్నములను వెలయింతురుగాక. అందులకు వలయు సర్వసాధనములను శాస్త్రిగారికి భగవానుఁడనుగ్రహించుఁగాక!

ఇట్లు బుధజన విధేయుఁడు,
కట్టి శ్రీరామమూర్తిశాస్త్రి.

దర్శనాచార్య, మహోపాధ్యాయ,
సాహిత్యాచార్య, శాస్త్ర విశారద,
లాక్షణిక శిరోమణి, విద్యా, భాషాప్రవీణ
జమ్ములమడక మాధవరామశర్మ.

ఏ. సి. కాలేజి
గుంటూరు.
తే 14—8—1954 ది.

# పుష్పిక

నవకాలసమున్మేష మొక సమీక్షాసముల్లాసమున కపూర్వ విద్యుదుద్ద్యోత మయినది. సాహితీ సమాస్వాదము పునర్నవ మగును. కాదేని స్వస్పందశ్లోకులు లోకులకు హృదయసంవాద మిచ్చుటెట్లు? నేటి సాహితీసంధ్య యనపాయిని కాదు. ప్రమాతృ ప్రతిభ సాధారణ్యమున సర్వము సమీకరించును. అరసమును స్వరసభరమున స్వీకరించు సరస్వతీతత్త్వము కవిభావక భావ్యమాన భవ్యమగుట హితపథ్య.

శ్రీ రాయదుశాస్త్రి గురుకులము మేము మాధవలక్ష్మి నారాయణులము,-సహితపథ్యాసంచారులము. కొంత చేసితిమి. మరి కొంత చేయదలచితిమి. ఇంత కింతంత కెంతేని వలయును. కాని మేము కార్మణజ్ఞులమని సలోచన సహృదయాలోకము గుర్తించెను. తదభిజ్ఞత-సత్ప్రజ్ఞతాప్రతీకము. ఈ సంవేదనము చతురస్రమగుట కవిభారతీ విజయము. భారత భారతి, సంస్కృతభాష-సమీక్షా సంభావన మెపుడో యందుకొనినది. సహస్రపరమ సంస్కృతసమీక్ష లోకభాషలలో శతరూపయేని శతాంకురయేని యగుటయే యందరి యంతరభిలాష.

* * * * *

ఆనందవర్ధనుడు తనపూర్వతనముల క్రోడీకరించి ధ్వని బిందు పీఠమున ప్రతిష్ఠించినాడు. నేడబిందుకములయిన సాహితీ రేఖలు తమయాత్ర గుర్తింపసీకున్నవి. అందున నాంధ్రమున

కేంద్రబిందు దర్శన మావశ్యకమైనది. సమసామయిక వివేకము నకు "ఆంధ్రధ్వని" "అభినవాంధ్ర ధ్వన్యాలోకము" "ఆంధ్ర ధ్వన్యాలోకము" "ధ్వనిసారము"-ఈ 'ఆంధ్ర ధ్వన్యాలోకము" అపేక్షితములు. ఇంకను ధ్వనిసూత్రము కవిలోకమున కావ్యలోచన మిచ్చి యభినవభాష్యపుష్టి కూర్పనగును. అపుడు సమకాలప్రచలిత ములు ధ్వన్యధ్వ ప్రతిష్ఠములు కాగలవు. అపుడు మా రాయడు దేవుడు సహస్రశీర్షుడు విశ్వరూపుడగును. లక్ష్మీనారాయణశాస్త్రి దీని నపుడు సంతరించెను. అద్వితీయమయిన యీ ద్వితీయభాగ మిపుడు ముద్రించెను. నా సహపాఠి-ప్రీణితబుధుడు సారస్వతేయ మూర్తులలో నన్నియునగును. నే నీ వ్యక్తిని భావించి నిభాలించి ప్రభా-మతియని ప్ర-భామతి యని ప్రభామతిచూచి చూపించి యందును.

కవిగా-కావ్యధర్మ విశేషజ్ఞుడై. భావకుడుగా-రమణీయతా మర్మజ్ఞుడై. సమీక్షకుడుగా-సమయజ్ఞుడై లక్ష్మీనారాయణశాస్త్రి. ప్రభా-మతి యయినాడు. గాథానువదనము శ్లోకానుకరణ మిందొక చిత్రీకృతి. గాథాలాలిత్యము పంతుల కనవగతముకాదు. శ్లోకముల ప్రతిపద వ్యంజకతయు నిత్యప్రతిభాతము కానిదికాదు. తెలుగు లోచనములతో గాథాశ్లోకములు వెలుగులు చూచుటకై పంతుల ప్రభ యుపకరించును. అమూల మమాతృకమయిన క్రియాశక్తి సుశ్లిష్ట యగునటుల పంతుల యాయోజనముచూపెను. ఆత్మ ప్రత్యయము కల కవి-సమ్యక్ దృష్టికల సమీక్షకుడగుట శ్రుతచరమే. కా యంతట దృష్టచరముకాదు. ప్రభామతిచూడ అది యశ్రుత మదృష్ట మనిపించదు.

ధ్వని కారికలు-పద్యీకృతములయినవి. అట్టివి పాఠకధార ణోపయోగి యని కతిపయోక్తి. మేము మా యధ్యయనమున గద్య

ములఁ గూడ ధారణము చేసితిమి. అది యీనాటికి కంఠనాళముల నదించును, నినదించును. కారికలభావమునే కాక వృత్తిభావము కూడ పద్య పథ్యలో మా పంతుల కుదింపవచ్చును. సంగ్రహ కారికల నెట్లో పద్యముల రూపింపనే రూపించెను. మూలమంతయు పద్యశాయితమగుటయు పంతుల రచనా బంధురతాభినందన పర్య వసితమెకాదు. కృతి సంభావనమును. ధ్వన్యాలోకముపై వెలువడిన వ్యాఖ్యఁ చూచి-సరిచూచి, తూచి, తలయూచి, పంతుల వివృతి, ప్రభా మతి" యయ్యెను, గ్రంథ మేవంవిధ మగుటలో నిట్టి శతేక్షిక నిదానమయినను పాఠకుల కొక ప్రదానమయినది. వ్యాఖ్యాత లెన్నియో చెప్పుదురు. చెప్పినవన్నియు నాంథ్రమున రాదగినవె యయినను అపునరుక్తముగ వచ్చుటనే మన మభిలషింతుము. ప్రభా మతి యభిలషితమిచ్చినది. అసలభినవుడు-అన్నిటిని సూత్రించెను. గుప్తసూత్రము నాధారించుకొనినవె ధ్వనిసీమలో నుండగలవు. భావావిష్కరణమున, రమణీయతా నిదర్శనమున, కావ్యభాషా భష ణమున, ప్రభామతి-అభినవపాద పాద, పదసంచర యయినది. అభినవోన్మీలనమునకు యత్నించిన కౌముది-బాలప్రియా కృతి వహించుట ప్రభామతి గుర్తించినది. వటుకనాథుని దీధితి పటుభావ మును ప్రభామతి పట్టి చూచినది. రాయడు ప్రవచనము నాటికివి యన్నియు సుప్రకాశములుకావు. నేటికట్టివి మహాదీపము లయి నవి. ప్రభామతి ప్రభావతి యయినది. "నాఽమూలం లిఖ్యతేకించిత్, నానపేక్షితముచ్యతే" అని ప్రభామతియు ననఁగలదు. సూత్ర పట్టి, వివక్షితము తిగిచి, ప్రభామతి-తివిరి తివిరి వివరించినది.

ఇట్టి యీ శాస్త్రశ్రమ-విశ్రమ మెరుగనిదే యయినను నేర్పరులయిన చదువరుల కశ్రమమున నిస్తారమిచ్చినది, అందు ననె ప్రభామతి ప్రభా-మతి యందును........కర్షకృతి సంభా వనము-భావముపట్టుభావకులది,

శ్రీమదానందవర్ధన ధ్వన్యాలోకము-నానాలోక భాషలలో ననూదితమయినది. ఆంధ్రమున నది విభిన్నాకృతుల ధరించుట మన యాంధ్రుల విశిష్టతా స్ఫోరకము కావచ్చును. మా "పంతుల" "కవి సహృదయుడై" యిట్లొనర్చెను. తన నాటికి నిస్పృత ప్రస్పృత ముల నేరికొని యానందు"డివిఘట్టి"వనెను. ఈ "కావ్యానందుని" చేత యా రూపము-రూపించినది. దీనిని బుద్ధ్యారోపము చేసికొనిన వారు పాండిత్యమునకు వైదగ్ధ్యమిచ్చికొనగలరు. నానాటికి వెలు వడి బృహత్కాయమయిన మన సారస్వతము పరిష్కరించుకొనుట కిదియు సహకరించుగావుత!

* * * *

అద్యతనులలో కతిపయ సమీక్షకులు పాశ్చాత్యాభావనా వాసితులయినారు. ఆ రీతి మన సాహితి సమీక్షింతురు. వారికివి యెట్లెట్లో గోచరించినవి. వారు మనలను మనము వారిని సమీ క్షించుట యసంగతముకాదు. కాని; నీని నాకన్నుతో, వాని నీ కన్నుతో చూచుట దృష్టితగులును, పాశ్చాత్యుల జీవనదృష్టి, సంస్కృతి, వేరు.

వారి సాహిత్య కలాదర్శన విజ్ఞానాదులు తదనుసారులు తద్భావసారములును, అయినను చేతనమానవజీవనాజీవనము లంతటనేకరసములగుట ప్రత్యక్షప్రత్యక్షముగ సామ్య సంవాదము సుసాధము. సచేతనుల కలాసాహిత్యముల మూలము లెచటివయిన నెప్పటివయిన వివదించునవికావు. సంవదించునవియే యగునని యానందాభినవవాలోకాలోకమున నవలోకము వాకొనుట కిది యుపకారి.

* * * *

ప్లేటో, అరిస్టాటిల, దాంత, సిడనీ, డ్రైడన, క్రోచే, బ్రాడ్లీ, రీడ, రిచర్డ్స, ఏబరక్రాంబీ ప్రముఖుల సాహిత్యగతులు రూపాం తరమున ధ్వనిగతి ప్రగతులు. ఇది గుర్తించి సమాలోచకులు

సమాలోచన మొనర్పవలసియున్నది. ఇట్టి యింతటి సమాలోచనము-అభినవలోచనమున గలుగవలయునని నా సహోధీతి వాచస్పతులకు ప్రభామతి ప్రదర్శించెను. మతిగల పతులు సహితభావు లగుదురు. సాహిత్యసౌహిత్యముల సామరస్యమునకై సచేతః కవి పండితుడు పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి యింతగా దీనిసంతరించుట సహృదయ ధన్యత. "అస్తు".

"లక్ష్మీనారాయణ శ్రీ ధీ గీరాధ్యః శ్రీ విరాజితాన్ ।
సంవాదభాజినోభావాన్ సంవిదైక్యేన భావయే॥".

మాధవ రామశర్మ.
—జయ శ్రావణ పూర్ణిమ.

---

# ధ్వన్యాలోక ప్రశంస

శతావధాని
శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు.

1910 లోనో...."9 లోనో తిరువతి సంస్కృతపాఠశాలలో శ్రీనరకంఠీరవ శాస్త్రులుగారు రసగంగాధరమును ధ్వన్యాలోకమును బోధించుచుండగా వింటిని. "11లోనో"10లోనో వ్యక్తి వివేకము యమ్మేకు పఠనీయమాయెను. ఈ రెండుపేరులు నేనా కాలమున సరికొ్రొత్తగా వింటిని.

"22వ సంవత్సరములో గాబోలు నేనును శ్రీ ప్రభాకర శాస్త్రిగారును పరస్పరము తెలియకుండ కడియము వెళ్లుచు రైలులో కలిసితిమి. ప్రసక్తాను ప్రసక్తముగా ధ్వన్యాలోకమును, నేను తెలిగించుచుంటిననగా నేను తెలిగించుచుంటినని" ఒకరి

కొరకరము చెప్పుకొంటిమి. క్రమక్రమముగా అందలి పాఠభేదములు, పాఠదోషములు, గ్రంథపాతములు మొదలగు వానిమీద మాచర్చ పెరిగెను. ఆ ప్రసక్తిలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు- "శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు సులోచనమను వ్యాఖ్య వ్రాయుచున్నారు. అది అచ్చగు వఱకు నేను వేచియుందును" అనిచెప్పిరి. మ. మ. శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగారి సులోచన ముపలోచనముగా మాఱి ఉత్తుంగోదయుని కౌముదితోఁగూడ ఒక ఉద్ద్యోతము మాత్రము అచ్చయి వచ్చుట కిరువది రెండేండ్ల కాలముపట్టెను. ఈ లోపుగా శ్రీ పిషారొటీగారి ఆంగ్లానువాదము—ఒక యుద్ద్యోతము మాత్ర మనుకొందును—వెలువడెను. అదియు పాఠభేదములయెడ తుకారాం ప్రతికి ప్రతియే!

ఈ లోపుగనే కొన్ని విశ్వవిద్యాలయములు ధ్వన్యాలోకమును ఏదో ఒక శాఖకు పాఠ్యమొనరించుటజేసి చౌఖాంబా ముద్రణాలయము నుండి ధీధితి, బాలప్రియ, మొదలగు వ్యాఖ్యలు వెలువడెను.

ఆంధ్రదేశములో సంస్కృత పాఠశాలలుగా కళాశాలలుగా మాఱుట మొదలగుటతో విజయనగరము, చిట్టిగూడూరు మొదలగు చోటుల ధ్వన్యాలోకపు ధ్వనియు, ఆలోకమును, విస్తృతము కాదొడగెను.

మహామహోపాధ్యాయ శ్రీఉ. తాతా రాయడుశాస్త్రులవారు అలంకార శాస్త్రమునకు అంధప్రాయమైన ఆంధ్రదేశమునకు కన్నులొసగిరి వారికడ చదివినవారిలో మూవురనుండి సాహిత్యశాస్త్రము ముత్త్రోవల బాఱి తెలుగు నాడంతయు ముంచి యెత్తుచున్నది.

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రిగారి ధ్వన్యాలోకము ఒక ఉద్ద్యోతము మాత్రము తెలుగులో చూచితిని. రెండవది శ్రీ

వేదాల తిరువేంగళాచార్యులవారిది. ఇది సమగ్రము. [ఇందు లక్ష్యములనూదితములు కావు. 1950లో ప్రకటితము.]

మూడవది శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారిది. ఇది మూడవ ఉద్ద్యోతము మూడుపాళ్లు ముద్రితము. [1, 2, ఉద్ద్యోతములు 1944లో ముద్రితము.]

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ధ్వన్యాలోకవ్యాఖ్యల నన్నిటిని చూచి వానిలోని విశేషముల నచట నచట నుట్టంకించి యున్నారు.

ఇంతియకాక వ్యాఖ్యాతలు ప్రకటించిన భిన్నాభిప్రాయముల మీద తమ వివేకమును ముద్దరవైచుచు బోయిరి. ఈ ప్రయత్నము మనీషులగు పాఠకులలో విమర్శశక్తికిని, స్వాతంత్ర్యమునకును ఉద్దీపకము. 3వ ఉద్ద్యో-7వ పుట; 12వ పుట; 147వ పుట మొదలగునవి చూడనగును.

ఈ గ్రంథము చదువుచు బోదుమేని-"తేజస్వినా వధీతమస్తు మా విద్విషావహై" అను మంత్రము ఒంటబట్టిన గురుశిష్యు లిరువురు కనబట్టుదురు. విద్యార్థులకును, ఉపాధ్యాయులకును, ఇది రసాయనము. ఆంగ్లపిమర్శనమార్గమే వరవడిగా గల నేటి తెలుగు విమర్శకులకు ఈ తెలుగు ధ్వన్యాలోకము-ప్రభామతిత్వమాపాదించుటయే గాక సరియగు ఆలోకమును చూపించునని విశ్వసింతును.

ఎటులో తీరిక చేసికొని ఈ నాలుగు పంక్తులు వ్రాయగలిగితిని. ఇంతమాత్ర-మీ పరిశ్రమకు తగిన ప్రశంసకాదు.

చిరివాడ. } వేలూరి శివరామశాస్త్రి.
15—9—54.

శ్రీ లేఖ

విద్వాన్ గంటి జోగి సోమయాజి, ఎమ్., ఎ., ఎల్. టి.,
ప్రొఫెసరు : ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు,
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు,
విశాఖపట్టణము.

చదివితిని-చాల సంతోషించితిని. మీపరిశ్రమ ప్రశంసార్హము మీ శ్రమకు తగిన ప్రతిఫలము లభించుఁగాకయని యాశించు. చున్నాను.

సంస్కృత ధ్వన్యాలోకము మీవంటి పండితులకే విదిత మగును గాని సామాన్యులకు సాధ్యముకానిది. దానికిఁగల వ్యాఖ్యానములలోని సారమును గ్రహించి తెలుఁగువారి కనుకూలమగునట్లు పొందు పఱచుట-తెనుఁగు భాషకు మహోపకారకము.

ఇట్టియుపకృతికి మూలమగు ప్రతినివ్రాసి దాని ముద్రణమునకును మీరే శ్రమ పడవలసివచ్చుట చాల విచారకరము.

ఇఁక నీ శాస్త్రమునకు ప్రచారముకల్పించుటయు మిక్కిలి యావశ్యకమయినదే..................మీ రచన - అసందిగ్ధమయి, మూలములోని యభిప్రాయములను ఉదాహరణములతో సమన్వయించి, సవిశేషముగా పాఠకుల కందిచ్చుచున్నది. నేను చదివినందువలన కనుఁగొనిన విషయమిది.

ఇట్లు,

28—8—54. భవదీయుఁడు, సోమయాజి.

# ప్రదీపిక

శ్రీ తిరుమల నరసింహాచార్యులవారు, M. A. L. T.,
శ్రీ మహారాజ కళాశాలాధ్యక్షులు,
విజయనగరము.

ఆంధ్రధ్వన్యాలోక కృతికర్తలును, ప్రస్తుతము శ్రీ మద్విజయ నగర మహారాజ సంస్కృత మహాపాఠశాలాంధ్ర పండితులును, కవితా విశారద, కవిశేఖర, బిరుదాంకితులునునగు సాహిత్య విద్యా ప్రవీణ - ఉభయ భాషాప్రవీణ- శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రులుగారు నాకు మిత్రులును చిరపరిచితులును కవితయందును, ఉపనిషద్ విషయలోలతయందును, వీరి ప్రశస్తి-విదితపూర్వమే: లబ్ధప్రతిష్ఠులును, సందు మిత్రులును, గూడ నైన వారని విశేషముగ గీర్తించుట-స్తోత్రపాఠమగునను భయమున నెక్కుడుగ వ్రాయ నొల్లను.

అమరభాష - సాహితీలక్ష్యలక్షణసమన్వయ విమర్శనలను సమగ్రముగాఁ బరిష్కరించుకొని, సర్వాంగ సౌష్ఠవము నంది యున్నది. కావ్య లక్షణమగు నలంకారశాస్త్రమును భారతీయభాష లన్నియుఁగూడ-ఈ శాస్త్రమునుండియే సంగ్రహించుకొని కొంత వఱకుఁబుష్టినితుష్టిని సముపార్జించుకొన్నవి.

తెలుఁగుపలుకుకలికి-కృతినిర్మాణమునందుఁ బరిపుష్టినందు కొన్నను సాహితీలక్ష్యలక్షణసముపార్జనమునందుఁదగిన కృషి నొనర్చినట్లు కాన్పింపదు. ఈ కొఱతఁబాపుకొనుటకు నాంధ్రి లింకను గొంతకాలము పడిపడిగాఁబరిశ్రమింపవలసియున్నదని చెప్పకతప్పదు. భరతనాట్యమునందలి సాత్విక-వాచికాభినయ నిరూ పణము-సాహిత్య శాస్త్రరూపమున భామహాదులగు నాలంకారికుల చేత విస్తరింపఁజేయఁబడి, పరిపుష్టినందియున్నది.

ఆనందవర్ధన ప్రచలితమగు నీ ధ్వన్యాలోకము ప్రవాద మాత్రమగు ధ్వని స్వరూపమునకుఁ బ్రతిజ్ఞాపురస్సరముగ లక్ష్య లక్షణ నిరూపణము నొనరించి, క్రొత్తపంథలోఁ గవితా కాంతకు జీవితలాభమును బ్రసాదించినది.

| | | |
|---|---|---|
| కృతికాంతకు | | |
| శబ్దార్థములు | — | మూర్తి |
| కైశిక్యాదులు | — | వృత్తులు |
| వైదర్భీప్రభృతులు | — | రీతులు |
| మాధుర్యాదులు | — | గుణములు |
| రసాదిధ్వనులు | — | ఆత్మ [జీవితము.] |

అను సిద్ధాంతము-ధ్వన్యాలోకమువలన ప్రరూఢమై నిరూఢ మైనది. అనంతములగు ధ్వని ప్రభేదములు ఇందు సార్థకనామ యుక్తములుగా నిరూపితములై ఉదాహృతి సమన్వయ విమర్శ లతోఁ బ్రదర్శింపఁబడినవి. సాహిత్యశాస్త్రరత్నమాలికలో కృతి జీవిత నిరూపకమగుధ్వన్యాలోకము-నాయకరత్నస్థానము నధిష్ఠించు ననుట అతిశయోక్తి కానేరదు. సత్ కవితకును, విమర్శకును, "ధ్వన్యాలోకము" అనుల్లంఘనీయమగు శాసనమనుటలో విప్రతి పత్తికి తావులేదుకదా!

ప్రముఖస్థానము నార్జించుకొనిన యీ గ్రంథమును శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, తాతా-సుబ్బరాయశాస్త్రిల వారియొద్ద నధ్యయన మొనర్చి,కవిగారు-దీనినాంధ్రీకరించి,సద్గురువు లగు శ్రీ శాస్త్రిలవారికి పూర్తిగావినిచి, సంస్కరించుకొని, శ్రీవారి ఆశీరామోదములను బడసి, కృతార్థులైరి.

మూలమునందలి లక్ష్యలక్షణసమన్వయములను పద్య గద్యములలో నాంధ్రీకరించుటయేగాక,నిగూఢమును,గంభీరమును,

అగు ఆచార్యాభినవగుప్త లోచనమునుగూడ-గద్య పద్యములలో సమగ్రముగా ప్రిభామతితోఁబ్రిసరింపఁజేయుటయేకాక, ధీధిత్యవధానటీకా బాలప్రియాదులయందలి యుపయుక్తాంశములను సంగ్రహించి స్వాభిప్రాయమునుగూడ ప్రిదర్శించుటవలన నీ యాంధ్రి ధ్వన్యాలోకము-అపూర్వమును, సమగ్రమును, సుస్పష్టమును, నగు రమణీయత నార్జించుకొనినదని తలఁచెదను.

ఆంధ్రీకృతిసరణి చతుర్విధముగాఁగాన్పించు చున్నది. (1) స్వేచ్ఛానువాదము, (2) మూలమునందలి లక్ష్యలక్షణములను భాషామయ వ్యాఖ్యలో విశదీకరించుట, (3) మూలమునందలి లక్షణమును గద్యమునందో, పద్యమునందో అనువదించి, భాషా కావ్యములందలి పద్యములను లక్ష్యములుగా నొసంగి, తదనుగుణములగు సమన్వయ విమర్శలను గావించుట, (4) లక్ష్యలక్షణ సమన్వయ విమర్శలను యథామాతృకముగా ననువదించుట. ఈ మార్గములలో మూలమునందలి లక్ష్యలక్షణశ్లోకములను భాషామయ పద్యరూపములుగాను, సమన్వయ విమర్శనాత్మకములగు గద్యములను గద్యరూపములుగాను, ఆంధ్రీకరించునదియగు 4వ మార్గము శ్రేష్ఠమని నా యభిప్రాయము.

ప్రిస్తుత ధ్వన్యాలోక విషయమునఁదెలుపుదును. మూలమునందలి భావములను-అన్యూనాతిరిక్తములగునట్లు పద్యగద్యములలో నిరూపించుటవలన మూలగ్రింథకర్తయగు ఆనందవర్ధనుఁడు-ధ్వని తత్త్వమును ఎట్లు నిరూపించినదియు ఆంధ్రసహృదయ విజ్ఞులకుఁ దెలియవీలగుచున్నది. ఆంధ్రీకృతములగు లక్షణపద్యములను ధారణచేయుటకు సౌకర్య మేర్పడుచున్నది, పద్యగద్యభావములను ప్రిభామతి యందు వెలయింపఁజేయుటవలన విషయ విజ్ఞానము లభించుట కవకాశము కలుగుచున్నది. పద్యమునందుండఁదగిన భావము - పద్యమునందును, గద్యమునందుండఁదగిన భావము-

గద్యమునందును, పొందుపఱచుట వలన గ్రంథము రమణీయ మగుచున్నది. స్వేచ్ఛానువాదముగాని, భాషాకావ్యములందలి (కళా పూర్ణోదయాదులందలి) లక్ష్యములను సమన్వయించునదియగు ననువాదముగాని, మాతృకయందలి యభిప్రాయములను అనఁగా; సంస్కృత ధ్వన్యాలోకాభిప్రాయ విమర్శలను, మార్పులేకుండునట్లు తెలియఁజేయునవి కానేరవు.

మూల మునందలి గద్యపద్యములను భాషామయమగు వ్యాఖ్య యందు వివరించునదియగు ద్వితీయ సరణికూడ విషయవిజ్ఞాన మున కుపకరించినను రమణీయతాపాదకము కానేరదు.

ఈ గ్రంథమునందు లక్షణములగు కారికలు, లక్షణవిషయ ప్రబోధకములగు పరికర శ్లోకములు, లక్ష్యశ్లోకములు, లోచన వ్యాఖ్యానోదాహృత శ్లోకములుకూడ ఆంధ్రీకృతములైనవి.

ధ్వన్యాలోకమేదియుఁగూడ-ఈ పక్కిలో నింతకుముందు రచింపఁబడియున్నట్లు కాన్పింపదు. కావున నీ గ్రంథము కళాశాలా విద్యార్థులకు నెల్లెడలను పాఠ్యగ్రంథముగ విశ్వకళాపరిషత్తువారు నిర్ణయించినచో నెంతయు మేలు చేకూఱఁగలదు.

మూలమునందలి శ్లోకములు-నిర్దుష్టము, సుస్పష్టము,రమ్యము, గంభీరము, నగు లలిత భణితిలో నెట్లనువదింపఁబడినవో సహృదయులగు పాఠకులు పరిశీలనమునఁ దెలియఁగలరు.అయినను మచ్చునకొక్కటిచొప్పున నొసఁగి నాయభిప్రాయము ముగింతును.

—• లక్షణకారిక •—

అవిరోధీ విరోధీవా రసోఽఙ్గిని రసాన్తరే
పరిపోషం ననేతవ్యస్తథాస్యాదవిరోధితా॥

కం॥ అవిరోధియొ సువిరోధియొ
యవురసమన్య రసమంగి యగునెడ పరిపో
ష వియుక్తము కాఁదగు,నటు
లవునెడ తద్రసవిరోధమడరక యుండున్॥

—• పరికర శ్లోకము •—

అనౌచిత్యా దృతేనాన్య ద్రసభఙ్గస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్య బన్ధస్తు రసస్యోపనిషత్పరా॥

కం॥ సత్యము వచియింతు మనౌ
చిత్యమె రసభంగ మొదవఁజేయు, ప్రసిద్ధౌ
చిత్య నిబంధము మాత్రము
నత్యంతము నుపనిషత్తె యగు రసమునకున్॥

—• మూలమునందలి లక్ష్య శ్లోకము •—

యా నిశా సర్వభూతానాంత స్యాంజాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతిభూతాని సానిశాపశ్యతో మునేః॥(భగవద్)

గీ॥ అఖిల భూతమ్ములకు నిశయయిన దేదొ
అందెమేల్కాను సంయమియైనవాఁడు
భూతములు జాగరూకతఁబొందునెందు
అదియెనిశయగు కనుఁగొనునట్టి మునికి॥

అభినవగుప్త లోచనోదాహృత శ్లోకము. [చంద్రుఁడను కవి రసౌచిత్యము నెఱుఁగక రచించినది.]

ప్రసాదే వర్తస్వ, ప్రకటయముదం, సంత్యజరుషమ్
ప్రియే! శుష్యన్త్యఙ్గాన్యమృత మివతే సిఞ్చతు వచః;
నిదానం సౌఖ్యానాం క్షణమభిముఖం స్థాపయముఖమ్
నముగ్ధే! ప్రత్యేతుం ప్రభవతిగతః కాలహరిణః॥

ఉ॥ నిండుమనంబునూని, కరుణించి ప్రియా! రుషవీడవే సుఖా
ఖండము నీముఖంబభిముఖంబొనరించి-వచోఽమృతంబు-నా
యెండిన యంగకమ్ములు రహింపఁగఁజిల్కవె! ముద్దరాలవె
న్నండునుబాలః కాలహరిణంబు-గతించినవెన్క వచ్చునే?

ప్రభామతి యందుదాహృతమయిన అమరుకశ్లోకాంధ్రీకృతి.

[కవి-రసౌచిత్యము నెఱిఁగి రచించుట కుదాహరణము.]

మ॥ అలసమ్ముల్,వలితమ్ములై, ప్రణయలీలార్ద్రార్ద్రముల్, మొగ్గలై,
చలితమ్ముల్,క్షణపమ్మ్రఖమ్ములయి,లజ్జాఢల్, పరాస్తమ్ములై,
అలివేణీ! హృదయస్థితమ్ములగు భావాకూతముల్ చల్లు జ
ల్లులు నీ చూపుల నిప్పుడే సుకృతి నాలోకించితో తెల్పవే!

శ్రీ మహారాజ సంస్కృత కళాశాల,
విజయనగరము,
8—9—54.

తిరుమల, నరసింహాచార్యుఁడు,
అధ్యక్షుఁడు,

# —• విషయసూచిక •—

శ్రీభారత్యైనమః.

# ని వే ది క

సహృదయానందుఁడు-సహృదయానందవర్ధనుఁడు.

ఆనందవర్ధన ప్రసాద ప్రభాసితము-ధ్వన్యాలోకము.

దీనికి "సహృదయాలోకము" "కావ్యాలోకము" అను నామాంతరములు కలవు. శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ శాస్త్ర రత్నాకర, తాతా-సుబ్బారాయశాస్త్రి చరణుల సన్నిధిని 1931లో దీని నధ్యయన మొనర్చునపుడు ఆశ్చర్యచకితులై యానందులయిన సహపాఠులలో నేనొకఁడను. సాహితీ శాస్త్ర కృతులలో నిట్టి స్వాతంత్ర్యమును, చాతుర్యమును ప్రదర్శించిన కృతి-వేఱొకటి కాన్పింపదు, ఇది ధ్వనులకు గని! కవి విమర్శకులకు పెన్నిధి!

1932లోనే దీని నాంధ్రీకరించుట కువ్విళ్లూరితిని. అవకాశము కలిగినదికాదు. నా ముప్పదవయేటను, అనఁగా 1939లో సంపూర్ణముగా ఆంధ్రీకరించితిని. వాగ్దేవతానుగ్రహమున, 1942లో శ్రీగురుదేవులకు వినిచి, శ్రీవారి యాశీరనుమతులఁగైకొంటిని! ఆనాటికి ధ్వన్యాలోకాంధ్రీకృతి యేదియుఁగూడ ప్రకటితముకాలేదు. ధనలోపము వలన 1943లో ప్రథమ ద్వితీయోద్ద్యోతములుగల ప్రథమ భాగమును మాత్రమే అచ్చొత్తించి, దానిని తే 24-9-1944 దీని శ్రీ భారతీదేవికి సమర్పించి ప్రకటించితిని! 1939లో రచించిన సంపూర్ణగ్రంథమును 1945లో సమగ్రమగు లోచనముతోడను, బాలప్రియా దీధిత్యావధాన టీకాది వ్యాఖ్యలయందుపయుక్తములగు నంశములతోడను, స్వాభిప్రాయముతోడను, సంఘటించి-విపులీకరించితిని. 1944లో ప్రకటితమైన ధ్వన్యాలోక ప్రథమభాగమును ఆంధ్ర విశ్వ కళాపరిషత్తువారు 1950లో భాషాప్రవీణ ఫైనలుకు పాఠ్యముఁగా నొనర్చి నన్ను ప్రోత్సహించిరి.

ఈ ద్వితీయభాగమునందే మిగిలిన గ్రంథమునంతను ప్రక టింపఁదలఁచినను, ధనలోపమువలన తృతీయోద్ద్యోతమునందుఁగల మూడుపాళ్లగల భాగమును మాత్రమే ప్రకటింపఁగలిగితిని. తృతీయ భాగమును వాగ్దేవతాకటాక్షమువల్లను, సహృదయుల ప్రోత్సాహము వల్లను త్వరలో ప్రకటింపఁగలుగుదునని యాశించుచున్నాను. సహృదయులు ప్రథమభాగము నాదరించినట్లు దీనినిగూడ నాదరింతు రని విశ్వసింతును.

ప్రథమభాగమును సమీక్షించి దయతో పంపిన సహృదయ పండితాభిప్రాయములను సంగ్రహరూపమున నీ గ్రంథము చివరను ప్రకటించియున్నాను. ఆ మహాశయుల కెల్లరకును నా నమస్కృతుల నర్పింతును. ప్రథమభాగమును మరల అచ్చొత్తించునపుడు వానిని సమగ్రముగా ప్రకటింతును।

నా విజ్ఞప్తిని మన్నించి యీ గ్రంథమును సమీక్షించి-అభి నందించిన బ్రహ్మశ్రీ కట్టి-శ్రీరామమూర్తి శాస్త్రిగారికిని, "పుష్పిక" నొసంగిన సహపాఠిమిత్రులు, బ్రహ్మశ్రీ జమ్ములమడక. మాధవ రామ శర్మగారికిని, ప్రశంసించిన బ్రహ్మశ్రీ వేలూరి-శివరామశాస్త్రి గారికిని. శ్రీ లేఖను ప్రసారించిన బ్రహ్మశ్రీ గంటి-జోగి సోమయాజి గారికిని, ప్రదీపింపఁజేసిన శ్రీమాన్ తిరుమల. నరసింహాచార్యుల వారికిని,కృతజ్ఞతా పురస్సరములగు ప్రణామాంజలులను సమర్పించు చున్నాను. ఆంధ్రదేశములో ధ్వన్యాలోకము వ్యాప్తము కావలయు నను నా యుద్యమము - బలీయమగునట్లు భిన్నసరణులలో ఆనంద ధ్వని ప్రబోధము నొనర్చిన సహృదయ పండిత వరేణ్యులకు నా నమోవాకము లర్పింతును. దీనినిట్లు ప్రకటించుటలో సహకరించిన చిరంజీవులు-బిక్కవోలు.సత్యలింగమును,మిరియాల-రామకృష్ణను, ఆయురారోగ్యవిభూతియుక్తులుగాను, విజ్ఞాన కవితాసూక్తులుగాను ఆశీర్వదింతును. ఈగ్రంథమునిట్లు సర్వాంగలలితముగా ముద్రించిన శ్రీ వేదవ్యాస ముద్రణాలయము నభినందింతును.

ఇంకొక ముఖ్యరహస్యమును వెలువరింతును.

శ్రీ విజయనగరములో మహారాజశ్రీ, బత్తుల వజ్రం శ్రేష్ఠి గారు-వదాన్య శిరోమణిగా పేర్వడసియున్నారు. భక్తశిఖామణి యు, వైశ్యకులాగ్రిణియు, అగు నీ మహాశయుండు 1944 సం॥ర ములో ఏకాహమహోత్సవము నొనర్చి కృతార్థుండయ్యెను. ఆ మహోత్సవ సందర్భమున నేనొనర్చిన అధ్యాత్మిక ప్రవచనము నాలించి యీయన మిక్కిలి యానందించెను. తదుపరి సుహృదయు డగు కీ॥ శే॥ కాళ్ల సన్యాసి నాయనిద్వారమున, తనంతతానుగా నన్ను సమాహ్వానించి, నేనడుగనిదే- "తమ గ్రంథమును ప్రక టించుట కెంతయగును"అని తానేయడిగి, భారతి చెప్పించినసంఖ్యను నేను చెప్పంగా, అసంఖ్యగల మొత్తము నీ లక్ష్మీపుత్రుండా భారతికి సమర్పించెను. ఎంతప్రయత్నించినను ముద్రణార్థమగు కాగితము లభింపకుండుటవలన దీని నావెంటనే ప్రచురింపంజాలనయితిని, అనాటినుండియు నేవింగ్సు బ్యాంకులో పదిలపరుపంబడిన వజ్రశ్రీ సహాయమువలననే యీనాడిట్లు దీనిని వెలువరించితిని. శ్రీ వజ్రం శ్రేష్ఠి యొసంగిన ద్రవ్యము-ముద్రణ వ్యయమునకు చాలకున్నను ఏతన్ముద్రణమునకయిన ద్రవ్యములో-అర్ధభాగముకంటె నించుక యధికమే యగుచున్నది. శ్రీ సరస్వతి-తన అత్తయగు ఇందిరను కోరినదామె యొసంగినది.

క్రింది పద్యములలో "శ్రీ వజ్రాభ్యుదయము" నాకాంక్షింతును.

బత్తులలో వెలింగి-కొనె బత్తుల వజ్రసమాఖ్య, శ్రేష్ఠతా
వృత్తి-గడించె శ్రేష్ఠియనుపేరు, సతీమణి-సూర్యకాంత, తా
హత్తినప్రేమందన్గొల వ-నర్థులంబోచుచు, గుప్తదాతయౌ
బత్తుల వజ్రశ్రేష్ఠికి శుభంబు యశంబుందనర్పుంగావుతన్॥

స్వప్రకాశప్రదాత-భాస్వంతుండయిన
నెత్తినకరమ్ములను దించు నెపుడొయపుడు;
స్వాత్మవస్తుప్రదాత-వజ్రార్యవర్యుం
డెత్తిన కరంబులను దింపండెపుడుంగూడ॥

అతిసంపన్మయుఁడయ్యు, గర్వితుఁడుగా, డజ్ఞానసంసార సంగతుఁడై యుండియు, మోహయుక్తుఁడెపుడుంగా, డర్థిలోకావన ప్రతుఁడయ్యున్, బ్రకటింపఁడాత్మయశమున్, భవ్యుండు వజ్రార్యుఁడున్నత సత్కార్యుఁడు వెల్గుఁగాత సుజనానంద ప్రభాధుర్యుఁడై!

శ్రీ భారతీ దేవతాత్మయగు సచ్చిదానంద రసము నర్థించుచు ఈ నివేదికను ముగింతును

[ నాటు తెలుఁగు గీతిక ]

తొలిపలుకు కొనపలికిన తెలివి, తనివి,
యునికితో కూర్పుదినుసు తానెనసి తనర,
తెలివి తనివి యునికియౌచు వెలుఁగు "నింపు"-
డెందముల నెల్లపుడు సందడించుఁగాక!

ఆంధ్రీకృతికర్త,
అధ్యాపకుఁడు,
శ్రీ మహారాజ సంస్కృత కళాశాల.

విజయనగరము,
1-10-1954.

ఓమ్, తత్, సత్.

---

శ్రీ భారతీ దేవ్యైనమః.

# విజ్ఞాపిక

లలిత కళావిద్యలలో
కళలు-మనోరమలు; కళలఁగావ్యకళ-రసో
జ్జ్వలితోపదేశ, కృతి రా
మలలో ధ్వని కృతి-మహోత్తము, సదాత్మయగున్! ౧

ధ్వనికాదు, సరిగమాది
ధ్వనికాదు, పదార్థవృత్తి దర్శనములు కా
దు, నవాలంకృతి కా, దీ
ధ్వని-తద్వ్యంజిత రసాది తత్త్వాత్మ; సుఁడీ! ౨

వ్యంజకము-శబ్ద, మర్థము,
వ్యంజకములు-రీతి, వృత్తి, వస్తు, స్వరముల్
వ్యంజితమగు వ్యంగ్యత్రయి
రంజిల్లు రసాద్యలంకరణ వస్తువులై! ౩

అర్థము శబ్దము-వ్యంజక
మర్థము-వ్యంగ్యమగు, వృత్తి-వ్యంజన, రమణీ
యార్థము-ప్రధానమగు వ్యం
గ్యార్థమె-ధ్వని; అదియె-ఆత్మయగు సత్కృతికిన్! ౪

స్వరరాగశ్రుతు లెరుఁగని
అరసికునకు గాన సౌఖ్య మబ్బనిభంగిన్,
స్ఫురితాత్మ ధ్వని నరయని
అరసికునకు కావ్యసౌఖ్య మబ్బదు; సుహృదుల్!! ౫

"కావ్యానంద ప్రణయులు
భవ్యాత్ములు; భోగ-మోక్ష-ఫలసిద్ధులు, త
ద్దివ్య సుఖము-బ్రహ్మానం
దావ్యయ సబ్రహ్మచారి" యనిరి సహృదయుల్॥ ౬

[ జిలుగు ]

రస భావాభాస సుభావగత
ప్రశాంతి, సంధి, శబలతోదయముల
లసితమగు వస్త్వలంకృతుల ధ్వని
ప్రసారముఁగాంతుర్ప్రవణ శ్రవణులు! ౭

"శ్రమపడి-భ్రమవిడి-రసత
త్త్వ మెఱుంగుట-రసికులకు స్వధర్మము, కృషి-సౌ
ఖ్యముఁగూర్చు, ప్రాలుమాలిక
అమిత మనోవ్యథలఁదెచ్చు"నని క్షేమేంద్రుఁడీ! ౮

కావ్యాత్మ ధ్వనిదర్శిగాకయు, అహంకారాంధుఁడౌ వ్యక్తి-కా
వ్య వ్యాకర్తను భావుకుండనని డంబాలాడు శ్రీ సాహితీ
భవ్యాధ్వన్ బయనింపలేఁడతఁడు; కావ్యానందులానందవాగ్
దివ్యాలోకములో ధ్వనిప్రకృతి నుద్వీక్షింత్రు; విద్యార్థులై! ౯

అన్యాయంబు మహాకవిత్వ-రసికత్వావాప్తి కామంబు-కా
వ్య న్యాయజ్ఞులు కానిమూఢులకు; భాస్వత్సాహితీ మర్మమౌ,
ధ్వన్యాలోకము లోచనామృతములో దర్శించి, కావ్యజ్ఞులై
ధన్యుల్ కండు! కవుల్! విమర్శకులు! వ్యుత్పత్తిప్రియం
భావుకుల్! ౧౦

ధ్వనితానంద రసానుభూతి-సుకృతిప్రాప్యమ్ము, వ్యుత్పత్తి సా
ధనరూపం, బదిచూచు శ్రీ సహృదయుల్ ధన్యుల్, పరుల్ వ్యర్థజీ

వను, లీ మర్మమెఱింగి, సజ్జనులు! సంభావించి, ఆనంద వ
ర్ధన సంవర్ధితమై వెలుంగు ధ్వనితత్త్వంబున్ విలోకింపుఁడీ! ౧౧

అన్యాలోకములో కృతిప్రకృతి-శూన్యాలోకమైయుండ, సౌ
జన్యానంద వివర్ధనుండతఁడు భాస్వత్సాహితీ జీవిత
ధ్వన్యాలోక మొసంగె, లోచన-మతి-స్వాద్యంబు, వాగ్దేవతా
స్తన్యంబౌనది - ఓసుహృత్ సహృదయుల్ : స్వాదించి
మోదింపుఁడీ! ౧౨

ప్రతిభోత్పత్తి లలిత భా
రతి సముపాసించుచున్న ప్రాజ్ఞునకు చమ
త్కృతి భావనా పదార్థ
స్మృతి-కృతిరూపమున సంస్ఫురించుటయరుదే? ౧౩

సుధులు! ప్రతిభామతి-లోచన
ముఁదెరచి-యాలోకముఁగని-పూర్ణధ్వనులై
హృదిలో సుకృతి నుపాసిం
చి-దయామయి భారతి-దరిసింపుఁడు కృతులై!!! ౧౪

విజయనగరము, 10-10-1954.

ఇట్లు, రచయిత—
కౌముదీ సాహితీ పరిషత్సభ్యుఁడు.

ఓం నమో భగవతే, శ్రీ రమణాయ.
శ్రీ భారతీ దేవ్యైనమః.

# ఆంధ్ర ధ్వన్యాలోకము

## ప్రభామత్యాంధ్ర వివరణ సహితము.

### తృతీయోద్ద్యోతము (ద్వితీయభాగము)

మూ॥ కం॥ శ్రీ లలితరూప వీక్షణ
లీలారంజిత విరించికృతయోగతపో
జ్వాలా సంజాతజగ
జ్జాలాశ్రియ దివ్యమూర్తిః సహితస్ఫూర్తీ!

ఇట్లు ప్రభేద సహితమగు ధ్వని స్వరూపము ద్వితీయోద్ద్యోతమునందు వ్యంగ్యముఖముననే ప్రదర్శింపఁబడినది. ఇప్పుడు వ్యంజకముఖమున నదియే తిరుగఁబ్రకాశింపఁజేయబడుచున్నది.

ప్రభామతి :— వృత్తికారుడు ద్వితీయోద్ద్యోత—తృతీయోద్ద్యోతములకుఁ గల సంబంధమును దెలియఁజేయుచున్నాఁడు.

ద్వితీయోద్ద్యోతమునందు ధ్వనిస్వరూపము-వ్యంగ్యద్వారముననేగాని, వ్యంజక ద్వారమునఁబ్రదర్శింపఁబడుటలేదా? అని యాశంకించి లోచనకారులగు శ్రీ మహా మహేశ్వరాచార్య శ్రీమదభినవగుప్త పాదులవారు తమలోచనము నిట్లు ప్రసారించు చున్నారు.

"ధ్వనిస్వరూపమునకు వాచ్యద్వారముననే అవివక్షిత వాచ్యాదులగు భేదములు సంభవించుచున్నవి. వివక్షితముకాని వాచ్యముగలది-అవివక్షితవాచ్యము, వివక్షితమై, అన్య (వ్యంగ్య) పరమగు వాచ్యముగలది వివక్షితాన్య పరవాచ్యము. అని యిట్లు వాచ్యమగు నర్థము నవలంబించియే ధ్వని ప్రభేదవంతమగు చున్నదిగదా!

"యత్రార్థః" "అర్థమైన శబ్దమైన స్వార్థముల ప్రధానతఁగొలంగి యెటతదర్థము స్ఫురింపఁజేయునవియో" అను కారికయందు వాచ్యమగునర్థము వ్యంజకము (వేరొక యర్థమును వ్యంజనావ్యాపారముచేత ప్రకాశింపఁజేయునది) గానే చెప్పఁబడినది. కావున ద్వితీయోద్ద్యోతమునందు వ్యంగ్య ముఖమున ధ్వని స్వరూపము చెప్పఁబడినను, వ్యంజక ముఖమునఁగూడ నది చెప్పఁబడినదియే యగుచున్నది. అట్లయినను వ్యంజకమగు నావాచ్యార్థము వ్యంగ్య ద్వారముననే భేదించు

చుండును. అదెట్లనిన :— 'అవివక్షితమగు వాచ్యము' అను ఉక్తి చేతనే యది (అవివక్షితవాచ్యము) వ్యంగ్యముచే న్యగ్భావితమగు (అప్రధానముగాఁ జేయఁబడు) నను నంశము సిద్ధించుచున్నది. అట్లే వివక్షితమై అన్యపరమైన వాచ్యమగుటచే వివక్షితాన్యపరవాచ్యముగూడ వ్యంగ్యార్థ ప్రవణమే (వ్యంగ్యమున కధీనమైనదియే) యగుట సిద్ధముగదా! కావున నిట్లు అవాంతర భేద సహితములగు మూల భేదములందే వ్యంజకమగు నర్థము వ్యంగ్యపారతంత్ర్యముచే భేదము నొందుచున్నది. కావుననే "వ్యంగ్యముఖమునఁబ్రదర్శింపఁబడినది" అని వృత్తి కారుడను చున్నాఁడు. "వ్యంగ్యముఖమునఁబ్రదర్శింపఁబడినది" అని చెప్పుటలో వేరొక యభిప్రాయముగూడ నున్నది. అర్థము వ్యంజకమే యగుచున్నను (ఒకానొకప్పుడు) వ్యంగ్యము గూడ నగుచుండును. శబ్దము మాత్రము అట్లెప్పుడును వ్యంగ్యముగాక-వ్యంజకమే యగుచుండును. అని దానిభావము.

పూర్వోద్ద్యోతమున అవివక్షితత్వాదిభేద విశిష్టమగు వాచ్యమునకు ధ్వనివ్యంజకత్వము-సర్వథా లేకపోలేదను నంశమును "తిరుగ" అను పదముచేఁ జెప్పుచున్నాఁడు. ఫలితమేమనిన :— "ప్రస్తుతమగు నుద్ద్యోతమునందుఁదిరుగ దానినే శుద్ధ (కేవల) వ్యంజకముఖమునఁబ్రదర్శించు చున్నాడు" అనునదియే. వ్యంగార్థవ్యంజకములగు పద, వాక్య, వర్ణ, పదభాగ, సంఘటనా, మహావాక్యములు (వ్యంగ్యముఖ ప్రేక్షితములు కాకుండఁగనే) స్వతంత్రముగనే భేదించుచుండుననియు, నర్థమునకు వలె వీని కెప్పుడునుగూడ వ్యంగ్యత్వము సంభవించునది కాదనియు, కావున వీనికి వ్యంజకైకనియతమగు స్వరూపమేది కలదో, తద్ద్వారమున నిచట ధ్వని భేదము ప్రదర్శింపఁబడుననియుఁదాత్పర్యమై యున్నది.

పూర్వోద్ద్యోతములందు వ్యంగ్యముఖమునఁ గావింపఁబడిన ధ్వని ప్రదర్శన-మీ యుద్ద్యోతమున వ్యంజకముఖమున ప్రకాశింపఁజేయఁబడునని భావము.

మూ॥ కారికా॥ అవివక్షిత వాచ్యస్య పద వాక్యప్రకాశతా
తదన్యస్యానురణన రూపవ్యఙ్గ్యస్యచ ధ్వనేః॥

గీ॥ వాచ్యము వివక్షితముకాని ధ్వనికి-పదము,
వాక్యమును, వ్యంజకమ్ములై వరలు, నట్లె
తదితరమ్మను రణనాభిధమ్ము, నగున
ధ్వనికి నయ్యవియేయగు వ్యంజకములు.

ప్రభావతి :— అర్థాంతర సంక్రమితము-అత్యంత తిరస్కృతము-అని అవివక్షితవాచ్య ధ్వని-ద్వివిధమై యుండునని యింతకుముందే చెప్పఁబడెను. అట

హత్ + స్వ + అర్థమగు = స్వార్థమును విడువని లక్షణచేత-స్వరూపమును విడువక, వేఱొక యర్థమునందు సంక్రమించునదియు, జహత్ + స్వ + అర్థమగు = స్వార్థమును విడుచునదియగు లక్షణచేత-స్వరూపమును విడిచి-అర్థాంతరవ్యంజకమగునదియు, అగు వాచ్యార్థము-ఇట్లు అర్థాంతర సంక్రమితమును, అత్యంత తిరస్కృతమును, అగుటవలన అవివక్షితమగు చున్నది. ఇట్లు అవివక్షితమగు వచ్యార్థముగల ధ్వని-అవివక్షితవాచ్య-ధ్వని యగుచున్నది. ఇట్లు లక్షణా మూలకములగు నీ యవివక్షిత వాచ్యధ్వని భేదములకు కొన్ని స్థలములయందు పదమును, కొన్నిచోట్ల వాక్యమును వ్యంజకమగు చుండును.

సంలక్ష్యక్రమవ్యంగ్యము, అసంలక్ష్యక్రమవ్యంగ్యము, అని-వివక్షితాన్య పర వాచ్యధ్వని-ద్వివిధమని వెనుక చెప్పఁబడినది. అందు-ప్రతిధ్వని సదృశ మగుట వలన అను రణన రూపవ్యంగ్యమను నామాంతరముగల సంలక్ష్య-క్రమ-వ్యంగ్య ధ్వనికిఁగూడ నిట్లే పదమును, వాక్యమును, గూడ వ్యంజకములగు చుండునని తెలియునది.

ద్వివిధమగు నవివక్షితవాచ్యము-పదప్రకాశితమును, వాక్యప్రకాశితమునునై చతుర్విధమగు చుండుననియు, వివక్షితాన్యపరవాచ్య సంబంధియగు క్రమద్యోత్యము (సంలక్ష్యక్రమవ్యంగ్యము) కూడ-స్వభేదములందన్నింటనుగూడ నిట్లే-పదప్రకాశితమును, వాక్యప్రకాశితమును, గూడ నగుచుండుననియు, నెఱుఁగునది.

మూలము :— అవివక్షితవాచ్య ప్రభేదమగు అత్యంత తిరస్కృత వాచ్యము (నిశ్శేషముగాఁ దిరస్కరింపఁబడిన వాచ్యము గల ధ్వని) పదప్రకాశిత మగుటకు మహర్షియగు వ్యాసుని మహాభారతము నందలి పద్యముదా :—

కం॥ క్షమ, దయయు, శౌచమును, ధై
ర్యముఁ, గారుణ్యము, ననిష్ఠురంబగు మృదువా
క్యము, మిత్త్రుల కనభిద్రో
హము, నను నీయేడు సమిధలగు సిరికెపుడున్॥

ప్రభామతి :— క్షమాదులు సంపదకుఁ గట్టెలగుట సంభవము కానేరదు. కావున సమిచ్ఛబ్దార్థము సర్వథా తిరస్కృత మగుచున్నది. ఇందు "సమిధలు అనుపదము" "తదితరముల నపేక్షింపకయే యుద్దీపన సమర్థములు" అను నర్థమును లక్షింపఁజేయుచు క్షమాదులకుఁగల సంపదుద్దీపన సామర్థ్యము అనన్యాపేక్షము (క్షమాదులకంటె నితరములగు వాని నపేక్షింపను) అను (సహకార్యం

తరానపేక్షమను) నర్థమును ధ్వనింపఁ జేయుచున్నదని యెఱుంగునది. (తదితరముల నపేక్షింపకయే యెండుకట్టై లగ్నిముద్దీపింపఁజేయునట్లు, క్షమాదులు తదితరముల నపేక్షింపకయే సంపద నుద్దీపింపఁజేయునని భావము) ద్వితీయోద్ద్యోతమునందుదాహరింపఁబడిన "నిశ్వాసయుక్తి నంధమ యనట్టి" అనుచోట "అంధము" అను పదమువలెనే ఇచటి "సమిధలు" అను పదముఁగూడ "అత్యంత తిరస్కృతమగు వాచ్యము గలదగు చున్నది. ఇట్లిచ్చట అత్యంత తిరస్కృతవాచ్యమగు సమిత్పదము తద్ధ్వనివ్యంజక మగుచున్నది. ఇదియే వ్యంజకముఖమునఁగావింపఁబడిన ధ్వని భేద ప్రవర్తనమని గ్రహించునది.

ఇందలి "సమిధలు" అను పదము-సాధనాంతరముల నపేక్షింపక సంపదుద్దీపక రూపకమగు లక్ష్యార్థమును లక్షింపఁజేయుచు, క్షమాదులవలన నగు సంపదలు సర్వతోముఖీనములు, విపద్దేశ పాతకానుత్పాదకములు, పారత్రిక సుఖప్రదములు, ఇత్యాద్యనంతమగు ప్రయోజనమును ధ్వనింపఁజేయునని యవధాన టీక చెప్పుచున్నది.

మూలము :— ఇంకొకటి కాళిదాసుని దుదాహరింపఁబడు చున్నది. మేఘ సందేశమున మేఘునితో యక్షుఁడను చున్నాఁడు.

గీ॥ నాకరణి నస్వతంత్రుఁడు గాకయున్న
వాఁడెవండైన విరహ విహ్వల ప్రియ, స్వ
కీయకాంతామణి నుపేక్ష సేయఁగలఁడె?
నీవు సన్నద్ధుఁడవుగాఁగ నీరదంబ!

ప్రభామతి:—సన్నద్ధుడు = యుద్ధోద్యమము గలవాఁడు. చేతనమాత్ర ధర్మమగు యుద్ధోద్యమము (సన్నాహము) అచేతనమగు మేఘమునకుఁగలుగనేరదు. కావున నిందలి "సన్నద్ధుఁడవు" అనుపదము అత్యంత తిరస్కృతమగు స్వార్థము గలదగుట వలన వాచ్యనిరపేక్షమగు ఔద్ధత్యమును (ఉద్యతత్వమును) లక్షితముఁ జేయుచు వక్త్రభిప్రేతమగు నిర్దయుఁడు, అప్రతీకార్యుఁడు, (ప్రతీకారము చేయఁదగనివాఁడు) అప్రేక్షాపూర్వకారి, ప్రసహ్యకారి, ఇత్యాది ప్రయోజన రూపమగు వ్యంగ్యార్థమును ధ్వనింపఁజేయు చున్నది.

తిరుగ నింకొకటి కాళిదాసునిదే (ఉదాహరింపఁబడుచున్నది.)

శాకుంతలమున :— ఆశ్రమవృక్ష సేచన మొనర్చుచున్న శకుంతల సౌందర్యముచే నాకర్షింపఁబడిన దుష్యంతుఁడను చున్నాఁడు.

గీ॥ మధురములగు నాకృతులకు మండనంబు
గాని వస్తువేదైన లోకమునఁ గలదె?

ప్రభామతి :— రస విశేష వాచకమగు మధురపదము (తీపియను నర్థముఁ దెలుపు పదము) బాధ సహిష్ణుతచేత ఆకృతి రూపమగు నర్థమును బోధించుట కనర్హమై, సర్వవిషయ రంజకత్వ, తర్పకత్వాదులలో నేదోయొక ధర్మమును లక్షింపఁజేయుచు, 'ఆకృతులు మిగుల నభిలషించుటకు విషయములనునది యాశ్చర్యముకా' దను వక్త్రభిప్రేతమగు నంశమును ధ్వనింపఁజేయుచున్నది.

మూలము :— మీఁది యుదాహరణములయందు "సమిధలు, సన్నద్ధుఁడవు, మధురములు" అనుపదములు (తత్ప్రతిపాదిత వ్యంగ్యమునకు) వ్యంజకములగు నను నభిప్రాయముచేతనే ప్రయోగింపఁబడినవి. (వాచ్యార్థబోధనేచ్ఛచేఁగాక మీఁది పదములు వ్యంగ్యార్థబోధనేచ్ఛచేతనే ప్రయోగింపఁబడినవని భావము)

ఆ యవివక్షిత వాచ్యమునకే ద్వితీయ ప్రభేదమైయున్న అర్థాంతర సంక్రమిత వాచ్యము పదముచేఁబ్రకాశించుట కుదాహరణము :— రావణకృత మాయాసీతా శిరచ్ఛేదమును గాంచి-శోకవిహ్వలుఁడగు రాముఁడు-ఆత్మ హృదయమున సీతాదేవిని సంబోధించి యనుచున్నాఁడు.

మ॥ తగఁజేసెన్ ఖలుఁడైన రావణుఁడు ప్రత్యాఖ్యానరోషంబునన్
దగ నీవోర్చితి దాని బంధుజన మూర్ధంబుల్ ప్రకంపింప,వ్య
ర్థగతిన్ నీదురవస్థఁగంచు ధనువున్ దాల్చున్ ప్రియప్రాణుఁ డీ
జగతిన్"రాముఁడె" ప్రేమకుందగు సదాచారంబుగా నెం, బ్రియా!

ఇందు "రాముఁడు" అనుపదము సాహసైక పరత్వాది వ్యంగ్యాభి సంక్రమిత వాచ్యమగు వ్యంజకము.

ప్రభామతి :— రావణుఁడు రక్షస్స్వభావుఁడగుటచేతనే క్రూరుఁడు, మఱియు నలంఘ్యశాసనుఁడనను దుర్మదము గలవాఁడు. అట్టి గర్వాంధుఁడగు రావణుని లెక్కింపక అవరోధసుందరీ సహస్ర సన్నిధియందే నీవు తిరస్కరించితివి. కావునఁగ్రోధాంధుఁడగు నతఁడు "నాయాజ్ఞ నింకెవ్వఁడును గూడ నిల్లంఘింపఁగూడ"దను నభిప్రాయమున నీశిరః కర్తన మొనర్చుట యాతని చిత్తవృత్తి

కుచితమే యగుచున్నది. భయంకరమగు నిజ శిరః కర్తన సమయమున నీ నేత్ర విస్ఫారత (వికాసము) గాని ముఖ ప్రసాదముగాని రవంతయుఁ దరుగలేదు. కుల స్త్రీ జనమంతయు (మా జానకియెంత ధీరురాలు అను తలంపున) తలలెత్తుకొని తిరుగునట్లు నీవా శిరః కర్తనము మహోత్సవమువలె స్వీకారవై సహించితివి. ఇట్లు (క్రూర స్వభావుఁడగుటవలన రావణుఁడును) ఉత్తమ స్వభావవగుటవలన నీవును సముచితమగు విధమునఁ బ్రవర్తించితిరి. సాహసైక స్వభావుఁడనగు నేను మాత్రమే ఉచిత ప్రవర్తకుఁడను కాఁజాలనైతిని. మద్ధనుర్ధారణ ప్రయోజనము నిష్ఫలమైనది. రాజ్యభ్రష్టుఁడ నగుటచే నాధనుర్వ్యాపారమునకు ప్రథమ ప్రయోజనమగు రాజ్య రక్షణము నిరవకాశీకృతమైనది. (రాజ్యము రక్షించుట కవకాశము లేక పోయినది.) ద్వితీయ ప్రయోజనమగు కళత్ర మాత్ర రక్షణమును గూడ జేసికొనఁజాలనైతిని. తుదకు నీశిరః కర్తనమును జూచుచు నూరకుండిన వాఁడనగు నేను తృతీయ ప్రయోజనమగు నిజ జీవిత రక్షణమును మాత్రమే కావించుకొను స్వార్థపరుఁడనైతిని. ఇంతకంటె ననుచిత ముండునా? అని తాత్పర్యము. "సాహసైకరసుఁడను (పౌరుషవంతుఁడను) సత్యసంధుఁడను (రావణునిఁ జంపి నిన్నుఁ దిరుగఁ దీసికొని వచ్చుటకు సత్యమగు ప్రతిజ్ఞ నొనర్చినవాఁడను) ఉచితకారిని (ఉచితమగు సీతా ప్రాణ రక్షణము నొనర్పఁదగిన వాఁడను) అగు నేను, నిరుపమానమగు సాహసమును ప్రదర్శించి నేనొనర్చిన ప్రతిజ్ఞను సత్యమగునట్లు సంధించుటకు అనుచితమగునాత్మ జీవితరక్షణము నుపేక్షించి హృదయేశ్వరివగు నీప్రాణ రక్షణమును గావించుట సముచితము" అని యిందలి భావము నెఱుఁగునది. ఇందు "రాముఁడు" అను పదముచేఁ దెలుపఁబడు నర్థము, అసమ సాహసరసుఁడు, సత్యసంధుఁడు, ఉచితకారి, ఇత్యాద్యర్థాంతరమున (వ్యంగ్యమైన) సంక్రమిత మగుచున్నది. (చేర్పఁబడుచున్నది) కావున నిందున్న 'రాముఁడు' అనుపదము అర్థాంతర సంక్రమితవాచ్యధ్వనికి వ్యంజకముగానే తత్పద్యకవిచేఁ బ్రయుక్తమని గ్రహించునది.

"సాహసైక పరత్వాది" అని వృత్తియందుఁగల ఆదిశబ్దముచే కాపురుషాది ధర్మ పరిగ్రహము (కాపురుషుఁడగు ఇత్యాది విశేషణములు గల 'రాముఁడు' అని) గ్రహింపవలయును అని ఒకానొకనిచే వ్యాఖ్యానింపఁబడునది. కాని అదియుక్తము కాదు. కాపురుషునకు (దుష్టునకు) నిజజీవిత రక్షా ప్రయోజనకమగు ధనుర్ధారణమే యుచితముగదా! ఇచ్చటి యర్థాంతరము. 'కాతరత్వ'మని ప్రదీపకారుఁడును 'కైతవ స్నేహవత్త్వ'మని చక్రవర్తియుఁ, 'పురుషకార పరాఙ్ముఖత్వ'మని భట గోపాలుఁడును వచించిరి' (అని బాలప్రియ 292 పేజి)

[ఇచట వ్యంగ్యమగు నర్థము "కాతరుఁడు" అనునదియని ప్రదీపకారుఁడును, కైతవ స్నేహవంతుఁడనునని యని చక్రవర్తియు, పురుషకార పరాఙ్ముఖుఁడనునది యని భట్టగోపాలుఁడును వ్యాఖ్యా నించియున్నారు. అని బాలప్రియా వ్యాఖ్య (292పేజి) చెప్పుచున్నది. సాహసైకరసుఁడైనను కాతరుఁడును, స్వార్థముచేనంధుఁడగువాఁడును,అవివేకియు అగురాముఁడు" అనునర్థము నిచట గ్రహింపవలయునని దీధితి వ్యాఖ్య చెప్పుచున్నది. క్రూరుఁడగు రావణుఁడు తన కుచితమగు విధమునఁ జేసెను. పరాక్రమశాలియగు (వివేకవంతుఁడగు) రాముఁడు తన కుచితమగు విధమునఁజేయఁడయ్యెను. అని చెప్పుటయే యుచితముగా నున్నది. సాహసైకరసుఁడైనను భయపడినవాఁడు, స్వార్థాంధుఁడు, అవివేకి. అగు రామునకు నిజజీవిత రక్షా ప్రయోజనకమగు ధనుర్ధాణ ముచితమే యగును. కావున దీధితివ్యాఖ్యయందుఁ దెలుపఁబడిన విధమున వ్యంగ్యార్థమునందు 'రామ'పదవాచ్య సంక్రమణము కాఁజాలదని తోఁచెడిని. అట్లే కాతరుఁడగు రామునికిఁగాని, కపట స్నేహవంతుఁడగు రామునకుఁగాని, పౌరుష శూన్యుఁడగు రామునకుఁగాని "ఆత్మప్రాణపరాయణత్వము" యుక్తమేయగును. కాఁగా "ప్రదీప"కారాదుల యభిప్రాయములుగూడ నయుక్తములే యగును. కావున లోచనోక్తమగు నర్థాంతరమే సయుక్తికముగ నున్నట్లు గ్రహించునది "ప్రియా" శబ్ద మాత్రమే యిపుడుమిగిలియున్నది. ప్రియాశబ్ద ప్రవృత్తికి హేతువగు ప్రేమ పూర్వోక్త విధమున ననౌచిత్య కళంకితమే యైనదని భావము. కావున నిచట నిల్లు సంభావితమగు ప్రియాస్మరణము-ఆలంబన విభావము, ప్రియా సంబంధియగు నసాధారణ కర్మాది స్మరణము-ఉద్దీపన విభావము-తద్యోగము చేత రాముని యందలి కరుణము-ప్రస్ఫుటీకృతము.]

మూ॥ అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని-పదముచేఁ బ్రకాశింపఁజేయఁబడుట కింకొక యుదాహరణము :—

గీ॥ ఇట్లె! శశిబింబమును లోకమెల్ల నావ్మె
చెక్కిలికి సాటిగా వివక్షించు చుండు;
సత్య మరసిన-నిర్భాగ్య చక్రవర్తి
యైన చంద్రుఁడు-చంద్రుఁడే యగునుగాదె!!

ఇచ్చట ద్వితీయమగు "చంద్రుఁడే" అనుపదము అర్థాంతర సంక్రమిత వాచ్యము.

ప్రభామతి :— ఇది నాయికా ప్రశంసా పరమగు నొకానొక ప్రాకృత శ్లోకమున కాంధ్రీకృతి రూపము. ఆప్రాకృత శ్లోకమిట్లున్నది.

ఏమేఅజణో ణిస్సాదేఉ కవోలోవమాఇ ససిబిమ్బమ్
పరమత్థవిఆరేఉణ చన్దో చన్దో విఅవరాఓ

ఇందు చివరనున్న ద్వితీయచంద్ర పదము మాత్రమే అర్థాంతర సంక్రమిత వాచ్య వ్యంజకముగా నుదాహరింపఁబడినది. కాని యిందలి పదములన్నియుఁగూడ అర్థాంతర సంక్రమితములగు వాచ్యములు గలవగుచుఁ దద్ధ్వని వ్యంజకము లగుచున్నవి.

ఇందలి వ్యంగ్యములగు నర్థాంతరములతో వాచ్య మెట్లు సంక్రమించునదియు క్రింది యర్థనిర్వచనముచే నెఱుంగునది. ఇఒ్లై = అవివేకముచే గుడ్డిదై (యుక్తాయుక్త విచారణలేనిదై) ఈ విధముననే, లోకము + ఎల్లన్ = వివేకవంతుఁడొక్కఁడును లేక లోకప్రసిద్ధిచే గతానుగతికమై యున్నలోకమంతయు (ఈజనమంతయు) శశిబింబమును = కలంకవ్యాజ జిహ్మీకృతమగుటచే నధమాధమై ఆమనోహర ముఖ మండలముతోఁగూడ నుపమించుట కనర్హమగు చంద్ర బింబమును, ఆమె = అసాధారణ గుణ గణ మహార్ఘశరీర భంగిమముగల ఆ (స్మృతిపథ ప్రకాశితయగు) రమణియొక్క, చెక్కిలికిన్ = నిర్వ్యాజలావణ్య సర్వస్వభూతమును, ముఖమధ్యవర్తియు ప్రధానభూతమును (అనిర్వచనీయమును) నగు కపోలతలమునకు (ముఖమునకుఁగూడగాదు) శశిబింబముకంటె నుత్కృష్టమగు వస్తువును ఆమె చెక్కిలి కుపమానముగాఁ జెప్పఁదగునని భావము. సాటిగాన్-పేరెత్తుటకుఁగూడ వీలులేని చంద్ర బింబమునకు తద్రమణీ కపోలతలముతోడి సాదృశ్యము-పరిహాస పాత్రమని భావము. వికషించుచుండున్ = సాదృశ్యకథనము ఆయా వక్తలకు సంబంధించిన యభిప్రాయానుగత వివక్షయేగాని వాస్తవికము గాదని భావము-నిర్భాగ్య చక్రవర్తి = కృపైక భాజనము (కనికరముఁజూపఁదగిన వాఁడు) (జాలిఁగొనఁదగిన దురదృష్టవంతులలో ముఖ్యుఁడు) అగు చంద్రుఁడు-చంద్రుఁడే: (చంద్రుఁడు + ఏ = క్షయము గలవాఁడు, మాలిన్యము గలవాఁడు, విలాసము లేనివాడు అగుచంద్రుఁడే: ఇందు రెండవదగు చంద్రుఁడు అనుపదము (రెండుమార్లుచ్చరింపఁబడుటవలన పునరుక్తమగుటవలన ఉపపన్నము కానేరదు. కావున తత్పదవాచ్యము శైత్య దోషము గలవాఁడు (చల్లనివాఁడు) కళంకము గలవాఁడు, విలాసము లేనివాఁడు, ఇత్యాద్యర్థమునందు సంక్రమించి ''ఏమియు కాంతిలేనివాఁడు, అసహ్యమగురూపము గలవాడు, ఇంచుకయుఁ దృప్తిని గలిగింపనివాఁడు, ఇంచుకయు నాదరింపఁదగని వాఁడు,'' అను ప్రయోజన వంతమగు వ్యంగ్యార్థమునకు వ్యంజకమగుటవలన అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని-పదప్రకాశిత మగుట సిద్ధించుచున్నది" అని అవధానటీక చెప్పుచున్నది. (199 పేజి.)

మూలము :— ఇట్లు ప్రథమభేద (అవివక్షితవాచ్య ప్రకార) ములు రెండును పదప్రకాశకము లెట్లగునదియు నుదాహరించి, యిప్ప డవి వాక్య ప్రకాశకము లెట్లగునదియు నుదాహరించుచున్నాఁడు.

అవివక్షితవాచ్య సంబంధియగుచు-అత్యంత తిరస్కృతరూప మగు ధ్వనిభేదము-వాక్యముచేఁ బ్రకాశింపఁజేయఁబడుటకుదాహర ణము-భగవద్గీతయందు ద్వితీయాధ్యాయమున—

యానిశా సర్వభూతానాం తస్యాంజాగర్తి సంయమీ
యస్యాం జాగర్తి భూతాని సానిశా పశ్యతో మునేః॥

గీ॥ అఖిల భూతంబులకు నిశ (రాత్రి) యైన దేదొ
అందె మేల్కొను సంయమి యైన వాఁడు
భూతములు జాగరూకతఁ బొందునెందు
నదియె నిశయగుఁ గనుఁగొనునట్టి మునికి॥

మీఁది వాక్యమున నిశార్థముగాని,జాగరణార్థముగానియేదియు వివక్షింపఁబడినదికాదు. ఇంకేమనిన :— సంయమి (ముని) తత్త్వజ్ఞానము నందవహితుఁడగుటయు, (అవధానము గల్గియుండు టయు,) తత్త్వేతరమునందు (జీవ-బ్రహ్మ-భేదదృష్టి రూపమగు. సంసారమందు) పరాఙ్ముఖుఁడగుటయుఁ, బ్రతిపాదింపఁబడినది. కావునఁ దిరస్కృత వాచ్యమగు నీవాక్య మిచట నర్థాంతర వ్యంజక మగుచున్నది.

ప్రభామతి :— భగవద్గీతాగతమగు నీవాక్య ముపదేశపరముకావలయును. పగటియందు సమస్త ప్రాణులును మేల్కొనునట్లు సంయమి - రాత్రియందు మేల్కొన వలయును, ప్రాణులు రాత్రియందువలె సంయమి-పగటియందు నిద్రింప వలయును, అను నీ విధమగు నర్థము ప్రకృతోపదేశ యోగ్యము కానేరదు. కావున బాధితమగు స్వార్థముగల మీఁది వాక్యము "సంయమి" లోకోత్తరుఁ డగుటచే తత్త్వదృష్టియందే నిమగ్నుఁడగుచుండుననియు, మిథ్యాదృష్టియందుఁ బరాఙ్ముఖుఁడగు చుండుననియు, ధ్వనింపఁజేయుచున్నది.

పూర్వపక్షి-భూతములన్నియు నిద్రించునపుడు సంయమి మేల్కొనుట యుపపన్నము కానేరదు, అఖిల భూతముల (ప్రాణుల) యందును సంయమికూడ

చేరి యున్నాఁడు. కావున "అఖిల భూతంబులకు నిశయైనదేదో" "అందె మేల్కాను" అనుచోటనున్న అఖిల శబ్దము బాధితమగు స్వార్థము గలదగుటవలన ననుపపన్నమై పూర్వోక్తమగు నర్థము నాక్షేపించును. కావున నిచట ధ్వనిలేదు.

సిద్ధాంతి-అవశ్యకతచేత ఇచటనున్న అఖిల శబ్దము సంయమి వ్యతిరిక్తము అగు సమస్త ప్రాణులను దెల్పును. గావున దానిచేఁ బూర్వోక్తమగు వ్యంగ్యము ఆవిష్కరింపఁబడనేరదని గ్రహించునది.

బ్రహ్మాది స్థావరాంతమగు చతుర్దశ [బ్రాహ్మ, ప్రాజాపత్య, ఐంద్ర, పిత్ర్య, గాంధర్వ, యాక్ష, రాక్షస, పైశాచభేదముచే సప్తవిధమగు దైవము, ఏక విధమగు మానుషము, పశు, పక్షి, సర్ప, కీట, స్థావర, భేదమువలనఁ బంచవిధ తిర్యగ్యోని సంబంధియునగు] భూతములకును, ఏతత్త్వదృష్టి నిశయో (వ్యామోహ జననియో) దానియందే సంయమి మేల్కానుచున్నాడు. అనఁగా ఈతత్త్వ జ్ఞాన మెట్లు పొందనగునని తత్ప్రాప్తి సాధనమగు యోగాదికము నన్వేషించు చుండునని భావము. వాఁడే సంయమి. ఎవఁడైనను విషయములను త్యజించినంత మాత్రము ననే సంయమి కాఁజాలఁడు. సర్వభూత మోహినియగు నిశయే యవిద్య. కావున నందే "మేల్కానున్" అనుదానికి "అవిద్యయందే సంయమి "మేల్కా నును" అని యైనను చెప్పవచ్చును. ఈయవిద్య నెట్లు విడువవలయునని విమ ర్శించుటయే మేలుకొనుట. 'భూతములు జాగరూకతఁ బొందునెందున్' = ఏమిథ్యా దృష్టియందు (అవిద్యయందును తత్కార్యమగు ద్వైతభేద ప్రపంచమునందును) ఈ భూతములు (ప్రాణులు) మిక్కిలిగా మేల్కాని = తెలిసికొనియుండునో ఆమిథ్యాదృష్టి (అవిద్యా ప్రపంచదృష్టి) "పరిదృశ్యమానమగు నీలోకమంతయు బ్రహ్మమే" అని తత్త్వదర్శియగు మునికి, నిశయగున్ = రాత్రియగును = అ ప్రబోధ విషయమగును. అతఁడు అవిద్యా ప్రపంచ ప్రవృత్తి జ్ఞాతకాఁడు. అతఁ డిట్లు లోకోత్తరాచార వ్యవస్థితుఁడై చూచుచుండుటవలన బహిష్కరణవృత్తియు, మననము చేయుటవలన అంతఃకరణ ప్రవృత్తియు చరితార్థమగుచుండును. తది తరుఁడెవ్వఁడును, ఇట్లు చూడఁడు, తలఁపఁడు. కావున మానవుఁడు తత్త్వదృష్టి పరాయణుఁడు కావలయునని తాత్పర్యము.

దీని ఫలిత మేమనిన :— "కనుఁగొనునట్టి" అనుపదమును, "ముని కిన్" అను పదమును స్వార్థమునందే విశ్రమింపక పూర్వోక్తమగు వ్యంగ్యము నందే విశ్రమించుచుండును. 'ఏదో' 'అందె' 'ఎందు' 'ఆదియె' అనునవికూడ స్వతంత్రార్థ బోధకములు కాక అర్థాంతరమగు వ్యంగ్యార్థమునందు సంక్రమించిన వాచ్యార్థము గలవియే యగుచున్నవి, కాఁగా ఇందలి పదసమూహమంతయు, ఇట్లాఖ్యాత సహాయమున వ్యంగ్యపరమే యగునని తెలియునది. (లోచనము)

మూలము :— అర్థాంతర సంక్రమిత వాచ్యమగు ఆ యవివక్షిత వాచ్యధ్వనియే వాక్యముచేత ప్రకాశింపఁజేయఁబడుటకు ఉదాహరణము :—

కం కొందఱికి విషమయంబగుఁ
గొందఱికిలనమృతమయమగునుకాలము, తాఁ
గొందఱికి విషామృతమగుఁ
గొందఱి కవిషామృతంబగుచునుండుఁగదా!

ప్రభామతి :— స్వకర్మార్జితమగు దుఃఖము ననుభవించుచున్న యొకానొక వ్యక్తి-మీఁది వాక్యము ననుచున్నాఁడు.

'లావణ్యము' మొదలగు శబ్దములకు-ఛాయతిశయాద్యర్థమునందు (కాంత్యతిశయాదులయందు) వలె మీది పద్యమునందలి విషశబ్దమునకు దుఃఖ సాధనము నందును అమృత శబ్దమునకు సుఖసాధనమునందును నిరూఢ లక్షణ నంగీకరింపవలయును.

కాలము-పాపాత్ములకు కొందఱికి లేక, అత్యంతమగు వివేకము గలవారికి కొందఱికి-దుఃఖసాధనమయమగుచుండును.

ఆకాలమే-కొందఱు పుణ్యాత్ములకు లేక ఏమియు వివేకములేనివారికి సుఖసాధనమయమగు చుండును.

అదియే-పుణ్యపాపమిశ్రకర్మయుక్తులకుఁ కొందఱికి, లేక వివేక అవివేక మిశ్రచిత్తులగు కొందఱికి-దుఃఖ-సుఖోభయ సాధనమయమగు చుండును.

అదియే-కొందఱు మూఢప్రాయులకు, లేక - ధారా ప్రాప్తయోగభూమికారూఢులగు మహాయోగులగు కొందఱికి-దుఃఖ-సుఖ-ఉభయసాధనరహితమగు చుండును. ఆయా వ్యక్తులకిట్లు-కాలము గడచునని సమన్వయించుకొనునది.

"వేప-చేదు-వెలగతీపి" అనుచోటనువలె-ఈ పద్యమునందున్న - విష-అమృతపదములు-లావణ్యాది పదములవలెనే నిరూఢ లక్షణారూపతచేత దుఃఖ-సుఖ సాధనములయందు వర్తించును. అయినను-ఈ పదములు-దుఃఖసాధనము-సుఖసాధనము-అను-స్వార్థమాత్రమునందే విశ్రమింపక, దుఃఖసాధనముచేత సాధ్యమగు దుఃఖమునందును, సుఖసాధనముచేత సాధ్యమగు సుఖమునందును, పర్యవసానము నొందును. సాధనములులేక సాధ్యములగు సుఖదుఃఖములు కలుగవు. కావున ఆసాధనములు కూడ సర్వథా-అవివక్షితములు కావు (వివక్షలేకుండుటవలన తిరస్కృతములు కావని భావము) 'కొందఱికి' అను-పదము-ఆ కొందఱు-ఎట్టి విశేష

ధర్మము గలవారై యున్నదియు తెలుపుటలేదు. కావున (అజ్ఞాత విశేష ధర్మ వచ్చిన్నమగు) ఆ 'కొందటికిన్' అను పదముకూడ-విషామృతపదములవలె-ఇక్లే పాపాత్ములు-పుణ్యాత్ములు-ఇత్యాది-అర్థ విశేషములందు సంక్రమించుచున్నదనియు. 'కాలము' అనునది సర్వవ్యవహారములయందును సంక్రమించుచున్నదనియు నెఱుఁగునది.

మూలము :— మీది యుదాహరణవాక్యమునందు విషామృత శబ్దములు-దుఃఖసుఖరూప సంక్రమిత వాచ్యములుగా వ్యవహరింపఁబడియున్నవి. కావున అవివక్షితవాచ్యధ్వని ప్రభేదమగు అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనికి-ఇచట వాక్యమే-వ్యంజక మగుచున్నది.

ప్రభామతి :— కొందటికిన్, కాలము-ఇత్యాది పదములుగూడ-అర్థాంతర మగు పాపాత్ములు ఇత్యాది వ్యంగ్యార్థమునందు సంక్రమించునవియగు వాచ్యార్థములను గలిగియుండుట వలన అవికూడ-అర్థాంతర సంక్రమితవాచ్య ధ్వనికి-ఉదాహరణములై యున్నవి. వృత్తికారుఁడు విషామృత శబ్దవాచ్యములు మాత్రమే వ్యంగ్యార్థమునందు సంక్రమించుననుట ఉపలక్షణార్థము మాత్రమే అని గ్రహించునది.

దుఃఖ-సుఖ-విశేషమిచట వ్యంగ్యము. విషామృతములు తత్సాధనములు. దుఃఖ సుఖ సాధనార్థకములగు విషామృత శబ్దములిచట స్వసాధ్య దుఃఖ సుఖ విశేష రూపమగు నర్థాంతరమగు వ్యంగ్యమునందు సంక్రమించుటవలన-ఈ పద్యము అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనికి ఉదాహరణ మగుచున్నదని తెలియునది.

దీధితి ఇట్లు చెప్పుచున్నది :— అర్థము వ్యంగ్యమునందు సంక్రమించుట కుదురదు. కావున నిది అర్థాంతరమునందు సంక్రమించు నదియగు వాచ్యముగల ధ్వనికి (అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వనికి) ఉదాహరణమగునా? కాదా? అని విచారింపవలసియున్నది.

కాఁగా, ఇది-అత్యంతతిరస్కృత వాచ్యధ్వనికి-ఉదాహరణమనుటయే సంగతమని తోఁచెడిని (పే 165) ఈ యభిప్రాయము-సంగతముకాదు. బాలప్రియ ఏమనుచున్నదో చూడుఁడు:

నింబము-విషము-కపిత్థము-అమృతము-ఇత్యాది ప్రయోగములయందు నిరూఢ లక్షణచేత, నింబము, దుఃఖసాధనము, కపిత్థము, సుఖసాధనము-అను నర్థమే అచట వివక్షింపఁబడును. ప్రకృతమునందో, కాలము-కొందటికి-దుఃఖమయముగను, కొందటికి సుఖమయముగను గడచును, అను నర్థము వివక్షింపఁబడుటవలన విష పదమునకు కించిత్ సాధనమగు దుఃఖమునందును, అమృతపదమునకు కించిత్

సాధనకమగు సుఖమునందును లక్షణ ప్రవర్తించును. దుఃఖ-సుఖవిశేషము-వ్యంగ్య మగుచుండును.

విషామృతములు సాధనములుగా భావించుచుండుటవలన నిచట అర్థాంతర సంక్రమిత వాచ్యతకూడ సిద్ధించును. (296 పేజీ).

మూలము: అవ :— ఇట్లు కారికయందలి ప్రథమార్థము చేత లక్షితమగు ప్రకార చతుష్కము నుదాహరించి,ద్వితీయార్థము చేత స్వీకృతమగు ప్రకారషట్కమును క్రమముగా నుదాహరించు చున్నాఁడు.

[దాన ధర్మమునందు మిక్కిలి యాసక్తి గలిగిన ఒకానొక దరిద్రుఁడు-దానము నొనర్చుటకు శక్తి లేక నిర్విణ్ణుఁడై యను చున్నాఁడు.]

వివక్షితాన్య పరవాచ్య ప్రభేదమగు అనురణన (సంలక్ష్య) రూప వ్యంగ్యసంబంధి, శబ్దశక్త్యుద్భవధ్వని ప్రభేదము-పదముచేత ప్రకాశింపఁజేయఁబడుటకుదా :—

చం॥ ధనములొసంగి అర్థి జనతా స్వమనోరథ పూరణంబుఁగూ
ర్చనియతిఁజేర్పకున్న,నెవొత్రోవను సాంద్రవినిర్మలాంబుపూ
ర్ణనుత జలాశయంబుగనొ,నన్ను జడాకృతి నూతిఁగానొ, తా
నను గుణమైనరీతినకటా! విధియేల సృజింపఁడయ్యెనో?

మీఁది పద్యమునందు "జడాకృతి" అనుపదమును నిర్విణ్ణుఁడగు వక్త (దరిద్రుఁడు) ఆత్మ సమానాధి కరణముగా,అనఁగా, అభేద సంబంధముచేత తనకే విశేషణముగా ప్రయోగించి యున్నాఁడు. ఆపదము-అనురణనరూపమై (సంలక్ష్యక్రమమై) స్వశక్తి చేత,అనఁగా, వ్యంజనా వ్యాపారముచేత కూపసమానాధికరణత్వమును బొందు చున్నది. అభేద సంబంధముచేత నూతికిఁగూడ విశేషణముగాఁ జేయఁబడుచున్నది.

ప్రభామతి :—''జడాకృతి''అనుపదమునకు ''శీతల జలాకృతి''అనియు, ''వివేక శూన్య-అచేతన స్వరూపము''అనియు, రెండర్థములున్నవి. కావున''జలా

కృతిన్'' (జడాకృతిన్) అను పదమును-విషణ్ణుఁడగు దరిద్రవక్త 'కింకర్తవ్యతా మూఢుఁడను' అను నర్థమున ప్రయోగించెను. కావున ఈయర్థమునందే అభిధ నియంత్రితము కాఁగా, నటుపిమ్మట (వాచ్యార్థోపస్థితి కలిగిన పిమ్మట) నీ పదము నకు శీతలమగు (శీతలజలయోగముచేత పరోపకారసమర్థమగు) లేక, వివేకరహిత మగుటచే సంతాప-నిర్వేదశూన్యమగు, నూతినిగానో విధి-నన్నేల సృజింపఁడయ్యెనో అనునర్థము అభిధా మూలమగు వ్యంజనచేతఁడీసికొని రాఁబడుచున్నది.

కావున శబ్దశక్తి మూలమగు సంలక్ష్య క్రమ వ్యంగ్యధ్వని-ప్రపస్రికాశిత మగుటకిది యుదాహరణమగుచున్నది. గంట వాయించునపుడు కలుగు మొదటి ధ్వని ననుసరించి జనించు తరువాతి ధ్వనిపలె, నిచట వాచ్యార్థబోధము కలిగిన వెంటనే ధ్వన్యమానమగు నర్థము స్ఫురింపఁజేయఁబడుటవలన నిది శబ్ద శక్తి మూల మగు ననురణన ధ్వనియని చెప్పఁబడుచున్నది.

''అచేతనమగుటవలన సంతాప నిర్వేదము తెలియఁగక-'అర్థిజనుల మనో రథములను బూరింపలేకపోయితినే' అను విషాదము ననుభవింపని కూపమునుగా నైనను విధినన్ను సృజించి యుండిన యెడల నాకిట్టి దుఃఖము కలుగకుండెడిది'' అని వక్తృగతమగు దుఃఖాతిరేకము-ఇందలి జడపదముచే ధ్వనింపఁజేయఁబడు చున్నది.

'ధనములు' అనుచోనున్న బహువచనముచే యాచకుల యభీష్టముల కను రూపములగు వస్తువుల నానాత్వమును, 'జనతా' అనుబచే నర్థిజన బాహుళ్యమును, విధి శబ్దముచేఁదిన య స్వతంత్రతయు, 'వినిర్మలాంబుపూర్ణ' శబ్దముచే లోకోపకార కత్వమును సూచింపఁబడుచున్నవి.

మార్గసమీపమునందుండి బాటసారుల కుపకరించుటకుఁదగిన తేటనీరుగల తటాకమేకాక, చేద, త్రాడు, లేనియెడల పరులకుపకరింపని దైనను, చల్లని నీరు గల కూపము కూడ (ఏమిచేయవలయునో తెలియని) నాకంటె సార్థక జన్మ వంతమే యను నభిప్రాయమును స్ఫురింపఁజేయుచు, దాన పరాయణుఁడయినను దారిద్ర్యముచేత దానము నొసఁగుట కశక్తుఁడగు నీవక్తకుఁగలిగిన నిర్వేదాతిశయ మును శబ్దశక్తిచేత ధ్వనింపఁజేయుటవలన, శబ్ద శక్తి మూలమగు సంలక్ష్య క్రమ వ్యంగ్యధ్వనికిచట వ్యంజకమగునది ముఖ్యముగా 'జడాకృతి' అనుపదమే యని గ్రహింపవలయును.

**మూలము :— ఆదియే అనఁగా సంలక్ష్య క్రమ వ్యంగ్య మగు శబ్ద శక్త్యుద్భవ ధ్వనియే-వాక్యముచేతఁబ్రకాశింపఁజేయఁబడు టకు హర్షచరిత్రమునందలి సింహనాద వాక్యములుదాహరణము.**

"ఈ మహాప్రళయము ప్రవర్తిల్లఁగా, ధరణీ ధారణము కొఱ కిప్పుడు నీవు శేషుండవై యున్నావు"

ఈవాక్యము-అనురణనరూపమగు నర్థాంతరము(వ్యంగ్యము)ను శబ్ద శక్తిచేత స్పష్టముగానే ప్రకాశింపఁజేయుచున్నది గదా!

ప్రభామతి :— ఈ = ఇట్టి = తండ్రియగు ప్రభాకర వర్ధనుఁడును, జ్యేష్ఠ భ్రాతయగు (పెద్దన్నయగు) రాజ్యవర్ధనుఁడును చనిపోవుటయను, మహా + ఆ ప్రళయము = శోకకారణమగు నుత్సవనాశము (గొప్పఅపాయము) ప్రవర్తిల్లఁగా = సంభవింపఁగా, ధరణీ ధారణము కొఱకున్ = రాజ్యభారమును వహించుట (మోయుట) కొఱకు, నీవు, శేషుండవై = మిగిలినవాడవై యున్నావు. అను ప్రాకరణికమగు వాక్యార్థబోధము కలిగిన పిమ్మట, అభిధామూలమగు వ్యంజనచే "ఇట్టి ఘోరమగు కల్పాంతము సంభవింపఁగా (దిగ్గజములు సైతము ప్రలీనములుకాఁగా) ధరాపీఠభారమును మోయుటకు నీవే శేషుఁడవై (నాగరాజవై) యున్నావు" అను నర్థాంతరము (వ్యంగ్యార్థము) ప్రత్యాయిత మగుచున్నది.

అప్పుడీ యర్థములు రెండింటికిని ఉపమానోపమేయభావముకూడ వ్యంజింపఁజేయఁబడుచున్నది. శేషునివలె నీవుధారణముకొఱకు శిష్యమాణుఁడవని యిట్లింపుపమాలంకారము ధ్వన్యమానమని గ్రహించునది.

ప్రళయాద్యనేకపద సాపేక్షమగుటచేత నీధ్వని-వాక్య ప్రకాశితమగుచున్నది.

ఇది శబ్దశక్తిచేత నుద్భూతమగుటవలనను, అనురణన రూపమగుటవలనను, శబ్దశక్తిమూలానురణనధ్వన్యుదాహరణ మగుచున్నది.

మూలము :— కవిప్రౌఢోక్తి మాత్రనిష్పన్న శరీరమగు నదియే (వివక్షితాన్య పరవాచ్యధ్వనియే) అర్థశక్త్యుద్భవమగు ప్రభేదమునందు పద ప్రకాశిత మగుటకుదా :—

ప్రవరసేనకృతము-ప్రాకృత భాషారూపకము-అగు హరి విజయము నందలి పద్యము.

గీ॥ చారుచూతాంకురావతంసము, మహోత్స
వోపగమ మనోహర సురామోదయుతము
శ్రీకరంబు, వసంతలక్ష్మీముఖంబు
నొసఁగకున్నను గ్రహియించెఁగుసుమశరుఁడు॥

మీఁది పద్యమునందు కుసుమశరుఁడు (మన్మధుఁడు) (ఆమె) ఒసఁగకున్నను వసంతలక్ష్మిముఖమును గ్రిహించెను. అను (నవోఢా సంబంధియగు) నీయవస్థ నెఱిఁగించు "ఒసఁగకున్నను" అనుపదము కుసుమబాణుడను కాముకుఁడు కావించిన వసంతలక్ష్మి ముఖ గ్రహణరూపమగు బలాత్కారమును అర్థశక్తి చేతఁబ్రకాశింపఁజేయుచున్నది.

వ్రిభామతి :— ముఖమనఁగా ప్రారంభము, ముఖముకూడ నర్థమగును. కావున వసంతఋతు ప్రారంభమునందు కాముఁడు చిత్తము నాక్షేపించు (నాకర్షించు) నను నీయర్థము-కవిప్రౌఢోక్తిచేత నర్థాంతర వ్యంజకముగాఁజేయఁబడుచున్నది.

చారు చూత+అంకుర+అవతంసము = 1 అవతంసము (కర్ణభూషణము) వంటి చూతాంకురము గలది = 2 అందమగు రసాలమంజరియే కర్ణపూరముగాఁ గలది.

మహోత్సవోపగమ, మనోహర సుర+ఆమోదయుతము = మహోత్సవమగు నుత్సవప్రసరముచే మనస్సును హరించు మన్మధదేవునియొక్క చమత్కారము గలది. గొప్పదగు నుత్సవప్రాప్తివలె మనోహరమగు మద్యముయొక్క సౌరభము వంటి సౌరభముతోఁగూడినది (అగు) వసంతలక్ష్మి ముఖంబున్ = వసంతశోభ యొక్క ప్రారంభమును (వసంతఋతు ప్రారంభమును) "వసంతలక్ష్మి" అను నవోఢయగు (క్రొత్తపెండ్లి కూతురగు) నాయికయొక్క ముఖమును, ఒసఁగకున్నను = వసంతారంభము కలుగకున్నను, సిగ్గుచేత ఆమె తన్నతఁడు చుంబించుట కంగీకరించి యర్పింపకున్ననుగూడ, కుసుమశరుఁడు = పుష్పబాణుఁడగు మన్మధుఁడు, కుసుమశరుఁడను నాయకుఁడు, గ్రిహియించెన్ = ఉద్దీపింపఁజేసెను (బలాత్కారమున) ముద్దాడెను.

కుసుమశరుఁడను కాముకునిచేఁజేయఁబడిన వసంతలక్ష్మిముఖ-బలాద్గ్రిహణ రూపమగు వ్యంగ్యము-కవిప్రౌఢోక్తి మాత్రనిష్పన్న శరీరము. 'ఒసఁగకున్నను' అనుపదము ముద్దరాలగు వసంతలక్ష్మియొక్కలజ్జావస్థను సూచించుచు, మీఁది వ్యంగ్యార్థమునకు వ్యంజకమగుచున్నది.

క్రొత్తపెండ్లికూతురగు వసంతలక్ష్మియను నాయికయొక్క - చూతాంకురావతంసము, మహోత్సవప్రాప్తివలె మనోహరము, మదిరాసౌరభయుక్తము-అగు ముఖము-కుసుమశరుఁడను నాయకునిచే బలాత్కారమున గ్రిహింపఁబడుచున్నది. అను నీయర్థము సమాసోక్త్యలంకార రూపమగుచున్నది.

("వాసంతిక శోభారంభమునందే కాముఁడు పరాక్రమించె" ను వాక్యార్థము వలన, ప్రపంచము నందనంగుఁడొనర్చిన బలాత్కారము-ఒనఁగకున్నను, అను పదముయొక్క మహిమచే ధ్వనితమై సాంద్రమవిరాసురభి ప్రముఖసంబంధాది ప్రవృత్తిని స్ఫురింపఁజేయుచున్నదని అవధాన టీక.)

లోచనము :— కవినిబద్ధ-వక్తృ-ప్రౌఢోక్తి శరీరార్థశక్త్యుద్భవమగు ధ్వని-పదముచేతను, వాక్యముచేతను, ప్రకాశింపఁజేయఁబడుటకు రెండుదాహరణము లీయఁబడవలసియున్నను, పూర్వోక్త కారికయందు "అన్య....ప్రౌఢోక్తిమాత్ర నిష్పన్న దేహ మన స్వతస్సంభవియున" అని మాత్రమే చెప్పఁబడుటచేత వీనిచే నవికూడ గ్రహింపఁబడినవని నభిప్రాయమున నుదాహరింపఁబడవయ్యెను.

కవినిబద్ధ వక్తృప్రౌఢోక్తి శరీర-అర్థశక్త్యుద్భవ ధ్వని-పద ప్రకాశితమగుట కుదాహరణము :—

లోచనములోని యుదాహరణము :—

శ్లో॥ సత్యం మనోరమా రామాః సత్యం రమ్యా విభూతయః
కిన్తు మత్తాఙ్గనాపాఙ్గ భఙ్గ లోలం హి జీవితమ్॥

కం॥ రమణులు మనోరమలు, స
త్యము, రమణీయములు సంపదలు సత్యము, కా
ని-మనుష్య జీవితము మా
త్రము ప్రమదాపాంగ భంగ తరళమ్ము గదా!

మీఁది పద్యమునందు విరాగియగు వక్త-కవినిబద్ధుఁడు. కవినిబద్ధుఁడగు ఆ విరాగి వక్త పలికిన ప్రౌఢమగు ఉక్తిచేత-ఇందున్న జీవిత శబ్దము-అర్థ శక్తి మూలమున క్రింది యభిప్రాయమును ధ్వనింపఁజేయుచున్నది.

"రామాదులగు ఈ కామములు, మనోజ్ఞములగు ఈ విభూతులు, అన్నియును గూడ-మనుష్యుఁడు తాను జీవించియున్నప్పుడే ఉపయోగించును. ఆ జీవితములేనప్పుడు - ఇవియున్నను వానికి లేనివేయగుచుండును. ప్రాణవృత్తి-మిక్కిలి చంచలము. కావుననే ప్రాణధారణ రూపమగు జీవితము కూడ వాయు సంచలితమగు దీపమువలె చంచలమగుట వలన సుస్థిరము కానేరదు. దీనము

లగు విషయ భోగములు కృపైక భాజనములు. పాపము వీని యెడల-దోషము నుద్ఘోషించుటవలన ప్రయోజనము ఏమున్నది? కావున విషయములు కనికరింపఁదగినవి. అవి దుష్టములని నిందా వచనములచేత ఉద్ఘోషించుట-దౌర్జన్యమే యగును.

ఆత్మీయమగు జీవితమే-ఉపాలంభార్హము, కాని అదికూడ-స్వభావముచేతనే తరళము (చంచలము)గా నున్నది. కావున నదియు నిరపరాధమే యగుచున్నది. అయ్యో! వీనియందు నిందింపవలసిన దేదియును కాన్పింపకున్నది. కనుక ["వైరాగ్యమేవాభయమ్" అను భర్తృహరి వాక్యము ననుసరించి] గాఢ గాఢమగు వైరాగ్యమే శాశ్వతమగు ఆత్మయొక్క సంప్రాప్తికి ఉపాయమగుట చేత ఆశ్రయణీయము".

అ ధ్వనియే వాక్యముచేత ప్రకాశింపఁజేయఁబడుటకు ఉదా :— "ఏ శిఖరి యందు ఎన్నినాళ్ళ" అను పూర్వోదాహృతము. [ప్రథమభాగము 51వ పేజీ]

ఈ పద్యమునందు-వాక్యమే-ప్రచ్ఛన్నమును, మనోహరమును, వ్యంగ్యమును, అగు కవినిబద్ధ వక్తృనాయకాభిప్రాయ విశేషమునకు-వ్యంజకమగుచున్నది గదా!

మూలము :— ఈ ప్రభేదమే (అర్థశక్త్యుద్భవమగు సంలక్ష్య క్రమ వ్యంగ్యధ్వనియే) వాక్యముచేతఁబ్రకాశింపఁజేయఁబడుట కుదా :—

"కం॥ నవకిస పత్త్రిలములన్" అను పూర్వోదాహృత పద్యము. [ప్ర-భా 177 పేజీ]

"అనంగున కొసంగుటకాక వసంతుఁడు నిర్మించును బువ్ముఁలుకులన్" అను, కవిప్రౌఢోక్తిమాత్ర నిష్పన్న శరీరమగు నీవాక్యార్థము. వసంత సమయమునకుఁగల మన్మథోన్మాదకతావస్థితిని" సూచించుచున్నది.

స్వతస్సంభవి శరీరార్థశక్త్యుద్భవమగు ప్రభేదము పద ప్రకాశితమగుట కుదా :—

(ఒక వ్యాధుఁడు గలఁడు, వానికొడుకు మిగుల బలిష్ఠుఁడగు వేటకాఁడు. కావున వానియిల్లు పులితోళ్ళకు-ఏనుఁగు దంతములకు అంగడియయ్యెను. ఆయింటికొక క్రొత్త కోడలు వచ్చెను. కాలము గడచిన పిమ్మట "మీయింట పులితోళ్లును, ఏనుఁగు దంతములును గలవా? అని యొకానొక వర్తకునిచే నడుగఁబడి, మామయగు ఆ వ్యాధ వృద్ధుఁడనుచున్నాఁడు)

కం॥ పులితోళ్ళును, గజదంతం
బులు నో వాణిజక! యెటులఁబొందుదుమే మీ
"లలితాలక ముఖి" మా కో
డలు మాగృహమందుఁదిరుగుట మొదల్గాగన్॥

మీఁది పద్యమునందలి "లలితాలకముఖి" (మొగము మీఁదికి జారుచున్న ముంగురులు గలకాంత) అను పదము స్వతస్సంభావిత శరీరమగు నర్థశక్తిచేత "వ్యాధవధువు సురత క్రీడాసక్త" అను నంశమును సూచించుచు, ఆమె భర్త నిరంతరమగు సంభోగముచేతఁ గృశించి యుండుటను ప్రకాశింపఁజేయుచున్నది.

ప్రభామతి :— స్వతస్సంభావిత శరీరమగు నర్థశక్తి యనఁగా: లోకమునందుఁగూడ నౌచిత్యముచే సంభవించు నర్థముయొక్క సామర్థ్యము.

"అలకాలంకృతముఖి యగుటచేత అత్యంత మనోహారిణియైన నాకోడలి, యొక్క విభ్రమావేక్షణములచేతను, సురత విలాసములచేతను, విమోహితుఁడై యున్న నాకొడుకు సంతతమగు తదుపభోగముచేతఁగృశించి,వేటకొఱకు-ఒక్క క్షణ కాలముగూడ బయటికి రాకున్నాఁడు. కావున మాకు హస్తి దంతాదులెట్లు సంభవించును" అని భావము.

[ఇందలి 'లలితాలకముఖి' అనుపదము స్వతస్సంభావితమగు శరీరము గలిగి స్వార్థమహిమచేత బోయవాని కోడలికిఁగల సహజ మాధుర్యమును బోధించుచు, "వ్యాధపుత్రున కొదవిన జీవికావిముఖత-తదాసక్తి మూలిక" అను నంశమును సూచించుచున్నది అని యవధానటీక.]

మూలము :— అదియే-స్వతస్సంభావిత శరీరరార్థశక్త్యుద్భవ ధ్వనియే-వాక్యముచేతఁప్రకాశింపఁజేయఁబడుట కుదా :— వెనుక నుదాహరింపఁబడిన

గీ॥ "ముత్తెములుగూర్చి రచియింపఁబోలుచు భూష
ణముల మెరయు సపత్నీజనంబు నడుమ
వ్యాధుని వెలందియొక్కతె బర్హిపింఛ
కర్ణభూషణ, గర్వసంగత, భ్రమించు"

అను పద్యము. [ప్రి-భా 180 పేజీ.]

"ఏవ్యాధుఁడు-తదితర సపత్నీ సంభోగకాలమున కరివరవధ వ్యాపార సమర్థుఁడై యుండెనో, ఆవ్యాధుఁడే-తత్సమ్మేళన కాలమున-కరివరవధ వ్యాపారమున కసమర్థుఁడయ్యెను" అను నర్థమును ప్రకాశింపఁజేయుటచేత నీవాక్యముగూడ నవపరిణీతయు-శిఖిపింఛ కర్ణపూరయు అగు నొకానొక వ్యాధవధువుయొక్క సౌభాగ్యాతిశయమును ప్రకాశింపఁజేయుచున్నది.

( ఇచటి మూలమున కింకొక పాఠాంతర మిట్లున్నది. )

ఈ వాక్యముచేతఁగూడ - శిఖిపింఛకర్ణపూరయు, నవ పరిణీతయు, అగు నొక వ్యాధకామిని (బోయవెలఁది)యొక్క సౌభాగ్యాతిశయము ప్రకాశింపఁజేయఁబడుచున్నది. "తత్సంభోగైక రసుఁడగు తద్భర్త మయూరమాత్ర మారణ సమర్థుఁడయ్యె"నను నర్థము ప్రకాశింపఁజేయఁబడుటయే యిందులకు హేతువు-మఱియు దీనిచేత చిరపరిణీతలు-ముక్తాఫల రచితాలంకారలు-అగు తదితర సపత్నుల దౌర్భాగ్యాతిశయముగూడ ప్రకాశింపఁ [ధ్వనింపఁ] జేయఁబడుచున్నది. "తదితర సపత్నీ సంభోగకాలమునందావ్యాధుఁడే కరివరవధ వ్యాపారసమర్థుఁడై యుండెను" అను నర్థము ప్రకాశింపఁజేయఁబడుటయే యిందులకు హేతువు.

ప్రిభామతి :— "తన పెనిమిటి క్షణకాలమైనను గూడ తన్ను విడువఁజాలకుండుటచేత, వ్యజ్యమానమగు ఆత్మ గుణ ప్రకర్షము—ఈ క్రొత్త సుందరి యొక్క సౌభాగ్యాతిశయము మూలకమగు గర్వమునకు హేతువగుచున్నది. తత్సపత్నీ సంభోగకాలమునఁ దన పెనిమిటికిఁగల గజమారణ సామర్థ్యము కూడ వారి యందతనికిఁగల యనాసక్తిని సూచించుటచేజనగు తత్సౌభాగ్యాపకర్షముగూడ-తద్ గర్వ

హేతువే యగుచున్నది. అట్లు కానియెడల ముక్యములను ధరించియున్న భాగ్యవంతురాండ్రి యెదుట నెమలిపురికన్ను ధరించిన దరిద్రురాలికి గర్వసంబంధ ముపపన్నము కానేరదు గదా?

ఈ యర్థము నంతటిని స్వతస్సంభవియగు నర్థమును బోధించు నదియగు వాక్యమే ప్రకాశింపఁజేయుఁచేత ఈ ధ్వని-వాక్యప్రకాశిత మగుచున్నది'' అని ధీధితి. ఇందున్న ''గర్వసంగత'' శబ్దముచే లలితాలకముఖియగు వ్యాధ వధువున కొదవిన 'పతివాల్లభ్యము' వాచ్యమేయని శంకింపఁదగదు. ఈ గర్వసంగతి బాల్య నిమిత్తకమగునవివేకముచేతనైనను గలుగవచ్చునని సమాధానము చెప్పఁకొనవచ్చును గదా! ఏతత్ పద్య సందర్భమును ఈ గ్రంథముయొక్క ప్రథమ భాగమునందున్న 180, 181 పేజీలయందుఁజూచునది.

మూలము:— (ఇట్లు-ఉదాహరణ షట్కమును బ్రదర్శించి వ్యంజక కావ్యము-పదప్రకాశితమని నిరూపించుటకు ముందు "సముదాయమే ధ్వని" అని [ధ్వని-వాక్య ప్రకాశితమేకాని, పద ప్రకాశితముకాదని] ఆశంకించుచున్నాఁడు.)

ప్రశ్న :— అయ్యా !

("అర్థమైన శబ్దంబైన" అను కారికచేత) కావ్య విశేషము ధ్వనియని మీరు పూర్వము చెప్పియున్నారు. విశిష్టార్థ ప్రతిపత్తి హేతువగు శబ్ద సందర్భ విశేషముగదా కావ్య విశేషము! అది-పద ప్రకాశిత మెట్లగును? (వాచ్య-వ్యంగ్యభేదమున ద్వివిధమగునది విశిష్టమగు నర్థము. తదర్థబోధనమునకు హేతువగు వాక్య విశేషమే కావ్య విశేషము. కావున నది-పదముచేఁబ్రకాశింపఁజేయఁ బడదు.)

పదములు స్మారకములే గాని వాచకములు గాకుండుటవలన ధ్వని-పద ప్రకాశ్యమగునెడల అది-కావ్య విశేషమెట్లగును?

ప్రభామతి :— ''ఆయాయర్థములు పదములచే స్మరింపఁబడును. స్మృతము లగు నాయర్థములు వాక్యర్థము ననుభావింపఁజేయును'', అను మతమున ''పదము-ప్వార్థోపస్థితి మాత్రమునందే వాచకమగుచుండును. వాక్యమే వాక్యార్థోపస్థాపక మగును. పదము లచట తదర్థ స్మారకములే యగును. కావున నవి విశిష్టార్థ వాచ

కములు కానేరవు. కనుక పదములకు ధ్వనికావ్య వ్యంజకత్వము సంభవింపదు" అని పూర్వ పక్షాశయము.

మూలము :— దీనికి ప్రత్యుత్తరము చెప్పఁబడుచున్నది.

ధ్వని వ్యవహారమున-వాచకత్వము ప్రయోజకమగు నెడల నియ్యది దోషము కావచ్చును. "వ్యంజకత్వమే-ధ్వని వ్యవహార ప్రయోజకమగును" అను వ్యవస్థానము (నియమము) వలన వాచకత్వము తత్సాధకము గానేరదు.

ప్రభామతి :— 'పదములు స్మారకములే కాని వాచకములు కాకుండుటవలన, వానిచేత ధ్వని ప్రకాశింపఁజేయఁబడదు' అని చెప్పుటకు వీలులేదు. "వ్యంజక వ్యంగ్య సంబంధ నిబంధనముగల్గి వెలయుచున్నది ధ్వని" అని యింతకుముందు ధ్వని వ్యవహారమున కేవలమును వ్యంజనాత్మకయగు వ్యంజన అపేక్షింపఁబడుట వలన ధ్వని వ్యవహారమున వాచ్యార్థమునకు ప్రయోజనములేదు. కావున నచట నభిధారూపమగు వాచకత్వ మపేక్షింపఁబడునది కానేరదు. కావున ధ్వని విషయమున పదమున కభిధాప్రయోజ్యమగు బోధము నంగీకరింపకుండ వచ్చును గాని వ్యంజనా ప్రయోజ్యమగు బోధము నంగీకరింప వలసియే యుండును. అట్లంగీకరించునపుడు ధ్వని-పద ప్రకాశ్యమగుట సంగతమే యగును" అని సిద్ధాంతము.

మూలము :— ఇంతేకాక, శరీరులయందువలెనే కావ్యములయందగు సౌందర్య ప్రతీతి కూడ-సంస్థాన విశేషావచ్ఛిన్నమగు (అవయవ విశేష విశిష్టమగు) సముదాయము (అవయవి)చేత సాధింప వలసినదయినను-అన్వయ-వ్యతిరేకములచేత భాగముల (అవయవముల) యందు కల్పింపఁబడుచున్నది. కావున వ్యంజకత్వ ముఖమున పదములయందుఁగూడ వ్యవస్థితమగు ధ్వని వ్యవహారము విరోధించునదికాదు.

ప్రభామతి :— రసాది విశిష్టములగు కావ్యములే శరీరితుల్యములనియు, కేవల శబ్దార్థమాత్రములగునవి-శరీరమాత్రములేయనియు నెఱుంగునది.

పదములు-వ్యంజకములుగావిచో, తద్ఘటకములగు వాక్యములు గూడ వ్యంజకములు కాక పోవలసి వచ్చునని భావము.

ఇందలి యభిప్రాయమును క్రింది పూర్వపక్ష సిద్ధాంతములచే నెఱుంగునది. ఒకానొకఁడిట్లనవచ్చును.

పూ :— పదములు ధ్వనిప్రకాశకములు గాకుండుట కవి వాచకములు గాకుండుటయే హేతువని నేను చెప్పుటలేదు. వాక్యమే ధ్వనిప్రకాశకముగాని-పదము ధ్వని ప్రకాశకముగాదనియే నేననునది. కావున పదము ధ్వనింపకుండుటకు హేతు వది వాక్యముగా కుండుటయే.

సి :— నీవు చెప్పినది సత్యమే. పదము ధ్వనించునని మేముకూడఁజెప్పము. సముదాయము (వాక్యము) ధ్వనించుననియే మేము కూడఁజెప్పుదుము. అయినను ముఖాదులగు నవయవవిశేషములతోఁగూడియున్న శరీరియందగు సౌందర్య ప్రయోజకత-తత్తదవయవములయందుఁగూడ కల్పింపఁబడునట్లు-ఆకాంక్షాది విశిష్ట పద సముదాయ రూపమగు వాక్యమునందుఁగల చమత్కారివ్యంగ్యప్రతీతి ప్రయోజకత పదముల యందుఁగూడ కల్పింపఁదగినదియే యగును. కావున పదములు వ్యంజకములగుటవలన నవి-ధ్వని ప్రకాశము లగుట యుక్తమే.

పూ :— భాగములగు 'కటాః ఇత్యాది పదరూపములయందు చారుత్వ ప్రతీతి నారోపించుట కెట్లువీలగును? అవి స్మారకములు గదా !

సి :— ఏల వీలుకాకుండును? మనోహారియగు వ్యంగ్యార్థమును స్మరింపఁ జేయునవి సౌందర్య ప్రతీతి నిబంధనములు కావని యెవ్వఁడు నివారింపఁగలఁడు? (అప) 'తుష్యతుదుర్జనః' అను న్యాయము ననుసరించి వాచ్యభిన్నమగు నర్థము నందుఁగూడ పదములకు స్మారకత్వము నంగీకరించి ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁము.

మూలము:—

గీ॥ వ్యక్తమగు శ్రుతి దుష్టాదులం దనిష్ట
తను స్మరించు పదము-దుష్టతను ఘటించు
నట్లె, యిష్టార్థము స్మరించునట్టి పదము
సుందరతఁగూర్చుచుండు సంశ్రితము గాగ॥

గీ॥ కావుననె, పదంబులు-స్మారకంబు లగుచుఁ
దనరు నవియైనను, పదమాత్రవభాసి
యైన ధ్వనియును రమణీయ మగుచు మిగుల
నమరు నైజములగు ప్రభేదములనెల్ల

గీ॥ అధిక విచ్ఛిత్తి సంశోభి యయిన నగనొ
కండె కొని కామినీమణి కాంతి లీల
పద విభాసితమగు ధ్వని ప్రకృతిఁగొనియు
సుకవిభారతి-కాంతి విస్ఫురిత యగును॥

అను నివి పరికర పద్యములు.

ప్రభామతి :— పేల శబ్దమునకు లాటభాషయందు వృషణమని యర్థము. 'పేలవ' ఇత్యాది పదములు కొన్ని కావ్యములయందు ప్రయోగింపఁబడియున్నవి. పేలవ శబ్దమునకు పేలార్థము (వృషణమను నర్థము)లేదు. అయినను సత్కావ్యము నందు అసభ్యమగు పేలార్థమును స్మరింపఁజేయుటవలన పేలవ శబ్దముకూడ శ్రుతి దుష్టముగా పరిగణింపబడినది. ఇట్లు శ్రుతి దుష్టములగు పేలవ ఇత్యాది పదములు అసభ్యములగు పేలాద్యర్థములకు వాచకములు గాకున్నను, స్మారకములగుటవలన చారు స్వరూపమగు కావ్యముకూడ శ్రుతి దుష్టముగా పరిగణింపఁబడుచు కావ్యగత మగు - ఆ శ్రుతిదుష్టత్వము-అన్వయ - వ్యతిరేకములచేత-తద్ భాగములయందు (పేలవాదులందు) వ్యవస్థాపింపఁబడుచున్నదిగదా ! అట్లే ప్రకృతమునందుఁగూడ-రమణీయార్థ స్మారకములగు పదములయందున్న సౌందర్యము - స్వీకారార్హమే యగును. కావున పదములు కూడ-వ్యంగ్యార్థమును ప్రకాశింపఁజేయునవి యనుట యుక్తమే యగుచున్నది. కనుక వాక్య భాగములగు పదములయందుఁగూడ ధ్వని వ్యంజకత్వము వ్యవస్థాపింపఁదగినదియే యగును.

మూలము :— ఇట్లు "వాచ్యము వివక్షితము కాని ధ్వనికి" అనుకారికచేత సంగ్రహింపఁబడిన అర్థాంతర సంక్రమిత వాచ్య-అత్యంత తిరస్కృతవాచ్య-సంలక్ష్య క్రమవ్యంగ్య ధ్వనులను-వ్యంజక ముఖమున నిరూపించి, ఆకారికచేత సంగ్రహింపఁబడని అసంలక్ష్య క్రమవ్యంగ్య ధ్వనినిగూడ-నట్లే వ్యంజక ద్వారమున నిరూపించు చున్నాఁడు.

కం॥ తనరు నలక్ష్య క్రమమను
ధ్వనియో, అది వర్ణములఁ, బదాదులఁ వాక్యం
బున, సంఘటనఁ ప్రబంధం
బునను, మనోజ్ఞమగు దీప్తిఁబూని వెలుంగున్॥

ప్రభామతి :— "ధ్వనియో, అది" అనుటచేత అసంలక్ష్య క్రమధ్వని-పూర్వధ్వని భేదములకంటె-విశేషించు నను నంశము తెలియఁజేయఁబడుచున్నది.

"వర్ణసముదాయము-పదము, పదసముదాయము-వాక్యము, సంఘటనయో, పద గతము, వాక్యగతము, కూడ అగుచుండును, సంఘటిత వాక్యసముదాయమే-ప్రబం ధము" అను నభిప్రాయమున వర్ణాదులు యథాక్రమముగా ప్రతిపాదితములు. "పదాదులన్" అనుచోటనున్న ఆదిశబ్దము, పదైకదేశమగు పదావయవమును, పదద్వితయము, మొదలగు వానిని గూడ, గ్రహించునని తెలియునది. "దీప్తిఁ

బూని వెలుంగున్'' అను క్రియచేత వర్ణాది నిమిత్తకమగు అసంలక్ష్య క్రమ ధ్వని కూడ కావ్య విశేషము అను నంశము వెనుక చెప్పినట్లే సమర్థితము.

''యసంలక్ష్యక్రమ వ్యఙ్గ్యధ్వనిర్వర్ణపదాదిషు వాక్యే, సఙ్ఘటనాయాంచ స ప్రబన్ధేఽపి దీప్యతే ...'' అనునేతన్మూలకారికయందు, 'వర్ణపదాదిషు' ఇత్యాదు లందున్న సప్తమి-నిమిత్తార్థకముగాని, 'వర్ణములచేత' అని కరణార్థకముగాదని లోచనము సమీక్షించుచున్నది.

నాచేత నాంధ్రీకరింపఁబడిన మీఁది పద్యమునందలి 'వర్ణములన్, పదాదులన్' అనునవి, తృతీయార్థకములును, సప్తమ్యర్థకములునుగూడఁగావచ్చును, గావున నిచట నిమిత్తార్థ స్వీకృతి కూడ సుకరమే యగునని పాఠకులు భావింపఁగోరెదను.

మూలము :— (వ్యాకరణ మహాభాష్యాదులయందు వర్ణముల కర్థము లేదని చెప్పఁబడియెను. కావున ననర్థకములగు వర్ణములు రసాది ధ్వని వ్యంజకము లెట్లగునను నాక్షేపమును పరిహరించుటకు, వర్ణములకుఁగల రసాదివ్యంజకత్వమును, అన్వయ వ్యతిరేకములచేత ప్రదర్శించుచున్నాఁడు.)

అందు వర్ణములకు-అర్థములేకుండుటవలన ద్యోతకత్వము-అసంభవమని యాశంకించి క్రింది పద్యములు చెప్పఁబడుచున్నవి.

కం॥ తలచుగ శషలు, ఢకారము
స రేఫసంయోగమున నెసంగుచు, శృంగా
ర రసమ్ముఁను (రసాదుల) భంగించుట
నరయ, "రసక్షతి ఘటించునవి వర్ణంబుల్"॥

కం॥ అవియే భీభత్సాదుల
నివేశితములగుచుఁదలచు నెగడునపుడు వా
ని వెలుంగఁజేయునట్టివె
యవుట, "రసచ్యుతి ఘటించునవివర్ణంబుల్"॥

మీది శ్లోకద్వయముచేత వర్ణములకుఁగల ద్యోతకత్వము-అన్వయ-వ్యతిరేకములచేత ప్రదర్శింపఁబడినదగు చున్నది.

ప్రభామతి:— 1 శృంగార రసమ్ముఁను, అను పదము కరుణ శాంతరసముల కుపలక్షణము అనఁగా శృంగార రస అనుశబ్దముచేత కరుణ శాంతరసములుకూడ గ్రహింపఁబడునని భావము.

2 ఆది పదముచేత రౌద్ర వీర రసములుకూడ స్వీకరింపఁదగియున్నవి. ‘తలఁచగన్’ అను మొదటి పద్యముచేత వ్యతిరేకమును ‘అవియే’ అను రెండవ పద్యముచేత అన్వయమును ప్రదర్శితములు.

సుకవి కాఁగోరినవాఁడు శృంగారమున శ్శ, ష్ఠ, ఢ (ధ), ఇత్యాది వర్ణములను ప్రయోగింపఁగూడదని యుపదేశించుటకు మొదట వ్యతిరేకమును, వ్యంజనీయములగు బీభత్సాదులయందు తత్ప్రయోగము చేయఁదగు ననుటకు తరువాత అన్వయమును-కారికా కారుఁడు (వరుసగా) తెలిపెను. వృత్తికారుఁడు మాత్రము ‘వ్యతిరేకము-అన్వయ పూర్వకము’ అను శైలి ననుసరించుటకును (సమాసౌచిత్యము కొఱకును) ముందుగా నన్వయమునే తెలిపెను.

(లోచ) ఇందలి యభిప్రాయమిది :—

విమర్శించిచూడ-విభావానుభావ వ్యభిచారి ప్రతీతి సంపదయే, రసాస్వాద నిబంధనమగు చుండును. అట్లయినను-ఉపనాగరికాదివృత్తి విషయకమగు శ్రవణముచేత సమప్యమాణములగు నావిభావాదులే రసాస్వాద నిబంధనములగుచుండుట స్వానుభవజ్ఞాన సిద్ధమైయున్నది. కావున శ్రోత్రైక గ్రాహ్యమును. మృదు పరుషాత్మకమును అగు వర్ణ స్వభావముకూడ, రసాస్వాదమున సహకారియే యగును. కావుననే యీ సహకారిత్వమునే చెప్పుటకు ‘వర్ణపదాదిషు’ (వర్ణములఁబదాదులన్) అనుచోట నున్నది - నిమిత్తార్థకమగు సప్తమియే యగుచున్నది. కాని కరణార్థకమగు తృతీయకాదు. కేవలములగు వర్ణములచేతనే రసాభివ్యక్తి కలుగదనియు, విభావాది సంయోగమువలననే ముఖ్యముగా రస నిష్పత్తి కలుగుననియు, పలుమార్లు చెప్పియున్నాము గదా!

కనుకనే పాఠకమహాశయులు-పదరహిత గీత ధ్వనివలెను, పుష్కరవాద్యముచేత నియమితమును విశిష్ట జాతి కరణమును అగు ‘ఘ్రా’ ఇత్యాది అనుకరణ శబ్దము వలెను, శ్రవణ గ్రాహ్యమగు వర్ణములయొక్క స్వభావముగూడ రసనిష్యందమున సహకారి యగుచుండునని గ్రహించునది.

మూలము :— అసంలక్ష్య క్రమవ్యంగ్యమగు రసాది ధ్వని-పదమున విద్యోతిత మగుటకు ఉదాహరణము.

[ఇది-ప్రేయసియగు వాసవదత్త-హఠాత్తుగ దహింపఁబడినదని విని, ప్రవృద్ధశోక నిర్భరహృదయుఁడయిన వత్సరాజగు ఉదయనుఁడు కావించిన పరిదేవిత వచనము.]

ఉ॥ ప్రేయసి! గాఢ కంపితవు, భీతి పరి స్ఖలితాంశు కాంతవై,
మూయక-ఆకనుల్, విధురముల్ దిశలెల్ల పరిభ్రమింపఁగన్
జేయఁగ, ఘోరవృత్తి వడినిన్ను దహించెను క్రూరుఁడగ్ని, కాం
తా! యతఁడైన ధూమ కలితాంధత-నిన్ గనఁడయ్యె, నక్కటా!

మీఁది పద్యమునందున్న "ఆ" అను పదము సహృదయులకు రస మయముగా అవభాసించుట స్పష్టమేగదా!

ప్రభామతి :— 'పదమున' (పద్యోతితమగుటకు) అనఁగా, పదవిశేషము ప్రకాశించు చుండునపుడు అనియర్థము. విభావాదుల వలననే ముఖ్యముగా రస ప్రతీతి కలుగుచున్నను 'ఆ' ఇత్యాది పదవిశేషములు రస వ్యంజనమున సహకారులగుచునే యుండును. ఆ విభావాదులు కూడ విశిష్టమగు ఒకానొక పదముచేత-అర్ప్యమాణములై, రస చమత్కార విధాయులగుచుండును. కావున రసచమత్కార విధానమున పద సంబంధి-మహిమయే-సమర్పితము. అని తెలియఁదగును. వాసవదత్తా దాహాకర్ణన ప్రవృద్ధ శోక నిర్భరుఁడు, వత్సరాజు-పరిదేవించు చున్నాఁడు. (అనిలోచనము.)

వత్సరాజగు నుదయనుఁడు ప్రేయసియగు వాసవదత్తను లావాణకమున దగ్ధురాలినిగాఁదలఁచి-ఆ రమణీమణిని, ఆమెలోచనాదులను, స్మరించి, ధ్యానించుచు-అనుచున్నాఁడు.

"దహనుఁడగు అగ్ని-అసలే క్రూరస్వభావుఁడు, తదుపరి (దానికి తోడుగా) పొగ క్రమ్ముటచేత-ధూమాంధితుఁడై యున్నవాఁడు. అట్టివాఁడు కనుకనే ఇట్టి భయానక కార్యము నొనర్చెను. కాని వివేకవంతుఁడగు వాఁ డెవ్వఁడును గూడ నిట్టి యనుచితము నొనర్చుట సంభావ్యము కానేరదు. క్రూరదారుణుఁడగు దహనుఁడు కూడ రమణీయ లావణ్య సుధారస తరంగిణివగు నిన్ను ఆ దురవస్థా సమయమున చూచి యుండినయెడల ఇట్టి ఘోరవర్తనము నొనర్పకుండెడిని" అని యీ విధమున స్మరింపఁబడుచున్న తదీయమగు సౌందర్య లావణ్యవిలాసము అతిశయ వంతమగు శోకావేశమునకు విభావము అగుచున్నవి. ఇందలి యర్థమంతయు 'ఆకనుల్', అనుచోటనున్న 'ఆ' అను పదము చేతనే 'విర్వ్యూఢము'. భయముచేత కన్నులు మూయవలసి యుండినను మూయకుండుట అనుభావమగు స్తంభమును స్ఫురింపఁ జేయునని తెలియునది,

అమూలక మయినను "మూయక" అను పదము-ఆంధ్రపద్యమునందు రసపోషకమను నభిప్రాయమున సంఘటితము.

ఇష్టజననాశప్రభవము - శోకము - ప్రియురాలగు వాసవదత్తయొక్క ఏభ్రూవిక్షేప-కటాక్షములు-తద్రతి విభావములై యుండినవియో, అవియే అత్యంతమును వినాశమునొంది యిప్పుడు స్మృతిగోచరములై నిరపేక్షభావత్వప్రాణమగు కరుణరసము నుద్దీపింపఁజేయుచున్నవి. "ఆ కనుల్" అనుచో నున్న 'ఆ' యను శబ్దము-వాసవదత్త కన్నులయందున్నదియు, స్వసంవేద్యము-అవ్యపదేశ్యము-అనంతము-అగుచున్నదియు నగు గుణగణముయొక్క - స్మరణాకారమును-స్ఫురింపఁజేయుచు, రసమునకు అసాధారణమగు నిమిత్త మగుచున్నది.

ఈ యంశమున నొకఁడొనర్చిన చోద్యమును, వేరొకఁడొనర్చిన పరిహారమును గూడ-మిథ్యలే (అనుచితములే యగును.)

చోద్యము :— (ప్రశ్నము) ప్రక్రాంతమగు వస్తువును పరామర్శించునవి (వెనుక చెప్పుటకు ప్రారంభించిన దానిని చెప్పునది) యగు 'ఆ' అను శబ్దమునకు-ఇంత గొప్ప యర్థమును చెప్పుటకు సామర్థ్యమున్నదా?

పరిహారము :— (ఉత్తరము) ఇచ్చట-పరామర్శించువాఁడు-రసావిష్టుఁడు సహృదయుఁడగు వాని దృష్టియందు ఆ పదమున కంత గొప్ప యర్థమును జెప్పుటకు తగిన సామర్థ్యమున్నది.

ఈ ప్రశ్నోత్తరములు రెండును ఇచట నావశ్యకములు కానేరవు.

ఏలయనిన :— "ఎవఁడు విద్యాపరిపూర్ణుఁడో, వాఁడు పూజ్యుఁడు అనుచోటను వలె ఒక వస్తువునందు కొన్ని ధర్మములు ముందన్వయింప వలసియున్నప్పుడు, వానితోఁగలిసి యుండుటకు తగిన వేఱొక ధర్మము కూడ ఆ వస్తువునం దున్నదని తెలుపుటకు. యత్ (ఏ) శబ్దమును మొదలఁ ప్రవర్తించి, తరువాత బుద్ధిస్థమగు-ఆ ధర్మాంతరముతోడి కలయికను-తత్ (ఆ) శబ్దముతో పరామర్శించుట మర్యాదయై యున్నది. కావుననే యత్తదోర్నిత్యసమ్బన్ధః" అని శాస్త్రమున నిర్వచింపఁబడినది. అనఁగా, 'ఏ' 'ఆ' శబ్దములకు నిత్యసంబంధముండునని యర్థము. వాఁడు, అనునది-ఇచట ప్రక్రాంతమును అనఁగా. "ఎవఁడు" అని ఉపక్రమింపఁబడిన దానిని పరామర్శించుటచేత-అట్టి తచ్ఛబ్దమే-ప్రక్రాంతపరామర్శకమగును. 'ఆ రమణి' ఇత్యాదులందో, 'ఆ' యను శబ్దము నిమిత్తముచేత ఉపనతమగు స్మరణ విశేషముయొక్క ఆకారమును సూచించునదియేకాని-ప్రక్రాంతపరామర్శకముకాదు. అట్లే 'ఆకనుల్' అనుచోనున్న అ శబ్దముకూడ-ప్రక్రాంతమును పరామర్శించునదికాదు. కావున అటిక ప్రశ్నోత్తర పరామర్శకులగు పండిత మన్యులతోడి వివాదము నింతతో చాలింతుము. (లోచనము)

ఇందు 'గాఢకంపితవు' ఇత్యాదులచేత ప్రియాసంబంధి భయానుభావములగు-ఉత్కంపాదులుత్ప్రేక్షితములు. "ఆభయమును నేను తొలఁగింపఁజాల

నైతిని" అమనది శోకావేశమున కుద్దీపన విభావము. "అకరుణ్" అనుచోనున్న 'ఆ' శబ్దముచేత సాతిశయ విభ్రమైకాయతన రూపములు, అనిర్వాచ్యములు, అనుభవైక వేద్యములు, అగుచు, 'నాకు రక్షకుఁడగు ఆర్యపుత్రుఁడెచ్చటనున్నాడో" అని కాందిశీక (భయోద్రేక) భావమున వికలములు, సర్వదిక్కులందును, విక్షిప్తములు, అగు విధమున స్మరింపఁబడుచున్న కన్నులయందున్నతావృశమగు దురవస్థగాఢ గాఢమగు శోకోద్దీపన విభావము. "క్రూరుఁడు" అనుటచేత వానికి నిర్దయమగు ఈ దారుణవృత్తి (దాహకత్వాదికము)స్వభావమే. అదహనుఁడు క్రూరుఁడైనను తన్నాత్రమున నిన్ను దహించియుండఁడు. వాఁడు కూడ ధూమాంధితుఁడగుటచేత చూచుట కసమర్థుడగుటవలన నిట్టి అనుచితకార్యము నొనర్చెను. 'సవివేకి' ఇట్లొనర్పఁజాలఁడు. అని స్మరింపఁబడిన వాసవదత్తయొక్క సౌందర్యము-ఇచట సాతిశయమగు శోకమునకు ఆలంబన విభావమగుచున్నది. 'అ' అను శబ్దముండునప్పుడే యీ యర్థమంతయు నిర్వహింపఁబడుచున్నది.

ఇట్లే-ఈ ద్వ్యశస్థలములందంతటను వ్యాఖ్యానింపఁదగును. (లోచనము)ఇచట వత్సరాజుయొక్క చిత్తవృత్తి విశేషమగు శోకము-స్థాయిభావము. పూర్వానుభూతములగు లోచన పక్షిపాదులు-ఉద్దీపన విభావములు, కంపాదులు-అనుభావములు, తదనుమితములగు దైన్యాదులు-వ్యభిచారి భావములు.

'అ' అను పదము - వాసవదత్తానయనములయందు - పూర్వానుభూతమగు అనంత గుణ గణమును స్మరింపఁజేయు, కరుణరసవ్యంజనమున సహకారి యగుట వలన నిచట పదముచేతఁగు రసవ్యంజకత్వము స్పష్టమగుచున్నది. ఇందలి 'అ' అనుపదము అనుభూతిని దెలుపునది యగుటవలన 'ఏని' అనుపదము నపేక్షించు నదికాదు.

మూలము :— అరసధ్వనియే-పదప్రకాశితమగుట కింకొక యుదాహరణము (ఈ యుదాహరణము-లోచనమునందు వ్యాఖ్యానింపఁబడుటలేదు. కావున నిది ప్రక్షిప్తమని బాలప్రియ - చెప్పుచున్నది)

ఇది-జానకీ విరహియగు శ్రీరాముని వాక్యము.

గీ॥ బంగరుహారంగు రంగు కురంగముఁగని
వడి విరిసి-వాయువిఖలితోత్పల దళాల
విసరునవివోలె స్మృతములై -ప్రియసీ సు
దృక్ ప్రసారము, "లవి"నన్ దహించునకట!

ప్రభామతి :— ఇచ్చటఁగూడ-'అవి' అనుపదము సహృదయులకు రస మయముగా నవభాసించుచుండుట స్పష్టమేగదా! మీఁది పద్యమునందుఁగూడ-'అవి' అనుపదము అనుభూతి మాత్రవిషయమై, తెలుపుటకు వీలుపడని దృక్ప్రసారముల యందలి విభ్రమాతిశయమును దెలుపుచు, ఉద్దీపన విభావమై, విప్రలంభ శృంగార మును విద్యోతింపఁజేయుచున్నది.

[ముగ్ధయగు ప్రేయసిని విడిచి తాను దేశాంతరమునకు పయనించుట కుద్యమించునపుడు-అత్తమామల సన్నిధియందున్న ఆ ప్రేయసి-తనయందు ప్రసరించిన నిగూఢమగు అపాంగ వీక్షణ ప్రకారమును-ఒకానొక ప్రేయసుఁడు తలంచుకొనుచున్నాఁడు. లేక ప్రియమిత్రునితో తెలుపుచున్నాఁడు.]

మూలము :— అసంలక్ష్య క్రమవ్యంగ్యమగు రసధ్వని-పదావయవము చేత ప్రభాసింపఁజేయఁబడుటకుదాహరణము.

చం॥ వదనము వంచి లజ్జ గురువర్గమునొద్ద-ఉరోజయుగ్మకం
పదమగుచున్న మన్యువును మానసమందె యడంచి-బాష్పములో
విడులుపుచున్ విభీతహరిణీ విలసన్నయన "త్రిభాగమున్"
పొదువగ నాపయింబఅపి "పోవల"దంచు మిటారితెల్పదే॥

మీఁది పద్యమునందలి "త్రిభాగ" శబ్దము (పదావయవము) రస స్ఫోరకము.

ప్రభామతి :— రసికుఁడగు నొకప్రియుఁడు ప్రణయినియగు ముగ్ధప్రేయసిని విడిచి, కార్యాంతరమున దేశాంతరమునకు పయనింప నుద్యమించెను.

గురుజన సన్నిధియందు లజ్జాపరవశయగు ఆముగ్ధ-స్వాభిమతమును తెలుపఁజాలక-అట్లనియుపేక్షింపఁజాలక-మన్యువేగము (శోక దైన్య కోప వేగము) కుచ కలశములను కంపింపఁజేయుచున్నను, దానిని హృదయమునందే నిరోధించి, లోచనములనుండి అశ్రుకణములనుత్సర్జించి తుదకెట్లో తెగించి చకిత హరిణీ నయనముల వలె మనోహారిణులగు నయనముల త్రిభాగమును (అంశత్రయమును) ఆప్రేయుని సుందరమూర్తి యందు ప్రసారించి ఆచేష్టా విశేషము వలననే "నన్ను విడిచి పోవల"దను భావమును తెలుపుచున్నదని పద్యార్థము.

[లోచనము] దేశాంతరగతులగు నాయికా నాయకులకు సంబంధించిన శృంగారము ప్రవాస విప్రలంభ శృంగారము.

[ "తల్లిదండ్రులు, లేక, అత్తలు, వదినెలు మొదలగు] గురు జనమును సైతము లెక్కసేయక ఎట్లో ఆ సుందరి-సాభిలాష-కోప-దైన్య-గర్వ-మంథరముగా నన్ను విలోకించినది" అని, ఇట్లు, స్మరించుటచేతనే కారణమగు పరస్పర ప్రేమ బంధమే ప్రాణముగాఁగల ప్రవాస విప్రలంభ శృంగారరసము 'త్రిభాగ' శబ్ద సన్నిధియందు ఉద్దీపితమై స్పష్టముగా ప్రకాశించుచున్నది".

[ "ఇందు - అంశత్రయమును తెలుపునదియగు త్రిభాగ శబ్దము విప్రలంభ శృంగారమును స్ఫురింపఁజేయుటయందు సహకారి యగుచున్నది" అని లోచనాభిప్రాయము.]

వదనము ... .......అను వాక్యముచేత నాయికాగతమగు శాలీనతా (ముగ్ధ) సౌందర్యము సూచితము. ఆ మిటారి తన ఉరోజకలశములకు మిక్కిలి కదలికను గలిగించుచున్న, ఆత్మీయమగు కోప-శోక-దైన్యావేశమును మనస్సునందే నిరోధించి, ఆగురు జనులకు తెలియకుండునట్లు నిరంతరముగా స్రవించుచున్న కన్నీటిని తుడుచుకొనినది. తదుపరి-ఎట్లో సాహసించినది. అట్లు-తెగించి-భయపడిన అడు లేడి కనులవలె-అందములగు ఆకన్నులయందలి భాగత్రయమును నావంకకు మరలించి-నేత్ర త్రిభాగ ప్రసారణరూపమగు చేష్టావిశేష మాత్రము చేతనే "నీవు వెళ్ల వలదు" అను నభిప్రాయమును స్ఫురింపఁజేసినది కాదా? అనునది-ఏతద్ వాక్యాభిప్రాయము.

మన్యుశబ్దమునకు-దైన్యము, క్రోధము, శోకముకూడ నర్థమగును. నాయకుని స్మృతిపథమునందు-గోచరించిన సుందరీమూర్తియొక్క నేత్రాంశత్రయము-నాయికకు నాయకుని యందుఁగల ప్రణయాభిలాషను, ఆయభిలాషకు భంగము కలుగుటచేత నొదవిన కోపమును, ఆకోపము, నిరుపయుక్తమగుటచేత కలిగిన దైన్యమును, శతపత్ర పత్రవేధక్రమమున మెరపు మెరసినంత త్వరలో ప్రదర్శించి, దానివలన-పెద్దలయెదుట ఆసుందరి-తనయభిమతము నెఱిఁగింపఁజాలకుండుటను, ప్రియుని ప్రవాసమునకు తాను భయపడుచుండుటను, స్ఫురింపఁజేయుటవలన నాయకునకు తానుపయనింపఁగూడదను భావముదయించుచున్నది.

కావున-నేత్ర 'త్రిభాగ' శబ్దమే-ఇచట ప్రవాస విప్రలంభ శృంగార రస వ్యంజనమున సహకరించునని తెలియునది.

మూలము :— వాక్యరూపమగు అసంలక్ష్య క్రమవ్యంగ్య ధ్వని 1 శుద్ధము 2 అలంకార సంకీర్ణము అని ద్వివిధ మగు

చున్నది. అందు శుద్ధమునకు [యశోవర్మ కృతమగు] రామాభ్యుదయ నాటకమునందలి—

"అయారీతి, సదైన్యదృక్-కృతకరోషా శూర్ప్రక్తి వారించినన్
మాయమ్మన్ విడనాడి, వేనఁగల ప్రేమన్ కానలందుంటివో
హా! యూహించుచు నూతనాంబుదవినీలాశల్, కఠోరాత్ముఁడై
నీయా ప్రేయసు డా ప్రియన్ విడిచియున్ జీవించునేడున్ ప్రియా"
[జీవించియే యుండెడిన్.]

అను పద్యము-ఉదాహరణ మగుచున్నది.

ఇచ్చట ఈవాక్యమే పరిపోషప్రాప్తమగు (శ్రీ సీతారాముల) పరస్పరానురాగమును ప్రదర్శింపఁజేయుచు మహత్తర మగు రసతత్త్వమును ఆమూలాగ్రముగా ప్రకాశింపఁజేయు చున్నది గదా!

ప్రభామతి :— జానకీ విరహియగు శ్రీరామచంద్రమూర్తి-ప్రేయసియగు సీతాదేవియొక్క ప్రణయరమణీయములగు గుణములను ఇట్లు స్మరించుచున్నాఁడు.

"ప్రేయసీ! మాయమ్మ కౌసల్య-దీనములగు దృష్టులచేతను, కృత్రిమ కోపాభినయములచేతను, అశ్రుపూరితములగు నేత్రములచేతను-నిన్ను-అరణ్యము నకు వెళ్లవలదని యెంతయోనిరోధించినది. కాని నీవు నాయందున్న ప్రీతిచేఁ గురువచనమునుగూడ నుల్లంఘించి, ఆమెను విడిచి, నీ సౌకుమార్యమును త్యజించి నాకు తోడునీడవై నన్ననుసరించి ఘోరారణ్యములకు వచ్చియుంటివి. కాని సదుణ వతివగు నీవిప్పుడిచటలేవు. నవజలధరశ్యామములగు దిక్కులను చూచుచున్నను. కఠిన హృదయుఁడగు నీ యీ ప్రియుని ప్రాణములు పోకున్నవి. నేను నీకు ప్రియుఁడనగుటకు అర్హుఁడనుకాను."

ఇందు ఇట్లు స్మర్యమాణ రమణీ రమణీయ గుణాలంబనమగు విప్రలంభ శృంగారము-సముద్బుద్ధ వాసనోపేతమగుచు సహృదయ హృదయములయందు రసత్వము నొందుచున్నది.

[లోచనము] 'వాక్యరూపమగు' అను ప్రథమాక్షనిర్దేశముచేత భేదమును బోధించుటచేత క్రింది యభిప్రాయమేర్పడుచున్నది.

వర్ణ, పద, పదావయవాదులందునపుడు అలక్ష్య క్రమమగు వ్యంగ్యము విర్భాసించుచున్నను, అది (అలక్ష్యక్రమవ్యంగ్యము) విభావాది సంయోగమే ప్రాణ

ము గాఁగలదగుటవలన-సమస్త కావ్య వ్యాపకముగానే నిర్వాసించుచుండును. ఇట్లది విభావాది సంయోగ ప్రాణమగుచు నిర్వాసించుట వలనే వర్ణాదులు-నిమిత్త మాత్రములే యగుచుండును. వాక్యము మాత్రము-వర్ణాదులవలె నిమిత్తతా మాత్రముచే నుపకారియగునదికాదు. ఇంకేమనిన; అది సంపూర్ణమగు విభావాది ప్రతిపత్తియందు వ్యాపృత మగుచుండుట వలన రసాదిమయముగానే భాసించుచుండును. కావున "తనరు" అనుకారియందున్న 'వాక్యంబునన్' అనుచోనున్నది (తదితరముల యందువలె) నిమిత్త సప్తమీ మాత్రమేకాదు. అది తదితరాసంభవమగు విషయ రూపకముగూడ నగుచుండును."

ఏ యర్థాలంకారముతోడనుగూడ సమ్మిశ్రముకాని అలక్ష్యక్రమవ్యంగ్యధ్వని శుద్ధమని చెప్పఁబడును. మీఁది పద్యము-కాన్యకుబ్జేశ్వరుఁడగు యశోవర్మచే ప్రణీత మయిన రామాభ్యుదయనాటకమందలిది. ఇది (కృతకకుపితైః) అనునంతవఱకే ధ్వన్యాలోకమునందు లక్ష్యముగా నీయఁబడినది. అట్లయినను స్పష్టతకొఱకిందది యంతయు నాంధ్రీకరింపఁబడి ప్రదర్శింపబడినది. "నీవెవ్వని కొఱకు సుఖసంపద లన్నింటిని పరిత్యజించి ఘోరారణ్యముల కరుదెంచితివో, ఆరాముఁడు సీతోడి విరహముచేఁగుందుచున్నవాఁడైనను, తుచ్ఛమగు జీవము విడువకున్నాఁడు. అహా! అతని హృదయ మెంతకఠినము" అను నభిప్రాయముగల యీ రామ వాక్యము-సీతారాముల పరస్పరాను రాగమును బ్రకాశింపఁజేయుచు సహృదయ మనస్సుల విప్రలంభ శృంగారరసమును వ్యంజింపఁజేయుచున్నది. ఇందర్థాలంకార సాంకర్యము లేకుండుటవలన నిది శుద్ధమగు విప్రలంభ శృంగార రసధ్వని యగు చున్నది.

ఇందు "మాయమ్మన్ విడనాడి" 'అను దానిచేత' నీవు నాయందలి యనురాగ పారవశ్యమున గురువచనోల్లంఘనమునుగూడ నొనర్చితి వని వ్యంజి తము. 'నీ యా ప్రేయసుఁడు-అప్రియున్' అనుదానిచేత పరస్పర జీవిత సర్వ స్వాభిమానాత్మకమగు రతిస్థాయి భావము చెప్పఁబడినది (వ్యంజితము) "నూత నాంబుదవినీలాళిల్" అనుదానిచే దుర్నిరీక్ష్యమగు జలవన్మేఘాలోకనము-ఉద్దీపన-విభావముగాఁజెప్పఁబడినది.

"జీవించు నేడున్ ప్రియా!" అనుదానిచేత కరుణావకాశనిరాకరణము కొఱకు-సాపేక్షభావత చెప్పఁబడినది. ఇట్లే వాక్యమంతయు విప్రలంభ శృంగార రస ప్రకాశకమై యున్నదని గుర్తింపవలయును.

**మూలము :— అలంకారాంతర (వేఱొక యలంకార ముతో) సంకీర్ణమగు-అసంలక్ష్య క్రమధ్వని కుదాహరణము :— (అమరుకమునందలిది).**

గీ॥ స్మరనవ నదీప్రపూర సంపత్సమృద్ధు
లగుచు, నిజగురుసేతువు లడ్డుగాగ
అప్రపూర్ణ మనోరథులగుచు-దుఃఖి
తాత్ములగుచుందు రాప్రియురాండ్రు, ప్రియులు॥

గీ॥ అయినను పరస్పరోన్ముఖులై, నిరంత
రాయముగఁ, జిత్రములఁబోలు నంగకముల
నయనయుగళ సరోజినీ నాళ సమభి
నీతమయిన రసంబు నానెదరు వారు॥

మీఁది వాక్యమునందు (పద్యద్వయమునందు) యథోక్తమగు వ్యంజకలక్షణముచే ననుగతమగు రూపకముచే నలంకరింపఁబడిన (అయోగ విప్రలంభ శృంగార) రసము-అత్యధికముగా నభివ్యక్తమగుచున్నది గదా!

ప్రభామతి :— స్మర+నవనదీ+ప్రపూరసంపత్ + సమృద్ధులు = మన్మథుఁడను నూతన నదీప్రవాహ సంపదచేత-పరస్పర సాము్మఖ్యమును-తృణకాష్ఠాదులవలె నజ్ఞానపూర్వకముగానే పొందింపఁబడినవారు, గురుసేతువులు = గురుజనులను (దాటుటకు, లేక తప్పించుకొనుటకు, వీలులేని) బంధములు = పెద్దగట్లు రసంబున్ = జలమును-అభిలాషాత్మకమగు విప్రలంభ శృంగారమును (సుఖామృతమును) అతి శీఘ్రముగా వృద్ధినొందుట వలన స్మరుఁడే (మన్మథుఁడే) నవనదీపూరము = ప్రావృషేణ్యప్రవాహమగుచున్నాఁడు. మరుఁడను నాక్రొత్త యేటి వరదచేత యౌవనారంభమునందున్న యువతీ యువకులగు నీ ప్రియులు (ప్రేయసీ-ప్రియులు) (తృణ, కాష్ఠాదులు క్రొత్త యేటి వరదచేతనువలె) అబుద్ధి పూర్వకముగానే-పరస్పర సాము్మఖ్యము నొందింపఁబడి, మనోరథ ప్రసరనిరోధకులగుటచేత, అత్త, మామ, మొదలగు గురువులను, గురు = (దాటశక్యముకాని) పెద్ద సేతువులు (క్రొన్నీటివరదకు పెద్దగట్లవలె) అటంకమై యుండుటచేత-అప్రపూర్ణ (బాగుగా పూర్ణముకాని) మనోరథములు గలవారలగుచున్నారు. అట్లయినను (ఇంటనాది రూపమగు వారి మనోరథము నెఱవేరకున్నను) పరస్పరోన్ముఖతాలక్షణమగు-అన్యోన్యతాదాత్మ్యముచేత స్వశరీరములయందగు సకల వ్యాపారములనుగూడ-నిరోధించి చిత్తరువులవలె (చేష్టలుదక్కి)ఉన్న అంగములచేత-నేత్రములను పద్మనాళములనుండి జాలువారుచున్న అభిలాషాత్మకమగు జలమును (రసమును) గ్రోలుచుందురు.

ఆ ప్రేయసీ-ప్రేయసులు-పరస్పరాభిలాషాత్మక-దృష్టిచ్ఛటా మిశ్రీకారయో జనముచేతనే కాలము నతివాహింతురు" అని తాత్పర్యము.

ప్రశ్న :— మీఁది పద్యమునందుగ్గడింపఁబడిన నాయికా - నాయక (ప్రేయసీ= ప్రేయస) యుగళములు-హంసలుగానో, చక్రవాకములుగానో, ఇంకే జలపక్షులుగానో, ఆరోపింపఁబడవలసియున్నారు. ''ఏకసరోజినీ నాళ సముభినీత (సంబునాను''నవి (ఒకతామరతూటియందలి నీరమును గ్రోలునవి)అవియేగదా :—

మీఁది పద్యమునందుక్తములగు నాయకయుగళముల యందట్టి యారోపము లేకుండుటవలన నిందలి రూపకము ('స్మర-నవనదీ ప్రపూర' ఇత్యాది గానారంభింపఁ బడిన రూపకము) తుది వఱకును నిర్వహింపఁబడినదని చెప్పుటకు వీలులేదు. ఇది దోషము కాదా?

ఉత్త :— కాదు. 'రసతత్పరముగా' అనుదానియందు ''అధికమౌగతి నిర్వహణము సేయఁగరాదు'' అని చెప ఁబడుటచేత-ఆ యలంకార సమీక్ష విధా నము ననుసరించియే యిచటి రూపకము తుదివఱకును నిర్వహింపఁబడినదికాదు. కావున నిది పూర్వోక్తమగు వ్యంజక లక్షణముచే ననుగతమగు రూపకమై, విభా వాది భూషణ ద్వారమున నిచట అభిలాష (అయోగ) విప్రలంభ శృంగార రసము నభివ్యక్తీకరించుచున్నది. (పునస్సమ్మేళనము జరుగని) కలయిక కలుగని తరుణీ- తరుణులకు సంబంధించిన శృంగారము-అభిలాష (అయోగ) విప్రలంభము.

ఇది-ఇట్లు-వాక్యరూపము-అలంకారాంతర-(రూపక) సంకీర్ణము-అగు-అసం లక్ష్యక్రమ (విప్రలంభశృంగార రస) ధ్వనికుదాహరణమగుచున్నది.

**మూలము :— అసంలక్ష్య క్రమవ్యంగ్యము - సంఘటన యందుఁగూడ భాసించుననీ (ఇంతకుముందు) చెప్పఁబడియున్నది. అందు ఏది సంఘటనకు స్వరూపమో, అది నిరూపింపఁబడుచున్నది.**

ప్రభామతి :— సంఘటన యనునది వామనోక్తమగురీతి-వాక్యంబున- సంఘటనన్" అని యింతకు ముందు-అది రసవ్యంజకమను నంశము ప్రతిపాదింపఁ బడినది. 'సంఘటనన్' అనుచోనున్నదికూడ-నిమిత్త-మాత్రమునందగు సప్తమి యేయని యెఱుంగునది. అది గుణములకంటె వివిక్తముగా (వేరుగా) విచారింపఁ బడునని భావము.

**మూలము :—**

**కం॥ అసమాస, మధ్యమ సమా**
**స, సుదీర్ఘ సమాస, అయి యెసంగుచు, త్రిగతి**

పరిసరణమున త్రివిధంబయి
లసితాకృతి సంఘటన వెలయుసత్కృతులన్॥

కొందఱు కేవలము-సంఘటనను అనువదించి, ఇట్లను చున్నారు.

గీ॥ "అర్థి-మాధుర్య ముఖ్యమ్ములగు గుణముల
నాశ్రియించి, రసంబుల (రసాదుల) వ్యక్తపఱచు"
వక్తృగతమును-వాచ్య సంబద్ధమునగు
నౌచితి-విధానమగు తన్నియంత్రణమున॥

సంఘటన-గుణముల నాశ్రియించి యుండి రసాదులను వ్యక్తీకరించు ననునది యేతత్ కారికా పూర్వార్థమై యున్నది.

ఇచ్చట (ఏతత్ కారికార్థ విషయమున) గుణములకును-సంఘటనకును 1 ఐక్యముగాని, 2 వ్యతిరేకముగాని, వికల్పించుటకు వీలుకాన్పించుచున్నది.

ప్రభామతి :— గుణములు, సంఘటన, ఒకటేయనిగాని, అవి రెండును భిన్నములు (వేరు) అనిగాని వికల్పించుటకు = కల్పించుటకు = వ్యాఖ్యానించుటకు వీలగుచుండునని భావము.

మూలము :— వ్యతిరేక పక్షమునందు (భిన్నములను నపుడు) ద్వివిధమగు గతి యెఱుంగఁదగియున్నది. (అందు) "సంఘటన-గుణాశ్రియము [సంఘటన గుణముల నాశ్రియించి యుండునది] అనునది యొకటి" "గుణములు-సంఘట నాశ్రియములు (గుణములే-సంఘటన నాశ్రియించునవి) అనునది యింకొకటి".

ప్రభామతి :— సంఘటన-గుణములు భిన్నములు (వేర్వేరైనవి) అను పక్షమున ద్వివిధమగు వికల్పము సంభవించును.

ఆవికల్పముయొక్క స్వరూపద్వయమున, సంఘటన గుణముల నాశ్రయించు ననునది యొక వికల్పమగుచున్నది. గుణములు-సంఘటన నాశ్రియించు ననునది యింకొక వికల్పమగుచున్నది.

మూలము :— అంద్వైక్యపక్షమున గుణములను=ఆత్మభూతములను, ఆశ్రయించి యున్నదగుచు, సంఘటన-రసాదులను వ్యక్తీకరించుననియు, (1) "గుణములు-సంఘట నాశ్రయములు" అనునప్పుడు, ఆధేయ భూతములగు గుణముల నాశ్రయించి యున్నదగుచు-సంఘటన-రసాదుల నభివ్యక్తీకరించుననియు, నర్థమేర్పడును, నానాత్వపక్షమున (వ్యతిరేకపక్షమున, అనఁగా; సంఘటనా-గుణములు భిన్నము లనునపుడు) 2 "సంఘటన - గుణాశ్రయము" అను విధమును స్వీకరించు నపుడు మాత్రము "గుణములను-ఆశ్రయించి" అనుచో గుణపరతంత్ర స్వభావమై (గుణముల కధీనమై) అను నర్థమేగాని, "గుణరూపమై" అను నర్థమురాదు.

ప్రభామతి :— 1 సంఘటనకు గుణములు ధర్మములని భట్టోద్భటాదుల మతము-ధర్మములు-ధర్మ్యాశ్రితములనునది ప్రసిద్ధమార్గము. కావున "నాధేయములగు గుణములు, ధర్మియగుటచే నాధారమగు సంఘటన నాశ్రయించును" అనునపుడు ఆధేయ భూతములగు గుణముల నాశ్రయించి, సంఘటన-రసాదుల నభివ్యక్తీకరించునను నర్థమేర్పడును.

2 సంఘటన-గుణములయందుండుట ప్రసిద్ధముకాదు. కావున నిచట నాశ్రయ శబ్దార్థము-అధారాధేయ భావముకాదు. కావున గుణాయత్తమై (గుణముల కధీనమై) గుణ ముఖ ప్రేక్షిణియగు సంఘటన-రసాదివ్యంజకమను నర్థమిచట లభించుచున్నది. అనఁగా: 'సంఘటన-గుణాశ్రయము' అనునపుడు-ప్రకృతివర్గము (అమాత్యాదికము) రాజున కధీనమగునట్లు, సంఘటన-గుణముల కధీనమై రస వ్యంజకమగు నను నర్థమేర్పడును.

మూలము :— (మీఁది మూఁడుపక్షములను-ప్రదర్శించుట వలని ప్రయోజనమును దెలుపుచున్నాఁడు),

ఇట్లు వికల్పించుటకు ఫలమేమనినఁజెప్పుచున్నాము. గుణములు-సంఘటనయు-ఏకతత్త్వము (ఏకరూపములు = అభిన్న వస్తువులు)గాని, గుణములు-సంఘటనాశ్రయములు (సంఘటన నాశ్రయించునవి)గాని, అగు నెడల, సంఘటనకువలెనే గుణములకుఁగూడ విషయ నియమములేక పోవలసివచ్చును.

ప్రభామతి :— సంఘటనకు విషయనియమములేదు. 'శృంగారమునందు-సమాసరహితయగు సంఘటనయే యుండవలయును' ఇత్యాదికమగు విషయ నియమము సంఘటనకు లేనట్లే (గుణములు) సంఘటనా రూపములనినను, సంఘటన యందుండుననియనినను గూడ - ఆ గుణములకుఁగూడ విషయ నియమము లేక పోవలసివచ్చును. అదెట్లనిన :— గుణములు సంఘటనా రూపములను తాదాత్మ్య పక్షమున (ప్రథమ పక్షమున) గుణములు నియమ రహిత సంఘటనారూపములే యగుటవలన-అనియమ-విషయనియమములేనివగును. సంఘటన-ఆధారము. గుణము లాధేయములు. అను ద్వితీయపక్షమున ఆధేయములగు గుణములు నియత విషయ రహితము, ఆధారము అగు సంఘటన ననుసరించి యుండుటవలన తాము విషయ నియమములేనివే కావలసివచ్చును.

మూలము :— "మాధుర్య-ప్రసాద-ప్రకర్షము, కరుణ-విప్రలంభ శృంగార విషయమే, ఓజస్సు (ఓజోగుణము) రౌద్రా ద్భుతాది విషయము.

మాధుర్య-ప్రసాదములు, రస, భావ-తదాభాస (రసాభాస-భావాభాస) విషయములే" అని గుణములకు మాత్రము విషయ నియమము వ్యవస్థితము. సంఘటనకు మాత్రము ఆ విషయ నియమములేదు.

ప్రభామతి :— "గుణములు-అనియత విషయములు కాఁగూడదా?" అనినఁ జెప్పుచున్నాఁడు. 'మాధుర్య' అని. కరుణరసమునందును, విప్రలంభ శృంగారము నందును, మాధుర్య గుణసంబంధియగు ప్రసాదాతిశయము మిక్కుటముగా నుండును. ఈ యంశము "'కరుణ మాధుర్యము ప్రకర్షవంతమగుట నచట నధికంబుగా హృదయానుభూతి, యార్ద్రమగుచుండు" అని ద్వితీయోద్ద్యోతమునఁ జెప్పఁబడియెను. (ప్ర-భా పే99)లేక మాధుర్య ప్రసాద ప్రకర్షమనఁగా: మాధుర్య గుణ-ప్రసాద గుణముల ప్రకర్షము (స్ఫీతిమాధిక్యము) అనియైనను జెప్పవచ్చును. ఓజో గుణమునకు రౌద్ర-అద్భుత-వీరభీభత్సములు విషయములు. ఈ యంశము 'కావ్యములఁగల్గు రౌద్రాదికమ్ములైన 'అని ద్వితీయోద్ద్యోతమునందే చెప్పఁబడినది. (ప్ర-భా-పే-99) (సమ్మిశితములగు) మాధుర్య ప్రసాదములకు రస-భావ-తదాభాస ములు-విషయములు. అనివానికి విషయ నియమ వ్యవస్థ-చెప్పఁబడియున్నది. ఇప్పుడు గుణములు సంఘటనారూపములని యంగీకరించు నెడల నానియమము భగ్నము కాక తప్పదు. శృంగారాదికము వ్యంగ్యమగు నపుడు, అసమాసయగు సంఘటనయే యుండవలయును' ఇత్యాది విషయ నియమము సంఘటనకు లేదు.

మూలము :— (సంఘటనకు విషయనియమము లేదను టకు లక్ష్య దర్శనమే హేతువనుచున్నాఁడు.)

శృంగారమునందుఁగూడ దీర్ఘసమాసయు, (దీర్ఘ సమాస ములు గలదియు) రౌద్రాదులయందుఁగూడ, అసమాసయు, (సమాసములు లేనిదియు) అగు సంఘటనలు కాన్పించుచున్నవి.

ప్రభామతి :— దీర్ఘసమాస, అసమాస, మధ్యమసమాస, అని సంఘటన త్రివిధము.

సంఘటనకు విషయ నియమము లేకుండుటవలననే శృంగారమునందుఁగూడ దీర్ఘసమాసయగు సంఘటనయు, రౌద్రాదులయందుఁగూడ - సమాసరహితయగు సంఘటనయుఁగాన్పించు చున్నది.

మూలము :— ఏతద్ వ్యభిచార దర్శనస్థానమగు నుదా హరణమును ఆ సూత్రించు (ప్రదర్శించు) చున్నాఁడు.

అందు శృంగారమున దీర్ఘసమాసయగు సంఘటన కుదా:—

మందార కుసుమరేణుపింజరితాలక (అగు నారమణి)

ప్రభామతి :— శృంగారమునందసమాస-రౌద్రాదికమునందు దీర్ఘసమాస-శాదితరములయందు, మధ్యమసమాస, అగు సంఘటనయే యుండవలయునను నియమము లేదని యుదాహరించుచున్నాఁడు.

మందార కుసుమ పింజరితాలక = "దేవ వృక్ష విశేష పుష్పపరాగములచేత పిశంగితములగు నలకలుగలది" అనునది దీర్ఘసమాసయగు సంఘటనయే యయి నను-అభిలాష శృంగార వ్యంజకమగుచున్నది. దీర్ఘసమాస సంఘటన యుండినను వర్ణ విశేష వ్యంగ్యమగు మాధుర్యముగూడ స్ఫురించుచున్నది, కావున అసమాస యగు సంఘటనయే మాధుర్య గుణ రూపమనిగాని, మాధుర్య గుణవృత్తియనిగాని చెప్పుటకు వీలులేదని స్పష్టపడుచున్నది.

మూలము :— (అనుభావాది ప్రతీతి (స్ఫుటముగా) లేకుండుటవలన మీఁది సమాసమున శృంగారము (స్పష్టముగా) కాన్పించుటలేదని, స్ఫుటమగు శృంగారప్రతీతిగల వేఱొక పద్యము నుదాహరించుచున్నాఁడు.)

మఱియొకటి :— (ప్రణయ కుపితయగు నాయికను ప్రసాదింపఁజేసికొనుటకు తన్నాయకుఁడనుచున్నమాట.)

కం॥ అనవరత నయన జలలవ
పరిణిపతనాముషితపత్రిరచనాంతము, హ
స్త నిషణ్ణమునగు నీయా
నన మెవనికిఁదాపకారణముగా దబలా?॥

ఇత్యాదిక మిందులకుదాహరణము :—

పరిభామతి :— ఇందీర్ష్యావిప్రలంభ శృంగారము-వ్యంగ్యము. మాధుర్యోల్ల సితమగు విప్రలంభమిచటనున్నను, దీర్ఘసమాసయగు సంఘటనయుండుటవలననది, ఓజో గుణ రూపముగాని, ఓజో గుణ వృత్తి గాని, కానేరదని గ్రహించునది.

శృంగారమున దీర్ఘసమాసయగు సంఘటన యుండుననుట కుదాహరణ బాహుల్యము గలదని భావము.

అట్లే రౌద్రాదులయందు - అసమాస (అగు సంఘటన) కాన్పించెడిని,

"పాండవసేన శస్త్రమును బట్టు" ఇత్యాదికమిందులకుదా హరణము.

పరిభామతి :— రౌద్రాదికము ధ్వన్యమానమగు నపుడు దీర్ఘ సమాసయగు సంఘటన యుచితమై యుండినను, సమాస రహితయగు సంఘటన లక్ష్యమునం దీక్షింపఁబడుచున్నది.

మీఁది పద్య మింతకుముందోజోగుణమున కుదాహరణముగా నీయఁబడి యున్నది. (చూ-పరి-భా-పే-101) ఇందు రౌద్రము-ధ్వన్యమానము. సంఘటనకు విషయ నియమమున్న యెడల నిచట దీర్ఘ సమాసముండవలయును.

మూలము :— కావున (పూర్వోక్తవిధమున సంఘటన వ్యభిచరితమగుట వలన) గుణములు సంఘటనా స్వరూపములు కావు. సంఘట నాశ్రియములును కానేరవు.

(పరిశ్నించి సమాధానము నిచ్చుచున్నాఁడు.)

సంఘటన-గుణముల కాశ్రియము కానియెడల వాని కాలం బన మేదని చెప్పవలయును?

ప్రభామతి :— ఆధేయములు నిరాధారములని చెప్పుటకు వీలులేదు. కావున సంఘటన-గుణముల కాధారమని చెప్పనియెడల వానికి శబ్దార్థములాశ్రయములని చెప్పవలసివచ్చును-అప్పుడు గుణములకు-అలంకారములకుంబె భేదమేముండును? అనునది పృచ్ఛకుని యభిప్రాయము.

**మూలము :—** **చెప్పుచున్నాము.**

**కం॥ అంగిరసాద్యవలంబన**
**ముంగలవి గుణంబులనుచు బుధులెంతురు, తదీ**
**యాంగాశ్రితముల భూషల**
**భంగి నలంకారములని భావింపఁదగున్॥**

**అని వానికాలంబన మింతకుముందు ప్రతిపాదింపఁబడియే యున్నది.**

ప్రభామతి :— శౌర్యాదిగుణములు-ఆత్మనాలంబనముగాఁజేసికొని యుండునట్లు మాధుర్యాది కావ్యగుణములు ప్రధానములగు రసాదుల నాలంబనముగాఁ జేసికొని యుండుననియు, అలంకారములు-ఆత్మశరీరమునందలి యంగముల నలంకరించునట్లు-కావ్యాలంకారములు శబ్దార్థరూపములగు నంగముల నాశ్రయించుననియు, అస్మన్మూల గ్రంథకర్తచే ద్వితీయోద్ద్యోతమునందే ప్రతిపాదింపఁబడియెను. కావున సంఘటన గుణముల కాధారము కానేరదు. గుణములే సంఘటన కాశ్రయములగును. అనఁగా: సంఘటనయే - గుణముల నాశ్రయించును అని తెలియవలయును. (అవయవముల నాశ్రయించిన మురుగులు మొదలగు భూషణములు-దేహద్వారమున దేహి (జీవు) నలంకరించునట్లు, అనుప్రాసాదులగు నలంకారములు శబ్దార్థద్వారమున రసము నలంకరించుననియు, శౌర్యాదులాత్మ నాశ్రయించునట్లు గుణములు మాత్రము శబ్దార్థ ద్వారముననఁగాక సాక్షాత్తుగానే రసము నాశ్రయించుననియు, పూర్వోక్త పద్యమున కభిప్రాయము. అని అవధాన టీక ౧౩౧.

**మూలము :— (గుణములు శబ్దముల నాశ్రయించుననుసంశయము-తనకు అభిమతము కాకున్నను "ఆశబ్దమెంతమధురము!" అని, రసాశ్రయమగు మాధుర్య గుణమును శబ్దాశ్రయముగా నుపచరించుచున్న, అవివేకి జనాభిప్రాయము నంగీకరించి ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.) పోనిమ్ము! (నీవనినట్లు) గుణములు శబ్దాశ్రయములే కానిమ్ము!**

అట్లని (ఏకాశ్రితములను కారణమున) గుణములను ప్రాసాదులతో (తుల్యములని శంకింపఁగూడదు. అను ప్రాసాదులు (శబ్దాలంకారములు) అర్థ (విస్తార)ము నపేక్షింపని శబ్దధర్మములు గానే ప్రతిపాదింపఁబడియున్నవి. గుణములో, వ్యంగ్యవిశేషము నవభాసింపఁజేయువాచ్యమును ప్రతిపాదించుటకు సమర్థములగు శబ్దధర్మములే యగుచుండును.

శౌర్యాదులు అన్య (ఆత్మా) శ్రయములయినను శరీరాశ్రియములని తలంపఁబడుచున్నట్లు - ఇవియు (గుణములును) అన్య (రసా) శ్రియములయినను శబ్ద ధర్మములని తలంపఁబడుచుండును. రస ధర్మములగు గుణములను శబ్ద ధర్మములుగా తలంచుటయే ఉపచారము.

ప్రభామతి :— అనుప్రాసాదులగు నలంకారము లర్థముల నపేక్షించునవి కావు. మాధుర్యాదులగు గుణము లర్థము నపేక్షించును. కావున నీ రెండును శబ్దాశ్రయములను నంతమాత్రమున తుల్యములేయని భావించి వానికి తాదాత్మ్యము నంగీకరించుటకు వీలులేదు. గుణములౌపచారికముగనే శబ్ద ధర్మములు కాని వాస్తవముగా శబ్దధర్మములు కావు.

శౌర్యాదులను గుణములు - ఆత్మవృత్తులు కాని శరీర వృత్తులు కావుగదా! అట్లయినను శరీరమునకును-ఆత్మకును గల పార్థక్యమును (భేదమును) గ్రహించుటకు సమర్థులు కానేరని యవివేకులు "ఆతని బాహువు శౌర్యవంతము" ఇత్యాది వ్యవహారము ననుసరించి, శౌర్యాదులను శరీర నిష్ఠములనుగాఁదలంచుచుందురు. అట్లే వివేక శూన్యులగు జనులు రసనిష్ఠములగు గుణములను శబ్ద ధర్మము లని తలంచుచున్నారు. ఇది మాకభిమతము కాకున్నను-అవివేకి మతము ననుసరించి చెప్పుచున్నాము. [ఈ యుపచారమునకు మూలమవివేకము. కావున నేతత్పక్ష ముపాదేయము కానేరదని సూచితము.]

మూలము :— (గుణములు సంఘట నాశ్రియములు [సంఘటన నాశ్రయించునవి] అను వాదము నుపేక్షించి, అవి-శబ్దాశ్రియములు కావచ్చునని చెప్పఁబడిన మీఁది మతము స్వాభిమతాను కూలమను తలంపున ప్రతివాది శంకించుచున్నాఁడు.)

ప్రభామతి :— (మాధుర్యాది గుణము-శబ్దగతమగు నెడలనది విశిష్ట ఘటనా లభ్యమే యగును, కావున) గుణములు శబ్దాశ్రయములగు నెడల నప్పుడవి సంఘటనా రూపములగుటగాని, సంఘటనాశ్రయములగుట (సంఘటన నాశ్రయించుట) గాని ప్రాప్తింపక తప్పదు. సంఘటితములు కాని (కలయిక నొందింపఁబడని) శబ్దములు (అర్థ) వాచకములుకావు. కావున అర్థ విశేషములచేత ప్రతిపాదింపఁదగిన రసాదుల నాశ్రయించు నవియగు-అనఁగా: రసనిష్ఠములగు గుణములకు-ఉపచారము చేతనైనను సంఘటితములు కాని శబ్దములు ఆశ్రయములు కావుగదా: [గుణములు-శబ్దములు నాశ్రయించునని యంగీకరించు నెడల అవి సంఘటన నాశ్రయించు నవియే యగును.]

ప్రభామతి :— (1) ఉపచారముచేత శబ్దములయందు గుణములుండునను నపుడు వక్ష్యమాణమగు తాత్పర్యము నెఱుంగనగును. "శబ్దమునకుఁగల శృంగారాది రసాభి వ్యంజకమగు వాచ్యముయొక్క ప్రతిపాదన సామర్థ్యమే మాదుర్యము. శబ్దగతమగు నాసామర్థ్యము విశిష్ట శబ్దాంతర సంఘటనచేతనే లభ్యమగును. ఇట్లనుట చేత సంఘటన అనునది శబ్దములకంటె భిన్నము కాదు. ఇంకేమనిన, సంఘటితములగు శబ్దములే సంఘటన. కాఁగా, పూర్వోక్తమగు శృంగారాది రసాభి వ్యంజక వాచ్య ప్రతిపాదన సామర్థ్యము-సంఘటిత శబ్దాశ్రితమే యగుచున్నది. కావున గుణములు సంఘటనాశ్రితములే యగుట సిద్ధించుచున్నది" అని పూర్వపక్షాశయము (లోచనము).

1) ఉపచార మనఁగా: ఒకదానియందుండు ధర్మమును వేఱొక దాని యందారోపించుట. గుణములు (అవివేకి జనాభిప్రాయమున) ఉపచారముచేత శబ్దధర్మములుగాని, శబ్దైకాత్మకములు (శబ్దరూపములు) గాని, కానిమ్ము: నడుమ నీసంఘటన కీయనుప్రవేశమెందులకు: అని కూడ నాశంకించి, పూర్వోక్తపూర్వ పక్షవాదియే యనుచున్నాఁడు.

ప్రశ్న :— పరస్పర సాకాంక్షములగు పదములచేత ప్రతిపాదింపఁదగిన విభావాది రూపములగు నర్థవిశేషములచేత ప్రతిపాదింపఁదగిన వ్యంగ్యములగు రస-భావ-తదాభాస-తత్ప్రశమాదుల నాశ్రయించునవియు, ముఖ్యముగా, ఆ రసాదుల యందుండు నవియు, అగు మాధుర్యాది గుణములకు, ఉపచారముచేతనయినను గూడ-అసంఘటితములగు శబ్దములాశ్రయములుకావు. ఏలయనిన: అసంఘటితములగు శబ్దములు - నిరాకాంక్షరూపమును, - వ్యంగ్యోపయోగియు, నగు వాచ్యమును (వాక్యార్థమును) చెప్పఁజాలవుగదా: (లోచనము)

[సంఘటితములగు శబ్దములే గుణముల కాశ్రయములనునది పూర్వపక్షాభిప్రాయమునందు ఫలితార్థమని తెలియునది]. ఇందలి భావమిదె :—

"శబ్దములకు వాక్యత్వమును సంపాదించునదియగు పరస్పర సంబంధమునకు "సంఘటన" (కూర్పు) అనిపేరు. ఆ సంఘటన లేనియెడల విశృంఖలములగు శబ్దములు వాచ్యార్థ బోధకములుగాఁ జాలకుండుటవలన అవి రస వ్యంజకత్వముచేత గుణముల కాశ్రియములగుట సిద్ధింపదు. కావున "గుణములు శబ్దాశ్రియములు' అను నీవుగూడ-ఇష్టము లేకున్నను ఆగుణములను సంఘటనా ధర్మములుగ నంగీకరింపక తప్పదు" అని భావము [అని దీధితి 186 పేజీ].

**మూలము :— (అసంఘటితములగు వర్ణ - పదములు గూడ రస-భావాదివ్యంజకములని యింతకుముందు చెప్పఁబడుట వలన"సంఘటితపదాపేక్షలే"దని ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.] రసములు-వర్ణములచేతను, పదములచేతను, గూడ వ్యంగ్యములగు (రసీభవింపఁజేయఁబడు)నని ప్రతిపాదింపఁబడినది. కావున నిట్లు సంఘటితములగు శబ్దములే రసవ్యంజకమగు నర్థమును ప్రతిపాదించి, రసాద్యాశ్రితములగు గుణముల కాశ్రియములగునని ఆక్షేపింపఁగూడదు.**

వ్రిభామతి :— "సంఘటితములగు శబ్దములే అనఁగా, వాక్యరూపములగు శబ్దములే, రసవ్యంజకములై రసాశ్రితములగు గుణముల కాశ్రియములగు" నను నియమములేదు.

"తనరు నలక్ష్యక్రమమగు ...... వర్ణములన్, పదాదులన్" అని నిరపేక్షములగు వర్ణములచేతనుగూడ, స్వసౌందర్య బలముననే రసాదులు ధ్వనింపఁజేయఁబడునని చెప్పఁబడినది. ఆవర్ణముల వలెనే శ్రవణమాత్రముననే స్వార్థమును స్మరింపఁజేయుటచేత పదములు గూడ గుణముల కాధారములగు రసాదుల నభివ్యంజింపఁజేయునని చెప్పఁబడినది. కాఁగా-శుద్ధమగు (సంఘటితము కాని) పదముకూడ-రసవ్యంజక మగుచున్నది. పదములకుఁగల రసాభివ్యక్తి యోగ్యమగు అర్థముయొక్క అవభాసకతయే మాధుర్యాదికమగును.

[సంఘటన-గుణవ్యంజకమై గుణముల కాశ్రియమగుట ఉపపన్నము కాదనిభావము]

**మూలము : అవ :—("సంఘటిత పదసముదాయమే వాక్యము. కావున రసాదిధ్వనులు-వాక్య వ్యంజకములగు నపుడు మాత్రము సంఘటన-రసవ్యంజకమై, గుణముల కాశ్రియము కావచ్చును.**

స్వసౌందర్యముగాని, వాచ్యసౌందర్యముగాని, సంఘటనలేనియెడల కలుగనేరదు" అని యాశంకించి-ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు]

[లోచనము]

రసాదులు - వాక్యవ్యంగ్యములుగుటకూడ - అంగీకృతమై యున్నను, నియతమగు సంఘటనయేదియు, వానికి (గుణములకు) ఆశ్రయము గాకుండుటవలన - వ్యంగ్యవిశేషానుగతములును (రసవ్యంజకములును) నియతసంఘటనా రహితములును, అగు శబ్దములే గుణముల కాశ్రయములు.

ప్రభామతి :— ఇందలి యభిప్రాయము విశ్లేషింపనగు :— వాక్యమునందు సంఘటనయను ప్రవేశింపనీ, అంతమాత్రమున సంఘటన గుణముల కాశ్రయము కానేరదు. సంఘటన లేకున్నను, వర్ణ-పద-వ్యంగ్యమగు రసాదికమునందు మాధుర్యాది గుణములకు-నియతమగు సంఘటన (యేదియు) ఆశ్రయముగాని, స్వరూపముగాని కాదు, రసాదికము-వాక్యవ్యంగ్యమగు నపుడుగూడ నిట్లే సంఘటన లేకున్నను, వాక్యమే-రసవ్యంజకమగుట సంభవించును. కావున (వాక్యమునందు) సంఘటన సన్నిహితమై యున్నను, అసంఘటన-రసాభివ్యక్తి యందుపయోగించునని కానేరదు. కావున రసాశ్రయములగు గుణములకు సంఘటన-యాశ్రయమెట్లగును? [గుణములు-సంఘటన నాశ్రయించునవికావు] కాఁగా, ఔపచారికముగనైనను-గుణములు-శబ్దాశ్రయములే యగునని ఉపసంహరింపఁబడినది.

[లోచనము]

మూలము :— "గుణములు సంఘటనాశ్రయములు" (సంఘటన నాశ్రయించును) అను పూర్వపక్షి తిరుగ నాక్షేపించుచున్నాఁడు)

అయ్యా! మీరు మాధుర్యగుణము విషయమున నిట్లు చెప్పినను చెప్పవచ్చునుకాని ఓజోగుణమునకు నియతమగు సంఘటన లేని శబ్దము లాశ్రయములగునా? సమాసరహితమగు సంఘటన-యెప్పుడైనను-ఓజోగుణమున కాశ్రయత్వమును బొందదు గదా!

[ఓజోగుణము - సమాసము లేనిచోట నుండదని పూర్వపక్షాశయము.]

ప్రభామతి :— మాధుర్యగుణము వ్యంజనీయమగునపుడు సమాస రహిత మగు సంఘటనయు-ఒక్కొక్కప్పుడు "అనవరత" ఇత్యాది స్థలములయందు దీర్ఘసమాసయగు సంఘటనయు (గూడ-కాన్పించుటవలన-మాధుర్య వ్యంజకమగు సంఘటనకు నియమములేదనవచ్చునుగాని, ఓజోగుణము వ్యంజనీయమగునపుడు, దీర్ఘసమాసయగు సంఘటనయేగాని సమాస రహితయగు సంఘటన-ఎచ్చటను లభించుటలేదు, కావున ఓజోవ్యంజకమగు సంఘటనకు (మాత్రము) విషయ నియమము లేదన(గూడదని పూర్వపక్ష తాత్పర్యము.

మూలము :— (ప్రతిపక్షి నిరాకరించుచున్నా(డు) చెప్పుచున్నాము. (అట్లయిన మేము చెప్పునది శ్రద్ధగావినుము).

నీచిత్తము ప్రసిద్ధిమాత్రాభినివేశ దూషితము కాకుండిన యెడల ఈ ప్రశ్నమునకు (గూడ సమాధానము చెప్పలేనివారలము కాము. [నీ చిత్తము ప్రసిద్ధిమాత్రము నందలి యభినివేశముచేత దూషితమైననుసరియే। సంఘటనకు విషయనియమములేదని యే చెప్పుదుము" అని పాఠాంతరము] సమాసరహితమగు సంఘటన (రచన) ఓజోగుణమున కాశ్రయముకాదా?

ఏకావ్యము - రౌద్రాదిరసములను ప్రకాశింప(జేయునో ఆ కావ్యమునకు(గల దీప్తియే "ఓజ"స్సని యింతకుముందు ప్రతిపాదింప(బడినది గదా। (రౌద్రాదులను ప్రకాశింప(జేయుటచే నాలక్ష్యమాణమోజస్సనిభావము) ఆ యోజోగుణము సమాసరహితమగు సంఘటన యందుండినయెడల దోషమేముండును?

సహృదయ హృదయ సంవేద్యమగు అచారుత్వ (సౌందర్యాభావ)ము లేదుగదా।

కావున గుణములు నియతమగు సంఘటన లేని శబ్దముల నాశ్రయించుటలో క్షతియేదియు లేదు.

ప్రభామతి :— "నీ చిత్తము కేవలమును ప్రాచీనమగు రూఢి యందలి యభినివేశముచేత దూషితమై యున్నను, దూషితముగాకున్నను, మేము చెప్పవలసిన ప్రత్యుత్తరమును చెప్పుచున్నాము, వినుము. సమాస రహితమగు సంఘటన యోజోగుణమున కాశ్రయము కాకపోదు. కావ్యమునకు(గల రౌద్రాది ప్రకాశాత్మక

యగు దీప్తియే = ఉజ్జ్వలతయే. ఓజస్సని గుణ నిరూపణ సమయమునందే ప్రస్తావింపఁబడినది గదా: కావున గుణాద్యభివ్యక్తి విషయమున దీర్ఘసమాస బంధముగాని, అల్ప సమాసబంధముగాని, ప్రయోజకములు కానేరవు.

"పాండవసేన" అను పద్యమున దీర్ఘసమాసములేకున్నను, అచట ఓజో గుణ రూపమగు రౌద్ర రస సౌందర్యము తగ్గినట్లు సహృదయ హృదయ ప్రమాణ మేదియు కాన్పింపకుండుటవలన, గుణములు-నియతమగు రచన నపేక్షింపని (సంఘటన నపేక్షింపని) శబ్దములచేతనే వ్యంజనీయములు" అను విషయమున-అనుపపత్తి యేమియులేదని భావము.

మూలము :— గుణములకు మాత్రము చక్షురాదులకు వలెనే, ప్రత్యేకముగా విషయ నియమితమగు స్వరూపమున్నది. కావున నది వ్యభిచరింపదు. [నియమమును తప్పి చరింపదు] ["గుణములకు విషయ నియమమున్నది. సంఘటనకు విషయ నియమములేదు" అని భావము]

ప్రభామతి :— "శృఙ్గారఏవ మధురః" మాధుర్యము-శృంగారాది రసములకు గుణమైయున్నది. అట్లయినను-అది-మాధుర్యాభి వ్యంజకములగు శబ్దముల యందుపచరితమగుచున్నది........శృంగారమే - మాధుర్యగుణ విశిష్టమగురసము. అని ద్వితీయోద్ద్యోతమున చెప్పఁబడినది. (ప్రథమభాగమున 98 పేజీ) దీనిచేత గుణములకు మాత్రము విషయనియమము చెప్పఁబడియేయున్నది. [లోచనము] చక్షురాదులకు విషయములు-రూపాదులు - గుణములకో-రసాదులు (బాలప్రియ 317) రూపము నెఱుఁగుటకు-కన్ను, రుచినెఱుఁగుటకు, రసన, మొదలగునవి కారణములగుచు, తమతమ నియమమును తప్పిచరింపుటలేదు. ఇట్లే శృంగార కరుణాది రసములయందు మాధుర్యగుణమును, రౌద్రాదులయందు-ఓజోగుణమును నియతములై యుండి-తమనియమమును తప్పిచరించుటలేదు. కావున శృంగారాది వ్యంజకములగు కోమల శబ్దములు-మాధుర్యమును ప్రకాశింపఁజేయుటకును, రౌద్రాది వ్యంజకములగు కర్కశ శబ్దములు-ఓజోగుణమును ప్రభాసింపఁజేయుటకును, వేరు వేరుగ కారణములగుట వలన-గుణములకు విషయ నియమమున్నది. దీర్ఘ సమాస సహితయగు సంఘటనయైనను-కొన్నిచోటుల శృంగారాదులను వ్యంజింపఁజేయును. సమాస రహితయగు సంఘటనయైనను కొన్నిచోటుల రౌద్రాదులను వ్యంజింపఁజేయును.

అడెట్లనిన :— "అనవరతనయన" అను పద్యమునందలి శబ్దములు-సమస్తములైనను నిసర్గకోమలములు కావున నవి విప్రలంభ శృంగారమును

ప్రకాశింపఁజేయుచున్నవి. 'పాండవసేన....స్వబాహుమదాంధుఁడు' అను పద్యమునందలి శబ్దములు-వ్యస్తములైనను కర్కశములు. కావుననే అవి - రౌద్రమును ప్రకాశింపఁజేయుచున్నవి. మొదటి పద్యమునందు దీర్ఘ సమాసమును, రెండవ పద్యమున-అల్ప సమాసమును ఉండుటవలన-సమాన రూపమగు సంఘటనయే తారుమారైనది. శబ్దములట్లు తారుమారు కాలేదు. కావున "శృంగారాదులయందు-అసమాసయగు సంఘటనయే యుండవలయును" అను నియమము-సంఘటనకు లేదు. కోమల శబ్దములే-మాధుర్యమును భాసింపఁజేయును. కర్కశ శబ్దములే-ఓజస్సును ప్రకాశింపఁజేయును." అను నియమము శబ్దములకు మాత్రమే కలదు. కాఁగా: గుణములు-నియత విషయములగుచున్నవి. సంఘటన-నియత విషయము కాదు.

మూలము :— (ఉపసంహరించుచున్నాఁడు)

"కావున గుణములువేఱు. సంఘటన వేఱు. గుణములు సంఘటన నాశ్రయించునవి కూడకావు." అనునిది యొక దర్శనము (మతము).

ప్రభామతి :— కావున గుణములు సంఘటనా రూపములును, సంఘటనా వృత్తులును గూడ కావని తాత్పర్యము.

మూలము :— (ఇప్పుడు-గుణ-సంఘటనాతాదాత్మ్య పక్షపాతి స్వమతమును స్థాపించుచున్నాఁడు) పోనిమ్ము! గుణములు సంఘటనా రూపములే కానిమ్ము.

ప్రభామతి :— శబ్దగతమగు మాధుర్యాదికము శృంగారాది రసాభివ్యంజకమగు సామర్థ్యమే యగును. కావున అది రసానుగుణమగునట్లు సంఘటనచేతనే నిర్వర్తింపఁబడును.

మూలము :— (ఈ విషయమున పూర్వోక్తమగు నాక్షేపమును స్మరించి-ఖండించుచున్నాఁడు)

(గుణములు సంఘటనా రూపములగు నపుడు) "లక్ష్యమునందు వ్యభిచారము కాన్పించుటవలన-సంఘటనకు వలెనే గుణములకుఁగూడ నియతమగు విషయము లేకపోవలసివచ్చును" అని యింతకుముందు చెప్పఁబడిన యాక్షేపమునకుఁగూడ సమాధానము చెప్పుదుము.

ఏలక్ష్యమునందు విషయమునకు వ్యభిచారము పరికల్పింపఁ బడునో, అది విరూపమే (దోషయుక్తమే) అగుఁగాక!

కవిశక్తి తిరోహితమగుటవలన-తాదృశమగు లక్ష్యమున-సహృదయులకు సౌందర్యరాహిత్యము స్ఫురించుటలేదు.

ప్రభామతి :— 'ఒక్కవిపరీత లక్ష్యము కన్పించినంతమాత్రమున నియమము వ్యభిచరణీయముకాదు. అట్టి లక్ష్యమును మార్పవలయును, లేదా తొలఁగింప వలయును' అని తాత్పర్యము.

(కవి కృతమగు) దోషము ద్వివిధముగదా! అందు-వ్యుత్పత్తి లేకుండుటవలన కవి చేయునది మొదటిది. శక్తిలేకుండుట వలన నతఁడొనర్చునది రెండవది.

ప్రభామతి :— వర్ణనీయవస్తు విషయ నూతనోల్లేఖశాలి ప్రతిభ, కవిత్వబీజభూతమగు నాప్రతిభయే శక్తి. (రచనాచాతుర్యమే శక్తియని ఫలితార్థము.)ప్రకరణోపయోగి సమస్తవస్తు-పౌర్వాపర్య-పరామర్శ కౌశలము-వ్యుత్పత్తి, వ్యుత్పత్తిశక్తులలో శక్తిగొప్పది.

అందు-అవ్యుత్పత్తిచేత (వ్యుత్పత్తిలేకుండుటచేత) చేయఁబడిన దోషము-కవిశక్తి తిరస్కృతమగుటవలన నొకానొకప్పుడు కనుపింపకుండును. అశక్తి కృతమగు దోషముమాత్రము-వెంటనే కనుపించును.

ఏ తద్విషయకమగు పరికర పద్యము.

గీ॥ కవికి వ్యుత్పత్తి శూన్యతఁగలుగు దొసఁగు
సంవృతంబగు నాతని శక్తిచేత
శక్తిహీనత నాతఁడు సల్పుదోష
మెంతయును శీఘ్రముగనే గ్రహింపఁబడును॥

ప్రభా :— కవికి 1 శక్తి 2 వ్యుత్పత్తులు ముఖ్యముగాఁ గావలసియున్నవి. వ్యుత్పత్తిలేకుండుటచే నతఁడొనర్చు దోషమాతని శక్తిచే నాచ్ఛాదింపఁబడుటచేత దానిని సహృదయుఁడు గూడ నొక్కొక్కప్పుడు గ్రహింపఁజాలఁడు. కాని కేవల వ్యుత్పత్తిశాలియగు కవి-శక్తిశూన్యుఁడగుటచేత నొనర్చిన దోషము దురాచ్ఛాదమే యగును.

[ శక్తిలేని కవి యొనర్చిన దోషము కప్పఁబడదు అని భావము.]

మూలము :— (విదర్శన ప్రదర్శనమున పూర్వోక్తమగు నర్థమును దృఢీకరించుచున్నాఁడు.)

మహాకవులొనర్చిన ఉత్తమ దేవతా విషయ ప్రసిద్ధ-సంభోగ శృంగారాది-నిబంధనాద్యనౌచిత్యముకూడ (తత్కవి) శక్తి తిరస్కృతమగుటవలన గ్రామ్యముగాఁదోచుటలేదు.

(ఒక యనౌచిత్యము నుదాహరించుచున్నాఁడు) కుమార సంభవము నందలి దేవీ సంభోగ వర్ణన మిందులకుదాహరణము.

ఇటువంటి విషయమున (ఇట్టి సందర్భములయందు) ఔచిత్య మెట్లు త్యజింపఁబడుచున్నదియు మొదట (కారికా కారునిచేత) ప్రదర్శింపబడియే యున్నది.

ప్రభామతి :— రససర్వస్వము-ఆస్వాదాయత్తము. కావున నాస్వాదయితలకు చమత్కార విఘాతము కలుగకుండునపుడే రసాస్వాదము కలుగును. పార్వతీ-పరమేశ్వరాద్యుత్తమదేవతా సంభోగ పరామర్శము-మాతా పితృ సంభోగ పరామర్శమువలె లజ్జాతంకాది ప్రసరణముచేత చమత్కారావకాశమును కలిగింప నేరదు. కావున తత్సంభోగ వర్ణన మనుచితమే యగును. అయినను కాళిదాసాది మహాకవి కృతమగునది శక్తి తిరస్కృతమగుటచేత ననుచితముగాఁదోచుటలేదు.

ప్రతిభావంతుఁడగుకవి-ఉత్తమ దేవతా విషయకమగు సంభోగమును వర్ణించినపుడు, సమ్యగ్వర్ణితమగు నాసంభోగమునందే-విశ్రమించిన సహృదయ హృదయము - పౌర్వాపర్య పరామర్శమును (అనౌచిత్యగ్రహణమును) గావింపఁజాలకుండును.

అదెట్లనిన: నిర్వ్యాజపరాక్రముఁడగు నొక పురుషుఁడనుచితవిషయమున ( బాల - గురు జన విషయమున ) యుద్ధముచేయుచున్ననుగూడ, నదిచూచు వారా యుద్ధకాలమునందతని పరాక్రమమును కీర్తింపకమానరు. కాని పౌర్వాపర్యమును పరామర్శించు నప్పుడు మాత్రము ఆ సాధువాద ప్రదానము జరుగదు.

కాళిదాస మహాకవి-కుమార సంభవమునందలి యష్టమసర్గమునఁగావించిన పార్వతీ సంభోగ వర్ణనము-అనౌచిత్య దోష దూషితమే యగునని భావము. 'విభావ భావానుభావ' అనుకారికను వివరించు సందర్భమున "సత్యము వచియింతు మనౌచిత్యమె రసభంగ మొదవఁజేయు" అనునంత వఱకునుగల సందర్భముచే నేతదౌచిత్య విమర్శముచ్ఛ వృత్తికారుఁడు మున్ముందు ప్రదర్శించును.

కావున రచనా చాతురీ రూపమగు కవిశక్తి-కావ్యగతమగు అనౌచిత్యాది దోషము నాచ్ఛాదించును. కావున-అసమాసయగు సంఘటనయందు ఓజోగుణము విరూపమగుచున్నను రసావిష్టమగు బుద్ధియందు - అనుచితముగాఁదోచకుండునని భావము.

మూలము :— (కవి ప్రతిభ-కావ్యదోషముల నెట్లాచ్ఛాదించుననినఁజెప్పుచున్నాఁడు)

(అవ్యుత్పత్తి కృతములగు దోషములు)శక్తి తిరస్కృతము లెట్లగునదియు-అన్వయ వ్యతిరేకములచే నిశ్చయింపఁబడుచున్నది. (అన్వయము కుమార సంభవమున-ప్రదర్శితమయినది. కావున వ్యతిరేకమును మాత్రమే ప్రదర్శించుచున్నాఁడు)

అదెట్లనిన :— ఏవంవిధమగు విషయమున శక్తిశూన్యుఁడగు కవి-ఉపనిబంధించిన శృంగారము-దుష్టమను నంశము స్పష్టముగానే భాసింపక తప్పదు.

ప్రభామతి :— శక్తిరహితుఁడగు కవి-మాతా పితృ సంభోగమును దీర్ఘ సమాసములచేత వర్ణించునెడల అది-దోష దూషితమని యెల్లరకును తెలియునని భావము.

మూలము :— ఏతత్ పక్షమున "పాండవసేన" ఇత్యాదులయందు అచారుత-ప్రతీయమానము కాకున్నను, [రౌద్రరస గుణమగు ఓజస్సును స్ఫురింపఁజేయునదియగు దీర్ఘసమాస సంఘటన లేకుండుటవలన "ఈకావ్యము-సౌందర్యవంతముకాదు" అని బలాత్కారముగా] అచారుత్వము నారోపించెదమా?

ప్రభామతి :— ఇట్లు - అంగీకృతమయిన గుణ సంఘటనైక్యపక్షమున కుపపత్తి కాన్పింపకుండుటవలన దానిని తిరస్కరించుచున్నాఁడు.

ఏతత్ పక్షమున అనఁగా: గుణములు సంఘటనారూపములను నభిప్రాయమును స్వీకరించినను, "పాండవసేన" ఇత్యాదులయందు దీర్ఘ సమాసములు లేకున్నను, సౌందర్యవిశేషము గోచరించుచుండుటవలన క్రుద్ధుఁడగు అశ్వత్థామచేత వచింపఁబడిన యీవాక్యమునందు దీర్ఘ సమాసములు లేకుండుటవలన ఇది-సౌందర్య సమంచితముకాదని బలాత్తుగా ఆరోపించు వారలముకాము అని భావము.

"గుణ - సంఘటనల కైక్యము నంగీకరించునెడల 'పాంశవనేన' ఇత్యాద్యుదాహరణములయందు - ఓజోగుణాను సారియగు దీర్ఘ సమాస సంఘటన లేకుండుటవలన సంభవించు వ్యభిచారమును వారింపవలసి వచ్చును.

కావున మీఁది లక్ష్యమును-లక్ష్యముగాకుండునట్లు చేయుటకు-కవి శక్తి తిరస్కృతమగుట వలన-ఇచటి సౌందర్యరాహిత్యము, పూర్వాపరపరామర్శ-వివేకశాలురకుఁగూడ గోచరముగాకున్నదను బలాత్కార కల్పనమును జేయ వలసి వచ్చును." అది-సహృదయ సమ్మతముకానేరదు. కావున మీఁది పక్షము యుక్తము కాదు. (ఖీదితి-పే-192.)

మూలము :— కావున సంఘటన గుణవ్యతిరిక్తమైనను, గుణరూపమైనను, గూడ దీని కింకొక నియమహేతువు చెప్పఁదగియున్నది. కావున (నే) "వక్తృగతమును, వాచ్య సంబద్ధము, నగు నౌచితి-నిదానమగు, తన్నియంత్రిణమున" అని (కారికావశేషమున) చెప్పఁబడినది.

ప్రభామతి :— మునలమ్మయందుప్పతిలివ - శృంగారచేష్టవలె, అసమాస సంఘటనయందగు-ఓజోగుణము-సమ్మోద దాయకముగాఁజాలదని చెప్పుచున్నాఁడు. "గుణ వ్యతిరిక్తమైనను" అని. వ్యతిరేకపక్షమున సంఘటనకు నియమహేతువేలేదు గదా! ఐక్య పక్షమునందుఁగూడ రసము నియమ హేతువుకాదు. కావున సంఘటన-గుణములకంటె వేరయినను కాకున్ననుగూడ దీనికి వేఱొక నియమ హేతువు చెప్పఁబడవలయును. కావున, వక్తృ-వాచ్యగతమగు నౌచిత్యము-తన్నియమ హేతువని చెప్పఁబడినది.

(సంఘటన - గుణరూపమనినను, గుణాశ్రయమనినను సరియే, కాని దానికి రసాను సారియగు వ్యవస్థ యుచితముకాదు. వ్యక్తృ-వాచ్య సంబంధియగు నౌచితి ననుసరించునదియగు వ్యవస్థయే సముచితము. అట్లయినచో వ్యభిచార మేర్పడదని భావము.)

మూలము :— (అవ :— కారికాంశమును వివరించుచు-వ్యక్తృభేదములను ప్రదర్శించుచున్నాఁడు.)

అందు (వక్తృ-వాచ్యములలో) వక్త-కవియు, కవిని బద్ధుఁడొకానొకఁడును గూడ, నగుచుండును. (అందును) కవినిబద్ధుఁడు రస భావ రహితుఁడుగాని, రస భావ సహితుఁడుగాని యగుచుండును. రసముగూడ - కథానాయకాశ్రయముగాని, తద్విపక్ష

శ్రియముగాని యగుచుండును. పూర్వుఁడగు కథానాయకుఁడే గాక-తదనంతరుఁడుగూడ-ధీరోదాత్తాదిభేద భిన్నుఁడగుచుండును. అను వికల్పములు (వక్తృభేదములు) గలవు.

ప్రభా :— వక్తయనఁగా: వచించువాఁడని యర్థము, కవికల్పితుఁడు (కవిచే నేర్పరుపఁబడినవాఁడు) కవినిబద్ధుఁడు.

రసభావాస్వాదములేనివాఁడు = రసభావరహితుఁడు. తదాస్వాదము గలవాఁడు = తత్సహితుఁడు. (మూలమున "కవి నిబద్ధశ్చాపి" అనుటచేత కవికూడ-రసభావరహితుఁడుగాని, తత్సహితుఁడుగాని కావచ్చునని చెప్పవచ్చునని తోఁచెడివి) నిర్వహణ సంధియందు ఫలభాగియగు తనిపనికి-అంగిభావము గల దానినిగా కథను నడుపువాఁడు-(కథను తనపని కంగముగాఁజేసికొనువాఁడు) కథానాయకుఁడు-కథానాయకాశ్రియము = రామాద్యాశ్రియము, తద్విపక్షాశ్రియము = తత్ప్రతినాయక - రావణాద్యాశ్రియము, అనంతరుఁడు = ఉపనాయకుఁడు లేక ప్రతినాయకుఁడు.

నాయకుఁడు - ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు అని చతుర్విధుఁడు. ఇట్లు చతుర్విధుఁడగు నతఁడు, అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు, అనుభేదములచేతఁదిరుగ చతుర్విధుఁడై, ఉత్తమ, మధ్యమాధమ భేదములచేత నలువది యెనిమిది భేదములు గలవాఁడగుచుండును. ధర్మ-యుద్ధ-వీర-ప్రధానుఁడు - ధీరోదాత్తుఁడు. వీర-రౌద్ర ప్రధానుఁడు. ధీరోద్ధతుఁడు, వీర-శృంగార ప్రధానుఁడు, ధీరలలితుఁడు, దాన-ధర్మ-వీర-శాంత-ప్రధానుఁడు ధీరప్రశాంతుఁడు. వీరు క్రమముగా సాత్వతీ-ఆరభటీ-కైశికీ - భారతీ లక్షణవృత్తి ప్రధానులు.

మూలము :— (వాచ్య వైవిధ్యమును జూపుచున్నాఁడు) వాచ్యముగూడ-ధ్వన్యాత్మ-రసాంగమును (ధ్వని స్వభావ రసవ్యంజకమును) రసాభాసాంగమునుగూడ నగుచుండును. (ఇట్లు ద్వివిధమగు వాచ్యము) అభినేయార్థమును (దృశ్యకావ్య ప్రతిపాద్యమగు నర్థముగలదియు) అనభినేయార్థమును (శ్రవ్యకావ్య ప్రతిపాద్యమగు నర్థముగలదియు) నగుచుండును. (అదియు) ఉత్తమ ప్రకృత్యాశ్రియమును. తదితరాశ్రియమును గూడ నగుచు, బహుప్రకారకమై యుండును.

ప్రభా :— వా, గంగ, సత్వాహార్యములచేత (వాచికము, ఆంగికము, సాత్త్వికము, ఆహార్యము అనుచతుర్విధాభినయములచేత) సాక్షాత్కారప్రాయమగు అభిముఖ్యమునుబొందింపఁదగిన (పొందింపఁదగిన) వ్యంగ్యరూపము-ధ్వని స్వభావము (ధ్వన్యాత్మకము) అగు నర్థముగల వాచ్యము-అభి-నేయార్థము.

ధ్వన్యాత్మకమగు నావ్యంగ్యమే-కావ్యార్థము, (కావ్య + అర్థము = కావ్యము చే నర్థింపఁదగినది) అనిచెప్పఁబడుచుండును. (కావ్యార్థశబ్దము-వ్యంగ్యరసాది వాచకమని భావము) ధ్వన్యమానమగునారసాదికమే-అభినేతవ్యము (అభినయముతోడి సంబంధము గలది) నాట్య శాస్త్రకర్త-భరతముని-అక్కడక్కడనిట్లే చెప్పెను. వాగఙ్గసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయన్తి" అని ఉత్తమ ప్రకృతులు = దేవముని ప్రకృతులు, ఆశ్రయము = ఆలంబనముగాఁగలది, తదితరాశ్రయము = మధ్యమ-అధమ ప్రకృత్యాశ్రయము (మనుజ-దనుజ, ప్రకృత్యాశ్రయము)

మూలము :— (ఇట్లు వక్తృభేదములను, వాచ్య భేదములను నిరూపించి, తద్గతమగు నౌచితిని-సంఘటనా నియామకముగాఁ దెల్పుచున్నాఁడు)

అందువక్త యగుకవి - అపగత, రస, భావుఁడగునపుడు, రచన (సంఘటన) స్వేచ్ఛగా సాగింపవచ్చును. అట్లే కవినిబద్ధుఁడగు వక్త కూడ రసభావరహితుఁడగు నపుడు రచన స్వేచ్ఛగా సాగింపవచ్చును. (ఇట్లు, శుద్ధమగు వక్త్రౌచిత్యమును విచారించి, వాచ్యౌచిత్యముతోఁగూడ మరల దానినే నిరూపించుచున్నాఁడు)

కవిగాని,కవినిబద్ధుఁడగు వక్తగాని, నియమముగా (తప్పక) రసభావ సమన్వితుఁడగునపుడు మాత్రము, ప్రధాన భూతమగుటవలన రసము ధ్వన్యాత్మభూతమే యగునపుడు - తత్కావ్యమున, సమాసరహితము, మధ్యమ సమాససహితము-అగు సంఘటనలే నియమముగా నుండవలయును. కాని, కరుణ రసమునందును, విప్రలంభ శృంగారము నందును సమాసరహితయగు సంఘటనయే యుండవలయును.

ప్రభామతి :— యమకాది చిత్ర కవిత్వ-ప్రదర్శన పరాయణుఁడగు కవి-నీరసభావకవి, కావున నచట సంఘటనకు నియమముండదని భావము. "కవి నిబద్ధుఁడగు వక్తకూడ" అనుచోట, ఆవక్తను ఉదాసీనమగు భావసాదికముమగా

గ్రహింపవలయును. రసావ్యాక్షేపరహితుఁడగు తాపసుఁడుగాని వేతాళుఁడుగాని యుదాసీనుఁడైనను ప్రధానమగు నితివృత్తమున కంగమగుట వలన 'ప్రధాన రసానుయాయి' యే ('రసభావసహితుఁడే') యగును. అయినను వాఁడు 'రస భావ రహితుఁ'డని యనట, తద్గతమగు-నైసర్గిక రసభావరాహిత్యము వివక్షితమై యున్నది. వాఁడు రసభావరహితుఁడగునపుడు దీర్ఘ సమాస - మధ్యమసమాస- అసమాసలలో నేసంఘటనయైనను, ఉపయోగింప వీలగునని భావము.

"కవిగాని.......రసభావ సమన్వితుఁడగునపుడు మాత్రము" అనుటచే నొకానొకప్పుడు కవి-రసావిష్టుఁడు కాకుండునని తోఁచును. అదియెట్లు సంభవించును" అని భావించి లోచనకారుఁడు ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు. కవి-రసావిష్టుఁడగు వక్తయగుటయే యుక్తము. అట్లుకానిచో "అతఁడే రాగ వర్తితుండైనయెడల, నీరసంబగునది యెల్ల నిశ్చయముగ" అనుకారిక ననుసరించి కావ్యము 'నీరసము' (రసరహితము) కావలసివచ్చును.

అయినను కవి-యమకాది చిత్ర ప్రదర్శన ప్రధానుఁడగునపుడు-రస భావ రహితుఁడగునని చెప్పఁబడినది. అట్లే తత్కల్పితుఁడగు వక్త కూడ-నియమముగా రసభావ సమన్వితుఁడగు నపుడు అనఁగా: తటస్థుఁడు కాకుండునపుడు, రసము-ధ్వన్యాత్మభూతమే యగునపుడు- అనఁగా: రస వదలంకార ప్రాయముగాకుండు నపుడు, అసమాస-మధ్యమ సమాస- అగు సంఘటనలే (దీర్ఘ సమాస రహితములగు సంఘటనలే) యుండవలయును. అట్లుకానపుడు-దీర్ఘసమాసయగు సంఘటన కూడ నుండవచ్చును.

మూలము :— దీనికి హేతు వేమనినఁజెప్పు చున్నాము. ("యుక్తి రహితమైననుగూడ నాదరింపఁదగుననుట కిది ధర్మసూత్రకార వాక్యమాయేమి": అనిన-ఉపపత్తి ననుసరించి చెప్పు చున్నాఁడు)

రసము-ప్రధానముగా, ప్రతిపాద్యమగునపుడు, తద్రస ప్రతీతి వ్యవధాయకములగు (తద్రసాస్వాదమునకు విలంబమును గలిగించుటచేత విఘ్నరూపములగు) విరోధులు (ప్రధాన రస విపరీతాస్వాదమయములగు ప్రతిబంధకములు)కూడ సర్వవిధముల చేతను పరిహరింపఁబడఁదగియున్నవి.

సమాసము లనేక ప్రకారములుగా సంభావింపఁబడును. (ఊహింపఁబడును) కావున దీర్ఘ సమాసయగు సంఘటన

ఒకానొకప్పుడు రస ప్రతీతిని (రసాస్వాదమును) విలంబముగాఁ జేయును. కావున దానియందు అత్యంతాభినివేశము యుక్తము కానేరదు. విశేషించి అభినయింపఁదగిన యర్థముగల కావ్యమున దీర్ఘసమాసయగు సంఘటన యందత్యంతాభినివేశము శోభావహము కానేరదు.

ప్రభామతి :— 'రక్తాంబర' ఇత్యాది సమాసములయందు-ఇది కర్మధారయమా? బహువ్రీహియా? ఇత్యాది సంభావన కలుగుటచేత వాచ్యార్థనిర్ణయము దుర్ఘటమగును. కావున దీర్ఘసమాసయగు సంఘటన రసప్రతీతిని విలంబముగాఁ జేయునని భావము.

అభినయింపఁదగిన యర్థముగల కావ్యము దృశ్యకావ్యము. అది ప్రయోజ్యమగునపుడు-వ్యంగ్యము త్రుటితము కాకుండునట్లు సమాసార్థము నభినయించుట శక్యము కానేరదు. మఱియు, కాక్వాదులును, గానాదులును, ప్రయోగించుటకు శక్యముగాకుండును. అర్థజ్ఞానము - బహుతర సందేహ ప్రసరమై యుండును. నాట్యము ప్రత్యక్షరూపము. కావున నయ్యది నాట్యమున కనురూపము కానేరదు.

తదితర (శవ్య) కావ్యమునందుఁగూడ, కరుణ- విప్రలంభ శృంగారములు వ్యంజనీయములగునపుడు దీర్ఘసమాస సంఘటనాభినివేశ, ముచితము కానేరదు.

అవి (అరసములు) సుకుమారతరములు. కావున శబ్దార్థములకు స్వల్పమైన అస్వచ్ఛత కలిగిననుగూడ రసాస్వాదము మంథరీభవించును. (రసా స్వాద ప్రతిబంధము కలుగును)

ప్రభామతి :— అభినేయార్థముగల కావ్యముకంటె వేఱగు కావ్యము శ్రవ్యకావ్యము. అస్వచ్ఛత = వ్యంగ్యార్థ ప్రతిపాదన సామర్థ్యము లేకుండుట అస్పష్టత.

మూలము :— రసాంతరమగు (కరుణ-విప్రలంభశృంగారముల కంటె వేఱగు) రౌద్రాదిరసము ప్రతిపాద్య మగునపుడు-మధ్యమ సమాసయగు సంఘటనయు, (ఒక్కొక్కచో) ధీరోద్ధత నాయక సంబంధియగు వ్యాపారము నాశ్రయించునపుడు, దీర్ఘ సమాసాక్షేపము లేనిదే వాక్యము రసోచితముగాఁజాలదు. కావున నొకానొకప్పుడు దీర్ఘ సమాసయగు రచనయుఁ, గూడ-ప్రతి

కూలముకాదు. కావున దానిని (దీర్ఘసమాస రచనను) గూడ నంతగా పరిహరింపఁగూడదు.

(ఇట్లు-సంఘటనకు వక్త్రాద్యౌచిత్య నిబంధనము నియమమని తెలిపి, ప్రసాదమను గుణము తద్వ్యాపకమని చెప్పుచున్నాఁడు) ప్రసాదమను గుణము-ఈ సంఘటనల యందన్నింటను గూడ వ్యాపించుచుండును.

అది సర్వరస సాధారణమనియు, సర్వసంఘటనా సాధారణమనియుఁ జెప్పఁబడినదిగదా!

ప్రభామతి :— మాయాపరుఁడు, ప్రచండుఁడు, చపలుఁడు, అహంకార-దర్పభూయిష్ఠుఁడు, ఆత్మశ్లాఘానిరతుఁడు, అగు ధీరోద్ధతుఁడు, నాయకుఁడగునపుడు, దీర్ఘసమాసవంతమగు రచనయే యుక్తమని భావము.

శ్లో॥ సమర్పకత్వం కావ్యస్యయత్తు సర్వరసాన్ ప్రతి
సప్రసాదో గుణోజ్ఞేయః సర్వసాధారణ క్రియః॥

గీ॥ కావ్య మఖిలరసవ్యంజకంబుగాగఁ
దనరుచుండుటయే ప్రసాదమను గుణము
సర్వసాధారణ క్రియా సహితమదియె
యగుటఁ గఁ వనలెల్లరు నరయవలయు॥

అని ద్వితీయోద్ద్యోతమునఁజెప్పఁబడినది.

'సంఘటన లన్నింటియందునుగూడ - ప్రసాదమను గుణము - శీఘ్రముగా రస-ప్రత్యాయకమగు చుండును' అనిభావము.

మూలము :— మీఁది యంశమును నిరూపించుటకు, అన్వయ-వ్యతిరేకములను, జూపుచున్నాఁడు.

ప్రసాదగుణమును విడువనియెడల (స్వీకరించిన యెడల) మధ్యమ సమాసయగు సంఘటనకూడ కరుణ-విప్రలంభ శృంగారములను ప్రకాశింపఁజేయును. ప్రసాదగుణము నతిక్రమించిన (విడిచిన) యెడల సమాస రహితమగు సంఘటనకూడ వానిని వ్యక్తీకరింప లేకుండును.

ప్రభామతి :— ప్రసాదగుణమున్నయెడల రసము ప్రకాశింపఁజేయఁబడుట అన్వయము, అదిలేనప్పుడు రసము ప్రకాశింపఁజేయఁబడకుండుట వ్యతిరేకము.

వ్యంజకమగు స్వవాచ్యమునే ప్రకాశింపఁజేయలేకుండుటవలన ప్రసాదగుణ రహితమగు సంఘటన, సమాస రహితమైననుగూడ కరుణ-విప్రలంభములను ప్రకాశింపఁజేయ నేరదని భావము.

మూలము:— కాఁబట్టి సర్వత్ర ప్రసాదగుణ మనుసరింపఁ దగినది. కావుననే "పాండవసేన శస్త్రమును బట్టు" ఇత్యాద్యుదాహరణమున (దీర్ఘ సంఘటనా విరహము వలన) ఓజోగుణస్థితి నంగీకరింపనియెడల నది ప్రసాదాఖ్యమగు గుణమేయగునుగాని మాధుర్యము కానేరదు. "పాండవసేన" అను నీపద్యము అభీష్ట రస ప్రకాశక మగుచున్నది. కావున నిందు సౌందర్యాభావము (కాన్పించుట) లేదు.

కావున సంఘటన - గుణముల కంటె వేఱుగాకున్నను వేఱయిననుగూడ యథోక్తమగు (వక్తృవాచ్య సంబంధియగు) నౌచిత్యమువలన సంఘటనకు విషయనియమ ముండుటవలన నది కూడ (సంఘటనకూడ) రసవ్యంజకమే యగును.

రసాభివ్యక్తికి నిమిత్తభూతమగు సంఘటనకు వెనుకఁ దెలుపఁబడిన యే నియమ హేతువుకలదో, అదియే గుణములకుఁ గూడ విషయ నియమ హేతువగుటవలన సంఘటన గుణముల నాశ్రయించి యుండుటకూడ విరుద్ధముకాదు.

ప్రభామతి :— కావున సంఘటన లన్నిటియందునుగూడ ప్రసాదగుణ మాశ్రయణీయము, 'పాండవసేన' అను పద్యమున దీర్ఘసమాస సంఘటన లేకుండుట వలన నచట-ఓజో గుణ స్థితిని ప్రధానముగా నంగీకరింపనివారెవ్వరైన నుండిన యెడల వారు-అచట ప్రసాద గుణస్థితి నంగీకరింపవలయునుగాని అచట మాధుర్య గుణస్థితి నంగీకరింపరాదు.

ఏలయనిన: ఓజోమాధుర్యము లన్యోన్యాభావరూపములని యింతకుముందే నిరూపింపఁబడుటవలన తత్సంకరము ప్రతీతి బాహ్యమని భావము.

'గుణములు సంఘటనారూపములు' అగు నెడల గుణనియమమే సంఘటన కుఁగూడ నియమమగును, 'సంఘటన-గుణాధీనము' అగు నెడలనుగూడ నిట్లే యగునని యెఱుంగునది, 'గుణములు సంఘటనాశ్రయములు' అగునెడల ఏవక్తృ వాచ్యౌచిత్యము-సంఘటనకు నియామకముగాఁజెప్పఁబడినదో అదియే (వక్తృ-వాచ్య గతమగు నౌచితియే) గుణములకుఁగూడ నియమహేతువగుచుండును.

కావున నిట్టి పక్షములు మూఁడునుగూడ విప్లవమేదియు లేకుండుటవలన సమీచీనములే యగునని యభిజ్ఞులు గ్రహింతురుగాక।

మూలము:— (సంఘటన కింకొక నియామకముగూడఁ గలదని చెప్పుచున్నాఁడు)

కం॥ నియమించు దాని విషయా
శ్రిమమింకొక యౌచితియు మరల, కావ్యభిదా
శ్రియణమునను, భేదాన్విత
మయి యీసంఘటన వెలయునట్టిది, యగుటన్॥

వక్తృవాచ్యగతమగు నౌచిత్యమిట్లుండ (ఉండినను) విషయాశ్రియమగు వేఱొక యౌచిత్యముగూడ సంఘటనను నియమించును.

ప్రభామతి :— విషయాశ్రియము=(సందానితకాది) సంఘాత విశేష రూపమగు ప్రబంధము ఆశ్రియముగాఁగలది.

సేనాద్యాత్మకమగు సంఘాతనమునఁజేరియున్న పురుషుఁడు భీరువైనను తదౌచిత్యమున కనుగుణముగనే (సేనౌచిత కనుకూలుఁడగు శూరుఁడుగానే) ఉండునట్లు, సంఘాత విశేషాత్మకమగు సందానితకము మొదలగు వాని మధ్యమునందున్న కావ్య (రూప) వాక్యముగూడ తదౌచిత్యానుగుణముగనే యుండును.

వక్తృ-వాచ్యములకుఁగల వైచిత్ర్యమువలన తద్గతమగు నౌచిత్యము సంఘటనను నియమించునట్లు ముక్తకాది భేదములచే విషయమునకుఁగల వైచిత్ర్యమువలన, తద్గతమగు నౌచిత్యముకూడ సంఘటనను నియమించునని తాత్పర్యము.

మూలము:— అదెట్లనిన:— సంస్కృత-ప్రాకృతాపభ్రంశ నిబద్ధమగు 1 ముక్తకము, 2 సందానితక-విశేషకకా-(క)లాపక-కులకములు, 3 పర్యాయబంధము, 4 పరికథ, 5 ఖండకథా, 6 సకలకథలు, 7 సర్గబంధము, 8 అభినేయార్థము (నాటకాదులు), 9 ఆఖ్యాయికా, 10 కథలు, మొదలగు కావ్య ప్రభేదములు గలవు.

ఆయా కావ్య ప్రభేదముల నాశ్రియించుటచేఁగూడ సంఘటన విశేష (భేద) వంతమగుచుండును.

ప్రభామతి :— 1 ముక్తకము = తదితరపద్యసంబంధమునుండి విడువఁబడి నది, (తదితరములచే నాలింగితము కానిది) ముక్తకము. తదితర పద్యములతోడి సంబంధము లేకయే స్వతంత్రముగా నర్థమును బోధించుటకు సమర్థమగు నొకే శ్లోకము ముక్తకము. ఉదాహరణము :— అమరుకము. ఇందలి పద్యములలో ఒకదాని కింకొక దానితో నెట్టి సంబంధమునుగూడ నుండదు. స్వతంత్రముగా నర్థ పరిసమాప్తిగల్గి నిరాకాంక్షమై యున్నను ప్రబంధ మధ్యవర్తియగునది ముక్తకము కాదు.

ప్ర :— సంఘాతరూపముకాని ముక్తకము కావ్య ప్రభేదముగా నేల చెప్పఁబడినది?

ఉ :— "ఏకపద్యాత్మకమగు ముక్తకము-సంఘాతరూపము కాకున్నను 'రస స్యందివి' అగుటవలన దానికిఁగూడ సంఘటనా నియమమున స్వాతంత్ర్యము కలదు" అను నేతావన్మాత్రమును ప్రదర్శింపఁజేయుటకు-ముక్తకముగూడ కావ్య ప్రభేదముగాఁజెప్పఁబడినది.

సంస్కృతమునుండి ప్రాకృతమును, దానినుండి అపభ్రంశమును పుట్టు వించుటచే నిట్లు క్రమముగాఁజెప్పఁబడినది. సంస్కృతము = దేవవాక్కు. ప్రాకృతము = తద్భవ-తత్సమ-దేశ్య భేదములు గల భాషా విశేషము.

అపభ్రంశము = గొల్లలు మొదలగువారు మాట్లాడునది. కాఁగా, ముక్తకము సర్వభాషా నిబద్ధమనునది స్పష్టమగుచున్నది.

సందానితకమునకు యుగ్మకమను నింకొక పేరున్నది. ద్విపరిసమాప్త క్రియమగు పద్యద్వయము సందానితకము.

త్రిపరిసమాప్త క్రియమగు పద్యత్రయము విశేషకము. చతుష్పరి సమాప్త క్రియమగు పద్యచతుష్టయము కాలాపకము.

పంచాది పరిసమాప్త క్రియమగు పద్యపంచకాదికము కులకము. మీఁది భేదములు క్రియాపరిసమాప్తిని జేయునవియే కావున ద్వంద్వముచేఁజెప్పఁబడినవి.

ఖండకావ్య స్వరూపమగు పర్యాయబంధము-అవాంతర క్రియా పరిసమాప్తి యున్నను వసంతాద్యేకతమవస్తు వర్ణనాత్మకమైన ప్రబంధము.

ధర్మార్థకామ మోక్షములయందు దేనినైనను పురుషార్థము నుద్దేశించి-విచిత్ర ప్రకారకములగు ననేక వృత్తాంతములను వర్ణించునది పరికథ. ధర్మాదుల నుద్దేశించి, ప్రవృత్తమగు ప్రసిద్ధేతి వృత్తమునందొక భాగమును వర్ణించునది-ఖండకథ. (చిన్నకథగలది-ఖండకథ) ఇందు జీవితము నందాశ్చర్యకరమగు నేదో యొక

విషయము మాత్రమే వర్ణింపఁబడును) సాహిత్యదర్పణమున "ఖండకావ్యంభవేత్ కావ్యస్యైకదేశాను కారిచ" అని ఖండకావ్యము కూడ నిరూపింపఁబడినది.

సమస్త ఫలాంతమగు నితివృత్తమును వర్ణించునది-సకలకథ. ఇందు అనేక కథలుండును. ఇందలి యితివృత్తములన్నియు ఫలాంతములై యుండును. ఇవి ప్రాకృత భాషయందే ప్రసిద్ధములని సూచించుటకు "ఖండకథా-సకలకథలు" అని ద్వంద్వ సమాసముచే నిర్దేశింపఁబడినవి. పూర్వోక్తములగు కావ్యప్రభేదముల కీ భాషానియమములేదు. సంస్కృతమయము-శ్రవ్యము-మహాకావ్యరూపము - పురుషార్థ ఫలము-సమస్త వస్తు వర్ణనాప్రబంధము-అగునది సర్గబంధము-ఇది సంస్కృతము నందే యుండునని లోచనమునందు చెప్పఁబడినను-ప్రాకృతము, తెనుఁగు మొదలగు భాషలయందుఁగూడ కాన్పించుచున్నవి.

అభినేయార్థము (దృశ్యకావ్యము)=దశరూపకము, నాటికా, త్రోట, రాసక, ప్రకరణికాది అవాంతర ప్రపంచ (ఉపరూపకభేద) సహితమై అనేక భాషావ్యామిశ్రరూపమై యుండును.

దశరూపకములు :— నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవకారము. వీధి, అంకము. ఈహామృగము అనునవి.

ఉపరూపకములు :— 1 నాటిక. 2 త్రోటకము, 3 గోష్ఠి. 4 సట్టకము, 5 నాట్యరాసకము, 6 ప్రస్థానము, 7 ఉల్లాప్యము, 8 కావ్యము, 9 ప్రేక్షణము, 10 రాసకము, 11 సంలాపకము, 12 శ్రీగదితము. 13 శిల్పకము. 14 విలాసిక, 15 దుర్మల్లిక. 16 ప్రకరణిక, 17 హల్లీశము, 18 భాణిక అనునవి. వీని లక్షణము లను విపులముగాఁజూడఁగోరిన పాఠకులు ఆగ్నేయపురాణ-కావ్యాదర్శ-సాహిత్య దర్పణ-మందార మరందాదులను పరిశీలింపవలెను.

' ఉచ్ఛ్వాసాది విభాగముతోఁగూడుకొని వక్త్ర - అపర వక్త్రాదియుక్తమై (వక్త్ర-ప్రతివక్త్రప్రవృత్తమై) యుండునది. ఆఖ్యాయిక, ఉచ్ఛ్వాసాది విభాగము లేనిది కథ. మీఁదివి రెండును గద్యబంధరూపములగుటచేత ద్వంద్వముచే నిర్దేశింపఁబడినవి. "మొదలగు" అనుపదముచేత, చంపువు గ్రహింపఁబడుచున్నది.

అది, గద్య - పద్య - ఉభయమయమను నంశమును "గద్యపద్య మయీ చమ్పూః" అనుచోట దండి చెప్పియున్నాఁడు.

మఱియు "మొదలగు" అనుదానిచే కోష-సంఘాతములను గ్రహింపునది. మఱియు, ఉదాహరణ, చక్రవాళక, భోగావళీ, బిరుదావళీ, పంచాననాపములను మందారమరందము ననుసరించి యెఱుంగునది.

మీఁదఁదెలుపఁబడిన ముక్తకాదుల లక్షణములను ఆయా యలంకార శాస్త్ర గ్రంథములవలన గ్రహింపఁదగును. ఇట్లు కావ్య భేదరూపమగు విషయముచేతఁ గూడ సంఘటన భేదించునని తెలియునది.

మూలము :— (ఆ భేదములను క్రమముగాఁబ్రద ర్శించు చున్నాఁడు)

అందుముక్తకములందు, రసబంధము నందభినివేశముగల కవి, తదాశ్రయమగు నౌచిత్యము ననుసరించునది. అదికూడ (సంఘటనా నియామక ప్రదర్శన ప్రసంగమున నింతకుముందే) ప్రదర్శింపఁబడినది. కృతికర్తకు రసబంధాభి నివేశము లేనపుడు సంఘటన స్వేచ్ఛగా నుండవచ్చును. ప్రబంధములందు వలెనే ముక్తకములందుఁగూడ రసబంధాభి నివేశముగల కవులు కాన్పించు చున్నారుగదా!

ఇందుల కుదాహరణముగా శృంగార రసస్యందులగు అమ రుక కవి ముక్తకములు ప్రబంధాయ మానములై (అల్పశరీరము లైనను వ్యంగ్యార్థపై పుల్యమున ప్రబంధమువలె నాచరించు చున్నవై) యుండుట ప్రసిద్ధమేగదా!

ప్రభామతి :— ఏకపద్యరూపమగు ముక్తకమునందు విభావాది సంఘటన యెట్లుండును? విభావాది ప్రతీతిలేనిదే రసప్రతీతి యెట్లుకలుగునని యాశంకించి 'ప్రబంధములందువలెనే' అని చెప్పఁబడినది.

ముక్తక కృతికర్తయగు అమరుక కవి పద్యము :— (ఒక సహృదయుఁడు ఒక ముగ్ధ నడుగుచున్నాఁడు).

( ఆం ధ్రీ కృ త ము )

అలసమ్ముల్ వలితమ్ములై ప్రణయలీలార్ద్రమ్ములై ముగ్ధలై
చలితమ్ముల్-క్షణసమ్ముఖమ్ములయి, లజ్జాప్తిన్ పరాస్తమ్ములై
అలివేణీ! హృదయస్థితమ్ములగు భావాకూతముల్ జాలువా
ర్చు లసద్ వీక్షల నివ్విధే సుకృతినాలోకించెదో చెప్పవే!

మీఁది పద్యమునందు విభావాది. ప్రసారసంపదచేత పూర్వరాగ (అయోగ) శృంగారరసము ప్రద్యోతిత మగుచున్నదిగదా!

ఇతర పద్యార్థ సంబంధములేకయే, యీపద్య మొక్కటియే, రస వ్యంజక మగుచున్నది. ముక్తకమగు అమరుకము నందలి పద్యములన్నియు, నిట్టివేయగు రత్నశలాకలట్లున్నవి. పాఠకులు పరిశీలించునది.

మూలము :— సందానితకాదులందు మాత్రము వికట నిబంధన ముచితమగుటవలన మధ్యమసమాసయు, దీర్ఘసమాసయు నగు సంఘటనలే యుండఁదగినవి.

(పద్య) ప్రబంధాశ్రియములగు వానియందు (సందానితక, విశేషక, కాలాపక, కులకములయందు మాత్రము) యథోక్త మగు ప్రబంధౌచిత్యమే అనుసరింపఁదగియున్నది.

ప్రభామతి :— ప్రబంధాశ్రియములు కాని సందానితకాదులయందగు సమాసరహితమగు సంఘటనయందు మంథర రూపమగు నర్థప్రతీతి, క్రియాద్యాకాంక్షాసహితమై చాలాకాలమగు వఱకును అత్యంత దూరవర్తియగు క్రియాపదము ననుధావించుచు వాచ్యప్రతీతియందే విశ్రమించుటచేత రసతత్త్వానుభూతికి యోగ్యము గానేరని దగును. పద్యప్రబంధాశ్రియములగు సందానితకాదులందు పూర్వోక్తమగు ప్రబంధౌచిత్యమే యనుసరింపఁదగును. పక్షాంతరమునందు ముక్తకము గూడ ప్రబంధమధ్యవర్తి కావచ్చునని యంగీకరించు నెడల నందుఁగూడ నిట్టి యౌచిత్యమే సంఘటనా నియామకమగును.

మూలము :— పర్యాయబంధమునందు సమాస రహిత యగు సంఘటనయు మధ్యమసమాసయగు సంఘటనయు నాశ్రియింపఁదగినవి. ఒకానొకప్పుడు (రౌద్రాదివిషయమున) అర్థౌచిత్యము నాశ్రియించునపుడు దీర్ఘసమాసయగు సంఘటన ననుసరించినను, పరుషమును గ్రామ్యమును అగు (శబ్ద) వృత్తి పరిహరింపఁదగినది.

ప్రభామతి :— (పర్యాయబంధమున శృంగారము వ్యంగ్యమగునపుడు దీర్ఘసమాసయగు సంఘటన యుచితము గానేరదు, తదితరమగు రౌద్రాదికము వ్యంగ్యమగునపుడు దీర్ఘసమాసయగు సంఘటన యుండవచ్చును. కాని పరుష వృత్తియగు గౌడిరీతియు, గ్రామ్యవృత్తియగు పాంచాలీరీతియు, ననుచితములుగాఁ దాలి వని తాత్పర్యము)

పరికథ యందితివృత్తము మాత్రముపన్యసింపఁబడును. కావున నత్యంతమగు రసాభినివేశముండదు. కావున నందు మాత్రమీసంఘటన స్వేచ్ఛగానుండవచ్చును.

ప్రాకృత ప్రసిద్ధములగు ఖండకథా-సకల కథలయందు కులకాది నిబంధనము తఱచుగా నుండుటవలన దీర్ఘసమాసయగు సంఘటనయున్నను విరోధము లేకుండును. వృత్త్యౌచిత్యమును మాత్రము రసానుకూలమగు నట్లనుసరింప వలయును.

ప్రభామతి :— పరుష ఉపనాగరికా గ్రామ్యవృత్తి సంబంధియగు నౌచిత్య మును తత్తత్ప్రబంధాను కూలమగునట్లును, రసానుకూలమగునట్లును అనుసరింప వలయును.

మూలము :— సర్గబంధమునందో, రసతాత్పర్యమున్న యెడల రసానుకూలమగు నౌచిత్యమును 1 అది (రసతత్పరత) లేనపుడు స్వేచ్ఛయుననుసరింపఁదగును. 2 మార్గములు రెండింటను గూడ సర్గబంధ విధాతలు కనఁబడుటవలన నిట్లు చెప్పఁబడినది. (వానియందు) రసతాత్పర్యము యుక్తము.

ప్రభామతి :— 1 కథామాత్రవర్ణనము నెడఁదాత్పర్యమున్న యెడల వృత్తి నియమ మనావశ్యకమని భావము. కథామాత్రమునందే తాత్పర్యముగల సర్గ బంధము భట్టజయంతుకుని కాదంబరీ కథాసారము. రసమునందే తాత్పర్యముగలది. కాళిదాసుని రఘువంశము.

2మార్గములు రెండింటను అనుచో "సంస్కృతప్రాకృతములు రెండింటను" అని కొందఱు వ్యాఖ్యానము చేసిరి. (అందు) 'రస తాత్పర్యము మంచిది' అను తరువాతి వాక్యముతోడి సంబంధ ముపపన్నము కాకుండుటవలన వారి వ్యాఖ్యానము సంగతము కానేరదు.

మూలము :— అభినేయార్థమునందు మాత్రము సర్వథా రసబంధాభి నివేశమే కార్యము.

ఆఖ్యాయికా-కథలయందు-గద్యనిబంధనము బహుళమగుట వలనను, గద్యము, ఛందోబంధ భిన్నమగు ప్రస్థానమగుటవలనను,

ఇచటనేతత్సంఘటనా నియామకమగు హేతువు పూర్వము చెప్పఁబడకున్నను, (ఇప్పుడు) సంక్షేపముగాఁజెప్పుచున్నాము.

ప్రభామతి :— దృశ్యమగు నాటకాదికమునందు రసతాత్పర్యము లేనియెడల స్వరూపహాని సంభవించును, గావున నచట రసబంధమునందే యభినివేశముండఁదగును. ఛందోనియమ వర్జితమగు గద్య కావ్యమునకు రచనా నియామకమగు హేతువును పూర్వులు చెప్పియుండలేదు. (ప్రస్థానమనఁగా మార్గరూపమగు రీతి అని దీధితి.)

మూలము :—

కం॥ ఛందోనియమ విశేష ని
బంధన రహితమగు గద్యబంధమునందున్
సంధించును సంఘటనకు
ముందలి యౌచితియె నియమమును దానెందున్॥

వక్తృవాచ్యగతమగు నేయౌచిత్యము సంఘటనను నియమించునని వెనుకఁజెప్పఁబడినదో, అదియే (వక్తృవాచ్యగతమగు నౌచితియే) ఛందోనియమ వర్జితమగు గద్యమునందంతటనుగూడ (1) విషయము నపేక్షించి నియమహేతువగుచుండును.

అదియెట్లనిన :— గద్యకావ్యమునందుఁగూడ కవిగాని, కవినిబద్ధుఁడుగాని, రసభావరహితుఁడగు వక్తయై యుండునపుడు రచన స్వేచ్ఛగా నుండవచ్చును. వక్తయగునతఁడు (కవిగాని, కవినిబద్ధుఁడుగాని) రసభావసమన్వితుఁడగు నెడల (మాత్రము) (2) పూర్వోక్తమగు నౌచిత్యమే యనుసరింపఁదగినది.

ప్రభామతి :— (1) విషయమనఁగా నిచట గద్య ప్రబంధభేదములని యూహించునది. (గ్రహించునది.) గద్యమునఁ బ్రబంధాపేక్షమగు నౌచిత్యమే సంఘటనా నియామకమని భావము. (2) పూర్వోక్తమగు నియమహేతువు వక్తృవాచ్యగతమగు నౌచిత్యమే యని గ్రహించునది.

మూలము :— అందుఁగూడ విషయౌచిత్యమే యనుసరింపఁదగును.

ప్రభామతి :— ప్రబంధౌచిత్యమే ముఖ్యముగా నమనరింపవలయును.

మూలము :— (అయౌచితినే ప్రదర్శించుచున్నాఁడు.) వికటమగు బంధనమునందే ఛాయ (దీప్తి) ప్రకృష్యమాణ మగు చుండును. కావున వికటమగు బంధము (కూర్పు) నాశ్రయించిన గద్యమే ఛాయావంతమగును. కనుకనే (గద్యరూపమగు) ఆఖ్యాయిక యందు మాత్రము మధ్యమ సమాసయు, దీర్ఘసమాసయు, అగు సంఘటననే నిబంధింపవలయును. కథయందు మాత్రము వికటమగు బంధము ప్రచురముగా నుండవలసియున్నను, రసబంధ విషయమున వెనుకఁ దెలిపిన యౌచిత్యమే అనుసర్తవ్యము.

ప్రభామతి :— "ఆఖ్యాయికయందు దీప్తమగు గద్యముండవలెను. కథ యందు మాత్రము వికటబంధ ప్రాచుర్యమున్నను, రసౌచిత్యానుసరణమే శ్రేష్ఠము" అనిభావము.

మూలము :— అన :— రసౌచిత్యమనుసరింపఁ దగునను చివరి యభిప్రాయమును కారికాకారుఁడు దృఢీకరించుచున్నాఁడు.

గీ॥ అంతటను రసబంధోక్తమగుచు వెలయు
నౌచితి సమాశ్రయించి తానలరు రచన;
ఔచితియొ-విషయాపేక్షమగుచు తాను
వించుక విభేదవంతమై యెనఁగుచుండు॥

అథవా పద్య (ప్ర)బంధమునందువలెనే గద్య (ప్ర)బంధము నందుఁగూడ సర్వత్ర రసబంధోక్తమగు నౌచిత్యము నాశ్రయించు నచో రచన, ప్రకాశించును. కాని రసౌచిత్యము విషయాపేక్షమై యించుక విశేషవంతమగును, కాని సర్వాకారముగ (విశేష వంతము)కాదు. (అధికముగా భేదమునొందదు.)

అదియెట్లనిన :— (1) గద్యప్రబంధము నందైనను ఆఖ్యాయిక యందుఁగూడ విప్రలంభ శృంగారమును, కరుణమును, ప్రతీయమానము లగునపుడు అతిదీర్ఘసమాసయగు రచన శోభిం పదు. నాటకాదులందుఁగూడ అసమాసయగు సంఘటనయే (సర్వత్ర) శోభించును.

రౌద్రవీరాదిరసములను వర్ణించునపుడు విషయాపేక్ష (ప్రబంధాపేక్ష)మగు నౌచిత్యము మాత్రము ప్రమాణమునుబట్టి ఒకచో అపకర్షింపఁబడుటయు, నొకచోట ప్రకర్షింపఁబడుటయుఁ గలదు.

ప్రభామతి :— (1) ప్రబంధౌచిత్యమే ముఖ్యమగునెడల అఖ్యాయిక యందుఁగూడ దీర్ఘసమాసయగు సంఘటనయే యుండినగును. కాని యట్లుండుట లేదు. కావున రసౌచిత్యమే ముఖ్యమును, ప్రబంధౌచిత్యాదికము తదనుయాయియు నగునని యెఱుంగునది. అట్లని విషయౌచిత్యము సర్వథా త్యజింపఁబడునది కానేరదు. పూర్వోక్తమగు రసౌచిత్యము విషయౌచిత్యమును సహకారిగా నపేక్షించి, అవాంతరవైచిత్ర్యము నింపుక సంపాదించును. లోకమునందెట్లు చెప్పఁబడుచున్నది. ఆలోకమునందు (వృత్తియందు) అథవా పద్యవద్ గద్యబంధేఽపి రసబన్ధోక్త మౌచిత్యం, సర్వత్ర. సంశ్రితా రచనా భవేత్" అనుచో నున్న "వా" శబ్దము వికల్పార్థకము [లేక, కాని, అనునర్థముగలది]కాదు. అది రసౌచిత్యమనుసరింపఁ దగునను ఏతత్పక్షమునకే. స్థితిద్యోతకము (సమ్మతిని ప్రదర్శింపఁజేయునది) ఇందలి 'వా' శబ్దము పక్షాంతర బోధకము కాదనుటకు గ్రంథాంతరము నందున్న క్రింది శ్లోకము ప్రష్టంభకమగుచున్నది.

శ్లో॥ స్త్రియోనరపతిర్వహ్నిర్విషం యుక్త్యానిషేవితమ్॥

స్వార్థాయ యదివా దుఃఖ సమ్భారాయైవ కేవలమ్॥ "స్త్రీలను, రాజును, అగ్నిని, విషమును, యుక్తిచే నుపయోగించు (సేవించు) నెడల స్వార్థము సిద్ధించును. అట్లుపయోగింపనియెడల కేవలమును దుఃఖమే సంభవించును" అనునది దీనియర్థము. మీదిశ్లోకము నందలి "వా" శబ్దము-పక్షాంతరద్యోతకము కానేరదు గదా! అట్లే-అథవా-అనునదికూడ-లేక, కాని, అని పక్షాంతరమును దెలుపునది కాదనియు, వాక్యాలంకారమే యగుననియు తెలియునది.

(బాలప్రియ.)

మూలము :— అవ :— విషయౌచిత్యము నింపుక యనుసరింపుటచేత సంఘటన యెట్లగునదియుఁ జెప్పుచున్నాఁడు.

అదెట్లనిన :— "అఖ్యాయికయందు స్వవిషయమగు కరుణాదికము వ్యంగ్యమయిననుగూడ సంఘటన— అత్యంతమును సమాసరహితమే యగుటలేదు. నాటకాదులందు స్వవిషయమగు రౌద్రాదికము-వ్యంగ్యమయినను గూడ అతిదీర్ఘ సమాసయుక్తమగు సంఘటన శోభింపనేరదు" అని సంఘటనా సరణిని గ్రహించునది.

కం॥ మదికి చమత్కృతిఁ గూర్చెడు
నెది, యది కావ్యార్థమనుచు నెఱిఁగించెడు న
స్మదుపజ్ఞము మఱునఁదగదు
మధుర కళాసార నిహితమతులగు విబుధుల్॥

ప్రభామతి :— ప్రబంధౌచిత్య సహితమగు రసౌచిత్యమే ముఖ్యముగా సంఘటనము నియమించునని భావము.

అవ :— సంఘటనయందు-అసంలక్ష్య నామాంతరమగు రసాది ధ్వని-దీపించునను నంశమిట్లు నిర్ణయింపఁబడినని. రసాదిధ్వని - ప్రబంధమునందు దీపించునను నంశము నిర్వివాద సిద్ధము. కావున నిచట నీవిషయమున తెలుపవలసిన దేదియును లేదు. (అయినను) కవులకును సహృదయులకును వ్యుత్పత్తిని సంధించుటకై, రసవ్యంజనము నొసర్చు విషయమున ప్రబంధమునకుఁగల ఇతి కర్తవ్యత (ప్రకారము)ను నిరూపింపవలయునను నాశయమున (నిట్లు) చెప్పుచున్నాఁడు. (లోచనము.)

మూలము :— అవ :- ప్రబంధము, రసవ్యఁజకమగు ప్రకారమును నిరూపించుచున్నాఁడు

ప్రబంధమున కాత్మయగు అసంలక్ష్యక్రమ వ్యంగ్య (రసాది) ధ్వని-రామాయణ మహాభారతాదులందు ప్రకాశమానమై ప్రసిద్ధమయియే యున్నది. ఆరసధ్వని (1) నెట్లు ప్రకాశింపఁ జేయవలసినదియు ఇప్పుడు ప్రతిపాదించుచున్నాము,

అవ :— (1) కథాపరీక్ష, (2) దానియందధికావాపము, (3) ఫల పర్యంతతానయనము, (4) రసజాగరణము, (5) తదుచిత విభావాది వర్ణనమునందగు అలంకారౌచిత్యము, అనునవి-ప్రబంధము, రసవ్యంజకమగుట కుపయోగించు ప్రకారములు" అని క్రమముగాఁజెప్పుచున్నాఁడు,

సీ॥ ప్రథమంబున విభావ భావానుభావ సం
చార్యౌచితీ మనోజ్ఞమగు దాని
వృత్తంబునైన, కల్పితమునైన, కథా శ
రీరంబు నొకటి పరిగ్రహింప

వలయు; నందితిహాస వశమునఁ గలిగి ర
సానుగుణంబుగానట్టి కథను
త్యజియించి యైన నంతరమందభీష్ట ర
సోచితమ్మైన కథోన్నయనము

గీ॥ కల్పితంబు నైన నొనర్పఁగడఁగ వలయు
సంధి సంధ్యంగ ఘటన. రసస్ఫురణము
కొఱకెగాని, కేవలమును భరతశాస్త్ర
విధి ననుసరించు కొఱకుఁ గావింపఁదగదు॥

గీ॥ రస సముద్దీపనంబు తత్ప్రశమనము య
థావసరముగ నడుమ నేయంగవలయు
సంతతముగ ఆరబ్ధవిశ్రాంతి గనిన
అంగిరసమను సంధింపనగును సుకవి॥

మంజరీ ద్విపద : శక్తియున్ననుగూడ సదలంకృతులను
అనురూపమగు చందమునఁ గూర్పవలయు
సత్ప్రబంధమ్ము రసాదికమ్మునకు
వ్యంజకమ్మగుట కీయవి నిబంధనలు.

ప్రభామతి :— ప్రబంధము రసవ్యంజకమగుటకు ఇవి కారణములు. 1) రసోచితమగు కథను నిర్మించుట. 2) అందుపయోగింపని యంశమును విడుచుట లేక ఉపయోగించు నంశమును కల్పించుట, 3) రసోపయుక్తము అగునట్లు సంధి సంధ్యంగములను సమకూర్చుట, 4) అవసరమునుబట్టి రసోద్దీపన రసప్రశమనములను గావించుట, 5) ప్రబంధము ముగియు వరకు ప్రధాన (అంగి) రసమును విచ్ఛిన్నము గాకుండ అనుసంధించుట, 6) అలంకారములను రసోపయుక్తములగు విధమునఁ గూర్చుట.

మూలము :— ప్రబంధముగూడ రసాదులకు వ్యంజకమని చెప్పఁబడినది. అది వ్యంజకమగుటకు నిబంధనము మొదట విభావానుభావసంచార్యౌచిత్యముచే మందరమగు కథా శరీరమును విధించుట.

ప్రతిపాదింపఁగోరిన రసభావాదికము నపేక్షించి ఉచితమగునవి విభావము, భావము, అనుభావము, సంచారిభావము, అను

నవిగలవో, వాని యౌచిత్యముచే సుందరమగు కథాశరీరమును విధించుట-ప్రబంధము. రసవ్యంజకమగుటకొరకు నిబంధనము.

అందు విభావౌచిత్యము (పూర్వోక్త భరతశాస్త్రమునందును లోకమునందును) ప్రసిద్ధమేగదా, భావౌచిత్యము మాత్రము, ప్రకృత్యౌచిత్యమువలన నేర్పడును. ప్రకృతి, ఉత్తమ, మధ్యమ, అధమ భావములచేతను, దివ్య మానుషాది భావములచేతను విభేదించి యున్నది. దానిని క్రమముగా ననుసరించి యుపనిబంధింపఁబడినదియు, సంకీర్ణముకానిదియు, స్థాయియు,నగు భావము (స్థాయి భావము) ఔచిత్యవంతమగును.

ప్రభామతి :— రత్యాదికముదేనిచే విభావింపఁబడునో అది విభావనము. ఆ-విభావనము ఆలంబన, ఉద్దీపన భేదములచేత ద్వివిధమగుచున్నది. శృంగారము ప్రస్తుతమగునపుడు నాయికా నాయకులు ఆలంబన విభావము. ఋతు, మాల్యాలంకార, ఉపవనగమనాదులు ఉద్దీపన విభావనము. రత్యాదికము స్థాయిభావము. రత్యాది స్థాయిభావకార్య విశేషమును భావ సంసూచనాత్మకమును అగు వికారము అనుభావము.లీలాదులను అనుభావములుగ గ్రహించునది. విశేషముగ అభిముఖములు (ఒకదానికొకటి యెదురు) అయి చరించునవి=వ్యభిచారులు లేక సంచారులు అని చెప్పఁబడుచున్నవి. వ్రీడాహర్షాదులు సంచారులని చెప్పఁబడును. ఉచిత విభావాదివంతమగు కథా శరీర విధానము రసవ్యంజకమని భావము. శృంగారవర్ణనేచ్ఛగల కవి-ఇట్టి కథ నాశ్రయింపవలయును.

"దేవాది విషయమగు రతియు, అపరిపుష్టమగు స్థాయియు, ప్రధానముగా వ్యంజితమగు వ్యభిచారియు, భావమని చెప్పఁబడును. కావున ఇచట భావౌచిత్యము అనుదానికి అపరిపుష్టమగు స్థాయిభావౌచిత్యము అనునర్థము తెలియుంగునది"

(దీధితి 209 పే.)

మూలము :— అట్లుగాక కేవలమును మనుష్యాశ్రయములుగా దివ్యోత్సాహాదులును, కేవల దివ్యాశ్రయములుగా మనుష్యోత్సాహాదులును ఉపనిబంధింపఁబడినయెడల అనుచితములగును.

ఆదెట్లనిన :— కేవల మనుష్యులగు రాజాదులను వర్ణించునపుడు సప్తార్ణవలంఘనాది (ఏడు సముద్రములు దాటుట మొదలగు) లక్షణములగు వ్యాపారములు ఉపనిబంధింపఁబడునెడల అవి

శబ్దమును ఆశ్రయించి యుండునది అర్థము. ఆ యర్థమే గాక మఱియొకటి స్ఫురించిన దానిని "ధ్వని"యనియు, "వ్యంగ్య" మనియు, అందురు. "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర" అను మనుచరిత్ర పద్యము చదివినప్పుడు పద్యము వలు గల అర్థమొకటి; స్ఫురించెడి యర్థము వేరొకటి. దీని ధ్వని యందురు. ఉత్తమ కావ్యములు ధ్వనిద్యోతకములుగా నుండును.

ధ్వని యనునది వేరేలేదనియు, కలయర్థమంతయు శబ్దమందే యున్నదనియు పూర్వపక్షము. తత్ఖండనము, సిద్ధాంతము, ధ్వని నిరూపణము, దానిని సాధించురీతులు, మొదలైన విషయము లీ గ్రంథములో వివరింపబడి యున్నవి.

సంస్కృతభాషాపరిచయము గలవారికి ఈ గ్రంథము బోధ పడునట్లు ఇతరులకు బోధపడదేమో యని తోచుచున్నది. తెలుగు పద్యములు సంస్కృతపద భూయిష్ఠములుగా నుండుటయు, ఆంధ్ర వివరణమును అట్లే యుండుటయు దానికి కారణములు.

ఆంధ్ర కృతికర్తలైన లక్ష్మీనారాయణశాస్త్రిగారి గురువులు కళాప్రపూర్ణ తాతా సుబ్బరాయశాస్త్రిగారు వ్రాసిన యభిప్రాయములో గ్రంథప్రాశస్త్యమును జెప్పుచు "బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు మొదలైన మహా విద్వాంసులును సంతోష పూర్వకముగా యిచ్చిన యభిప్రాయములు సైతము ఈ గ్రంథముయొక్క ఘనతను సాకల్యముగా చెప్పలేకపోయినవేమో యని తలచుచున్నాను"అని వ్రాసిరి. ఇంక ఇతరుల విషయము చెప్పనక్కరలేదు.

శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథముయొక్క ద్వితీయభాగమును త్వరలో ప్రచురించి పండితుల కృతజ్ఞతకు పాత్రులగుదురని నమ్ముచున్నాను.

—"భారతి" నవంబరు 1944.

నవిగలవో, వాని యౌచిత్యముచే సుందరమగు కథాశరీరమును విధించుట-ప్రబంధము. రసవ్యంజకమగుటకొక నిబంధనము.

అందు విభావౌచిత్యము (పూర్వోక్త భరతశాస్త్రమునందును లోకమునందును) ప్రసిద్ధమేగదా. భావౌచిత్యము మాత్రము, ప్రకృత్యౌచిత్యమువలన నేర్పడును. ప్రకృతి, ఉత్తమ, మధ్యమ, అధమ భావములచేతను, దివ్య మానుషాది భావములచేతను విభేదించి యున్నది. దానిని క్రమముగా ననుసరించి యుపనిబంధింపఁబడినదియు, సంకీర్ణముకానిదియు, స్థాయియు,నగు భావము (స్థాయి భావము) ఔచిత్యవంతమగును.

ప్రభామతి :— రత్యాదికముదేనిచే విభావింపఁబడునో అది విభావనము. ఆ-విభావనము ఆలంబన, ఉద్దీపన భేదములచేత ద్వివిధమగుచున్నది. శృంగారము ప్రస్తుతమగునపుడు నాయికా నాయకులు ఆలంబన విభావము. ఋతు, మాల్యాలంకార, ఉపవనగమనాదులు ఉద్దీపన విభావనము. రత్యాదికము స్థాయిభావము, రత్యాది స్థాయిభావకార్య విశేషమును భావ సంసూచనాత్మకమును అగు వికారము అనుభావము,లీలాదులను అనుభావములుగ గ్రహించునది, విశేషముగ అభిముఖములు (ఒకదానికొకటి యెదురు) అయి చరించునవి=వ్యభిచారులు లేక సంచారులు అని చెప్పఁబడుచున్నవి. వ్రీడాహర్షాదులు సంచారులని చెప్పఁబడును. ఉచిత విభావాదివంతమగు కథా శరీర విధానము రసవ్యంజకమని భావము, శృంగారవర్ణనేచ్ఛగల కవి-ఇట్టి కథ నాశ్రయింపవలయును.

"దేవాది విషయమగు రతియు, అపరిపుష్టమగు స్థాయియు, ప్రధానముగా వ్యంజితమగు వ్యభిచారియు, భావమని చెప్పఁబడును. కావున ఇచట భావౌచిత్యము అనుదానికి అపరిపుష్టమగు స్థాయిభావౌచిత్యము అనునర్థము నెఱుంగునది"
(దీధితి 209 పే.)

మూలము :— అట్లుగాక కేవలమును మనుష్యాశ్రయములుగా దివ్యోత్సాహాదులును, కేవల దివ్యాశ్రయములుగా మనుష్యోత్సాహాదులును ఉపనిబంధింపఁబడినయెడల అనుచితములగును.

అదెట్లనిన :— కేవల మనుష్యులగు రాజాదులను వర్ణించునపుడు సప్తార్ణవలంఘనాది (ఏడు సముద్రములు దాటుట మొదలగు) లక్షణములగు వ్యాపారములు ఉపనిబంధింపఁబడునెడల అవి

సౌష్ఠవముగానుండినను, తప్పక నీరసములుగానే తోఁచును. దీనికి (నీరసములుగా తోఁచుటకు) హేతు వనౌచిత్యమేగదా.

ప్రభామతి :— సప్తార్ణవలంఘనాది లక్షణములనగా తద్విషయకమగు నుత్సాహములని యర్థము. "సౌష్ఠవముగానుండినను" అనుదానికి "వర్ణన మహిమ చేత సుందరములై యున్నను'' అనునర్థము నెఱుంగునది.

మూలము :— పూర్వపక్షి :- అయ్యా, సాతవాహనుఁడు మొదలగువారు నాగలోకమునకుఁబోవుట మొదలగు వృత్తాంతములను వినుచున్నాము. కావున సకలోర్వీభరణక్షములగు క్షమాభుజులకు అలోక సామాన్యమగు ప్రభావాతిశయము వర్ణించుట అనౌచిత్య మెట్లగును? అనుట సరియైనదికాదు.

ప్రభామతి :— గోదావరీ తీరస్థమును కుంతలజన పదావయవమును నగు ప్రతిష్ఠానపురమునకు ప్రభువగు శాతవాహనుఁడు ఇతఁడే యగునా? లేక యింకొకఁడా? అనువిషయమును నిర్ణయింప శక్యముగాకున్నది. ఇతఁడే శకప్రవర్తకుఁడును "గాథాసప్తశతీ కర్తయగు గుణాఢ్యునిచే సేవింపఁబడినవాఁడునునగు శాలివాహనుఁడని కొందఱనుచున్నారు.

మూలము :— సిద్ధాంతి : మహారాజ ప్రభావాతిశయ వర్ణనము ఉచితముగాదని మేము చెప్పము, కాని కేవలమానుషాశ్రియమగు కల్పిత కథయందు దివ్యౌచిత్యమును నియోజింపఁగూడదనియే మేమందుము. దివ్యమానుషమగు కథయందు మాత్రము ఉభయౌచిత్యమును యోజించుట విరుద్ధమైనదియేకాదు. పాండవాదికథ దీని కుదాహరణము, సాతవాహనాదుల చరిత్రమెంతవఱకు ప్రాచీన చరిత్ర ప్రసిద్ధమై యుండునో, అంతవఱకు మాత్రమే వర్ణించుట కనుగుణముగా నుండును, కాని వ్యతిరిక్తమగు (అత్యధికమును అప్రసిద్ధమును నగు) ప్రభావాతిశయమును వారి విషయముననైనను వర్ణించుట యనుచితమే యగును. కావున నిందలి పరమార్థమిది.

కం॥ సత్యము వచియింతు మనౌ
చిత్యమె రసభంగ మొదవఁజేయు; ప్రసిద్ధౌ

చిత్యనిబంధము మాత్రము
నత్యంతము నుపనిషత్తైయగు రసమునకున్॥

ప్రభామతి :— వినేయులు (బోధింపఁదగినవారు) అగు సామాజికు లీకథ యసంభవమని భావింపకుండునట్లు కథావర్ణనము నొనర్పవలయును. అట్లు గానిచో కేవల మానుష విషయముగా ప్రతిపాదింపఁబడిన సప్తార్ణవలంఘనాదికము అసంభవ మగుటచే ననృత మని తోఁచుచు, తదుపదిష్టమగు చతుర్వర్గోపాయముకూడ అలీకము (అసత్యమే) అను వభిప్రాయమును వారి బుద్ధియందుఁదోపింపఁజేయుచుండును. శ్రీరామాదుల విషయమునందు మాత్రము అలౌకికమగు చరిత్రముగూడ పూర్వ ప్రసిద్ధపరంపరోపచిత విశ్వాసోపారూఢమగుటచేత ననత్యముగాఁ దోచఁనది కానే రదు. వారి విషయమునందైననుగూడ అలౌకికమును అశ్రుత పూర్వమును నగు వేఱొక ప్రభావము వర్ణింపఁబడిన యెడల నది యసత్యముగానే తోఁచును. కావున నసంభవముగాఁదోఁచు చరిత్రవర్ణనము యుక్తముగాదని గ్రహించునది. (లోచనము)

"సత్యము" అను పద్యమునందలి భావము ఇది. అనౌచిత్యమే రసభంగ హేతువు. ప్రసిద్ధౌచిత్య నిబంధనము బ్రహ్మమునకు ఉపనిషత్తువలె రసమునకు ప్రకాశనోపాయమగును.

మూలము :— కావుననే "నాటకమునందు ప్రబంధ ప్రఖ్యాతమగు కథను, ప్రసిద్ధుఁడగు నుదాత్తనాయకుని, ప్రతిపాదించుట యవశ్యకర్తవ్యము" అని భరత శాస్త్రమునందు ఉపన్యసింపఁ బడినది. అట్లయినయెడల కర్తవ్యమగు నాయకౌచిత్యానౌచిత్య విషయమున కవి వ్యామోహము నొందఁడు. ఎవఁడు ఉత్పాద్యవస్తుక మగు (2) నాటకాదికమును (అనగా నాటకముసుగాక నాటకము ఆదిగా గల ప్రకరణాది దృశ్యకావ్యమును) రచించునో వానికి అప్రసిద్ధమును అనుచితమును నగు నాయక స్వభావ వర్ణనమున మిక్కిలి ప్రమాదము గల్గెడిని.

అవ :— సంభోగ శృంగారమును కవి యెట్లు ఉపనిబంధింప వలయును? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

పూర్వ:—(3) అయ్యా! ఉత్సాహాది భావముల వర్ణించునపుడు దివ్యమానుషాద్యౌచిత్యపరీక్ష కావింపఁబడినఁ గావింపఁబడుఁగాక! రత్యాదులయందా పరీక్షచే నగు ప్రయోజనము ఏముండును? భారత

వర్షోచితమగు వ్యవహారముచేతనే దేవతావిషయమునఁగూడ రతి, వర్ణింపఁదగు ననుట-మర్యాదయేగదా!

ప్రభామతి :— ప్రసిద్ధులగు శ్రీరామాదులకెట్టి మాహాత్మ్యమును వర్ణించినను అనుచితమనితోఁపనేరదని భావము. ప్రమాదము (ఏమరుట) = అనవధానత.

నాటకము ఉత్పాద్యవస్తుకము (కల్పిత కధగలది) కాదు. కావున నాటక పదముచే నాటకమును గ్రహింపఁగూడదు. "నాటకాదికము" అనుచోట నాటక సదృశములగు ప్రకరణాదులను (రూపకములను) స్వీకరింపఁదగును. నాటకము ఆదిగాగలవి అనువ్యుత్పత్తి ననుసరించి ప్రకరణమును గ్రహింపవలయుననియు, ఆప్రకరణము కల్పితవస్తుకములును తదితరములును నగు అభినేతవ్యకావ్యముల కుపలక్షణము అనియు, నొకఁడనుచున్నాఁడు. లేక "నాటికాదికమును" అను పాఠమును స్వీకరింపనగును "ప్రకరణ నాటక యోగాదుత్పాద్యం వస్తు నాయకో నృపతిః" అనునది భరతమునిప్రోక్తమగు నాటికా లక్షణము. కావున నాటిక-కల్పితేతి వ్యుత్పత్తికమగుటచేత తద్గ్రహణము యుక్తమే యగునని లోచనము చెప్పుచున్నది. దీని వలనఁదేలిన ఫలితాంశమేమనిన: ఇచట నున్న "నాటకాదికమును" అను పదమునకు నాటకము మొదలగు వానిని అని యర్థముచేసికొనరాదు. కల్పిత కథా విషయముగల "ప్రకరణ నాటికాదికమును" అనియే యర్థము చేసికొనవలయును. అని. ఇందుడిమాదులను గ్రహించునది. 3 ఉత్సాహాదులయందు దేవతలకును మనుష్యులకును భేదమున్నను ప్రేమము సర్వత్ర ఒకేరీతిగా నుండుటవలన "రతి" యందు అట్టి భేదముండదని పూర్వపక్షాశయము.

మూలము :— (మీఁది పూర్వపక్షాశయమును ఖండించుచున్నాఁడు.)

ఇది యుక్తముకాదు. అందౌచిత్యము నతిక్రమించుట మిగుల దుష్టము. అదెట్లనిన : అధమ ప్రకృత్యౌచిత్యము ననుసరించి ఉత్తమ ప్రకృతి శృంగారమును వర్ణించునపుడు ఉపహాస్యత యేల కలుగకుండును? భారతవర్షమునందుఁగూడ శృంగార విషయమగు నౌచిత్యము వివిధమై యున్నది.

పూర్వ :— అట్లైన దీనికంటెవేఱగు దివ్యౌచిత్యమిచట నుపకారక మెట్లగును?

సిద్ధా-మేము శృంగార విషయమగు దివ్యౌచిత్యమేదియు దీనికంటె వేఱని చెప్పువారలముకాము. కాని భారతవర్షమునం

దుత్తమ నాయకులగు రాజాదుల విషయమున నెట్టి శృంగారోప నిబంధము గావింపఁబడునో, యట్టి శృంగారోపనిబంధనము దివ్యాశ్రియమునను శోభించును. రాజాదుల విషయమున (అ) (1) ప్రసిద్ధగ్రామ్య శృంగారోపనిబంధనము నాటకాదులందు ప్రసిద్ధము కాదుగదా!

ప్రభామతి :— (1) నీచజాత్యుచితమగు శృంగారవర్ణనము.

మూలము :— అట్లే యథముగనే దేవతలయందుఁ గూడ గ్రామ్యశృంగారోపనిబంధనము పరిహరింపఁదగినవి.

నాటకాదికము (1) అభినేయమగుటవలనను అభినేయము సంభోగ శృంగారమునకు విషయము కాకుండుటవలనను వాని యందు (మాత్రము) తత్పరిహారము యుక్తమేయగును అనరాదు.

ఏవం విషయమగు అభినేయ మసహ్యమైన యెడల ఏ తద్విషయమగు (శ్రవ్య) కావ్యము మాత్రము అసహ్యము కాకుండునా? కావున అభినయింపఁదగిన నాటకాదికము నందును, అభినయింపరాని (శ్రవ్య) కావ్యమునందునుగూడ నుత్తమ ప్రకృతి గల రాజాదులకు ఉత్తమ ప్రకృతిగల నాయికలతో గ్రామ్య సంభోగమును వర్ణించుట-తమతల్లిదండ్రుల సంభోగమును వర్ణించుట వలెనే మిగుల నసహ్యమైనది. ఉత్తమ దేవతా విషయమగు గ్రామ్యసంభోగ శృంగార వర్ణనముగూడ నట్టిదియే యగును. అదియును గాక సంభోగశృంగారమున కొక్క సురత ప్రకారమే గాక పరస్పర ప్రేమ దర్శనము మున్నగునవి ఇంకెన్నియో ప్రకృష్టములగు భేదములు గలవు. ఉత్తమ ప్రకృతి విషయమున వాని నేల వర్ణింపఁగూడదు. కాఁగా ఉత్సాహమునందువలెనే రతి యందుఁగూడ ప్రకృత్యౌచిత్య మనుసరింపవలసి యున్నది. అట్లే విస్మయాదులయందుగూడ ప్రకృత్యౌచిత్యము అనుసరింపఁదగును.

ప్రభామతి :— 1) అభినేయము : నాట్యరీతి ననుసరించి యభినయింపఁ దగినది. అట్లయినచో సంభోగ శృంగారము కవియెట్లు నిబంధింప వలయునని

యాశంకించి-చెప్పుచున్నాఁడు. అభినయింపఁదగిన దృశ్యకావ్యములయందు వలెనే యభినయింపరాని శ్రవ్యకావ్యములయందుఁగూడ గ్రామ్య శృంగార ప్రదర్శనము అసహ్యతను కలిగించును. అవి రెండును త్యాజ్యమే అనియు, సంభోగ శృంగారమున నాయికా నాయకుల ప్రేమదర్శనములు మధురాభాసములు మున్నగునవియే వర్ణనీయములనియు, భావము.

మూలము :— ఏవంవిధ విషయమున మహాకవులకుఁ గూడ లక్ష్యమునం దసమీక్ష్యకారిత్వము కనఁబడునెడల అది దోషమే యగును. కాని (అదోషము) వారి శక్తిచే తిరస్కృతమగుటవలన (మన) కాన్పింపకుండునని యింతకుముందే చెప్పియున్నాము. అనుభావౌచిత్యము మాత్రము భరతాదులయందుఁ బ్రసిద్ధమే. ఇది యొక్కటిమాత్రము చెప్పుదుము. భరతశాస్త్రలక్షణాదికము ననువర్తించువాఁడును, మహాకవి ప్రబంధ పర్యాలోచనమొనర్చువాఁడును, స్వకీయమగు ప్రతిభననుసరించువాఁడును నగుకవి, యవహితచేతస్కుఁడై విభావాద్యౌచిత్యభంగమును పరిత్యజించెడి విషయమున మహాప్రయత్నము నొనర్పవలయును (2).

ప్రభామతి :— (1) భరతమునికూడ తనశాస్త్రమందు అచ్చటచ్చట విభావానుభావాదులయెడ ప్రకృత్యౌచిత్యమునే మిగుల ప్రమాణీకరించి యున్నాఁడు. భరతనాట్యశాస్త్రమునందలి భావాధ్యాయమున నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ "స్త్రీనీచ ప్రకృతిష్వేవ శోకోవ్యసన సంభవః
ధైర్యేణో (స్థైర్యేణో)త్తమ మధ్యానాం నీచానాం
రుదితేన (సంభ్రమేణ) చ॥"

ఇట్లనుటచే స్త్రీలయందును, నీచప్రకృతులయందును వ్యసనము వలనఁ గలుగు శోకమును వర్ణింపఁదగుననియును ఉత్తములకును మధ్యములకును గలుగు శోకమును ధీరముగను, నీచులకుఁగల్గు శోకమును రోదనయుక్తముగను వర్ణింపవలయుననియును తెలియుచున్నది.

(1) లక్షణ పరిజ్ఞానము, (2) లక్ష్యపరిశీలనము, (3) అదృష్ట దేవతా ప్రసాదోదితమగు స్వప్రతిభా శాలిత్వము కలవాఁడగు కవి-విభావాద్యౌచిత్య పరిగ్రహమున నత్యధికమగు పూనిక వహింపవలయునని ఉపదేశించుచున్నాఁడు. (మీఁది మహోపదేశమును నవ్యకవులాదరింతురుగాక!)

మూలము :— "విభావాను భావసంచార్యౌచితీ మనోజ్ఞమగు దాని వృత్తంబునైన కల్పితమునైన కథాశరీరము నొకదానిని పరిగ్రహించుట-వ్యంజక నిబంధనములలో నొకటి" అని చెప్పుట వలన నేర్పడు నభిప్రాయ మిది. ఇతిహాసాదులయందు రసవంతము లగు కథలనేకములున్నను. విభావాద్యౌచిత్యవంతమగు కథా శరీరమునేగాని తదితరమును గ్రహింపఁగూడదు.

ప్రభామతి :— ఇతిహాసాదులయందున్న కొన్నికథలను మాత్రులు-రసవంతములని తలంచెదరు. ఉచిత విభావాదులు లేనికథలు-రసవంతములు కానేరవు. కావున విభావాది ఔచిత్యవంతమగు కథాశరీరమునే కవి గ్రహించునది. కల్పించిన కృతియందు మాత్రము ప్రసిద్ధేతి వృత్తమునందుకంటెను, ఒకటిమగు ప్రయత్న మెండఁదగును. ఏల యనినః "మూలకథయందున్న యంశమునే నేనును విశదీకరించితిని" అని ప్రసిద్ధేతి వృత్తమునందు ప్రత్యుత్తరమునైనను చెప్పుకోవచ్చును. గాని, కల్పితమునందిట్లు ప్రత్యుత్తరము చెప్పుటకు వీలుకలుగదు. కావుననే చెప్పుచున్నాఁడు.

మూలము :— వృత్తమగు కథా శరీరమునందుకంటె కల్పితమగు దానియందు కవి విశేషముగ ప్రయత్నము గలిగి యుండవలయును. అందేకాగ్రత లేకపోవుటవలన ప్రమాదము నొందు కవికి అవ్యుత్పత్తి సంభవించుటకు మిగుల నవకాశమున్నది. ఏతద్విషయకమగు పరికరపద్యము.

ఆ॥ కల్పితేతివృత్తకమగు కథా శరీ
రంబునెల్ల రసమయంబగుచు వె
లుంగు రీతిఁ గవివరుండవధాన యు
క్తుఁడయి యుచితసరణిఁగూర్పవలయు॥

కావ్యమును రసమయమగునట్లు కావించుట కభ్యుపాయము విభావాద్యౌచిత్యమును లెస్సగా ననుసరించుట. అది యింతకుముందే ప్రదర్శింపఁబడినది.

కం॥ సముచిత సిద్ధ రస ప్ర
ఖ్యము లారామాయణాదులై తగుకినితిహా

సము లందెల్ల రస విరో
ధమగు సరణి స్వేచ్ఛఁబూనఁదగ దెవ్వరికిన్॥

కథాశ్రియములగు వానియందు స్వేచ్ఛయే కూడదు. "కథామార్గేనచాల్పోఽప్యతి క్రమః" కథామార్గమునించుకయు నతిక్రమింపఁగూడదు. అనిచెప్పఁబడెను. 3 దానియందుఁగూడ స్వాతంత్ర్యము నవలంబించునెడల రసమునకు విరోధము గలుగని రీతిగా నవలంబింపవలయును 4.

ప్రభామతి :—1) సిద్ధరసప్రఖ్యములు = ఆస్వాదమాత్రశేషమై భావనీయము కాని రసముగలవని ప్రఖ్యాతములగునవి. (సాధ్యములుగాక సిద్ధములగు శృంగారాది రసములు గలవి) లేక (ఆయుర్వేద ప్రసిద్ధములగు పారదాదులను బోలునవి.)

2) రామాది వృత్తాంతముల కాశ్రయమగునవి ఇతిహాసములు.

3) యశోవర్మ యను కవి రామాభ్యుదయ నాటకమున కథామార్గము నల్పముగా నైనను అతిక్రమింపఁగూడదని చెప్పెను.

4) ఆయాగ్రంథములయందు ప్రసిద్ధమగు రసమునకు విరుద్ధమగు స్వేచ్ఛ నుపయోగింపఁగూడదు. శ్రీరాముని నాటికా నాయకుఁడగు ధీరలలితునిగా వర్ణించుట విందుల కుదాహరణముగా గ్రహింపవచ్చును. శౌర్య, వీర్య, ధైర్య, యుక్తుఁడగు రాముని శృంగారైకనాయకుఁడగు ధీరలలితునిగా వర్ణించుట సమంజసము గాదుగదా!

మూలము :— ప్రబంధము రసాభివ్యంజకము అగుటకు వేరొక నిబంధనమున్నది.

అది యెట్లనిన :— ఇతివృత్తవశముచే ఆయాతమును, రసమున కనుగుణముకానిదియు, నగు కథను త్యజించి-యెట్లోకల్పించియైనను స్వాభిమత రసోచితమగు కథోన్నయమును విధించుట.

(1) ఉదా :— 1) కాళిదాస ప్రబంధములు. (2) సర్వసేన విరచితమగు హరి విజయము. (3) మదీయమేయగు "అర్జున చరితము" అను మహాకావ్యము.

ప్రబంధరచయితయగు కవి, సర్వాత్మనా రస పరతంత్రుఁడై యుండవలయును.

ఇతివృత్తము రసమున కనుగుణమగు స్థితిని కలిగియుండని యెడల దానిని తొలగించియైనను సరియే స్వతంత్రించి రసానుగుణమగు కథాంతరము నుత్పాదింపవలయును. కథ వ్రాసినంత మాత్రమున కవికించుకయు (2) ప్రయోజనము (ఘనత) కలుగనేరదు. అది ఇతిహాసమువలననే సిద్ధించునుగదా! ప్రబంధము రసాభివ్యంజకమగుటకు ముఖ్యమగు నింకొక నిబంధనమేదనఁగా ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, నిర్వహణాఖ్యములగు సంధులను, ఉపక్షేపాదులగు తదంగములను (రూపకములయందు) రసాభివ్యక్తి నపేక్షించియే సంఘటించుట (3) దీని కుదాహరణము రత్నావళి.

ప్రభామతి :— ఇతిహాసములందు నిరూపితము గాకున్నను అజాది మహారాజ వివాహాది వర్ణనము రఘువంశమునఁ బ్రతిపాదింపఁబడినది (2) ఇతిహాస ప్రతిపాదితము గాకున్నను పారిజాతహరణాదికము కాంతానునయనాంగముగా (ప్రియురాలి నోదార్చుటకు) హరి విజయమునందు ప్రతిపాదింపఁబడినది, ఇట్లే (3) "అర్జున చరితము" నందు అర్జునుఁడు పాతాళ విజయము నొనర్చినట్లు వర్ణింపఁబడెను.

(2) ప్రయోజనము మహాకవిత్వపదవీలాభము. సహృదయాహ్లాదపురస్సరమగు నుపదేశము. (రూపకములందు) అభినేయముగల దృశ్యకావ్యము - నటుని యందు రామాది స్వరూపము నారోపించుటవలన రూపకమని చెప్పఁబడును.

(లోచనము) :— శ్రుతి స్మృతి శాస్త్రములవలన-వ్యుత్పత్తి కలుగదు.

(3) ప్రభుసమ్మితములగు శ్రుతి స్మృతులవలనను "ఇట్లు చేయవలయును, ఇట్లు చేయరాదు" అను ఆజ్ఞామాత్ర పరమార్థములగు శాస్త్రములవలనను, గూడ సుకుమార హృదయులగు వారి మనస్సులకు విజ్ఞానము కలుగదు. కాంతాపహరణమువలన రావణుఁడు నశించెను. అవి ఇట్లు యుక్తి యుక్త కర్మఫల సంబంధ ప్రకటన కారులును, సుహృత్సమ్మితములును నగు నితిహాస శాస్త్రముల వలనను అల్పమగు వ్యుత్పత్తియే కలుగును. ఇవికూడ

మనః ప్రీతిగా బోధింపఁజాలవు. ప్రజాపరిపాలనయోగ్యతా క్రాంతు లగు రాజపుత్రి ప్రియుల హృదయములకు రుచించునట్లు చతుర్వ ర్గోపాయ బోధమః నొనరింపవలయును గదా! ఇందులకర్హమైనది నాటకాదికమే. రసాస్వాదమయమగు నాటకాదికమే (అట్టి సుకుమార హృదయుల) హృదయములందను ప్రవేశించును.

సుకుమార హృదయులగు ప్రజలకు దుర్గ్రాహ్యములగు శ్రుతులుగాని ధర్మాదులను విధించునవియగు స్మృతులుగాని, మనః ప్రీతిని గలిగించి తద్ ద్వారమున వ్యుత్పత్తిని (విజ్ఞానమును) కలిగించునవి కానేరవు. హితునివలె బోధించునవియగు పురాణ ములు కూడ కాంతలవంటి కావ్యములనలె-మనోరంజన పురస్సర ముగా బోధింపఁజాలునవికావు. అవియు నత్యల్పమగు వ్యుత్పత్తిని మాత్రమే సంఘటించును.

ధర్మార్థ కామ మోక్షములను చతుర్వర్గములకు సంబంధించిన విజ్ఞానము సుకుమార హృదయుల హృదయములయందు ప్రస రింప వలయుననిన వారి మనస్సులయందు రసాస్వాదము కలుగ వలయును. విభావాది ప్రదర్శనము లేనియెడల రసప్రతీతి కలు గదు, విభావాది సంయోగ జనితమగు రసమునకు-చతుర్వర్గోపాయ విజ్ఞానము-అనుషంగిక ఫలమగుచున్నది. ఏలనిన; విభావాది సం యోగ ప్రపాద సంజనితమగు రసము నాస్వాదించిన సుకుమార సహృదయులు పరవశులగు చుందురు.

అట్టి రసాస్వాద వైవశ్యమే-స్వరసభావినియగు వ్యుత్ప త్తిని సుకరముగా వారి మనస్సులందు చొప్పించును. కాఁగా, ప్రీతియే అనగా రసాస్వాదముచేనగు నానందమే-వ్యుత్పత్తి ప్రయో జిక యగుచున్నది. ఆ ప్రీతిలేని యెడల చతుర్వర్గోపాయ విజ్ఞా నము కలుగునది కానేరదు. ప్రీత్యాత్మకమే-రసము, అదియే- నాట్యము. నాట్యమే వేదము (నాట్య వేదము). అని - అస్మదుపా ధ్యాయులు (నాట్యాచార్యులగు భట్టతౌతులు) ప్రవచించిరి.

(లోచనము.)

## ప్రీతి - వ్యుత్పత్తులు - భిన్నములుకావు.

రసాస్వాదానంద రూపమగు ప్రీతియు, చతుర్వర్గోపాయ సంబంధియగు వ్యుత్పత్తియు, భిన్నరూపములే యగునని తలంపఁ దగదు. ఇవి-యేక విషయములు. కావున భిన్నరూపములు కావు. విభావాద్యౌచిత్యమే-సత్యముగా ప్రీతికి కారణమను నంశమును పలుమార్లు చెప్పియున్నాముగదా! ఆయారసముల కుచితములగు నావిభావాదులు-ఫలపర్యంతమును ప్రసరించుటచేతనగు అర్థ స్వరూపమును గ్రహించుటయే వ్యుత్పత్తి. (విభావాద్యౌచిత్యమొక్కటియే-ఇట్లు, ప్రీతి-వ్యుత్పత్తులను కలిగించుచున్నది. కావున నివి-భిన్నములు కావు.)

వ్యుత్పత్తి-ధర్మాదులను గోచరింపఁజేయునదికాదు. ధర్మాది చతుర్వర్గోపాయమునే గోచరింపఁజేయును.

అదృష్టవశముచేతఁగాని, దేవతా ప్రసాదముచేతఁగాని, వేరొక దానిచేతఁగాని ఫలరూపములగు ధర్మాదులు సిద్ధించును. ఆ ఫలముపదేశింపవలసినది కాదు. ఫలోపదేశముచేత తదుపాయ విజ్ఞానముకలుగదు. కావున-చతుర్వర్గోపాయములే-ఉపదేశార్థములు.

### —: ఉపాయోపదేశ విధి :—

మహాకవి - రూపకములయందు-చతుర్వర్గమునకు సంబంధించిన ఉపాయక్రమము ననుసరించి ప్రవర్తించినవాఁడు-ఫలసిద్ధి నొందునట్లును-అనిష్ట హేతువగు అనుపాయ ద్వారమునను సరించినవాఁడు, ఫలసిద్ధినొందక, అనిష్ట ప్రాప్తినొంది నశించినట్లును, ప్రదర్శింపవలయును. అర్థోపాయమును, నాయకుఁడాశ్రయించినట్లును, అనర్థోపాయమును ప్రతినాయకుఁడాశ్రయించినట్లను ప్రకటించి-తదుపాయ-అనుపాయ విజ్ఞానమును-సామాజిక సహృదయుల హృదయములయందను ప్రవేశింపఁజేయవలయును. కర్తయగు నాయకాది వ్యక్తిచేత ఆశ్రయింపఁబడిన ఉపాయములు కూడ-పంచావస్థలనొందును.

—: అవస్థాపంచక నిరూపణము :—

అదెట్లనిన :— 1 అనుష్ఠీయమానమగు ఉపాయము ప్రథమావస్థయగు స్వరూపము నొంది, ద్వితీయావస్థయగు స్వల్పమగు షష్టిం బడసి, తృతీయమగు కార్యసంపాదన యోగ్యతను సంపాదించును. తదుపరి సది-ప్రతిబంధకములు సంభవించుటచేత కార్యసిద్ధియందు సంశయింపఁబడును. (ఇది చతుర్థావస్థ) తరువాత ప్రతిబంధకములు నివర్తించుటవలన బాధించిన వానిని బాధించి, సువృత్తమగు ఫలసిద్ధియందు వ్యాపించును. (ఇది పంచమావస్థ).

అర్తిసహిష్ణువులును, ఫలవియోగమును సహింపనివారును, అగు దీర్ఘదర్శులు ఇట్లే-కారణములను స్వీకరింతురుగదా! కారణగతములగు నీ యవస్థల నైదింటిని భరతముని యిట్లు చెప్పియున్నాఁడు.

"(నాయకాది) కారణముయొక్క వ్యాపారము-ఫలసిద్ధిని సాధించునపుడు - ఆకారణవ్యాపృతికి, పంచావస్థలు క్రమముగా కలవను నంశమును ప్రయోక్తలు గ్రహించునది. అవి 1 ప్రారంభము, 2 ప్రయత్నము, 3 ప్రాప్తి సంభవము, 4 నియత ఫల ప్రాప్తి, 5 ఫలసిద్ధి-ఉనునవి".

—: పంచ సంధులు :—

ఏతత్ కారణావస్థా సంపాదకమగు ఇతి వృత్తముకూడ అయిదుగా విభజింపఁబడినది. ఆ విభాగములే-అన్వర్థనామములును, ముఖ-ప్రతిముఖ-గర్భ-అవమర్శ నిర్వహణ-నామములును, అగు పంచసంధులై యున్నవి. ఇతివృత్త ఖండములను సంధించునవి కావున వీనికి సంధులనుపేరు అన్వర్థమగు చున్నదవి తెలియునది. (సంధిలక్షణములను దశరూపకమునఁజూచునది).

## —: సంధ్యంగములు :—

ఇవి-తమచేత నిర్వహింపఁదగిన ఫలమును క్రమముగా ప్రదర్శించును. కావున అవాంతరభేదముగల యితివృత్త భాగములు ఆసంధుల కంగములగుచుండును. కాగా ఉపక్షేప-పరికర-పరిన్యాసాదులు-సంధ్యంగములని చెప్పఁబడును.

## —: అర్థ ప్రకృతి పంచకము :—

ప్రయోజన సిద్ధిహేతువులు, లేక కథాశరీర కారణములు = అర్థ ప్రకృతులని చెప్పఁబడును. బీజ-బిందు-పతాకా-ప్రకరీ-కార్యములు అర్థప్రకృతి పంచకము. ఈయర్థప్రకృతులును, పూర్వోక్తములగు పంచావస్థలును, ముఖాదులగు సంధులయందు సమన్వితములై యుండును.

ఎటులనిన :— అర్థప్రకృతియగు బీజము అవస్థయగు ఆరంభముతోఁగూడికదా, ముఖసంధి యగును! కావున అర్థప్రకృతులగు బీజాదులు ఆరంభాద్యవస్థలతోఁగూడి ముఖాది సంధులందున్నవియే యగుచున్నవి. బీజారంభాది అనుగుణ్యముగ సంధ్యంగములు ప్రయోజ్యములు గదా! కావున అర్థ ప్రకృతులును అవస్థలతోఁగూడి ముఖాది సంధ్యంగముల యందంతర్భవించియే యున్నవి. కనుకనే, "అర్థప్రకృతయోఽత్ర వాస్తర్భూతాః" "అర్థప్రకృతులగు బీజాదులు ఉపక్షేపాదులగు (చతుష్షష్టి-౬౪) సంధ్యంగముల యందును అంతర్భవించియే యున్నవి" అని లోచనకర్త చెప్పుచు అర్థ ప్రకృతుల స్వరూప సంబంధముల నిట్లు చెప్పుచున్నాడు—

నాయకుఁడు ౧. స్వాయత్తసిద్ధి ౨. సచివాయత్త సిద్ధి. ౩. ఉభయాయత్తసిద్ధి అగుటవలన త్రివిధుఁడు గదా!

అందు స్వాయత్తసిద్ధికి-బీజము, బిందువు, కార్యము అనునవి మూడే అర్థప్రకృతులు. బీజముచేత-సర్వ వ్యాపారములును, అవాంతర విషయములచేత ముఖ్యప్రయోజనమునకు విచ్ఛేదము

కలుగునపుడు దానిని సంధించుటకు కారణమగు బిందువుచేత-అను సంధానమును, కార్యముచేత-నిర్వాహమును, వివక్షితములు.

సందర్శన, ప్రార్థనా, వ్యవసాయ, రూపములగు ఆయా ప్రయోజనములను-మనస్సునందు సందర్శించి, తత్ ప్రయోజనసిద్ధిని సంప్రార్థించి, దృఢముగా నిశ్చయించునవియగు మూఁటును కర్తచేత సంపాద్యమగు నర్థవిషయమున కర్తకు సంబంధించిన ప్రకృతులు అనఁగా స్వభావ విశేషములు అగుచున్నవి (అర్థప్రకృతి శబ్దమున కిట్లు వ్యుత్పత్తి చెప్పఁబడినది).

నాయకుఁడు స్వాధీనమగు సిద్ధిగలవాఁడగునపుడు అర్థప్రకృతులు (ప్రయోజనము కొఱకగు స్వభావములు) మూఁడే యగును.

ఆ నాయకుఁడు సచివాయత్తసిద్ధి యగునపుడు మాత్రము-సచివుఁడు నాయకుని కొఱకుగాని, తనకొఱకుగాని, నాయకుని కొఱకు, తనకొఱకు (ఉభయుల కొఱకును) గాని, ప్రవర్తించును. అట్లు ప్రవర్తించునపుడు ప్రకీర్ణమగు సచివుని వ్యాపార విశేషము-ప్రకీర్ణమగుటచేత "ప్రకరి" యనియు, ప్రసిద్ధమగుటచేత "పతాక" అనియు చెప్పఁబడుచున్నది.

ఇట్లు ఫలనిర్వహణముతో ముగియునదియు, ఆధికారికమును (ఫలస్వామి సంబంధియు) అగు నితివృత్తము-పంచసంధుల తోడను, పూర్ణములగు సంధ్యంగములతోడను, నిబంధింపఁబడిన యెడల నది సర్వజనులకును వ్యుత్పత్తిని గలిగించును.

"ప్రాసఙ్గికే పరార్థత్వాన్న హ్యేష నియమో భవేత్" అని భరతముని చెప్పియున్నాఁడు. కావున నితివృత్తము ప్రాసంగికమగునపుడు మాత్రము ఈనియమములేదు. "దీని కుదాహరణము-రత్నావళి" అని కృతికర్త-ప్రవచించియున్నాఁడు. కావున నాటికయగు "రత్నావళి" యందు లక్షణ సమన్వయమును లోచనకారుఁ డిట్లు నిరూపించుచున్నాఁడు.

"ఇట్లుండగా, "రత్నావళి"యందు ధీరలలితుఁడగు నాయకుఁడు ధర్మవిరుద్ధముకాని సంభోగమును సేవించుటయందు. అనౌచిత్యము కాన్పింపదు. అట్లు సేవింపనియెడల నతఁడు సుఖరహితుఁడగును. మఱియు నిది శ్లాఘ్యమే యగుచున్నది. ఈ కారణముల వలన పృథివీరాజ్యమను వేఱొక మహాఫలముతోఁగూడ కన్యాలాభమును ఫలము నుద్దేశించి ప్రస్తావన ముపక్రమింపఁబడినది. అర్థప్రకృతులతోఁను, అవస్థలతోడనుగూడి అంగ పరిపూర్ణములగు సంధులైదును ప్రదర్శింపఁబడినవి.

"ఈ ప్రారంభము - స్వామివృద్ధికి హేతువగును" అని బీజము ప్రదర్శితము. త దు ప రి, "విశ్రాంత విగ్రహకథః" "రాజ్యం నిర్జితశత్రు" అను వాక్యములచేత ఉపక్షేపాదులగు సంధ్యంగములు నిట ధీరఁబడినవి. "రత్నావళి" యందలి పాఠముల నుదాహరించి, వానివెనుక, సమస్త సంధ్యంగముల స్వరూపమును గూడ నిరూపింపవచ్చును. కాని, గ్రంథము విస్తృతమగును. ఇక్కడిదొకటియు, అక్కడి దొకటియు ప్రదర్శించినయెడల పూర్వాపరాను సంధానము కలుగకుండుటవలన బుద్ధికి సమ్మోహము మాత్రమే కలుగును. కావున విస్తరింపను".

మూలము :— అట్లుగాక (భరత) శాస్త్ర లక్షణ సంపాద నేచ్ఛచేత మాత్రమే వానిని ఘటింపఁగూడదు. 1) ప్రకృత రస నిబంధనానుగుణముగా నున్నను భరతమతాను సరణ మాత్రేచ్ఛచేత వేణీసంహారమునందలి ద్వితీయాంకమున "విలాస"మను పేరుగల ప్రతిముఖ సంధ్యంగము ఘటింపఁబడినది.

ప్రబంధము రసవ్యంజకమగుట కింకొక నిబంధన మేమనఁగా; అవసరమునుబట్టి (విభావాది పూరణముచే) రసము (1) నుద్దీపింపఁజేయుట, (2) ప్రశమింపఁజేయుట, దీనికిఁ గూడ ఉదాహరణము రత్నావళియే, మఱియు (3) ఆరబ్ధవిశ్రాంతియగు అంగిరసమును మాటిమాటికిని అను సంధించుటకూడ రస వ్యంజకమే యగును. దీని కుదాహరణము తాపసవత్సరాజము (4).

## —: సంధ్యంగ ప్రయోజనము :—

ప్రభామతి :— 1) రసాంగభూతమగు ఇతివృత్త ప్రశస్త్యోత్పాదనమే సంధ్యంగముల ప్రయోజనమని భరతమునిచేఁ జెప్పఁబడియెను, కాని పూర్వరంగాంగములకు వలె అదృష్టసంపాదనముగాని విఘ్నాది నివారణముగాని ప్రయోజనముగాఁ జెప్పఁబడలేదు. అదెట్లనిన :—

శ్లో॥ ఇష్ట స్యార్థస్యరచనా వృత్తాంత స్యానపక్షయః
రాగః ప్రాప్తిః ప్రయోగస్య గుహ్యానాంచైవ గూహనమ్॥
ఆశ్చర్యవదభిఖ్యానమ్ ప్రకాశ్యానాం ప్రకాశనమ్॥
అఙ్గానాం షడ్విధం హ్యేతద్దృష్టం శాస్త్రే ప్రయోజనమ్॥

1) ఇష్టమగు సర్థమును ప్రతిపాదించుట, 2) వృత్తాంతమునకు-అపక్షయము లేకుండుట, 3) అభినయ దర్శనముచేతను సామాజిక మనోరంజన సమృద్ధి, 4) గూఢములగు విషయములను గుహ్యములుగానే యుంచుట, 5) చమత్కారకారియగునట్లు చెప్పుట, 6) ప్రకటింపఁదగిన యంశములను ప్రకాశింపఁజేయుట, అనునవి యే సంధ్యంగములకు ప్రయోజనమని భరతముని చెప్పెను.

ప్రతిముఖ సంధ్యంగమగు విలాస లక్షణము సు జెప్పునపుడతఁడు "సమీహా రతిభోగార్థా విలాసః పరికీర్తితః" "రతియను స్థాయిభావమునకు విషయమగు కాంతాసురతము ప్రయోజనముగాగల-ఇచ్ఛయే-విలాసము" అని ప్రవచించెను. ఇందు రతిభోగశబ్దము-అధికారికమగు రసమునకే స్థాయిభావముండునో, దానిని వ్యక్తీకరించునదియగు విభావాదుల కుపలక్షణముగా ప్రయోగించెను. శాస్త్రస్థితీచ్ఛచేత వేణీసంహారకర్త-దీని తత్త్వమును గుర్తింపఁజాలక-విలాసమునుగూడ వేణీసంహారమునందు ప్రతిపాదించి సంధ్యంగ ప్రయోజనమును భంగించెను. అందు ప్రకృతమగునది-వీర రసము-విలాసము-దీనిని భంగించును. వీర రసస్థాయియగు ఉత్సాహమును, విలాసము-వ్యంజింపఁజేయఁజాలునుగదా :—

కావున కేవలమును శాస్త్రస్థితి ననుసరింపవలయునను నిచ్ఛ భరతాభిమతము కానేరదు.

2) "ఇతఁడాయుదయన మహారాజా? ఇతనికేగదా మాతండ్రి నన్నొసఁగెను." అను రత్నావళి వాక్యము రసోద్దీపన కుదాహరణము. ఆయంకము చివరను వాసవదత్త యొద్దనుండి (సాగరిక) రత్నావళి పలాయన మొనర్చుట (రస) ప్రశమనోదాహరణము. చిత్ర ఫలకము నుల్లేఖించుట పునరుద్దీపన కుదాహరణము. అటు తరువాతనగు సుసంగతా ప్రవేశము తదుపశమనమున కుదాహరణము. పునః పునరుద్దీప్యమానమగు రసము విరసమగును. గాఢమగు విధమున అనవరతమును

పరిమృదితమగు రసముకూడ విరతాస్వాదిత సుకుమార మాలతీకుసుమమువలె మ్లాని నొందును, శృంగారమునందు మాత్రము ఆ-మ్లాని మఱియు విశేషించును. కావున నది ప్రతీయమానమగునపుడు అనవసరముగా రసము నుద్దీపింపఁజేయుటయు, ప్రశమింపఁజేయుటయు నయుక్తము, ఉద్దీపన ప్రశమనములు గాఢమగు విధమున నొనర్పఁగూడదని భావము, కావుననే భరతముని యిట్లు చెప్పెను.

శ్లో॥ యద్వామాభి నివేశిత్వం యతశ్చ వినివార్యతే
దుర్లభత్వం యతోనార్యాః కామినః సాపరారతిః॥

ప్రతికూలాచరణాభిలాష, సంగమనిషేధము, దుర్లభురాలగుట అను నీ మూడును గల కాంతయే కాముకునకు ప్రీత్యతిశయ స్థానము-సంభోగ విఘ్నము నొనర్చు ప్రేయసియే కామికి పరమప్రీతి హేతువగునట్లు పునః పున రుద్దీపన విఘ్నముగల రసమే సహృదయునకు ఆస్వాదయోగ్యమగునని భావము.

3) ఆశంక్యమాన ప్రాయమగు విచ్ఛేదము గలది. (విశ్రాంతమైనట్లు శంకింపఁబడినది) అగు రసము ఆరబ్ధ విశ్రాంతి అని చెప్పఁబడును.

4) ఇదియొక నాటకము ఇది యిప్పు డెచటను లభింపకున్నది. ఇందు వాసవదత్తా విషయమగు ప్రేమబంధము, నడుమను విప్రలంభాది భూమికలను ధరించినను సమస్తేతివృత్తవ్యాపియగు చున్నది. కావున విశ్రాంతమైనట్లు శంకింపఁబడిన అంగిరసమును తిరుగ తిరుగ ననుసంధించుట యిందుఁగలదని యెఱుంగునది.

మూలము :— ప్రబంధ విశేషమగు నాటకము రసాభివ్యక్తి నిమిత్తమగుట కింకొక నిబంధనఁగూడ నెఱుంగునది. అది యేదనిన :— (అలంకార రచనా) శక్తి యుండినను రసాను రూపములగు విధమున అలంకారములఁగూర్చుట. శక్తుఁడగు కవి యొకానొకప్పుడు - అలంకారమును గూర్చునపుడు తదలంకారాక్షిప్త చేతస్కుఁడగుటచేత రసబంధాపేక్షను విడచి ప్రబంధము (కూర్పు)ను నారంభించు చుండుటవలన తదుపదేశము కొఱకిట్లు చెప్పఁబడియె (కొందఱు) కవులు అలంకార నిబంధనైకరసులై రసాపేక్షాశూన్యులైనట్లు తత్ప్రబంధములందుఁగాన్పించెదిని, (1) ఇంతియగాక—

గీ॥ ఆ-వివక్షతాన్య పరవాచ్యధ్వనిఁ దన
రారు భేదంబులందొకండగుచు వెలయు

నను రణనతుల్య మదికూడ నలరఁజేయఁ
బడుచునుండును కొన్ని ప్రబంధములను॥ (2)

ప్రభామతి :— (1) అలంకార రచనాసక్తుఁడగు కవి రసబంధాపేక్షశూన్యుఁడై యలంకార పూరణదృష్టి నవలంబించుట కుదాహరణము. స్వప్న వాసవదత్త యను నాటకమున వాసవదత్తానురాగి యగు వత్సరాజనుచున్నాఁడు.

గీ॥ ప్రాంచిత విశాల పక్ష్మకవాటమగు వి
లోచన ద్వారమును, తత్స్వరూప తాడ
నమున నుద్ఘాటిత మొనర్చి, నాదు హృదయ
గృహమునఁ జొచ్చె వేళ మొనరించె, నృపకుమారి॥

అని "లోచన ద్వారము" అనునంత వఱకుఁగల రూపకమే శృంగారానుగుణమై సుందరమగుచున్నదని గ్రహించునది.

(2) "అను స్వానోపమాత్మాపి ప్రభేదో య ఉదాహృతః ధ్వనే రస్య ప్రబన్ధేషు భాసతే సోఽపి కేషుచిత్॥ అనునది దీనికి మూలమగు (ధ్వనికారుని) కారిక. ఈ కారికకు అసంలక్ష్య క్రమ ధ్వని మాత్రమేగాక, సంలక్ష్య క్రమ వ్యంగ్యధ్వని కూడ కొన్ని ప్రబంధములచేఁబ్రకాశింపఁజేయఁబడి ప్రకృతమగు రసధ్వనికి వ్యంజకమగుచుండును" అను నర్థమును గ్రహించునది. క్రిందివృత్తి గ్రంథమును కూడ నిట్లే యోజింపవలయును. "సంబంధ......అసంలక్ష్య క్రమములు" అను వక్ష్యమాణకారికా సంబంధము నంగీకరించునెడల నీ యర్థము కారికావృత్తి సంగతమగును, "అను స్వానోపమమగు ధ్వని ప్రభేదము ప్రబంధములయందు సాక్షాత్తుగా భాసించుచునది (సంలక్ష్యక్రమము) మాత్రము రసధ్వనియందు పర్యవసించును" అని క్రింద లిఖింపఁబడిన వృత్తి స్థితవాక్యమునకుఁగూడ నర్థము గ్రహింపవలయును,

"అట్లు గ్రహింపని యెడల నసంలక్ష్య క్రమవిషయకమగు పూర్వోత్తర గ్రంథమధ్యమునందీవిషయమసంగతమగును. మఱియు నుదాహృతములగు పాంచజన్యోక్త్యాదులు నీరసములు కావలసివచ్చును'' అని లోచనకారులు చెప్పుచున్నారు.

(పూర్వోక్తమగు కారికార్థమును వృత్తికారుఁడొక విధముగను లోచనకారుఁడొక విధముగను వాక్రుచ్చియున్నారు, నాచే నుల్లేఖింపఁబడిన పద్యము వృత్తి కృన్మతయాను సారియై యున్నది,

వృత్తికారుని యభిప్రాయము సుస్పష్టముగ సంగతమే యగుటవలన లోచనోక్తమగు క్లిష్టార్థకల్పనము అనావశ్యకమని తోఁచెడిని).

అదియెట్లనిన :— (పాంచజన్యోక్తులు సంలక్ష్య క్రమధ్వనికేగాక రస ధ్వనికిఁగూడ నుదాహరణము లగుటవలన నీ రసములు కానేరవు. అసంలక్ష్య క్రమ వ్యంగ్యము ప్రబంధద్యోత్యమని చెప్పునపుడు సంలక్ష్య క్రమవ్యంగ్యముగూడ ప్రబంధ ద్యోత్యమని చెప్పుట యేతత్ప్రకరణమునకు సంబంధించినది కాదు. కావున నిచట నీ విషయమును జెప్పుట సంగతమే యగును.)

మూలము :— వివక్షితాన్య పరవాచ్యధ్వనియందు ద్విప్రకారకమగునే-యనుస్వానోపమ వ్యంగ్య. (సంలక్ష్య క్రమవ్యంగ్య) రూప ప్రభేద ముదాహరింపఁబడినదో. అదికూడ కొన్ని ప్రబంధములయందు భాసించుచున్నది. దీని ఉదాహరణములను—

ప్రభామతి :— ౧ మధుమథన విజయమునందలి పాంచజన్యోక్తులయందును ౨ నేను (ఆనందుఁడు) రచించిన విషమబాణలీల యందును ౩ మహాభారతము నందలి గృధ్రగోమాయు సంవాదాదులయందును జూడనగును. 1, 2 గ్రంథము లిపుడు లభించుటలేదు.

౩. మహాభారతమునందలి శాంతి పర్వమున మృతుఁడగు బాలుని శవముఁ దీసికొని శ్మశానమునకువచ్చి యచటనున్న తత్పరిజనులను దొలఁగింపఁగోరిన గృధ్రమిట్లను చున్నది.

శ్లో॥ అలంస్థిత్వా శ్మశానేఽస్మిన్ గృధ్రగోమాయుసఙ్కులే
కఙ్కాలబహులే ఘోరేసర్వప్రాణి భయఙ్కరే
నచేహ జీవితః కశ్చిత్ కాలధర్మ ముపాగతః
ప్రియోవా యదివాద్వేష్యః ప్రాణినాంగతిరీదృశీ॥

గ్రద్దలచేతను నక్కలచేతను ఆక్రమింపఁబడినదియు, అస్థిపంజరములతోఁ గూడినదియు ఘోరమైనదియు నగు నీ-శ్మశానమునందుండుటవలనఁబ్రయోజనము లేదు. కాల ధర్మము (మరణము)నొందినవాఁడు ప్రియుఁడైనను అప్రియుఁడైనను మరల జీవింపఁడుగదా। చనిపోయినపిమ్మట ప్రాణులగతి యిట్టిదే। (పునరావృత్తి లేనిదియే) ఇట్లనిన గ్రద్దమాటలు విని మృతబాలుని విడిచిపోవుటకు యత్నించుచున్న తద్బంధువులను జూచి యొక నక్క యిట్లనుచున్నది.

ఆదిత్యోఽయంస్థితో మూఢాః స్నేహంకురుత సామ్ప్రతమ్ బహువిఘ్నోముహూర్తోఽయం జీవేదపికదాచన। అముం కనకవర్ణాభం బాలమప్రాప్త యౌవనమ్। గృధ్రవాక్యాత్ కథంబాలాస్త్యజధ్వమవిశఙ్కితాః॥ "ఓ మూఢులారా! సూర్యుఁడింకను అస్తమించుటలేదు. (కావున మీకు భయములేదు) ఈ బాలుని

స్నేహమును విడువకుఁడు. (రాక్షస లీలాత్మకమును, సంధ్యారూపమునునగు ఈ ముహూర్తము (రాక్షసభూత పిశాచాద్యావేశమువలన) అనేక విఘ్నములు గలది. కావున నొకానొకప్పుడు (ఆయావేశము నివర్తించునెడల) ఈ బాలుఁడు జీవింప వచ్చును. బంగారమువంటి రంగుగల్గి యింతను యౌవనమునొందని యీబాలుని శంకారహితులై యెట్లు విడిచెదరు?".

ఈ శ్లోకప్రబంధము సంలక్ష్యక్రమవ్యంగ్యధ్వని వ్యంజకమై శాంతరసము నందు పర్యవసించుచున్నదిగదా!

మొదటి శ్లోకములచే పగటివేళ మాంసమునిను గ్రద్దకు గల మృతబంధు విసర్జనాభిలాషమును, తరువాతి శ్లోకముచే చీఁకటిపడిన వెనుక మాంసముఁదినఁ గోరిన నక్కకుఁగల మృతబంధుగమన నివర్తనాభిలాషమును, ప్రకరణాదివైశిష్ట్య బలమువలన వ్యంజింపఁజేయఁబడుచున్నవిగదా!

**మూలము :—** (అవతారిక-ఇట్లు అసంలక్ష్యక్రమ వ్యంగ్యమగు రసాది ధ్వనికి వర్ణములు మొదలు ప్రబంధమువరకునుగల వ్యంజకవర్గము నిరూపింపఁబడినది. కావున నింక నిరూపింపఁదగిన దేదియు మిగిలియుండుటలేదు. అయినను కవులకును సహృదయులకును శిక్షనొసంగుటకు తిరుగ సూక్ష్మమార్గమున తద్వ్యంజక వర్గము నుపదేశించుచున్నాఁడు).

**అవ :—** అసంలక్ష్య క్రమధ్వని కభివ్యంజకములగు సంబంధాదులఁదెల్పుచున్నాఁడు.

మంజరి॥ సంబంధ, సుప్, తిఙ్, వచనముల, కార
క, సమాస, కృత్, తద్ధిత, సముదాయముల
సమయు, నిపాతో పసర్గాదికముల
ప్రకటింపఁబడు నసంలక్ష్య క్రమంబు॥

**ప్రభామతి :—** (1) సంబంధములు-స్వస్వామి భావాదులగు షష్ఠ్యర్థములు. ఉదాహరణము :— రామునియొక్క గుణములు, (2) సుప్పులు-సంస్కృతమునందు స్వౌజసాదులు. తెనుఁగునందు డు, ము, వులు, మొదలైనవి. ఉదా :— రాముఁడు, ధనము, గోవు, అచలు, (3) తిఙ్లు-సంస్కృతమునందు తిప్, తస్, మొద, తెలుఁగునందు ను,రు,వు, మొద. ఉదా :— చేయుచున్నాఁడు. (4) వచనములు. సంస్కృతమునందు ఏక, ద్వి, బహువచనములు. తెనుఁగున

ఏక, బహువచనములు. ఉదా :— అరి, అరులు, మొద. మీఁది కారికయందు "ప్రకటింపఁబడు నసంలక్ష్య క్రమంబు" అనునదొకపాఠము. "ప్రకటింపఁబడును సంలక్ష్య క్రమంబు" అను పాఠాంతరము గూడ నున్నది. (5) కారకము-క్రియతోనన్వయించునది లేక క్రియను పుట్టించునది. ఇదిషడ్విధము. అందు కర్తృకారకమున కుదా :— రాముఁడు రావణుని సంహరించెను మొద. (6) సమాసము. తత్పురుషాదికము. ఉదా :— భూతబలి, మాటసేర్పరి. (7) కృత్తులు-దుజ్ భిన్నప్రత్యయములగు క, ఇమి, మొద. ఉదా :— ఎఱుక. కలిమి, తత్సమోదా :— శకిత్రజితుఁడు, ప్రబోధితవంతుఁడు. మొద. (8) తద్ధితములు-విభక్త్యంతములైన శబ్దములమీఁది భావార్థమతుబర్థాదులయందుఁబ్రయోగింపఁబడు ప్రత్యయములు, తన ఱిక, మొద, చిన్నతనము, కన్నెఱికము, తత్సమోదా :— తాపసుఁడు. (9) సమయములు = భూత, భవిష్య, ద్వర్తమానములు. ఉదా:— వాఁడు వెళ్లెను. (10) నిపాతములు-అద్రవ్యార్థములగు "చా"దులు, కూడ, ను మొద. (11) ఉపసర్గములు = క్రియాయుక్తములగు ప్రాదులు, (ప్ర-పర) ఉదా:— ప్రవర్తనము-విహారము. (12) సర్వనామములు అ, ఈ, ఏ, ఉదా :— అ-రమణి, ఈ నలుఁడు. (13) ప్రకృతులు ఉదా :— నతకుస్య, శక్ర, (14) అవ్యయములు ఉదా :— ఏల-ఇఁకన్, లోచనకారు లిట్లను చున్నారు.

"సుఖాదులచే ఏ-యను స్వానోపమవ్యంగ్య (సంలక్ష్యక్రమవ్యంగ్య) ధ్వని భాసించునో, అది వక్త్రభిప్రాయాది రూపమై యుండును. సుఖాదులచే వ్యక్తమగు అ-సంలక్ష్యక్రమధ్వని-అసంలక్ష్యక్రమవ్యంగ్య ద్యోతకమగుచుండునను నభిప్రాయమిచట నెఱుంగునది. ఈ యర్థము పూర్వోక్త కారికార్థములను సమన్వయించుటచే నేర్పడును. అంతటను సుఖాదులు అభిప్రాయ విశేషవ్యంజకములే యగునుగదా! ఉదాహరణమునందభివ్యక్తమగు నాయభిప్రాయము విభావాది రూపతాద్వారమున రసాదులను (అసంలక్ష్యక్రమవ్యంగ్యమును) వ్యంజింపఁజేయును".

ఇందలి యభిప్రాయమిది :— ప్రబంధాంతములగు వర్ణాదులు విభావాది ప్రతిపాదన ద్వారమున సాక్షాత్తుగాగాని, విభావాది వ్యంజన ద్వారమున పరంపరగాగాని, రసము నభివ్యక్తీకరించును. అందు పరంపరగా ప్రబంధము రసాది వ్యంజకమగునను నంశము మొదటి కారిక (                    ) యందుఁజెప్పఁబడియెను. ఇప్పుడో పారంపర్యముచే వర్ణపదాదులకగు రసవ్యంజకత్వము చెప్పఁబడుచున్నది. కావున వృత్తియందుఁగూడ "అభివ్యజ్యమానమై (ప్ర)కాశించుచుండును)" అని (ముందు) చెప్పఁబడును. అనఁగా రసాదికము సుప్విశేషాదులచే విభావాది వ్యంజనాద్వారమున పరంపరగా నభివ్యజ్యమానమై ప్రకాశింపఁజేయఁబడునని యర్థము.

మూలము :— రసాదిరూపమగు అసంలక్ష్యక్రమధ్వని, సంబంధ విశేషములచేతను, సుబ్విశేషములచేతను, తిఙ్విశేషముల చేతను, వచన విశేషములచేతను, కారకశక్తులచేతను, సమాసముల చేతను, కృద్విశేషములచేతను, తద్ధిత విశేషములచేతను, కాల, నిపాత, ఉపసర్గాదులచేతను, ద్యోత్యమానమై ప్రకాశించు చుండును. దీని కుదాహరణము (పుష్పావళి :— నూతనమగు జాతీయపద్యము) (హనుమన్నాటకమున చతుర్దశాంకమున పరిజన హిత బంధునాశము కలిగిన పిమ్మట రావణుఁడను చున్నాఁడు) పుష్పావళి :— (జాతీయమగు నూతన పద్యము).

ఇదియే పరాభవం బరులుంట నాకందు
నితఁడు తాపసుఁడీచ్చటనెవాఁడు సకట!
వధియించు రాక్షసాన్వయము రావణుఁడహో!
బ్రతుకుచున్నాఁడె? ఛీ! ఛీ! శక్రజితుని
కథ మజేలా? ప్రబోధితవంతుఁడగు కుంభ
కర్ణునిచేత నెయ్యది చేయఁబడియె
వృథగ స్వర్గగ్రామటికా విలుంఠనమునఁ జేఁ
పెరుగుచునున్న యీ భుజము లింకేల?

ప్రజ్ఞామతి :— మీఁది పద్యమునకు మాతృకయగు శ్లోకమిది.

శ్లో॥ న్యక్కారోహ్యయమేవమే యదరయస్తత్రాప్యసౌ తాపసః।
సోఽప్యత్రైవనిహన్తి రాక్షసకులం జీవత్యహో రావణః॥
ధిక్ ధిక్ శక్రజితం, ప్రబోధితవతా కిం కుమ్భకర్ణేన వా
స్వర్గ గ్రామటికా విలుణ్ఠన వృథోచ్ఛూనైః కిమేభిర్భుజైః॥

మీఁది పద్యార్థము నిట్లెఱుంగవలయును, ఇదియే = దీనికంటె వేఱగునది యేదియులేదు. (వేరొక పరాభవము లేదు).

అరులు = అంట + నాకున్ = నాయట్టి జగదేకవీరునకు శత్రువనువాఁడొక్కఁడును గూడ నుండఁదగదు. అట్టిచో అనేకులుండుట యనుచితమనిభావము.

"కావున, అరులు" అనునది సంబంధానౌచిత్య రూపమగు క్రోధ విభావ మును వ్యంజింపఁజేయుచున్నది, అందున్ = ఆశత్రువులందుఁగూడ-ఇతఁడు

తాపసుఁడు = రాక్షసులచే భక్షింపఁదగిన మనుష్యుఁడగు వీఁడు తపోమాత్రమే బలముగా గలవాఁడు. అనఁగా పౌరుష శక్తివిహీనుఁడని భావము. ఈ యభిప్రాయము మత్వర్థీయమగు తద్ధితముచే నభివ్యక్తమగుచున్నది. అందున్ అనుదానిచే అసంభావనీయత్వము ప్రకాశింపఁజేయఁబడుచున్నది. అకటా = అయ్యో! వాఁడున్ = మనుష్యమాత్రుఁడును తాపసుఁడును నగు ఆ శత్రువుగూడ, ఇప్పటనే = ఈ లంకలోనే, నా యెదుటనే (ఏవో దుర్గమారణ్య ప్రదేశమునందుఁగాదు) ఊరకుండక రాక్షసాన్వయమున్ వధించున్ = ఒకనినో, ఇద్దరినోగాక భయంకరమగు రాక్షసవంశము నంతటిని బాలవృద్ధ స్త్రీ పర్యంతమును నిశ్శేషమగు విధమునఁ జంపుచున్నాఁడు. (ఒక్కనినిఁగూడ విడుచుటలేదు.) ఇది యసంభావ్యముగ నున్నదని భావము. తిఙ్, కారకశక్తి ప్రతిపాదకములగు శబ్దములచేత నిచటఁ బురుషకారాభావము ధ్వనింపఁజేయఁబడుచున్నది.

రావణుఁడు = విశ్రవసు సంతతిలోనివాఁడు లేక, పరాక్రమాతిశయముచే సకల లోకములను గూడ ఆక్రందింపఁజేయువాఁడు.

అహో = ఆశ్చర్యము! బ్రదుకుచున్నాఁడే! = బ్రతికియుండుటలేదు. రావణుఁడు బ్రతికియే యుండినయెడల రాముఁడు రాక్షసవంశమును వధించుట సంభవించి యుండదని భావము. ఇందు "రావణుఁడు" అనుపదము అర్థాంతర సంక్రమిత వాచ్యము. అనఁగా రావణుఁడను పదము-జగదేకవీరుఁడు, స్వర్గవిమర్దనకారి సర్వలోక భయంకరుఁడు, ఇత్యాదులగు అనేక అర్థాంతరములతో సంక్రమితమగు వాచ్యము కలదని వెలుఁగునది. ధిః ధిః అను నవ్యయము శక్రజితుని అను సమాసముతోఁగూడి రావణుని కొడుకు శక్రుని జయించెననునది కల్పితకథ యను నంశమును వ్యంజింపఁజేయుచున్నది.

ప్రబోధితవంతుఁడగు ఆయాస సహస్రకృత జాగరణుఁడు (అనేకములగు శ్రమలచే మేల్కొలుపఁబడినవాఁడు) అగు "కుంభకర్ణునిచేత నెయ్యది చేయఁబడెను" = కుంభకర్ణుని మేల్కొల్పుట ప్రయాసవంతమయ్యెనేగాని యతనిచే నెట్టి ప్రయోజనమును సాధింపఁబడ నేరదయ్యెనని భావము. ఈపాటి ప్రయోజకత్వమునకు వీనిని కష్టపడి మేల్కొల్పుట కూడనా! అనినింద.)

స్వర్గగ్రామటికా ఇత్యాది సమాసము స్వపౌరుషానుస్మరణవ్యంజక మగుచున్నది. గ్రామటికాయను స్త్రీ ప్రత్యయ సహితమగు స్వార్థిక తద్ధిత ప్రయోగము స్వర్లోకజయము బహుమానాస్పదము కాదను నంశమును బ్రకాశింపఁజేయుచున్నది. విలుంఠన శబ్దమునందలి 'వి' శబ్దము నిర్దయావస్కందన వ్యంజకమై యున్నది. వృథగన్ అను నవ్యయము స్వాత్మపౌరుష నిందావ్యంజకమై యున్నది.

"భుజములు" అను బహువచనముచే ఇవి యనుపయుక్తములగుటయేగాక భార మాత్రములుగూడ నగుచున్నవను నంశము ధ్వనింపఁజేయఁబడుచున్నది. ఇట్లు విభజించిన కొలఁదియు నిందలి పదములన్నియుఁగూడ గంభీరమగు నిందలి యర్థము నకు వ్యంజకములగుచున్నవి. ఇట్లు వ్యంగ్యరూపమగు నీ-యర్థము-రావణగత క్రోధ వ్యంజక మగుచున్నదని యెఱుఁగునది.

మూలము :— ఈపద్యము నందలి పదములన్నియు నత్యంతము రసవ్యంజకములగుట స్పష్టముగనే గాన్పించుచున్నది గదా! (1) "అరులఁట నాకు" అనుచోట వచన సుప్సంబంధము లును, "అందు నితఁడు తాపసుఁడు" అనుచోట తద్ధితనిపాతము లును "ఇచ్చటనేవాఁడు నకట! వధియించు రాక్షసాన్వయము రావ ణుఁడహో బ్రతుకుచున్నాఁడే!" అనుచోట తిఙ్, కారక, శక్తులును "ఛీ! ఛీ! శక్రజితుని..........ఈ భుజము లింకేలా!" అనుచోట కృత్తద్ధిత సమాసోపసర్గములును రసధ్వనికి వ్యంజకము లగు చున్నవి.

ప్రభామతి :— ఇందలి పదములన్నియు విభావాది వ్యంజకములగుటచే పరంపరగా రసవ్యంజకము లగుచున్నవి. ఇందు "అరులు" అనుచోట బహువచన మును, "నాకు" అనుచోట షష్ఠ్యర్థమగు కుప్రత్యయమును, "నాకరులు" అనుచోట సంబంధమును, "తాపసుఁడు" అనుచోట (తాపసశబ్దమందలి "అణ్" ప్రత్య యము తద్ధితము) తద్ధితమును, "అందును, వాఁడును, అనుచోట అవ్యర్థకములగు 'ను' అను నిపాతములును, "వధియింతున్ బ్రదుకుచున్నాఁడు" అనుచోట తిఙ్లు లును, "రాక్షసాన్వయమున్" అనుచోట కారకశక్తియును అర్థవ్యంజకములని యెఱుంగునది.

ఇట్లే 'ఇచ్చటనె' అనుచోట అధికరణత్వమును, "ఏవకారమును, అకట! అహో!, అనుచోట నవ్యయములును జీవధాత్వర్థకమగు బ్రతుకు అనునదియు, 'రావణుఁడు' అనుపదమును, వ్యంజకములే యగుచున్నవి.

మఱియు "శక్రజితుని, ప్రబోధితవంతుఁడు" అనుచోట్ల కృత్తులును "గ్రామ టికా" అనుచోట తద్ధితమును, స్వర్గ్రామటికేత్యాది సమాసమును, 'ప్రబోధిత, విలుంఠన, అనుచోట్లనున్న ప్ర. వి. అను నుపసర్గలును, వ్యంజకములగుచున్నవి. మఱియు "ఛీ! ఛీ! ఇఁకన్, ఏలా" అనుచోట్లనున్న అవ్యయములును, శక్రరూప ప్రకృతియును 'ప్రబోధిత' అనుచోట ప్రేరణార్థకమగు ణిచ్చును, స్వర్గమందగు

గ్రామటికాత్వారోపమును, "భుజములు" అనుచోటి బహువచనమును, అర్థవ్యంజకములగు చున్నవని యెఱుంగునది.

"ఇందుఁగ్రోధము (స్థాయిభావము) ప్రతీయమానము" అనునెడల రౌద్రరసమును, "ఉత్సాహము ప్రతీయమానము" అనునెడల వీరరసమును ధ్వనితము అని యెఱుంగునది.

మూలము :— ఏవంవిధమగు వ్యంజక శబ్దాధిక్యము ఘటింపఁజేయఁబడునపుడే కావ్యమునకు సర్వాతిశాయినియగు బంధచ్ఛాయ (సంఘటనా సౌందర్యము) సమున్మీలితమగును.

ప్రభమతి :— (మహాకవిత్వపదాభిషేకమును గొను కవివర్యుఁడు-కావ్యజీవితమగు వ్యంగ్యార్థమును వ్యంజింపఁజేయునవియగు నిట్టి వ్యంజక శబ్దముల నత్యధికముగాఁగూర్చి కావ్యమును రచించునెడల-ఆకావ్యమునకు సర్వోత్తమమగు సౌందర్యము లభించును. వ్యంజక శబ్దశూన్యమగు కావ్యము-నీరసమే యగును, అందలి రచన-సౌందర్యసమున్మీలితము కాకుండుటవలన దానిని సహృదయు లాదరింపరని గ్రహించునది).

మూలము :— వ్యంగ్యార్థప్రకాశకమగు పదము-ఒక్కటి, ఆవిర్భవించినను గూడ కావ్యమున కనిర్వచనీయమగు బంధచ్ఛాయ కల్గునపుడు బహువ్యంజక (శబ్ద) సమవాయముగల కావ్యమునకుఁ గలుగు బంధచ్ఛాయను (రచనా సౌందర్యమును) గూర్చి వేఱుగా చెప్పవలసినదేముండును?

పూర్వోక్తమగు పద్యమే దీనికుదాహరణము.

ఇందు (ఇదియే అను పద్యమునందు) "రావణుఁడు" అను పదము-అర్థాంతర సంక్రమిత వాచ్యరూపమగు ధ్వని ప్రభేదముచే నలంకరింపఁబడియున్నను పూర్వోక్తములగు వ్యంజకప్రకారము లింకనెన్నియో దానితోఁగలిసి ప్రకాశించుచున్నవి (గదా).

ప్రతిభావిశేష భాక్కులగు మహాత్ముల రచనల యందిట్టి ప్రకారములెన్నియో కాన్పించుచుండునుగదా!

మూలము :— (అవ :— వ్యాస-కాళిదాసాది మహాకవుల రచనల యందీ వ్యంజకశబ్దప్రయోగమును ప్రదర్శించి, వాని

చేత ప్రభాసింపఁజేయఁబడిన ధ్వనులను విశదీకరించుచున్నాఁడు.)

మహర్షియగు వ్యాసుడు.

గీ॥ "ప్రత్యుపస్థిత ఘోరరూపంబులగుచు
కాలము లతిక్రమిత సౌఖ్యలీలలయ్యె।
దిన దినమ్మున పాపీయదివస యగుచు
విగతయౌవనయయ్యె పృథ్వీలతాంగి॥"

అని మహాభారతము నందుగ్గడించెను.

ఇందు కృత్ - తద్ధిత-వచనములచేత-అసంలక్ష్య క్రమ వ్యంగ్యధ్వనియు, "దినదినమ్మున," "విగతయౌవన" అను వాని చేత-అత్యంత తిరస్కృతవాచ్యధ్వనియు, ప్రకాశింపఁజేయఁబడినవి.

ప్రభామతి :—

శ్లో॥ అతిక్రాన్త సుఖాః కాలాః,
ప్రత్యుపస్థిత దారుణాః
శ్వః శ్వః, పాపీయదివసా
పృథివీ గతయౌవనా॥

అనునది వ్యాసభగవానుని మూలశ్లోకము.

మీఁది పద్యమునందు, ఉపస్థిత, అతిక్రమిత, గత, అనునవి (క్తరూప) కృత్తులు. "పాపీయ" అనునది ఛప్రత్యయ తద్ధిత, "కాలములు" అనునది బహు వచనము.

'ప్రత్యుపస్థిత' అనుచోట 'క్త' ప్రత్యయముచే :— దుఃఖములిదివరకే ప్రాప్తించి యుండుటయు, అవి నిరాకరింపరానివగుటయు, 'అతిక్రమిత' అనుచోట భూతకాలార్థక 'క్త' ప్రత్యయముచేత సుఖమునకింకెప్పుడును వర్తమాన కాలికత్వము లేకుండుటయు, ఆ కారణమున కాలము భయంకరమైనదగుటయు, 'గత' అనుచోటఁగల 'క్త' ప్రత్యయముచే పృథివికి తిరుగ యౌవనము రాకుండుటయు, దాన నామె విస్సారయగుటచే విడువఁదగి యుండుటయు, పాపిజనసంబంధ బోధకమగు 'ఛ' ప్రత్యయముచే :— దివసములు హీనములగుటయు 'కాలములు' అనుచోటనున్న బహువచనముచేత కాలములు నానావిధములై యుండుటయు, వానిని ద్రోసిపుచ్చుటకు వీలులేకుండుటయు, వానిని క్లేశముచే గడుపవలసియుండుటయు, 'దినదినమ్మున' అనుటచే నొకనాటికొకనాఁడు పాపీయములగు దివసముల

యొక్కయు, 'విగత యౌవన' అనుటచే వృద్ధ స్త్రీ వలె ననంభావ్యమాన సంభోగ యగు పృథివియొక్కయు, దౌర్భాగ్య మత్యధికమగుచుండుటయు, ప్రకాశింపఁజేయఁ బడుచున్నవి. కాలము స్వభావముచేతనే దుఃఖమయము. అందును పాపిష్ఠజన స్వామిక పృథివీ లక్షణదేశదౌరాత్మ్యమువలన మఱియునది విశేషించి దుఃఖమయ మగుచున్నదని భావము. మీఁది కృదాదులన్నిఁటిచేతను నిర్వేదద్వారమున శాంత రసము ధ్వనింపఁజేయఁబడుచున్నది. జడమగు పృథివియందు యౌవనము సంభ వింప కుండుటవలన 'విగతయౌవన' 'అనుపదము' పృథివి-ఉపభోగసమర్థము కానే రదు అను లక్ష్యార్థమును ప్రదర్శించుటచేత ఇంద త్యంత తిరస్కృత వాచ్యధ్వనికూడ కలదని యెఱుంగునది.

మూలము :— మీఁద ప్రదర్శింపఁబడిన సుబాదులు ప్రత్యేకముగను సమస్తము(సముదితము)ఁగనుగూడ వ్యంజకము లగుట మహాకవి ప్రబంధములందుఁగాన్పించుచున్నది. (అవి వేర్వేరుగా వ్యంజకములగుట కుదాహరణము నిచ్చుచున్నాఁడు.)

(మేఘసందేశమునందు యక్షుఁడు మేఘునితో ననుచున్నాఁడు) సుబంతము వ్యంజకమగుటకు ఉదా :—

గీ॥ అధికశింజావలయ మనోహరములైన
తాలములచే మదీయ కాంతనటింపఁ
జేయ మీ సుహృత్తగు శిఖిశ్రేష్ఠ మచట
నధివసించునుగాదె దినాంతమందు॥

ప్రభామతి :— ఇందు 'తాళములచేన్' అనుబహువచనము సంగీతాద్యనేక భంగిమనోహరమగు యక్షపత్నినర్తనవైదగ్ధ్యమును ధ్వనింపఁజేయుచు విప్రలంభ శృంగారోద్దీపకమగుచున్నది.

మూలము :— తిజన్తము వ్యంజకమగుటకుదా :— (తన్నుగు వయించుచున్న నాయకునితో నొక ఖండిత యనుచున్నది.)

గీ॥ వెడలిపొమ్మెద్చుటకెగదా విధి సృజించె
ఈ హతాక్షులః నూరార్చెదేలనన్ను
కనుఁగొనిన మాత్రి నున్మాదగతి వహించి
నీ హృదయ మియ్యది గ్రహింప నేరదయ్యె॥

ప్రభావతి :— ఇందు ముఖ్యమగు 'వెడలిపొమ్ము' అను తిజన్తముచే నాయక విషయక రోషస్ఫురమున నాయకు నపరాధముల క్షమింపరానివగుట సూచింపఁబడుచున్నది. మఱియు నిందలి 'ఏస్పటకె' హతాశీలన్, కనుఁగొనిన మాత్రన్, హృదయము, అను పదాంతరములు తదను గృహీతములై వ్యంజకము లగుచున్నవని యెఱుంగునది.

మూలము :— ఇంకొకటి (ఒకానొకతె కృత్రిమరోషావిష్టయై మాగ్గరోధకుఁడగు కాంతునకు సంకేత స్థలమును సూచించుచున్నది).

కం॥ వలదిట్లు దారినడ్డకు
తొలఁగుము బాలక! అలజ్జితుఁడ వహహా! నిరి
చ్ఛలమేము-శూన్యమగు మ
న్నిలయమునకు మేమె-రక్ష నెఱపఁగ వలయున్॥

ఇచట "తొలఁగుము" అను తిజన్తము-నిర్జనమగుటచే :— "సంకేతోచితమగు మాయింటికేరమ్ము" అను నర్థమును ధ్వనింపఁజేయుచున్నది. ఇందు సంభోగ శృంగారము వ్యంగ్యము. సంబంధము వ్యంజకమగుట కుదాహరణము :— (ఒక జలాశయమునందు స్నానముచేయుచున్న ఒకసుందరిని భార్యకుఁదెలియకుండ సాభిలాషుఁడై చూచుచున్న యొక గృహస్థునితోఁ దత్కామినియగు నొక లేమ యనుచున్నది).

గీ॥ ఓయిబాలక! ఏగు మింకొండు కడకు
స్నాంతి నన్నిట్లు చూచుచున్నావదేల?
అకట! జాయావిభీరుకులైన వార
లకు జలాశయ తీరవర్తనము తగునె?॥

కృత-"క" ప్రయోగములగు (తద్ధితకప్రత్యయ ఘటితములగు) ప్రాకృతములందు "(జాయావిభీరుకాణామ్" ఇత్యాదికావ్యవాక్యములయందు) తద్ధితవిషయమందగు వ్యంజకత్వము ప్రసిద్ధమే! (ఇందలి "క" ప్రత్యయము అవజ్ఞాతిశయద్యోతకము) వృత్యో

చిత్యముచేఁగూర్చునపుడు (కేవలములగు) సమాసములు గూడ నెట్లు వ్యంజకములగునదియు నెఱుంగునది.

ప్రభామతి :— ఇందలి 'క' ప్రత్యయ గ్రహణము కాదితద్ధితోపలక్షణార్థమని యెఱుంగునది. మఱియు నీపద్యమునందలి యీ-యీపదములు, ఈ-యీ-యర్థముల కభివ్యంజకములని పాఠకులు గుర్తించునది. ఓయీ! ఇది ఎత్తిపొడుపుతోఁగూడిన పిలుపు. (శోల్లుంఠమగు నాహ్వానము) 'బాలక!' అనునది జాయ (భార్య)యందలి ప్రణయ మధికమో, కామినియందలి ప్రణయ మధికమో యెఱుఁగని "అప్రౌఢుఁడా" అను నర్థమునకు వ్యంజకము. "జాయావిభీరుకులు" అనునది సంతతి జననమాత్ర కారణత్వ ద్వారమున :- ప్రణయాదిశూన్యులు, పరాధీనులు, కావుననే క్షణక్షణః ప్రణయభంగము నాశంకింపఁదగినవారు, కావుననే ప్రణయ సంబంధమున కనుపయోగింపనివారు ఇత్యాద్యర్థమునకు వ్యంజకము.

ఇందు "జాయాభీరుకులైనవారలకు" 'జలాశయతీర వర్తనము" అని చోమన్న (షష్ఠ్యర్థ) సంబంధముచే నట్టి గృహస్థునియందీ-కామినికిఁగల జాయాసక్తి నిమిత్తకమగు నీర్ష్యాతిశయము ధ్వనింపఁజేయఁబడుచున్నది. 'జాయా విభీరుకులు'' అనుదాని యందలి 'క' ప్రత్యయము :— ''ఎవరు రసజ్ఞులుగాక ధర్మపత్ని పరతంత్రులగుచుందురో, వారికంటె నీలోకమున కుత్సితుఁడగు వాఁడింకొకఁడుండఁడు'' అను నవజ్ఞాతిశయమునకుద్యోతక మగుచున్నది. ఇట్లు సంబంధ బోధక 'క' ప్రత్యయములకుఁగల వ్యంజకత్వము స్పష్టమగుచున్నది.

మూలము :— నిపాతములు, వ్యంజకములగుగుటకు ఉదా:— కాళిదాసుని విక్రమోర్వశీయమున (విరహియగు పురూరవుఁడను చున్నాఁడు.)

గీ॥ అంతలోనె సుదుస్సహంబగు విధమున
సముపగతమయ్యె చెలివియోగమును నాకు
నవజలధరోదయమున ననాతపత్వ
రమ్యములగు దినంబులు"న్" రాఁదొడంగె॥

ఇందు "చ" శబ్దార్థకమగు "ను" శబ్దము-వ్యంజకము.

ప్రభామతి :— ఇందలి యలంకారము సముచ్చయము. వియోగమును, దినంబులున్, అనుచోనున్న 'ను,ను'లు (సద్వయము) కాకతాళీయ న్యాయమున గండముపైని పిటకమువలెనే ప్రియసీ వియోగమును, వర్షాసమయమునుగూడ

వొక్కసారియే గల్గినవి అమటచే ప్రాణహరణమున కిఁయే చాలునను వంశము సూచింపఁబడుచున్నది. ఇందలి 'అనాతపత్వరమ్యములు :— మేఘచ్ఛాయచే హృదయాకర్షకములు' అనునది ఏకానత్వముచేత విరహ విప్రలంభ శృంగార వ్యంజకమగుచున్నది.

మూలము :— ఇంకొక ఉదా :— (కాళిదాసుని శాకుంతల నాటకములోనిది.)

గీ॥ సంతతమ్ము నిజాంగుళి సంవృతాధ
రమ్ము ప్రతిషేధవర్ణ విక్లబమనోజ్ఞ
మంస పరివర్తియగు పక్ష్మలాక్షి ముఖము
నెట్లొ యెత్తితిఁగాని చుంబింపనైతి॥

ఇచట "తు" శబ్దార్థకమగు "కాని" అనుపదము వ్యంజకము, నిపాతములు ద్యోతకములగుట ప్రసిద్ధమైనను విచ్చట నది రసాపేక్షచేఁజెప్పఁబడెనని యెఱుఁగునది.

ప్రభామతి :— ఇందు 'తు' శబ్దార్థకమగు 'కాని' అనునది పశ్చాత్తాప సూచకమగుచు, "తావన్మాత్రమగు పరిచుంబనము లభించినను గూడ కృతకృత్యత గలిగియుండెడిది" అను వంశమును ధ్వనింపఁజేయుచున్నది. వైయాకరణులు మొదలగువారి యిండ్లలో ఈ నిపాతములు - ధాతువులు మొదలగు వానికిముందే ప్రయోగింపఁబడునుగాని స్వతంత్రముగా ప్రయోగింపఁబడవు. వీనికి లింగ, సంఖ్యలుండవు. ఇట్టి నిపాతములు వస్తువ్యంజకములనునది వైయాకరణాదినయమున ప్రసిద్ధమే యగుచున్నను రసాదివ్యంజకములనునది ప్రసిద్ధముగాదు. ఆవిషయమే సూచేత నిచట క్రొత్తగాఁజెప్పఁబడుచున్నదని భావము.

మూలము :— ఉపసర్గములు వ్యంజకము లగుటకుదా :—.

సీ॥ పరశుక గర్భకోటర ముఖమ్ములనుండి
జారినవగుచు నీవారధాన్య
ములు వృక్షముల యధస్థలములంబడి కాన
నయ్యె ప్రస్నిగ్ధంబులగుచు కొన్ని
నెఱవుల నింగుదీఫలభిత్తులగు ప్రస్త
రములు సంసూచకత్వమె వహించె

విశ్వాసయుక్తి నభిన్నసంచార నం
కలితంబులై కురంగములు శద్ది

గీ॥ మును సహించుచునున్న విప్పుడు, జలాశ
యంబులకుఁ బోవుచున్న మార్గంబులెల్ల
వల్కల శిఖావినిష్యంద బహుళరేఖ
కాంకితము లౌచు దర్శనీయంబు లయ్యె॥

ప్రభానుతి :— ఇందు ప్రకర్షేణస్నిగ్ధాః "ప్రస్నిగ్ధాః" అనఁబోనున్న ఉప
సర్గమగు ప్రశబ్దము "ఇంగుదీఫలములు (గారపళ్లు) మిగులసరసములు" అను
నంశమును జెప్పుచు కణ్వాశ్రమ సౌందర్యాతిశయమును ధ్వనింపఁజేయుచు పరం
పరగా శాంతరస వ్యంజకమగుచున్నది.

మూలము :— ఛందస్సు వ్యంజకమగుట కూడా :—
(ఔపచ్ఛందసికచ్ఛందము)

రవముదిత కపోతముత్స్వనంబున్
ప్రవిరళ వామన వృక్ష సంయుతంబున్
ప్రవిశదధిక భీష్మ మీవనం బిం
కవు వ్యసనంబటు ఘోరమూర్తి ముందున్॥

ఇత్యాదులయందు ప్రశబ్దమునకును ఔపచ్ఛందసిక ఛందము
నకును గూడ వ్యంజకత్వము స్ఫురించుచున్నది.

ప్రభామతి :— ఔపచ్ఛందసిక ఛందము—

శ్లో॥ మదముఖరకపోత మున్మయూరమ్
ప్రవిరళ వామన వృక్షసన్నివేశమ్
వనమిద మవగాహమాన భీమం
వ్యసనమివోపరి దారుణత్వమేతి॥

ఈ ఛందమిచట వస్తువ్యంజనద్వారా భయానకరసవ్యంజకమై యున్నది.

మూలము :— రసాభివ్యక్త్యనుగుణములై నపుడు మాత్రము
రెండు మూఁడుపసర్గముల నొకే పాదమునందైనను ప్రయో

గించుట దోషముకాదు. ఇందుల కుదా :— (ప్రిభ్రిశ్యతుత్త్ర
రీయత్విషితమసి సముద్వీక్ష్య పీతావృతీన్" అను మూలశ్లోకము)

"పీతావృతులన్ జంతువుల సముద్వీక్షించి" అనుపద్యము,

ప్రిభామతి :— "సముద్వీక్షించి" అనుపదమునందలి సం, ఉత్, వి, అను నుపసర్గసముదాయము చక్కఁగను, ఉన్నతముగను, విశేషముగను చూచుటను బోధించుచు భగవంతుఁడగు సూర్యుఁడు జంతువుల యందధికమగు దయగలవాఁడను నంశమును వ్యంజింపఁజేయుచున్నది.

మూలము :— ఇంకొక యుదా :—

గీ॥ ఆత్మబుద్ధి సామాన్య కృతానుమాను
లగు నపండితుల్ తర్కవాక్యముల మనుజ
వృత్తి సముపాచరించు నిస్పృహయోగు
లకు నెఱుఁగరాని వాని నారయఁదలంతుర్॥ ఇత్యాదికము.

ప్రిభామతి :— సముపాచరించు :— ఇచటి సమ్, ఉప, అఙ్, అను నుపసర్గముల సముదాయము పరమేశ్వరుని లోకానుజిఘృక్షాతిశయమును వ్యంజింపఁజేయుచున్నది.

మూలము :— నిపాతములనుగూడ సప్తే (రెండు మూఁడింటి నొకపాదమునందు) రసాభివ్యక్త్యనుగుణముగా ప్రియోగించుటయు దోషముకాదు. ఇందుల కుదా :—

గీ॥ అహాహః స్పృహణీయ వీర్యుండ వైతివకటః
మఱియొకటి (సజ్జనులు నశించి దుర్జనులున్నతి నొందుటకు వగచుచున్నవాఁడు అనుమాట).

చం॥ అలఘుగుణాఢ్యుఁడైన జనునారసి ప్రస్థలదున్మదాళులై
పులకిత దేహులై తనువుపొంగముదంబున నాట్యమాడువా
రల కహహాః యసాధుజన రక్షకుఁడాళరుఁడావిధాతయే
ప్రిశయముఁగూర్ప నాకొరుఁడెవండిఁక దిక్కుఁగుఁగష్ట
మక్కటాః

ప్రిభామతి :— అహాహా!, అకటః అనువానిచే క్రిమముగా శ్లాఘాతిశయమును, నిర్వేదాతిశయమును, ధ్వనింపఁజేయఁబడుచున్నవి.

మూలము :— పదపౌనరుక్త్యముగూడ నొకానొకచో వ్యంజకత్వాపేక్షచేత ప్రయుజ్యమానమై శోభాదాయకమగుచుండును. ఇందులకు ఉదా :—

గీ॥ ఇచ్చకపు మాయమాట లెన్నేనిఁబలుకు
వంచకుఁడు స్వార్థసాధనపరుఁడు ఖలుఁడు
సుధులు తద్‌జ్ఞులుకారె తద్‌జ్ఞులె యగుదురు
కాని తత్ప్రీతి వృథసేయఁగడఁగకుందురి॥

ప్రభామతి :— ఇది (పదపౌనరుక్త్యము) వాక్యాది పౌనరుక్త్యమునకుఁ గూడ నుపలక్షణమని యెఱుంగునది. ఇచట సుధులు తద్‌జ్ఞులుగారె, అనునది ప్రకృతార్థమును దృఢముగా బోధించుచున్నను 'తద్‌జ్ఞులె' యగుదురు. అని తిరుగఁ జెప్పఁబడెను. దీనిచే తదితరులకంటె వారె యధికముగా నన్నింటినిఁదెలిసికొను చుందురను నంశము ధ్వనింపఁజేయఁబడుచున్నది.

మూలము :— కాలము వ్యంజకమగుటకు (ప్రవాసము నకుఁబోవనున్న ప్రియునితో తత్ప్రియురాలనుచున్నది). ఉదా :—

గీ॥ ప్రథితమార్గంబుల చిరకాలంబునందె
సమతలంబు నిమ్నోన్నతస్థలము నేరు
పడఁగ నీకెందు పథికులనడకలరుదు
గాఁగ నభిలాషలకును దుర్గమము లగును॥

మీఁది "ప్రథితమార్గంబులు"..................దుర్గమములగును" అనుచోటనున్న "అగును" (కాఁగలవు) అనుపదమునందున్న ప్రత్యయము (భవిష్యదర్థకమగు "ను") కాల విశేషమును దెలుపుచు రస పరిపోషహేతువై ప్రకాశించుచున్నది. ఈగాథార్థము ప్రవాస విప్రలంభమునకు విభావముగా విభావ్యమానమై రసవంత మగుచున్నది.

ప్రభామతి :— వర్షాసమయ మాసన్నమగునపుడు ప్రవాస మనుచితముకావచ్చని భావము. ఇచట భవిష్యత్కాల బోధకమగు 'ను' ప్రత్యయము "ఉత్ప్రేక్ష్యమాణ మగు వర్షాసమయమే విరహిజనకంపకారి యగునపుడు వర్తమానమగు వర్షాసమయ

మును గూర్చి చెప్పవలయునా?'' అను నంశమును ధ్వనింపఁజేయుచు ప్రవాస హేతుకమగు విప్రలంభ శృంగార రసమునకు వ్యంజకమగుచున్నది.

మూలము :— మీఁది పద్యమునందు ప్రత్యయాంశము వ్యంజకమైనట్లు కొన్నిచోట్ల ప్రకృత్యంశముకూడ వ్యంజకముగాఁ గన్పడుచున్నది. (అధిక దరిద్రుఁడగు సుదామునికి భగవత్కృపచే నొదవిన సంపదనుగాంచి యొకఁడనుచున్నాఁడు).

చం॥ అది నతభిత్తియైన నిలయం, బిదినాకమునేలు మందిరం,
బది కడువృద్ధురాలయిన-యా, విదినీరదతుల్య హస్తిసం
పద, వెతనించు దంపురొాద యయ్యది, కాంతలమంజుగీతమి
య్యది, దినముల్ ఘటంచెనహహా ద్విజుఁడీతనికీ మహో
దశన్॥

ఈపద్యమునందు "దినములు" అను నీపదమునందలి ప్రకృత్యంశముగూడ అర్థద్యోతకమగుచున్నది. పైపద్యమే సర్వ నామములుగూడ వ్యంజకము లగుటకుదాహరణమై యున్నది.

ప్రభామతి :— 'దినములు' అనుచో దినరూపమగు ప్రకృతిభాగము ఎన్నియో నెలలలోనో, సంవత్సరములలోనో లభింపవలసిన సంపద లల్పకాలము ననే సంప్రాప్తించుటను బోధించుచు, సుదామునికిఁగల్గిన సంపద 'అసంభావ్యమాన ము'లను నంశమును ధ్వనింపఁజేయుచున్నది. 'కూడ' అనిచెప్పుటచే ప్రకృత్యంశ ముతోఁగూడిన సర్వనామములు వ్యంజకము లగునను నర్థమేర్పడుచున్నది.

మూలము :— మీఁది పద్యమునందు కవి సర్వనామము లను వ్యంజకములుగా వ్యవస్థాపించియే "ఎక్కడ" (నతకుడ్యమగు నాగృహముండెడిదో) "అక్కడ" ఇత్యాది ప్రయోగమును గావింపఁ దయ్యెను. మీఁది విధము ననుసరించి మిగిలిన వ్యంజక విశేషము లను సహృదయులు స్వయముగా నుత్ప్రేక్షింపఁదగును. ఇది యంతయును పదవాక్యరచనాద్యోతనోక్తిచేత గతార్థమేయైనను పై చిత్ర్యముచే వ్యుత్పత్తిని గలుగఁ జేయుటకుఁ దిరుగఁ జెప్పఁబడి యెను.

ప్రభామతి :— 'అదినతభిత్తి' అను దానియందలి 'ఆది' అను సర్వనామము :— "ఆ-గృహ మమంగళ నిదానభూత మూషికాద్యాకీర్ణము" అను నర్థమును ధ్వనింపఁజేయుచున్నది. ఇట్లే 'ఆదికడువృద్ధురాలయిన యావు' ఇత్యాదులందంతటను యోజించునది. దీని యందంతటను స్మరణాకారము సర్వనామముచే వ్యంజింపఁజేయఁబడుట నెఱుంగునది. "ఆ-గృహంబు, ఆ-ధేనువు" ఇత్యాది స్థలమునందలి స్మృతియు, "ఈ-మందిరంబు, ఈ-హస్తి సంపద" ఇత్యాది పంతతుల యందలి యనుభవమును పరస్పర విరుద్ధ విషయత్వమును సూచించుచు ఆశ్చర్యవిభావము లగుచున్నవి.

అది, ఇది '(ఆ-ఈ') అను శబ్దము లిచటలేనియెడల నీ-యర్థము సంగతము కాఁజాలదు, కావున అది, ఇది అను ('సర్వనామ') శబ్దములే యీ పద్యమునకు ప్రాణములు (చమత్కారకారణ) అని యెఱుంగునది.

ఈ యంశ మింతకు ముందే చెప్పఁబడినను విస్మృతి నివారణము కొఱకును అధికముగాఁ దెలిసికొనుటకును మరల వివరింపఁబడినది.

మూలము :— (అయ్యా!) "రసాదులు అర్థసామర్థ్యముచే నాక్షేపింపఁ (ప్రకాశింపఁ) జేయఁదగినవే" అని చెప్పఁగూడదు. (1) అట్లయినచో సుబాదుల (డు, ము, వు, లు ఇత్యాదుల)కు వ్యంజకత్వ వైచిత్ర్యమును జెప్పుటకే వీలుండకపోవును.

ఈ గ్రంథమునందే (ఇంతకుముందు) పదములు వ్యంజకములని చెప్పునప్పుడు (2) ఈ విషయము చెప్పఁబడియెను.

ఇంతియేగాక రసాదులు అర్థవిశేషముచే నాక్షేపింపఁదగినవైనను ఆ-యర్థవిశేషములు వ్యంజకశబ్దములేనిదే కలుగనివగుట వలన మీఁద విభజింపఁబడి, ప్రదర్శింపఁబడిన వ్యంజక స్వరూప పరిజ్ఞానము ఉపయుక్తమైనదియే యగును (3)

ప్రభామతి :— (1) వాచకత్వము లేనిదే వ్యంజకత్వము కలుగని యెడల డు, ము, వు, లు ఇత్యాదులకు వ్యంజకత్వమును జెప్పుటకు వీలుకలుగక పోవునని భావము, వాచకత్వము నకు శక్తి నంగీకరించువారి మతమునందు పదములు గూడ (వాచకములు కానందున) వ్యంజకములు కాకపోవలసివచ్చును.

అవాచకములగు గీత శబ్దములును, గుణవ్యంజకములగు స్పర్శాది వర్ణములును గూడ వ్యంజకములు కాకపోవలసివచ్చును. (2) వాచకత్వము ధ్వనివ్యవహారోపయోగికాదు అను సంశయము (3) అర్థమెట్లు వ్యంజకము అగునదియు ప్రద

ర్శించు సందర్భము - తత్సహకారులగు శబ్దములంగూడ నెల్ల వ్యంజకములగునదానిని విభజించి ప్రదర్శించుట అనావశ్యకముగాదని భావము.

మూలము :— పదములు వ్యంజకములని చెప్పుచోటను, తదితర గ్రంథముల యందును శబ్దవిశేషములు (కొన్ని) సుందరము లగుచుండునను నంశము విభజించి ప్రదర్శింపఁబడినది. కావున నాశబ్దము- వ్యంజకములగుటచేతనే సౌందర్యవంతము లగుచున్నవని యెఱుంగునది.

ఎచ్చట నా వ్యంజకత్వము ప్రతిభాసింపదో అచటఁగూడ వ్యంజకమగు రచనాంతరము సంబంధింపఁబడిన సౌష్ఠవమే. పౌనఃపున్యమగు ప్రాచీన పరిచయమువలన పృథగవగతములైనను ప్రవాహపతితములగు నాశబ్దములయందుఁగూడ నవభాసించుచుండునని తప్పక యంగీకరింపవలసియున్నది.

ప్రభామతి :— భామహాదుల గ్రంథములయందు "ప్రక్చందనాది శబ్దములు శృంగారమున సుందరములును, భీభత్సమున అసుందరములును అగును" అని కావింపఁబడిన విభాగము రసకృతమే!

మూలము :— (ఈ యంశము నంగీకరింపక తప్పదనుచున్నాఁడు) అట్లు కానియెడల (వ్యంజకమగు శబ్దము-సౌందర్యనియామకమని యంగీకరింపని యెడల) సౌందర్య విషయమగు విశేషమింకేమగును? 3

ప్రభామతి :— వ్యంజకమగు శబ్దమే సౌందర్యవంతమని భావము. ఇందలి యభిప్రాయము లోచనము నందిట్లగ్గడింపఁబడుచున్నది.

'ప్రజము' చందనము మొదలగు కొన్నిపదములు శృంగారాది రసవ్యంజకము లగుచుండును. అవి ప్రకృతోపయోగకాలమునందు (శృంగారముకంటె నితరమగు నంశము వర్ణింపఁబడునపుడు) శృంగారాది వ్యంజకములుగాఁజూడఁబడుట వలన తదధివాస సుందరీభూతమగు నర్థమును (గూడ) ప్రతిపాదించుటకు సామర్థ్యము గలవియే యగుచుండును.

తట శబ్దమునకుఁగల పుంస్త్వ నపుంసకత్వముల నాదరింపక సహృదయులగు కవులు, 'తటీ' అని స్త్రీత్వమునే యాశ్రయించి ప్రయోగించుచుందురు, 'స్త్రీ' అను నామముగూడ మధురమేగదా!

అస్మదుపాధ్యాయ-విద్వత్కవి సహృదయ చక్రవర్తి భట్టేందు రాజకృతమగు వొకానొక పద్యమిందుల కుదాహరణమగుచున్నది. చూడుఁడు:

(మూలశ్లోకము) :—

ఇన్దీవరద్యుతి యదాబిభృయాన్నలక్ష్మ
స్యుర్విస్మయైక సుహృదోఽస్యయదా విలాసాః
స్యాన్నామ పుణ్యపరిణామవశాత్ తథాఽపి
కింకిం కపోలతల కోమలకాన్తి రిన్దుః॥

(ఒక చందమామనుజూచి మధ్యస్థుఁడగునొక రసికుఁడను చున్నాఁడు.)

గీ॥ విస్మయైక సుహృత్తులౌ - విలసనములఁ
దనరుఁగాక, యిందీవరంబునగు లక్ష్మఁ
బుణ్యపరిణామమున వీఁడి పొలుచుఁగాక!
కోమల కపోలతల కాంతి-సోముఁడగునె?

మీఁది పద్యమునఁ బ్రియుక్తములయిన "విస్మయైక సుహృద్, విలసన, ఇందీవర, లక్ష్మ, పరిణామ, కోమలాది శబ్దములు-శృంగారమభివ్యంజింపఁజేయఁ బడినపుడు చూడఁబడిన శక్తిగలవి. అవి యిచట నత్యధికమగు సౌందర్యము నావహించు చున్నవిగదా!

మూలము :— ప్రశ్న :– శబ్దసంబంధియగు నీ విశేషము (అన్యమే) సహృదయ సంవేద్యమే యగునని చెప్పఁదగదా?

ఉత్తరము :— సహృదయత్వమనఁగానేమి? రసభావముల నపేక్షింపక కావ్యము నాశ్రియించియున్న సమయ విశేషము నెఱుఁగుటయా? లేక రసభావాదిమయమగు కావ్యముయొక్క స్వరూపమును గుర్తించు నైపుణ్యమా?

అందు 1 ప్రథమపక్షము నంగీకరించునెడల, నట్టి సహృదయునిచే వ్యవస్థాపితములగు శబ్దములకు సౌందర్య నియమము లేకపోవలసివచ్చును. ఏలయనిన: తదితర సహృదయ సిద్ధాంతమున వానికింకొక విధమగు వ్యవస్థాపనముకూడ సంభవింపవచ్చునుగదా;

ప్రభామతి :— 1 'సహృదయుఁడు-రసాద్యనభిజ్ఞుఁడు' అనునెడల 2 రసాద్యనభిజ్ఞుఁడగు నా సహృదయుడు, సుందరము లనినశబ్దములనింకొక సహృదయుఁడు సుందరములు కావని చెప్పవచ్చును అనిభావము.

మూలము :— "రసజ్ఞతయే సహృదయత్వము" అను ద్వితీయపక్షము నంగీకరించునపుడు తథావిధులగు (రసాద్యభిజ్ఞులగు సహృదయులచే నెఱుఁగఁదగిన శబ్దగతమగు నా విశేషము (సౌందర్యము) నైసర్గికమగు రసాదిసమర్పణ సామర్థ్యమేయగును. కావున (రసాది) వ్యంజకములగు శబ్దములే సుందరములగును. కాఁగా శబ్దగతమగు నీ సౌందర్యము-ముఖ్యముగా వ్యంజకత్వము నాశ్రయించునదియే యగుచుండును.

ప్రభామతి :— " 'వస్తుతః' అద్వితీయాస్వాదాత్మకము కావున రసాదికమే-సౌందర్య నియామకము,

రసాద్యభిజ్ఞుఁడగు సహృదయుఁడు రసానుసారముగా నొనర్చిన సౌందర్య వ్యవస్థయే స్థేయమును సాధీయమునుగూడ నగును, రసాద్యనభిజ్ఞుఁడు స్వేచ్ఛచే నేదోయొక యంశమును స్వీకరించి, అదియే సుందరమను వ్యవస్థ నొనరించునెడల నా నియమము నియతము గాకపోవలసివచ్చును. ఇంకొక స్వేచ్ఛావిహారి యింకొక విధమగు వ్యవస్థను జేయుటకు వీలుండునుగదా।" (దీధితి)

మూలము :— వాచ్యార్థము నపేక్షించునపుడు మాత్రము వాచకత్వాశ్రయములగు నాశబ్దములకు సంబంధించిన విశేషము-ప్రసాదగుణమే యగును. అర్థము నపేక్షింపనపుడు మాత్రము-అవిశేషము (సౌందర్యము) అను ప్రాసాదికమే.

ప్రభామతి :— శబ్దగుణాలంకారములాదిశబ్దముచే సంగ్రహింపఁబడుచున్నవి, కావుననే రచనచేతను, ప్రసాదముచేతను, సౌందర్యముచేతను-ఉపబృంహితములగు శబ్దములే కావ్యమునఁగూర్పఁదగినవని తాత్పర్యము.

మూలము :— ఇట్లు రసాదులయొక్క వ్యంజక స్వరూపమును దెలిపి-యారసాదులకే విరోధులగు వాని స్వరూపమును లక్షింపఁజేయుటకై క్రింది విషయముపక్రమింపఁబడుచున్నది.

ఆ॥ రస నిబంధనాభిలాషియు, సుమతియౌ
కవి, ప్రబంధ-ముక్తకముల రెంటి
యందునను విరోధులగు వానిఁబరిహరిం
పఁగఁ బ్రయత్నమూనవలయు మిగుల॥

ప్రబంధమునందును, ముక్తకమునందును గూడ రసభావ నిబంధన సమాదరుఁడగుకవి-విరోధిపరిహారము కొఱకు మిగులఁ బ్రయత్నింపవలయును.

అట్లు కావింపనియెడల నా కవి-ఒక్క-పద్యమునుగూడ రసమయమగునట్లు రచింపనేరఁడు.

వ్యాఖ్యానము :— వర్ణములు మొదలు ప్రబంధము వఱకును గల రసాది వ్యంజక వర్గము మీఁదఁదెలుపఁబడియెను. ఇప్పుడు-తదభివ్యక్తికి ప్రతిబంధకము లగు విరోధుల స్వరూపమును దెలుపుటకుపక్రమించుచున్నాఁడు. విరోధి లక్షణము తెలిసినచోఁదత్పరిహారము శక్యమగునుగదా!

ప్రశ్న :— అయ్యా! "ప్రథమంబున విభావభావానుభావసంచార్యౌచితీ మనోజ్ఞమగుదాని, వృత్తంబునైనఁ గల్పితమునైన కథాశరీరంబునొకటి పరిగ్రహింపవలయు" అని యింతకుముందు చెప్పఁబడుటచేత వ్యతిరేకముఖమున తదితరమగు కథాశరీరమును బరిగ్రహింపఁగూడదని విరోధి పరిహారముకూడ తెలియుచున్నది గదా! తిరుగనిపుడు విరోధి లక్షణ నిర్వచనమేల?

ఉత్తరము :— మీ యూహ సమంజసముకాదు. 'ప్రథమంబున' అనుదానిచే విభావాద్యౌచిత్య విరహితమగు కథాశరీరమును విధింపఁగూడదను నర్థము మాత్రమే తెలుపఁబడుచున్నది గాని తద్విరుద్ధమగు నర్థమేదియు తెలుపఁబడుటలేదు. విభావాద్యౌచిత్య రహితమగు కథాశరీరమును విధించుటకూడ, విరోధి విషయ స్వీకారమంతదోష యుక్తము కానేరదు. వైద్యుఁడొకఁడు "పథ్యము నుపయోగింపుము" అని రోగికిఁదెలుప నతఁడు పథ్యము నుపయోగింపకున్నను, అపథ్యము నుపయోగించుటవలనఁగలుగునంత వ్యాధి వానికిఁగలుగదు గదా!

మూలము :— కవి-ప్రయత్నపూర్వకము గాఁ బరిహరింపఁదగిన విరోధులేవియో ప్రదర్శించు చున్నాఁడు.

మంజరీ ద్విపద- స్వవిరోధి రస-విభావాదులంగొనుట
ప్రాసంగికంబయి-ప్రాప్తించియున్న
వస్తువునెంతయు వర్ణించుటయును
అసమయంబున యందు త్యజించుటయును
అసమయాన ప్రకాశమందఁజేయుటయు
పరిపుష్టమై మనోహరమౌ రసంబు

తిరుగ నుద్దీపించి పరలఁజేయుటయు
వృత్త్యనౌచితిని గావించుచుండుటయు
రసవిరోధమున కౌరయఁగారణములు॥.

ప్రభామతి :— 'ప్రథమంబున విభావ' అనుపద్యమున విభావ—కథా శరీరంబు నొకటిఁబరిగ్రహింప వలయును. అనువానిచేఁజెప్పఁబడిన యంశమునకు విరోధియగు విషయమందు, స్వవిరోధిరసవిభావాదులంగొనుటయని, గ్రహించునది.

ఇట్లే, 'ఆందితిహాస వశమునఁగల్గి రసానుగుణంబుగానట్టి కథను త్యజించి యైన నంతరమందభీష్ట రసోచితంబయిన కథోన్నయనమునఁ గల్పితంబునైన నొనర్పఁగావలయును' అను నంశమునకు, "ప్రాసంగికంబయి ప్రాప్తించియున్న వస్తువు నెంతయు వర్ణించుటయును" అనునది విరోధియగుచున్నది. "రససముద్దీపనంబు—నేయంగవలయు"అను దానికి, అసమయంబున—ప్రకాశమందఁజేయుటయు. అనునది విరుద్ధమగుచున్నది. సంతతముగ అంగిరసమును సంధింపనగును" అను దానికి, "పరిపుష్టమై వగలఁజేయుటయును"అనునంశము విరోధి." శక్తియున్నను గూడ" కూర్పవలయు అనుదానికి "వృత్త్యనౌచితిని గావించుచుండుటయు" అనునవి విరోధియగునని గ్రహించునది.

మూలము :— ప్రస్తుత రసవిరోధియగు రసమునకు సంబంధించిన విభావ భావ (వ్యభిచారి) అను భావములను పరిగ్రహించుట రసవిరోధ హేతువులందొకటిగా సంభావింప వలయును. అందు విరోధి రస విభావ పరిగ్రహమెట్లనిన :—

శాంతరస విభావములు తద్విభావములు (శాంతరస కారణములు) గానే నిరూపింపఁబడియుండ వెంటనే శృంగారాది విభావములను వర్ణించుట,

ప్రభామతి :— శాంత-శృంగారములకు సామానాధికరణ్యము విరుద్ధము. కావున శాంతరసాశ్రియుఁడగు నాయకుని శృంగారమున కాలంబన విభావముగా వర్ణించుటయు, శాంతరసోద్దీపన విభావమును శృంగార రసోద్దీపన విభావముగా వర్ణించుటయు రస విరోధ హేతువులందొకటిగా నెఱుఁగవలయును.

శాంతరసస్థాయి భావమగు శమమును శృంగార రస స్థాయి భావమగు రతియు (నేక కాలమున) నొకేవ్యక్తియందుండ నేరవుగదా!

ఉద్దీపన విభావ విరోధమున కుదాహరణము :— "మానం మాకురుతన్వఙ్గి జ్ఞాత్వాయౌవన మస్థిరమ్" "ఓ తన్వంగీ! యౌవన మస్థిరమని తెలుసుకొని ప్రణయ

రోషమును విడువుము'' "యౌవనము స్థిరముగాదు" అను ప్రబోధము శాంత రసోద్దీపన విభావము. ఇది శృంగార రసోద్దీపన విభావముకాదు. అయినను శృంగారోద్దీపన విభావముగా వర్ణింపఁబడినది. నాయిక చుబుకమును బుడికి బ్రీతి మాలుటయో, తత్పాద పద్మములందుఁబడి ప్రణతుఁడగుటయో, ఆమెకు రత్న హారమును బహూకరించుటయో, ఇంకేదియో ఇచట ఉద్దీపన విభావముగా వర్ణింప వలసియుండ, యౌవనాస్థైర్యనివేదనమును విభావముగా నొనర్చుట యుక్తము గానే రదు గదా! హాస్య-శృంగారములకును, వీరాద్భుతములకును భయానక-భీభత్సము లకును, విభావ విరోధముండదను వభిప్రాయమున నిచట శాంతశృంగారము లుపన్య సింపఁబడినవని యెఱుంగునది. ప్రశమ-రాగములు-విరోధులుగదా!

మూలము :— విరోధి రసభావపరిగ్రహ మెట్టిదనిన:— కామినిఁ-తమ ప్రియునియెడ ప్రణయ కలహ కుపితలయి యుండ వారిని వైరాగ్యకథఁచే ననునయమొనర్చుట.

వ్రిభామతి :— భావపదముచే నిచట వ్యభిచారి భావమును గ్రహింప వల యును. స్థాయి భావమును గ్రహింపఁగూడదు. కాని యిచటి స్థాయి-వ్యభిచార్యు భయ సాధారణమగు భావపదము. కొన్నిచోట్ల స్థాయి భావమునుగూడ వ్యభిచారిగా గ్రహింపవచ్చునని సూచించుచున్నది. విరోధి రసభావము (వ్యభిచారిభావము) రస విరోధియగునప్పుడు దానిస్థాయిభావము ప్రకృత రస విరోధి కాకూడదు. కావున విరోధి రసస్థాయి భావమును ప్రతిపాదించునెడ ప్రకృత రసస్థాయిభావము విచ్ఛిన్న మగునని గ్రహించునది. "వైరాగ్య కథలచే'' అనుచోఁబ్రయుక్తమైన వైరాగ్య శబ్దము శాంత రస స్థాయి భావమగు నిర్వేదము (శమము)ను జెప్పుచున్నది. చంద్రుఁడను నొకకవి ప్రమాదవశమున దీని కుదాహరణముగాఁదగిన పద్యము నొకదానిని రచించియున్నాఁడు.

( ప్రణయకుపిత నొక నాయకుఁడోదార్చుచున్నాఁడు )

శ్లో॥ ప్రసాదేవర్తస్వ, ప్రకటయముదం, సన్త్యజరుషమ్,
ప్రియే! శుష్యన్త్యఙ్గాన్యమృతమివ తేసిఞ్చతువచః
నిదానం సౌఖ్యానాం క్షణమభిముఖంస్థాపయ ముఖమ్
నముగ్ధే! ప్రత్యేతుం ప్రభవతిగతః కాలహరిణః॥

ఉ॥ నిండు ముదంబుమాని, కరుణింపవె! రోషము వీడవే, సుఖా
ఖండము నీ ముఖంబభిముఖంబొనరించి వచోఽమృతంబునా
యెండిన యంగకమ్ములు రహింపఁగఁజల్కవె! ముద్దరాలవె
న్నండును బాల! కాలహరిణంబు గతించిన వెన్కవచ్చునే!

“కాలము - అనిత్యము” అను నిందలి యర్థము శాంతరస విభావము. దీనిచేఁబ్రకాశితమగు నిర్వేదము. వ్యభిచారిభావము. ఇట్లిచట విరోధి రస-విభావ భావ (వ్యభిచారి భావ)ములు పరిగ్రహింపఁబడినవి. ఇందు తొలి మూడు పాదము లందును ప్రకాశింపఁజేయఁబడిన రతి-చివర పాదముచేఁ బ్రకాశింపఁజేయఁబడిన నిర్వేదముచేత విచ్ఛిన్నమొనర్పఁబడినది.

అత్యల్పముగనైననుగూడ నిర్వేదమును ప్రవేశించినయెడల రతి విచ్ఛిన్న మగును గదా! రసికుఁడగు నాయకుఁడెవఁడైన నిట్లనునా? ఇట్టి వాక్యమును వినిన ప్రణయ కుపిత మానసముగూడ విరక్తమగునేగాని సరక్తము కానేరదుగదా! దుఃఖమిశ్రితములును పరిణామ విరసములు నగు విషయముల యథార్థ స్వరూపము నెఱిఁగిన వివేకి కాంతాది విషయముల జీవిత సర్వస్వాభిమానము నూనఁడు. కావున నట్టివాఁడిట్లనఁడు. ఇది శుక్తికయందు భాసించుచున్న రజితమేకాని యథా ర్థము కాదని యెఱిఁగిన వివేకశాలి భ్రాంతిరూపమగు నవిద్యకలుగని యెడల దానివి గ్రహింపఁడుగదా. “వైరాగ్య కథలచే” అనుచోనున్న బహు వచనముచేత శాంత రస వ్యభిచారులగు మతి, ధృతిప్రభృతులుగూడ గ్రహింపఁబడినవని యెఱుఁగునది.

మూలము :— విరోధి రసానుభావ పరిగ్రహమెట్టిదనిన ప్రణయ కలహకుపితయగు నాయిక, అప్రసన్నయగు (అలుకఁ బాయకుండు) నపుడు, నాయకుఁడు కోపావేశ వివశుఁడయి రౌద్ర రసానుభావము నొందినట్లు వర్ణించుట.

ప్రభామతి :— ఈర్ష్యాకషాయితయగు నాయిక యలుకఁదీర్చుటకు నాయ కుఁడు పండ్లుకొఱుకుట, తన్నుట, భయపెట్టుట, మొదలగు నసభ్యప్రవర్తనము నొనర్చినట్లు వర్ణించుటయే విరోధరసానుభావ పరిగ్రహమని తెలియవలయును. ఇది యొక రస భంగ హేతువని తెలియునది.

( ద్వితీయ రసవిరోధహేతువు నుదాహరించుచున్నాఁడు )

మూలము :— ప్రస్తుత రసము నపేక్షించుటచేత కథ కెట్లో సంబంధించిన వేరొక యంశమును విస్తారమగునట్లు వర్ణిం చుట, వేఱొక రస భంగ హేతువగుచున్నది.

అదెట్లనిన :— ఒకానొక నాయకునికి విప్రలంభ శృంగార మును వర్ణించుట కుపక్రమించిన యొక కవి-యమకాద్యలంకార

నిబంధన రసికతచేత మహా ప్రబంధ రూపమున పర్వతాదులను వర్ణించుట.

ప్రభామతి :— స్పష్టము.

మూలము :— (తృతీయమగు రస విరోధహేతువు నుదాహరించుచున్నాఁడు.)

సమయము కానపుడు రసమును విచ్ఛిన్నమొనర్చుట, సమయము కానపుడు రసమును ప్రకాశింపఁజేయుట, వేఱొక రస భంగ హేతువని యెఱుంగునది.

అందు సమయము కానపుడు రసమును విరమించుటయెట్లనిన:— ఒకానొక నాయకునకు స్పృహణీయ సమాగమయగు నొకానొక నాయికితోడి శృంగారము-అత్యధికమగు పరిపోష పదవి నధిరోహించి పరస్పరానురాగము తెలియఁబడియుండునపుడుకూడ, వారి సమాగమోపాయమును చింతించుట కుచితమగు వ్యవహారమును విడిచి, ఇంకొక వ్యాపారమును స్వతంత్రించి వర్ణించుట.

ప్రభామతి :— పూర్వరాగ (అయోగ) విప్రలంభ శృంగారము ప్రధానముగా ప్రస్తుతమగునపుడు, ఒండొరుల యనురాగము నెఱిఁగిన నాయికా నాయకులలో నెవరో యొకరు దూతికనో, ప్రేమలేఖనో, పంపినట్లుగాని, యింకేదైన ప్రణయ సంబంధియగు వ్యాపారము నొనర్చునట్లుగాని వర్ణింపవలయును. గావున తద్భిన్నము లగు వ్యాపారముల నొనర్చినట్లు వర్ణించుట రస విచ్ఛేద (భంగ) హేతువగును. దీని కుదా :— వత్సరాజ చరితమునందలి (రత్నావళియందలి) చతుర్థాంకమున భాభ్రవ్యుఁడు వచ్చినపుడు, వత్సరాజు రత్నావళిని విస్మరించి, విజయవర్మ వృత్తాంతమును వినినట్లు వర్ణించుట, ఇచట నాయిక యగు రత్నావళి యించుకయు పరామర్శింపఁ బడకుండుటవలన శృంగార రస విరామము కలిగినది.

మూలము :— అసమయమున (అనవసరమగునపుడు) రసమును ప్రకాశింపఁజేయుట యెట్లనిన :— ప్రవృత్త వివిధ వీర సంక్షయమును, కల్పసంక్షయ కల్పమును నగు సంగ్రామము జరుగుచుండునపుడు (రామ) దేవప్రాయుఁడగు నాయకుఁడు-అను

పకారాంతర విప్రలంభ శృంగారుఁడైనను, ఉచితమగు నిమిత్తము లేకయే శృంగార కథలోని కవతరించినట్లు వర్ణించుట.

ప్రభామతి :— వేణీసంహారమను నాటకమున ద్వితీయాంకమున దుర్యోధనుఁడు తనచే నారంభింపఁబడిన యుద్ధసన్నాహమును విడిచి ప్రతాచరణ శీలయగు భానుమతితోడి సమాగమము నభిలషించినట్లు శృంగారోపన్యాసము కావింపఁబడినది. ఇది ప్రకృతమగు వీర రసమును విచ్ఛిన్నమొనర్చుచున్నది.

(భరత శాస్త్రోక్తముగు విధిని తప్పక పాటింపవలయునను తలంపున నేతత్కర్తయగు భట్టనారాయణకవి విలాసమను ప్రతిముఖ సంధ్యంగమును ప్రదర్శించుట చేత నిట్టి రస విరోధ మేర్పడినదని తెలియునది.)

మూలము :— ఏతాదృశమగు స్థలమున కథా పురుషుఁడు (ప్రతినాయకుఁడు) దైవోపహతుఁడయ్యె నననది పరిహారము కానేరదు.

ప్రభామతి :— ప్రతినాయకుఁడు దైవోపహతుఁడగుటచేత నిట్లొనర్చెను. కావున నిది దోషముకాదని పరిహరింపఁగూడదని భావము.

మూలము :— ఏలయనిన; ముఖ్యముగా రసబంధము నందే కవి తనప్రవృత్తిని నిబంధించుట యుక్తమగును.

"దీప్తిఁగోరిన జనుఁడెట్లు దీపశిఖకునై ప్రయత్నించు తదుపాయమగుటవలన" ఇత్యాదులచేత ఇతివృత్త వర్ణనము రస నిబంధమునకుపాయ మాత్రమే యగునను నంశము వెనుక చెప్పఁబడినదిగదా!

ఇతివృత్తమాత్ర వర్ణనమే ప్రధానమగునపుడు అంగాంగి భావ రహితములగునట్లు రసభావములను నిబంధించుటచేత కవుల కేవంవిధములగు స్ఖలితములు (ప్రమాదములు) సంభవించును. గావున వీరికి (కవులకు) రసాదిరూప వ్యంగ్య తాత్పర్యమే యుక్తమని మేమీయత్నము నారంభించితిమి కాని ధ్వని ప్రతిపాదన మాత్రాభినివేశముచేఁగాదు.

ప్రభామతి :— ధ్వనిని ప్రతిపాదించుటకు మాత్రమే, మేమీ ప్రయత్నము (ధ్వన్యాలోకమును) జేసిన వారలముకాము, ముఖ్యముగా కవి చేయఁదగిన

పని-రసానుకూలములగు శబ్దార్థములను గూర్చుటయేకాని వేఱొకటికాదు. కవులు కథను మాత్రమే ముఖ్యముగా వర్ణించునపుడు, రసభావము లందేది ప్రధానముగా (అంగిగా) నుండఁదగినదో, ఏది యుపప్రధానముగా (అంగముగా) నుండఁదగినదో విచారింపక వానిని నిబంధించుచుందురు. కావున తన్నిమిత్తములగు స్ఖలితములు (దోషములు) సంభవించుచుండును. కావున నా దోషములు లేకుండఁజేయుటకే మేమీయత్నము నారంభించితిమి. దోషయుక్తమగునది వ్యంగ్యార్థము కానిండు: కాకపోనిండు: తదభినివేశము కాకికెన్నిదంతము లుండునని పరీక్షించుటవలె నిష్ప్రయోజనమే యగును.

మూలము :— (రస విరోధ హేతువులలో నాలుగవ దాని నుదాహరించుచున్నాఁడు)

"ఒకరసము సంపూర్ణమగు పరిపోషము నొందినను తిరుగఁ దిరుగ నుద్దీపింపఁజేయఁబడుట" అనునది రసభంగ హేతువులలో నింకొకటియని నిశ్చయింప వలయును. స్వకీయమగు సామగ్రిచేఁ బరిపోషింపఁబడి, ఉప (భుక్త) యుక్తమయిన రసము మాటి మాటికిని పరామర్శింపఁబడునెడల పరిమ్లాన కుసుమ కల్పమగును.

ప్రభామతి :— ఒకరసమెంతవఱకు నాస్వాద యోగ్యమగునో, అంతవఱకే దానిని బోషింపవలయును. ఆస్వాదింపఁబడిన రసమును దిరుగఁబోషించునెడల నది మిక్కిలి వాడిన పూవువలె నసహ్యమగును.

మూలము :— (పంచమ రసభంగ హేతువు నుదాహరించుచున్నాఁడు)

వృత్తియన వ్యవహారము. అదియుచితము గాకుండుటకూడ రసభంగహేతువే యగును.

అదెట్లనిన :— ఒకానొకనాయిక - ఉచితమగు (నంగ) భంగిని ప్రదర్శింపకయే, వానితోడి సంభోగమును దానభిలషించుచున్నట్లు ఒకానొక నాయకునకు స్వయముగాఁదెలిపినట్లు వర్ణించుట.

ప్రభామతి :— వృత్త్యనౌచితిని గావించుట యనుదానిచేఁజెప్పఁబడి నీయంశము బహ్వర్థకము. దానినొక విధమున వ్యాఖ్యానించుచున్నాఁడు. రమణీమణులు (స్వైరిణులైనను) శమఃరంజనను (సంభోగేచ్ఛను) శృంగార విభ్రమ

ప్రదర్శనమునఁ బ్రకాశింపఁజేయుటయే చమత్కృతి హేతువగును. కాని, "ప్రియా! నిన్ను నేను కామించితిని. నన్ను రతికేళిఁగూడుము" అని వాచ్యముగాఁ జెప్పుట రసభంగ హేతువే యగునని కవి సహృదయులు గ్రహింపవలయును.

"ధీరోదాత్తుఁడగు నాయకుఁ డెల్లప్పుడును వీరరసార్ద్రుఁడై యుండవలయును. ఒక నాయిక-తన సంభోగాభిలాషను స్వయముగా నతనికిఁ దెలిపి కాతరపురుషోచిత మగు స్త్రైర్యము నతనికిఁ గూర్చినట్లు వర్ణించుట దుష్టమే యగును" అని లోచన ముద్ఘాటించుచున్నది.

మూలము :— (అవ :— "వృత్త్యనౌచితిని గావించుచుండుటయు" అనుదాని కింకొక యర్థమును దెలుపుచున్నాఁడు) భరతశాస్త్ర ప్రసిద్ధములగు కైశిక్యాది వృత్తులనుగాని కావ్యాలంకారాంతర ప్రసిద్ధములగు నుపనాగరికాది వృత్తులనుగాని యనుచితమగునట్లు నిబంధించుట కూడ రసభంగ హేతువగును.

ఇట్లు రసవిరోధులగు వీనినేగాక, యీ విధమున ననుసరించి స్వయముగా నుత్ప్రేక్షింపఁబడిన తదితర రసవిరోధులనుగూడ పరిహరించు విషయమున కవులు జాగరూకులై యుండవలయును.

ఏతద్విషయకమగు పరికర పద్యము క్రింద నుగ్గడింపఁబడుచున్నది.

సీ॥ సుకవీంద్రులకు రసాదికమె ముఖ్యంబగు
వ్యాపార విషయ, మట్లగుటవలన
వారెప్పుడును తన్నిబంధనమ్మున నప్ర
మత్తులై యునికి సంభావ్యమగును
రసశూన్య కావ్య నిర్మాణంబు కవికి మ
హాప శబ్దంబు, వాఁడ కవియె యగు
వాని లక్షణము నెవ్వరుస్మరింపరు, విశృం
ఖల వాక్కుల పూర్వకవి వృషభులు

గీ॥ ప్రాప్తకీర్తులు, వారి సమాశ్రయించి,
యీ సరణివీడఁదగదు మనీషియెందు,

వ్యాస వాల్మీకి ముఖకవీశ్వర మతంబు,
కంటె నస్మన్మతము వేఱుగా మిఁగనుఁడు॥

(అవ :— సామాన్యముగా నిట్లు విరోధి పరిహారము నెఱిఁగించె, నియతవిషయమగు ప్రతిప్రసవము నిప్పుడెఱిఁగించు చున్నాఁడు)

గీ॥ తద్వివక్షితరసము లబ్ధప్రతిష్ఠ
మగు నపుడు మాత్ర మహితరసాంగములను
బాధ్యములనైన నంగభావము వహించు
వానినైనఁ గూర్పుట దోషవర్జితమగు॥

ప్రతిపాదింపఁగోరిన రసము స్వసామగ్రిలబ్ధ పరిపోషమగు నపుడు మాత్రము, విరోధి రసాంగములను, బాధింపఁదగిన వానిని గాని (బాధింపఁదగిన విరోధి రసాంగములనుగాని) అంగత్వమును బొందియున్న వానినిగాని (అంగత్వము నొందిన విరోధి రసాంగ ములనుగాని) ప్రతిపాదించుట దోషముకానేరదు.

ప్రభామతి :— "నీరసకావ్య రచనము కవికి మహాపశబ్దము" అనఁగా (దుర్యశమని) దుర్యశోజనకమను లక్షణార్థమును స్వీకరింపవలయును. అట్టి కావ్య మును రచించుటచేత నా కవి - అప్రశస్తకవియగును. అతని నామమును తద్గ్రంథ నామమును గూడ కాల గర్భమున విస్మృతములగును.

ప్రశ్న :— అయ్యా! కాళిదాస మహాకవి, స్వవిరచిత కుమారసంభవమున, పరిపుష్టమైనను కరుణరసమును, రతి విలాపమున తిరుగఁడిరుగ నుద్దీపింపఁజేసెను గదా! అది రస విరోధియైనను సహృదయులాదరించుచునే యున్నారు. అట్లే నవీనులుగూడ మీరు చెప్పిన రస విరోధపరిహారశాస్త్రము ననుసరింపక స్వాభి మతానుకూలమగు విధమున కావ్య రచనము నొనరింపఁగూడదాయేమి?

ఉ :— కూడదు; నిరుపమ ప్రతిభావిశేషోన్మీలిత అప్రతిబద్ధసుందర మహా కవితా ఝరీ విభాసురులగు కాళిదాసాదులెట్లొనర్చినను తత్కవితా మాధురీ వశం వదులగు సహృదయులు వారిని దిరస్కరింపఁజాలరు. వారిని దృష్టాంతముగఁదీసి కొని నవ్యులగు కవులట్లొనర్చు నెడల నిందాభాజనులు కాఁగలరు. వసిష్ఠాదు లొక ప్పుడు స్మృతిమార్గమును త్యజించిరని మనముగూడ దానిని త్యజించు నెడల (లోక) నిందాపాత్రులమగుదుము గదా! కాని మహాత్ములగు వారలట్లు చేయుటకుఁగల (నిగూఢ) హేతువులను మనమూహింపఁజాలమని యెఱుఁగునది.

మూలము :— అభిభవము (తిరస్కారము) శక్యమగు నప్పుడు మాత్రమే విరోధులు బాధింపఁబడును. అట్లుగానపుడు బాధింపఁబడునవి కానేరవు. బాధ్యములగు వానిని జెప్పుటవలన రసమునకు పరిపోషమే కలుగును. అంగభావము నొందినవానిని (విరోధిరసాంగములను) జెప్పినయెడల వాని విరోధిత్వము నివర్తించునదియే యగును. ఈ యంగములకగు నంగత్వప్రాప్తి స్వాభావికముగాని, సమారోపకృతముగాని యగుచుండునుగదా! అందు స్వాభావికమగు నంగభావప్రాప్తిగల యంగములను జెప్పుట అవిరుద్ధమే యగును.

అదెట్లన :— విప్రలంభ శృంగారమున, "వ్యాధి" ప్రముఖములగు తద్రసాంగములనే (ఉపకరించు వానినే) ప్రతిపాదించుట దోషముకాదు. కాని తద్రసానుకూలములుకాని అన్యరసాంగములను నివేశించుట దోషమేయగును.

ప్రభామతి :— సాపేక్ష భావముగల శృంగారమును నిరపేక్ష భావముగల కరుణమును పరస్పర విరోధులగు రసములు. కావున నిట్లు విప్రలంభ శృంగార విరోధియగు కరుణమునందు "వ్యాధి" మొదలగు నేయే యంగములు కాన్పించుచుండునో, అవి స్వాభావికముగనే విప్రలంభ శృంగారమునందుపకారకము (అంగము)లగుచుండును. కరుణము నందవియే యంగములగుచుండును. కాని విప్రలంభ శృంగారమునందవి మాత్రమేకాక తదితరములు (వ్రీడాదులు) కూడ నంగములగుచుండునని భావము.

ఆలస్యము, ఉగ్రత, జుగుప్స, అను నన్య రసాంగములను విప్రలంభ శృంగారమున ప్రయోగింపఁగూడదు.

ఆలస్య, ఔగ్ర్య, జుగుప్సలను విడిచి మిగిలిన వ్యభిచారుల నన్నిఁటిని గూడ (విప్రలంభ) శృంగారమున ప్రతిపాదింపవచ్చునను భరతముని ప్రవచనము ననుసరించునది.

మూలము :— ఆశ్రయ విచ్ఛేదము కలుగునపుడు రసమున కత్యంతమగు విచ్ఛేదము ప్రాప్తించును గావున, తదంగత్వము (విప్రలంభ శృంగారోపకారకత్వము) సంభవించినను మరణము నుపన్యసింపఁగూడదు.

ప్రభామతి :— "ఆలస్యౌగ్ర్యే జుగుప్సా వర్జాస్సర్వ ఏవశృఙ్గారే వ్యభిచారిణః" అను భరత ప్రవచనము వలన "మరణమ్" అను వ్యభిచారి భావము గూడ విప్రలంభ శృంగారమున కంగమగుచున్నది. విప్రలంభ శృంగారమున మరణము నుపన్యసించుట సంగతముకాదను నభిప్రాయమున మీఁది వాక్యము చెప్పఁబడినది.

శృంగారమున కధిష్ఠానములగు (ఆశ్రయములగు) స్త్రీ పురుషులలో నొక వ్యక్తికి (ఆశ్రయమునకు) అపాయము (మృతి) కలుగునెడల జీవిత సర్వస్వాభిమాన రూపమగుటచే నుభయాధిష్ఠానమగుటవలన విప్రలంభ శృంగార స్థాయిభావమగు రతికే విచ్ఛేదము కలుగును. కావున, మరణము నుపన్యసింపఁగూడదని భావము.

మూలము :— పూర్వపక్షి :— ఇట్టి విషయమున (ఇచ్చట) కరుణ రసమునకు మాత్రము పరిపోషము కలుగునుగదా!

సిద్ధాంతి :— ఇట్లనుట యప్రస్తుతము. ప్రస్తుతమగు విప్రలంభ శృంగారము మాత్ర మాశ్రయ విచ్ఛేదమువలన విచ్ఛిన్నమే యగును. కరుణ రసము మాత్రమే కావ్యమున ప్రధానము (ప్రస్తుతము) అగునపుడు మరణోపన్యాసముగూడ విరోధించునది కానేరదు.

శీఘ్రకాలమునందే ప్రత్యాపత్తి (మరణించిన తరువాత వెంటనే నాయికా నాయకులకు పునస్సమాగమము) సంభవించు నెడల శృంగారమునందుఁగూడ నొకానొకప్పుడు మరణమును పనిబంధించుట అంతగా విరుద్ధము కాదు.

దీర్ఘకాల ప్రత్యాపత్తి కలుగునపుడు మాత్రము శృంగార రస మధ్యమున ప్రవాహ విచ్ఛేదమే (అనుసంధాన ధారాభంగమే) కలుగును.

కావున రసబంధ ప్రధానుఁడగు కవి ఏవంవిధమగు నితివృత్త నిబంధనమును పరిహరింప వలయును.

ప్రభామతి :— ఏ మహాకవి-రస నిబంధనమునందే ప్రాధాన్యమును గలిగియుండునో, ఆ మహాకవి, నాయికా నాయకులలో నొకరు మరణించినట్లు-శృంగార రస ప్రధానమగు కావ్యమున వర్ణింపఁగూడదని భావము.

పూర్వపక్షి :— "సర్వ ఏవ శృఙ్గారేవ్యభిచారిణః" "వ్యభిచారులగు భావములన్నియు శృంగారము నందుండవచ్చును" అను భరతముని నిర్వచనము ననుసరించి మరణమునుగూడ నందుపయోగింపవచ్చునుగదా! మరణము నుపన్య సింపఁగూడదని యిందుఁజెప్పినయెడల నాభరతోక్తి విఘటితము కాదా?

సిద్ధాంతి :— నాయికా నాయకులలో నొకరు మరణించినను వారికి మరల శీఘ్రముగనే పునస్సమాగమము కలుగునెడలను మాత్రము మరణము నుప నిబంధింపవచ్చును. దీర్ఘకాలికముకాని మరణ జ్ఞానమున రతి ప్రతీతియొక్క విశ్రాంతికి స్థానమే కలుగకుండును. కావున తథా విధమగు స్థలమున మరణము వ్యభిచారిభావము కావచ్చును. కావున భరతోక్తి విఘటించునదికాదు. కాని (విప్ర లంభ) శృంగారమున వ్యభిచారియగు మరణము నుపన్యసించు కవికి అనితర సాధ్య మగు కౌశలము కావలయును. కాళిదాస మహాకవి స్వవిరచితమగు రఘువంశ మహాకావ్యమునందట్టి కౌశలమును బ్రదర్శించియున్నాఁడు. క్రింది యుదాహరణ మును దిలకింపుఁడు.

శ్లో॥ తీర్థేతోయ వ్యతికరభవే జహ్నుకన్యాసరయ్వో
దేహ న్యాసాదమరగణనాలేఖ్య మాసాద్య సద్యః
పూర్వాకారాధిక చతురయా సఙ్గతః కాన్తయాఽసౌ
లీలాగారేష్వరమత పునర్నన్దనాభ్యన్తరేషు॥

మ॥ సరయూ జహ్నుసుతాంబు సంగమ కళాసంజాత తీర్థంబునన్
వరదేహంబు త్యజించి, దేవగణనన్ భాసించి, శీఘ్రంబె, సుం
దర పూర్వాధిక రూపయైన నిజకాంతంగూడి, ఆరామ వి
స్ఫురితా గారములన్ సుఖింపడె నజక్షోణీంద్రుఁడత్యంతమున్॥

ఇందు "వరదేహంబు త్యజించి" అను వాక్యముచేఁ దెలుపఁబడిన మరణము (ఇందుమతీ మరణము) స్పష్టముగనే యందలి రతికంగమగుచున్నది. ఇందుఁ దెలుపఁబడిన (యిందుమతీ) మరణ జ్ఞానముయొక్క విశ్రాంతికి స్థానము కలిగిన యెడల స్థాయిభావమగు రతి విచ్ఛిన్నమగునని గ్రహించియే కాళిదాస మహాకవి, యిచట "దేహంబుత్యజించి" అను నంశముననువదించెనేకాని, తన్మరణ ప్రతీతి విశ్రమించుటకు పదబంధమును (స్థాన కల్పనమును) జేయుటలేదని గ్రహించు నది. అట్లుకాక యిందుమతీ మరణ జ్ఞానముయొక్క విశ్రాంతికి స్థానమును గల్పించిన యెడలను మాత్రము పరిమితమగు స్వల్పకాలమున ప్రత్యాపత్తి (సమా గమ) లాభము కలిగిననుగూడ సహృదయులకు (కావ్యశ్రోతలకు) శోకాస్వాదము కలుగకతప్పదు. (కొందఱిమతమును దెలిపి ఖండించుచున్నాఁడు.)

దీర్ఘకాలికముకాని ప్రత్యాపత్తి (మరణించిన వెంటనే కలుగు పునస్సమాగమ లాభము) గల మరణము-రత్యంగమగునని కొందరు చెప్పుచు నీసందర్భమున తాపస వత్సరాజము నుదాహరించుచున్నారు. అయ్యో! ఎంత మౌఢ్యము! తాపస వత్స రాజమున యౌగంధరాయణాది నీతిమార్గాకర్ణన సంస్కృతమతులగు సహృదయ సామాజికులకు (ఒకానొక కారణమున వాసవదత్త మరణించినట్లు యౌగంధరాయ ణాదులచే కల్పింపఁబడినదని తెలిసి సభ్యులకు) వాసవదత్తా మరణ బుద్ధియే కలు గుట సంగతము కాకుండునపుడచట కరుణ రసము పేరెత్తుటకుఁగూడ వీలు కలు గదు గదా!

కావున మూలమునఁజెప్పబడిన దీర్ఘకాలతా పదార్థము-తన్మరణ ప్రతీతి సహృదయ హృదయములందు నెలకొనినట్లు వర్ణించుటయే.

(ఇందలి ముఖ్యాభిప్రాయము నిష్టెఱుంగునది)

నాయికా నాయకులలో నొకరు మరణించిన పిదప స్వల్పకాలమునందే వారికి గలుగు సంగమలాభము, అదీర్ఘకాలికమగు ప్రత్యాపత్తియనియు, దీర్ఘకాలమున వారికిఁగలుగు సమాగమ లాభము దీర్ఘకాలికమగు ప్రత్యాపత్తియనియు అదీర్ఘ కాలికమగు ప్రత్యాపత్తిగల మరణమే (వ్యభిచారి భావమగు మరణమే) రత్యంగ మగుననియు మూలవాక్యములకుఁగొందఱర్థము చేయుదురు. కన్నున్న వాఁడిట్లు చెప్పఁడు. కావుననే లోచన కర్తలగు శ్రీమదభినవగుప్తపాదులకిది సమ్మతము కాదు. ఈ విషయమున వారి యభిప్రాయ రహస్యము నిట్లు గ్రహింపవలయును.

"రసము-సహృదయ సామాజికనిష్ఠము, కావున వారి హృదయముల యందు-నాయికా నాయకులలో నొకరు మరణించిరను నభిప్రాయము కొంతకాలము నిలిచియుండు నెడల శృంగారము భంగింపబడును. తన్మరణ జ్ఞానమట్లు సహృదయ హృదయములందు విశ్రాంతినొందని యెడలను మాత్రము ఆ మరణము-అదీర్ఘ కాల ప్రత్యాపత్తిగలదయినను సుదీర్ఘకాల ప్రత్యాపత్తిగలదయినను గూడ రత్యంగమై సహృదయులకు శృంగార రసాస్వాదమును ఘటింపఁగల్గును."

మీఁదఁబ్రకటింపఁబడిన "సరయూజహ్నుసుతా" అనుపద్యమున "వర దేహంబు త్యజించి" అను నసమాపక వాక్యముచేఁ దెలుపఁబడిన మరణము సహృ దయ హృదయమ్ముల యందు విశ్రమించుటకు స్థానము నొందకుండుటవలన రత్యంగమై సహృదయులకు శృంగార రసానుభూతిని గల్గించుచున్నదను నది స్పష్టమేగదా!)

ఇచట స్వాభావికమగు నంగభావప్రాప్తియే చెప్పఁబడినది. సమారోప కృత మగు విరోధి రసాంగభావప్రాప్తి-నైసర్గికము (వాస్తవము) కాకుండుటవలన-దీని కంటె విపరీతమగు ననునది యర్థ సిద్ధమగుటచేత స్వకంఠముచే వ్యాఖ్యానింపఁబడ దయ్యెనని గ్రహింపనది.

మూలము :— వివక్షితమగు రసము లబ్ధ ప్రతిష్ఠమగు నపుడు మాత్రము బాధ్యములగు విరోధి రసాంగములను ప్రతి పాదించుట దోషము కానేరదు. ఇందుల కుదా :—

మ॥ అకృత్యం బిందుకులంబునంగలదె? నాకాకాంత కాన్పించునే
యిఁక, నాజ్ఞానము-దోషనాశకముగాదే? అల్గినన్ రమ్య మా
మొక, మాహా! కృతులేమియండ్రా? కలనేఁబూఁబోడి
దుష్ప్రాప, స్థై
ర్యకృతిన్ గొమ్మ! మనమ్మ! మోవిఁగొను ధన్యాత్ముండు
వాఁడెవ్వఁడో?"

ప్రభా :— అవ:— ఇట్లు ప్రకారత్రయమును వ్యాఖ్యానించి యథా క్రమమున నుదాహరించుచున్నాఁడు. ఇది విక్రమోర్వశీయ నాట కము నందలి చతుర్థాంకమునందూర్వశి నుద్దేశించి పురూరవుఁడు భావించుచున్న వాక్యము.

"వేశ్యాసక్తి రూపమగు అకృత్యము-చంద్రవంశమున కను చితము" అను నిందలి ప్రథమవాక్యముచేత శాంతరస వ్యభిచారిభావ మగు వితర్కము ప్రకాశింపఁజేయఁబడుచున్నది. "నాకాకాంత కాన్పించునే యిఁకన్" అను ద్వితీయ వాక్యముచేత శృంగార రస వ్యభిచారి భావమగు ఔత్సుక్యము ప్రకాశింపఁ జేయఁబడుచున్నది. "నాజ్ఞానము దోషనాశకముగాదే?" అను ద్వితీయ వాక్యముచేత శాంతరస వ్యభిచారియగు మతియు, "అల్గినన్ రమ్యమా మొకము" (ప్రణయ రోషమును వహించినపుడుకూడ నా యూర్వశీముఖ మెంత మనోజ్ఞము!) అను చతుర్థవాక్యముచేత శృంగార రస వ్యభి చారి భావమగు స్మృతియు, "కృతులేమియండ్రా!" అను నైదవ

మాటచేత, శాంతరస వ్యభిచారియగు శంకయు, "కలయందైన నను బూఁబోఁడి దుర్లభ" అను నారవమాటచేత శృంగార రస వ్యభిచారియగు దైన్యమును, "ఓ మనస్సా! స్థిరత్వమును వహింపుము" అను నేఁడవ మాటచేత శాంతరసాంగమగు ధృతియు, "ఆ రమణి మోవినాస్వాదించు ధన్యాత్ముఁడెవ్వఁడో" అను నెనిమిదవమాట చేత శృంగారరస వ్యభిచారియగు చింతయుఁ బ్రకాశింపఁజేయఁబడుచున్నవి. విరుద్ధములగు శాంత శృంగార రసములకు సంబంధించిన వ్యభిచారి భావములకిందు సమావేశము (భావశబలత) కనఁబడుచున్నది.

ఇందిట్లు ప్రకాశింపఁజేయఁబడిన వితర్కము-ఔత్సుక్యము చేతను, ఔత్సుక్యము-మతిచేతను, మతి-స్మృతిచేతను, స్మృతి-శంక చేతను, శంక-దైన్యముచేతను, దైన్యము-ధృతిచేతను, ధృతి-చింతచేతను బాధింపఁబడుచున్నవి-తుదకు శాంత రసాంగములగు వితర్కాదులు శృంగార రసాంగములగు ఔత్సుక్యాదులచేత బాధింపఁబడుటవలన-"బాధ్యములగు వానిని విరోధి రసాంగములనైనను గూడ నిబంధించుట దోషముగా"దను నంశము స్పష్టమగుచున్నది. విక్రమోర్వశీయమునందలి మూలశ్లోకము-ఇట్లున్నది.

శ్లో॥ క్వాకార్యం, శశలక్ష్మణః క్వచకులం, భూయోఽపిదృశ్యేతసా, దోషాణాం ప్రశమాయ మేశ్రుతమహో! కోపేఽపికాన్తం ముఖమ్, । కిం వక్ష్యన్త్యపకల్మషాః కృతధియః, స్వప్నేఽపిసా దుర్లభా, । చేతః స్వాస్థ్యముపైహి, కః ఖలు యువా ధన్యోఽధరంపాస్యతి॥

1 ఈ యకార్య మెక్కడ? చంద్రవంశ మెక్కడ?
2 ఆ రమణీమణి మరల నాకుఁగనఁబడునా?
1 దోషములనుండి శాంతినొందుటకే గదా నా చదువు?
2 ప్రణయకోప కలుషితమైయున్నను గూడ నామె వదన మెంత మనోజ్ఞము!

1 నిష్పాపులగు సదాచార వర్తనులు నన్నేమని దూషింతురో !

2 ఆ యూర్వశి స్వప్నమునందుఁగూడ నాకు లభింపదు.

1 ఓ మనస్సా! చాంచల్యమును విడువుము!

2 ధన్యాత్ముఁడగునేయువకుఁడా మెయధరము నాస్వాదించునో,

ఇట్లిందు, (1) అంకెగల యభిప్రాయములచే వ్యంజింపఁజేయఁబడిన శాంతరస వ్యభిచారి భావములగు, వితర్క-మతి, శంకా ధృతులు. (2) వ యంకెగల యభిప్రాయములచే వ్యంజింపఁజేయఁబడిన విప్రలంభ శృంగార రసాంగములగు ఔత్సుక్య. స్మృతి. దైన్య. చింతలచే క్రమముగా బాధింపబడుచున్నవి. ఇట్లీ వితర్కాదులగు విరోధి రసాంగములు బాధ్యములగుటవలన ప్రకృతమగు విప్రలంభశృంగారమునకుఁ బోషకములే యగుచున్నవని యెఱుంగునది.

దీని కింకొక యుదాహరణము :— (కాదంబరియందు) మహాశ్వేతా విషయమున ప్రవృత్తమగు నిర్భరానురాగముగల పుండరీకునకు ద్వితీయముని కుమారుఁడుపదేశించిన సందర్భము.

ప్రభావతి :— కాదంబరియను గద్య కావ్యమున శ్వేతకేతుముని కుమారుఁడగు పుండరీకుఁడు హంసాఖ్యుఁడగు గంధర్వరాజు కుమారికను మహాశ్వేతను జూచి, అతిశయితమగు ననురాగముచేఁ బరవశుఁడైనపుడు ద్వితీయముని కుమారుఁడగు కపింజలుఁడను స్నేహితుఁడితనికి వైరాగ్యము నుపదేశించెను, కాని యా యుపదేశమంతయు నిష్ప్రయోజనమై తద్గతమగు ననురాగమునకు దార్ఢ్యమునే సంఘటించెను. అచట ప్రస్తుతమగు విప్రలంభ శృంగారమునకు విరోధియగు శాంతమునకంగ భూతములగు వైరాగ్య విభావములు విశేషించి నిర్దేశింపఁబడినవి, అట్లయినను తుద కవియన్నియు ప్రస్తుతమగు నావిప్రలంభ శృంగారముచే బాధింపఁబడి, తదుపకారకములే యయినవనుట స్పష్టము, కావున నిట్లు బాధ్యములగు (బాధింపఁబడునవియగు) విరోధి రసాంగములను ప్రతిపాదించుట దుష్టము కానేరదు.

మూలము :— అంగభావప్రాప్తి స్వాభావికమగునపుడు దోషము కలుగకుండుటకుదా :—

కం॥ సముకూర్చును జలధభుజం
గమజమగు విషము వియోగగతలకు బలిమిన్
భ్రమి, నరతి, నల సహృదయ
త్వ, మంగసాదమ్ము, మూర్ఛ, దమము, మరణమున్॥

ప్రిభామతి :— ఒకానొకసఖి, తననాయికయొక్క విరహావస్థను తన్నాయకు నకుఁదెలుపు నుద్దేశమున వర్షాకాలమందలి విరహిణీ దశను సామాన్యముగాఁదెలుపు చున్నది. ఈ పద్యము ఆంధ్రి ధ్వన్యాలోకము-ప్రిథమభాగము నందలి ద్వితీయో ద్యోతమునందుదాహరింపఁబడినది. (చూ పేజీ-148)

"జలదమను సర్పమునుండి పుట్టిన జలమను గరళము-విరహిణులగు కాంత లకు, భ్రిమ్యాదులను సమకూర్చు"నని తాత్పర్యము.

ఇందభివ్యక్తమగు వ్యాధి-శోకస్థాయికమగు కరుణమున కుచితమగునట్లు రతి స్థాయికమగు విప్రిలంభమునకుఁగూడ స్వాభావికమే యగును. ఏలయన నిందుగ్ర హింపఁబడిన, తలత్రిప్పు (గిగ్ భ్రిమణము) మొదలగునవి యీ రసములు రెండింటి యందును గూడ సంభవములే యగుచున్నవి. కావున నిచట విరోధి రసాంగము లకు నైసర్గికమగు నంగభావప్రాప్తి చెప్పఁబడియెనని గ్రిహించునది.

మూలము :— అంగభావప్రాప్తి - సమారోపితమగు నపుడు గూడ విరోధము లేకుండుట కుదా :—

ఒక సఖి విరహిణియగు నాయికతో నను చున్నది.

కం॥ వదనము పాండుక్షామము
హృదయము-సరసమ్ము, మతిశరీరము లలసమై
హృదిఁగల క్షేత్రియరోగము
నధికంబుగఁదెలుపుచున్నయవి ప్రియురాలా!

ప్రిబామతి :— పాండుక్షామము = తెల్లనయినదియు, కృశించినదియు, సర సమ్ము = అనురాగయుక్తము-అన్న రసయుక్తములేక చందనాది రసయుక్తము అలసము = ఆలస్యముతోఁగూడినది. (బాహ్య క్రియా సామర్ధ్యములేనిది) క్షేత్రియ రోగము = దేహాంతరమున చికిత్స చేయఁదగిన యసాధ్యమగు రోగము (క్షయ) లేక ప్రియా విరహవ్యాధి. ఇందు కరుణోచితమగు వ్యాధి -విప్రిలంభ శృంగార మున శ్లేష భంగిచేత సమారోపితమై యంగమగుచున్నది.

ఈపద్యమునందుఁ దెలుపఁబడిన పాండుత్వాదులు - కరుణ రసానుభావములుగాఁ బ్రసిద్ధములు. ఇట్లు స్వభావముచేఁగూడ ప్రస్తుత రసమునకు విరుద్ధమగు కరుణ రసమునకంగములైనను శ్లేష మహిమచేత ప్రస్తుతమగు విప్రలంభ శృంగారమున కంగములుగా నారోపింపఁబడుటచేత దోషము కలుగదని గ్రహించునది. ఇందలి యలంకారము తుల్యయోగిత.

[ "పాండుత్వాదులు కరుణమున కంగములగునట్లు విప్రలంభమునకుఁగూడ నంగములైయుండును. ఇట్లుభయసాధారణము లగుటచేతనే వానిని జెప్పుట విరుద్ధము కాదు" అని కావ్య ప్రకాశకారాదులు చెప్పుచున్నారు] (కావ్య ప్రకాశము నందలి సప్తమోల్లాసమును జూచునది.)

మూలము :— ఇందుల కింకొక యుదా :—

మ॥ బలిమిన్ గోమలలోల బాహులతికాపాశాలబంధించి, బిట్టలుకన్ వాసగృహంబు నందునిచి—ఇత్యాదికము.

(చూ-అ-ధ్వ-ద్వితీయోద్ద్యోతము 135 పేజీ)

ప్రభామతి :— బిట్టలుకన్, బంధించి, మోదన్, అనియిందు ప్రకృతమగు విప్రలంభ శృంగారమునకు ప్రతికూలములును రౌద్రరసాంగములును నగు కోప బంధనతాడనాదులను "బాహులతికాపాశాలన్" ఇత్యాది రూపకాలంకార బలముచే విప్రలంభ శృంగారాంగములుగా నారోపించుటవలన దోషము గలుగనేరదని గ్రహించునది. ఇచట నారంభింపఁబడిన రూపకము ద్వితీయోద్ద్యోతమునఁ జెప్పఁబడిన విధమున, (అలంకారము నధికముగా నిర్వహింపఁగూడదను నిర్ణయమున) తుదివఱకును నిర్వహింపఁబడకుండుటవలననే వీనికి (కోపాదులకు) శృంగారాంగత్వము సిద్ధించెనని యెఱుంగునది.

మూలము :— విధ్యనువాదభావము :—

ఆధికారిక (ప్రస్తుత) మగుటవలన నొక వాక్యార్థము ప్రధానమై యుండునపుడు, పరస్పర విరుద్ధములగు రెండురసములుగాని, భావములుగాని, అంగములగుటకూడ దోషము కానేరదు" అనునది యింకొక (చతుర్థమగు) అంగభావప్రాప్తి.

దీని కుదాహరణ మింతకు ముందుదాహరింపఁబడిన "కరమంటన్ విదళించి" అనునది.

ప్రశ్న :— మీఁది పద్యమున భిన్నరసములకు విరోధము లేకుండుటెట్లు?

కం॥ సమకూర్చును జలదభుజం
గమజమగు విషము వియోగగతలకు బలిమిన్
భ్రమి, నరతి, నల సహృదయ
త్వ, మంగసాదమ్ము, మూర్ఛఁ, దమము, మరణమున్॥

ప్రభామతి :— ఒకానొకసఖి, తననాయికయొక్క విరహావస్థను తన్నాయికకు నకుఁదెలుపు నుద్దేశమున వర్షాకాలమందలి విరహిణీ దశను సామాన్యముగాఁదెలుపుచున్నది. ఈ పద్యము ఆంధ్ర ధ్వన్యాలోకము-ప్రథమభాగము నందలి ద్వితీయోద్ద్యోతమునందుదాహరింపఁబడినది. (చూ పేజీ-148)

“జలదమను సర్పమునుండి పుట్టిన జలమను గరళము-విరహిణులగు కాంతలకు, భ్రమ్యాదులను సమకూర్చు”నని తాత్పర్యము.

ఇందభివ్యక్తమగు వ్యాధి-శోకస్థాయికమగు కరుణమున కుచితమగునట్లు రతిస్థాయికమగు విప్రలంభమునకుఁగూడ స్వాభావికమే యగును. ఏలయన నిందుగ్రహింపఁబడిన, తలతిరిప్పు (గిర్ భ్రమణము) మొదలగునవి యీ రసములు రెండింటియందును గూడ సంభవములే యగుచున్నవి. కావున నిచట విరోధి రసాంగములకు నైసర్గికమగు నంగభావప్రాప్తి చెప్పఁబడియెనని గ్రహించునది.

మూలము :— అంగభావప్రాప్తి - సమారోపితమగు నపుడు గూడ విరోధము లేకుండుట కుదా :—

ఒక సఖి విరహిణియగు నాయికతో ననుచున్నది.

కం॥ వదనము పాండుక్షామము
హృదయము-సరసమ్ము, మఱిశరీరము-అలసమై
హృదిఁగల క్షేత్రియరోగము
నధికంబుగఁదెలుపుచున్నయవి ప్రియురాలా !

ప్రభామతి :— పాండుక్షామము = తెల్లనయినదియు, కృశించినదియు, సరసమ్ము = అనురాగయుక్తము-అన్న రసయుక్తములేక చందనాది రసయుక్తము అలసము = ఆలస్యముతోఁగూడినది. (బాహ్య క్రియా సామర్థ్యములేనిది) క్షేత్రియరోగము = దేహాంతరమున చికిత్స చేయఁదగిన యసాధ్యమగు రోగము (క్షయ) లేక ప్రియా విరహవ్యాధి. ఇందు కరుణోచితమగు వ్యాధి - విప్రలంభ శృంగారమున శ్లేష భంగిచేత సమారోపితమై యంగమగుచున్నది.

ఈపద్యమునందుఁదెలుపఁబడిన పాండుత్వాదులు-కరుణ రసానుభావములుగాఁ బ్రసిద్ధములు. ఇట్లు స్వభావముచేఁగూడ ప్రస్తుత రసమునకు విరుద్ధమగు కరుణ రసమునకంంగములైనను శ్లేష మహిమచేత ప్రస్తుతమగు విప్రలంభ శృంగారమున కంగములుగా నారోపింపఁబడుటచేత దోషము కలుగదని గ్రహించునది. ఇందలి యలంకారము తుల్యయోగిత.

[ "పాండుత్వాదులు కరుణమున కంగములగునట్లు విప్రలంభమునకుఁగూడ నంగములైయుండును. ఇట్లుభయసాధారణము లగుటచేతనే వానిని జెప్పుట విరుద్ధము కాదు" అని కావ్య ప్రకాశకారాదులు చెప్పుచున్నారు] (కావ్య ప్రకాశము నందలి సప్తమోల్లాసమును జూచునది.)

మూలము :— ఇందుల కింకొక యుదా :—

మ॥ బలిమిన్ గోమలలోల బాహాలతికాపాశాలబంధించి, బిట్టలుకన్ వాసగృహంబు నందునిచి—ఇత్యాదికము.

(చూ-ఆం-ధ్వ-ద్వితీయోద్ద్యోతము 135 పేజీ)

ప్రభామతి :— బిట్టలుకన్, బంధించి, మోదన్, అనియిందు ప్రకృతమగు విప్రలంభ శృంగారమునకు ప్రతికూలములును రౌద్రరసాంగములును నగు కోప బంధనతాడనాదులను "బాహాలతికాపాశాలన్" ఇత్యాది రూపకాలంకార బల ముచే విప్రలంభ శృంగారాంగములుగా నారోపించుటవలన దోషము గలుగనేరదని గ్రహించునది. ఇచట నారంభింపఁబడిన రూపకము ద్వితీయోద్ద్యోతమునఁజెప్పఁబడిన విధమున, (అలంకారము నధికముగా నిర్వహింపఁగూడదను నిర్ణయమున) తుది వఱకును నిర్వహింపఁబడకుండుటవలననే వీనికి (కోపాదులకు) శృంగారాంగత్వము సిద్ధించెనని యెఱుంగునది.

మూలము :— విధ్యనువాదభావము :—

ఆధికారిక (ప్రస్తుత) మగుటవలన నొకవాక్యార్థము ప్రధానమై యుండునపుడు, పరస్పర విరుద్ధములగు రెండురసములుగాని, భావములుగాని, అంగములగుచుకూడ దోషము కానేరదు" అనునది యింకొక (చతుర్థమగు) అంగభావప్రాప్తి.

దీని కుదాహరణ మింతకు ముందుదాహరింపఁబడిన "కరమంటన్ విదళించి" అనునది.

ప్రశ్న :— మీఁది పద్యమున భిన్నరసములకు విరోధము లేకుండుటెట్లు?

ఉ :— అవి (విరోధులగు నారసములు) అన్యపరములఁగా వ్యవస్థాపితములగుటవలన విరోధము కలుగదు.

ప్ర :— అన్యపరము (అన్యాంగము)లైనను విరోధులగు (విరుద్ధ స్వభావములగు) వానికి విరోధ నివృత్తి యెట్లుకలఁగును?

ఉ :— చెప్పుచున్నాము. విధియందగు విరుద్ధ సమావేశము దుష్టమేయగును. కావి అనువాదమునందగు విరుద్ధ సమావేశము దుష్టముకాదు.

ప్రభామతి :— ఇంతకుమందు ప్రస్తుతమగు రసవిశేషమునకు-విరోధి రసాంగము-ఎట్లంగమగునదియు ప్రదర్శితము. ఇప్పుడట్లుగాక, పరస్పర విరోధులగు రసములు రెండును ప్రస్తుతమగు వస్త్వంతరమున కెట్లంగమగుచున్నదియు నుదాహరించు చున్నాఁడు. "కరమంటన్" అను నీపద్యము ద్వితీయోద్ద్యోతమునందింతకు ముందే యుదాహరింపఁబడి వ్యాఖ్యానింపఁబడినది. ( చూ, ఆంధ్ర ధ్వన్యాలోక ప్రథమ భాగము 87 పేజీ)

ఇందు పరిస్ఫురితములగు, ఈర్ష్యా విప్రలంభ శృంగార, కరుణములు పరస్పర విరుద్ధములు. అయినను అవి ప్రధానమగు త్రిపురాంతక ప్రభావాతిశయ రూపమగు వస్త్వంతరమున కంగములగుచున్నవి.

కావున విరుద్ధములగు రసములైనను, అన్యపరములు (పరాంగములు)గా వ్యవస్థాపింపఁబడవచ్చును.

ప్ర :— అన్యపరమైన వ్యవస్థ సంభవించినను స్వభావము నివర్తించునది కాదుగదా! స్వభావ కృతమేయగు విరోధమెటుల నివర్తించును?

ఉ :— ఒక వస్తువున కింకొక వస్తువుతోడి విరోధము, అవిరోధము స్వభావ కృతములుమాత్రమేకావు. సామగ్రీ విశేష సంబంధమువలనఁగూడ నీవిరోధావిరోధములు సంభవించుచుండును. ఘటత్వాదులకు - పటత్వాదులతోడను, శీత స్పర్శాదులకు-ఉష్ణస్పర్శాదులతోడనుగల అసామానాధికరణ్య రూపమగు విరోధము స్వభావకృతము. ఇట్లే వానికే ద్రవ్యత్వాదులతోడను రూపాది గుణములతోడను గల సామానాధికరణ్య రూపమగు అవిరోధముమగూడ గ్రహించునది. కోమల భోజన పదార్థోత్పత్తి సామగ్రి విశేషాను ప్రవేశముచేత శీత-ఉష్ణస్పర్శలకుఁగూడ విరోధము గలుగనేరదు. కావున నీ యవిరోధము సామగ్రీ విశేషసంబంధ కృతమగుచున్నది.

ధర్మము నాచరింపుము. ధర్మము నాచరింపకుము. అనువిధి యొకచోట నొకే సమయమునఁగావింపఁబడి-అదియే ప్రధానమగునపుడు-దుష్టమగును.

ఆచరణము-అనాచరణము, అను విధుల నొకేసమయమునఁదొకఁడాచరింపఁజాలఁడుగదా? విధీయమానమగు నర్థమే ప్రధానము. విరుద్ధములగు వాని కొకే సమయమునందగు ప్రాధాన్యము దుష్టము. కావుననే "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి-నాఽతి రాత్రే షోడశినం గృహ్ణాతి, (అతిరాత్రయాగమున షోడశిని గ్రహింపవలయును, అతిరాత్ర యాగమున షోడశిని గ్రహింపరాదు.) అను విరుద్ధవిధి-వికల్పార్థమునఁబర్యవసించునని వాక్యవిదులగు మీమాంసకులు చెప్పుదురు.

(స్వర్గోద్దేశమున విహితమగు జ్యోతిష్టోమమను యజ్ఞమున్నది. అందు నాల్గు సంస్థలున్నవి. అగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, అతిరాత్రము, అనునవి స్తోత్ర నామములు, సంస్థయనఁగా క్రతుప్రయోగవృత్తియగు స్తోత్రమును ముగించుట. ఇందే స్తోత్రముచే క్రతుప్రయోగము పరిసమాప్తి నొందింపఁబడునో దాని పేర్లనది వ్యవహరింపఁబడును. అగ్నిష్టోమమను స్తోత్రముతో జ్యోతిష్టోమము సమాప్తి నొందింపఁబడినయెడల నది అగ్నిష్టోమ సంస్థాకమగు జ్యోతిష్టోమమని వ్యపదేశింపఁబడును. షోడశిస్తోత్రానంతరము, రాత్రి పర్యాయములగు స్తోత్ర విశేషములు మూఁడును కావింపఁబడి యెడల నది అతిరాత్ర సంస్థాకమగు జ్యోతిష్టోమమగును. జ్యోతిష్టోమ ప్రకరణమున "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" అని అతిరాత్ర సంస్థాకమగు జ్యోతిష్టోమమున షోడశి గ్రహణము విధింపఁబడినది, మరల "నాఽతిరాత్రే షోడశినం గృహ్ణాతి" అని తన్నిషేధము విధింపఁబడినది. విరుద్ధమగు నీ విధి "షోడశిని గ్రహింపవచ్చును, లేదా గ్రహింపకుండవచ్చును." అని వికల్పార్థమునఁ బర్యవసించును. అని పూర్వమీమాంసకులందురు. శాస్త్రవిహితమగు నొక విధి శాస్త్రాంతరముచేత నిషేధింపఁబడుటచేత నది వికల్పార్థకమని చెప్పవలసి వచ్చినది కాని, "నకలంజం భక్షయేత్" "ఉల్లిపాయ తినఁగూడదు" అను విధి అనుల్లంఘనీయమే గదా :— కావున విధియందు విరుద్ధములగు వాని సమావేశము దుష్టమే.)

కాని యనువదింపఁబడునపుడు (పరాంగములగునపుడు) విరుద్ధములగు వాని సమావేశము దుష్టము కానేరదు.

మూలము :— (పంచతంత్రమునందలి పద్యము నుదాహరించు చున్నాఁడు).

ఆ॥ "రమ్ము-పొమ్ము, పండుకొమ్ము-కూర్చుండుమిం
కొండుపలుకు-మూరకుండు" మనుచు
నర్థవజ్జనంబు-లాశాగ్రహగ్రస్త
యాచకులనుగూడి యాడుకొంద్రు॥

ఇత్యాదిక మిందుల కుదాహరణము.

మీఁది పద్యమునందు విధి ప్రతిషేధములనూద్యమాన ములు. (అనువదింపఁబడినవి కాని విధీయ మానములుకావు) కావున వాని సమావేశము విరుద్ధముకాదు. ఇట్లే యిచ్చటఁ (కర మంటన్ అనుచోటను) గూడ, ఈర్ష్యా విప్రలంభ శృంగార-కరుణ ముల సమావేశము విరుద్ధము కానేరదు. త్రిపుర రిపు ప్రభావాతి శయమిచట వాక్యార్థ (ప్రధాన) మగుటవలన ఈ రసములు దాని కంగములుగా వ్యవస్థాపింపఁబడినవి. కావున నీర్ష్యా విప్రలంభ శృంగార-కరుణ రసములు విధీయమానములు (విధింపఁబడినవి) కావుగదా!

ప్రభామతి :— రమ్ము-పొమ్ము. పండుకొమ్ము - కూర్చుండుము, మాట్లాడుము, మౌనము వహింపుము. అను నీయర్థములు మిధో విరుద్ధములు. (పరస్పర విరుద్ధములు) అయినవివి విధీయమానములు (ప్రధానములు) కావు. కావున విరుద్ధములు కానేరవు. ధనలోభాభిభూతులగు యాచకులు ధనికుల కవమాన పాత్రములగు క్రీడా సాధనములగుచుందురనునది యిందలి తాత్పర్యము. కావున "అర్థవంతులాడుకొనుట" యిందు విధీయమానమగు నర్థమగుటవలన ప్రధానమగు చున్నది. "రమ్ము-పొమ్ము" అని యిందుక్తములగు నర్థములనూద్యమానములు (అనువదింపఁబడినవి) కావున ప్రధానములుకావు. పరస్పర విరుద్ధములగు నీ యర్థములు, (ధనిక) క్రీడాంగములుగా ("ఆడుకొందురు" అని విధీయ మానమగు ప్రధానార్థమున కుపకారకములుగా) చెప్పఁబడినవి. (అనువదింపఁబడినవి) కావున రాజ సమీప స్థితులగు నిరువురాతతాయుల (పగచే నొండొరులఁజంపుకొనఁబూనిన పురుషులయొక్క) న్యాయము ననుసరించి విరుద్ధములైనను అన్యాయత్తము(పరాధీనము) లగుటచేత అస్వతంత్రములగు "రమ్ము-పొమ్ము" అను నీ యర్థములు-క్రీడాంగము లుగా నన్వయించుటచేత స్వార్థమునందుఁగూడ విశ్రాంతిని బొందునవి కానేరవు. కావున నిట్టి వానికి పరస్పరరూపవైరుధ్యచింతయే యుదయింపనేరదని వేరుగ చెప్పనక్కరలేదుగదా!

మూలము :— (అవ :— వాచ్యమగు నర్థము ప్రధాన మగునపుడు విధేయమును, అప్రధానమగునపుడు, ఉద్దేశ్యమును నగుచుండును. రసము వాచ్యముకాదు. కావున వ్యంగ్యములగు రస

ముల కుద్దేశ్యత్వము నంగీకరించుటచేత ప్రకృతమునందగు విరోధ పరిహారము సముచితము కాదని యాశంకించి, సమాధానము నిచ్చు చున్నాఁడు.)

1) రసములను వాక్యార్థము (ప్రధానము) లని అంగీక రించుటవలన వానియెడల విధ్యనువాద వ్యవహారము లేదనికూడ చెప్పఁగూడదు.

2) వాక్యార్థమగు వాచ్యమునకుఁగల విధ్యనువాదములు, తదాక్షిప్తములగు రసముల కెట్లునివారింపఁబడును?

3) రసాదులను సాక్షాత్కావ్యార్థములని యంగీకరింపని వారు గూడ, రసాదులు తన్నిమిత్తములు (విభావాదికము నిమి త్తముగా గలవి) అను నంశము నంగీకరింపకతప్పదు. అట్లంగీక రించిననుగూడ ప్రస్తుత శ్లోకమునందు విరోధములేదు.

ప్రభామతి :— 1) ప్రధానమగు వాచ్యమువలె ప్రధానమగు వ్యంగ్యముకూడ విధేయమగును. అట్లే అప్రధానమగు వాచ్యమువలె నప్రధానమగు వ్యంగ్యము కూడ ననూద్యమానమగును. (అనువదింపఁబడును) ముఖ్యముగా రసమే కావ్య వాక్యార్థమని చెప్పఁబడియున్నది. కావున నప్రధానముగా, వ్యంగ్యమగు రసముగూడ ననూద్యమానమే యగును.

2) పక్షాంతరమున :— అనూద్యమానములగు విభావాదులచే వ్యంజిత మగుటవలన రసమనూద్యమానమగును.

3) "రసాదులు కావ్యవాక్య ప్రతిపాద్యములగు కావ్యార్థము లనునది సరవి సమ్మతముకాదు. కావున నుద్దేశ్య విధేయభావము సంభవింపదు, కావున విరోధ పరిహారమెట్లగు"నని శంకించి చెప్పుచున్నాఁడు. విరుద్ధములగు రసముల సమా వేశము-అనూద్యమానము కాకపోయినను సహకారికాకపోదు. కావున విరుద్ధముల కగు నంగభావము-యుక్తియుక్తమే యగును. తన్నిమిత్తములు = కావ్య సాక్షా ద్వాచ్యములగు-విభావాదులు సహకారులుగా గలవి, రసములు కావ్యార్థములు కా కున్నను కావ్యార్థ సహకారులు కాకపోవని భావము. రసాదులు కావ్యార్థ నిమిత్తము లని (సహకారులని) యంగీకరించినను గూడ ప్రస్తుతమగు (కరమంజన్ అను) పద్యార్థమునకు విరోధము కలుగదని భావము.

**మూలము:— ఇందనూద్యమానాంగ నిమిత్తమగు ఉభయ రసవస్తువు సహకారిగాగల విధీయమానాంశమునుండి భావ విశేష ప్రతీతి యుదయించుచున్నది. కావున విరోధమేదియులేదు.**

ప్రభామతి :— ఇందున్ = 'కరమంటన్' అను పద్యమునందు, అనూద్య మాన + అంగ + నిమిత్తము + అగు = అనువదింపఁబడుచున్న (ఉద్దేశింపఁబడుచున్న) 'హస్తములను విదలించుట' మొదలగు విభా (అనుభా)వాదులు హేతువుగాఁగల, ఉభయరసవస్తువు = కరుణ-విప్రలంభాత్మకమగు రసతత్త్వము, సహకారిగాఁగల = సహకారి కారణముగాఁగల (ఉపకారకముగాఁ గల) విధీయ మానాంశమునుండి = విధింపఁబడిన శాంభవబాణాగ్నిజనిత దురిత దాహమునుండి, భావ విశేష ప్రతీతి = ప్రేయోలంకార (రసవదలంకార) విషయ మగు భగవత్ప్రభావాతిశయ రూప (త్రిపురరిపు విషయకరతిరూప)మునందా స్వాదము-కల్గుచున్నది.

(లోచనావధారితమగు ప్రేయోఽలంకార ప్రతీతి-యిందుకలుగదు. ఇందంత టను శివ విషయకమగు రతిభావమే ప్రధానమయియున్నది. భావము ప్రధానము కానప్పుడే ప్రేయోలంకార మంగీకరింపఁబడునుగదా! అలంకారమునందే పక్షపాత మున్నచో ఇచటశృంగార-కరుణము లంగములగుటవలన నిది రసవదలంకారమనియే నిర్ణయింపనగును. (దీధితి 268 పేజీ)

**మూలము :— విరుద్ధోభయ (జలతేజోగత శీతోష్ణ) సహకారియగు కారణము (బియ్యము)నుండి, కార్యవిశేషము యొక్క (అన్నాది రూపముయొక్క) ఉత్పత్తి కాన్పించునుగదా!**

ప్రభామతి :— ఇందలి భావము నిట్లు గ్రహించునది. 'రసాదులు' వాచ్య ములు కాకుండుటవలనఁ గొందఱు వానికుద్దేశ్య విధేయ భావము నంగీకరింపరు. వారిమతమున రసాదులనువదింపఁబడునవికావు. కావున నిపుడు వ్యవస్థాపితమైన విరుద్ధములగు కరుణ-విప్రలంభ శృంగారముల సమావేశము-కుదురనేరదు. అట్ల గుట నిచట నేదో యొక యుపాయాంతరము నవలంబించుట తప్పదు.

అదెట్లనిన :— జలగతమగు శైత్యమును, అగ్నిగతమగు ఔష్ణ్యమును, పర స్పర విరుద్ధములైనను ఒక్కచోఁజేరి బియ్యమునుండి యన్నమును బుట్టించుచున్నవి. అట్లే నిమిత్తభూతములగు "కరమును విదలించుట" మొదలగు ననుభావములచే సూచితమైన కరుణమును, విప్రలంభమును, పరస్పర విరుద్ధములైనను, ఒక్కచోఁ గూడి, శాంభవశరాగ్నిజనిత దురిత దాహమునుండి త్రిపురరిపు ప్రభావాతిశయ

(త్రిపురరిపువిషయకరతిభావ) వ్యంజనాత్మకమగు కార్యమును బుట్టించుటకు సహకారులగుచున్నవి.

కావున పరస్పర విరుద్ధములైనను సహకారి కారణములొక కార్యము నుద్భవింపఁజేయుట అసంభవముకాదు. జల-వహ్ని విరోధము-ఓదనోత్పత్తి ప్రతి బంధకము కానట్లు-సహకారి విరోధము-కార్యోత్పత్తి ప్రతిబంధకము కానేరదు.''
(ధీధితి 268 పేజీ)

తేజో-జలాద్యాత్మకమగు (ఎండ-నీరు అను) విరుద్ధసహకారిద్వయముగల బీజాదికము నుండియే అంకురాది కార్యముత్పన్నమగు చున్నది. ఇంకొక విధమున నుత్పన్నము కాలేదు. ఈ ప్రపంచము నందంతటను కార్యకారణభావ మిట్లే యుండును గదా!

మూలము :— ఒక కారణమొకే సమయమున విరుద్ధ కార్యోత్పాదన హేతువగుట విరుద్ధముగాని (పరస్పర) విరుద్ధమగు సహకారి కారణద్వయమును గలిగి యుండుట విరుద్ధముకాదు.

(అవ :— "శ్రవ్యకావ్యమభినయ శూన్యము. కావున నందిట్లు విరుద్ధములగు నర్థములకుఁగూడ సమావేశము-దోషావహము కానేరదు. కాని అభినయింపఁదగిన దృశ్యకావ్యమున సమస్తమగు నభినయమును జేయునపుడు విరుద్ధములగు నర్థముల నభినయించుట యెట్లు"? అని యాశంకించి, సమాధానము నిచ్చుచున్నాఁడు) "ఏవంవిధవిరుద్ధ పదార్థవిషయమగు నభినయమెట్లు ప్రయోగింపవలయును" అనిన "అనూద్యమానమగు నేవంవిధ వాచ్య విషయమగు "రమ్మ-పొమ్మ" ఇత్యాదికము నెట్లభినయింపవలయునో అట్లే దీనిని "కరమంటన్" ఇత్యాద్యర్థముగల అభినేయ కావ్యమునుఁగూడ నభినయింపవలయును" అని సమాధానము.

ప్రభామతి :— ఇందలిభావము నిట్లెఱుంగునది :—

(అనూద్యమానములై విరుద్ధార్థకములగు రాకపోకల అభినయమును క్రమముగా నెఱుంగునట్లు తాదృశకరుణ-విప్రలంభముల యభినయమునుగూడ క్రమముగా నెఱుంగునది. విరుద్ధములగు ఈ రాకపోకలకు యుగపత్ప్రతీతిలేనట్లు విరుద్ధములగు ఈ రసములకుఁగూడ యుగపదభినయకరణము సంభవింపనేరదు.)

"కరమంటన్ విదలించి" అను నీపద్యమున భీతవిప్లుతావి దర్శనోపపాదన క్రమమున ప్రాకరణికమగు నర్థము నభినయింపవలయును. ఇందు మహేశ్వర ప్రభావము ప్రధానము. కావున నదియే ప్రాకరణిక (ప్రస్తుత)ము, తత్ప్రభావ పోషణము నందధికముగా నుపయోగించుటవలన విప్రలంభముకంటె కరుణమే దానికి సమీపించి ప్రస్తుతమగు నంగమగుచున్నది. 'ఆర్ద్రాపరాధరతుంబోలు' అని యుత్ప్రేక్షోపమావలమున నాయాతమయిన విప్రలంభము-దూరవర్తియై-కరుణమును బోషించుటవలన తదంగమగుచున్నది. (అభినయవిధి) కావున 'త్రిపుర స్త్రీలందున్' అనునంతవఱకునుగల యంశమునందు కరుణ రసవ్యంజకమగు నభినయమును సాదృశ్యమువలన నించుక విప్రలంభ శృంగార సూచకముగూడ నగునట్లభినయించి, "ఆర్ద్రాపరాధరతుంబోలు" అనుచో ప్రణయ కోపోచితమగు నభినయ మొనర్ప వలయును. అయినను దాని వలన ప్రతీయమానమగు విప్రలంభము వెనువెంటనే అభినయింపఁదగిన "శివాశుగాగ్ని దురితధ్వంసంబుఁగావించుతన్" అనుచోట-సాటోపాభినయనముచేత సమర్పితమగు మహేశ్వర ప్రభావమున కంగముగా పర్యవసానము నొందును. కావున విరోధమేదియుఁగలుగదు.

మూలము :— (అవ :— పూర్వోక్తమగు విరోధ పరిహారమును ముగించుచున్నాఁడు)

ఇట్లు విధి-అనువాద నయముల నాశ్రయించి యీ పద్యము నందలి విరోధము (ముఖ్యముగా) పరిహరింపఁబడినది.

(అవ :— విషయాంతరమున వేరొక విధమున (పంచమ ప్రకారమున) విరోధ పరిహారమును జెప్పుచున్నాఁడు)

ఒకానొక నాయకుఁడు-అభినందనీయోదయుఁడు-ఆ నాయకుని ప్రభావాతిశయమును వర్ణించునపుడు, తత్ ప్రతిపక్షుల (శత్రువుల) విషయమున కరుణరసము (శోకావేగము) ప్రదర్శింపఁబడిన యెడల నది పరీక్షకులకు (వివేచన కుశలులగు సామాజికులకు) వైక్లబ్యమును (చిత్తద్రుతిని) కలిగింపదు. సరిగదా! ప్రీత్యతిశయ నిమిత్తమగుచుండును. కావున (వీరాస్వాద) విరోధ విధాయియగు కరుణము-కుంఠితశక్తికము. (అన్యాంగమగుటచేత మందమగుశక్తి గలది) కావున దోషమేదియునులేదు.)

ప్రభావతి :— (ఒకనాయకుని, శ్లాఘ్యోదయ ప్రభావాతిశయమును వర్ణించునపుడు-తత్ప్రతిపక్ష (ప్రతినాయకాది) గతమగునట్లు వర్ణింపఁబడిన కరుణరసము-భయానకమువలెఁ-నాయకుని ప్రభావ ప్రకర్షమును పోషించుటచేత తదాలంబనకమగు వీర రసమునుగూడ పోషించునదియే యగును. కాని విరోధించునది కానేరదు.)

ప్రతిపక్షగతమగు కరుణాస్వాదమున సామాజిక హృదయము విశ్రమింపదు. కావున తాదృశమగు విషయమున (త్రిపుర స్త్రీగతమగు శోకోద్వేగమున) వారి చిత్తము ద్రవించునది కానేరదు. కాని వీర రసమునకే క్రోధము వ్యభిచారి యగుచుండునో, తతో క్రోధ స్థాయికమగు రౌద్రమునకు ఫలరూపమగు కరుణరసము-స్వకారణ (క్రోధ) వ్యంజన ద్వారమున వీరరసాస్వాదాతిశయమునే పోషించును.

కావుననే "రౌద్రస్యచైవయత్ కర్మ సజ్ఞేయః కరుణో రసః"॥ రౌద్ర రస సంబంధియగు కర్మయే (ఫలమే) కరుణ రసమని గ్రహింపవలయును. అని (భరతమునిచేత) చెప్పఁబడియెను.

విపక్షగతమగు కరుణము-వీర రసమునకు విరుద్ధమైనను తదంగమగుట కుదా :— (ఒకానొక కవి యొకమహారాజును స్తుతించుచున్నాఁడు)

చం॥ "కురవకమా! మదీయకుచకుట్మలఖేలన సౌఖ్యమింక నీ
కరయఁ నలభ్య, మోపకులమ్మా! స్మరణీయము నున్మఖాసవ।
స్ఫురదుడు సేవనీ, కిఁకనశోక! సశోకత నొందెదీవుమ
చ్చరణవియుక్తి", నందురు నిజధామము వీడు భవత్ పరాంగనల్॥

ఇందు 'కుచకుట్మలఖేలన సౌఖ్యము' ఇత్యాది పద వ్యంగ్యమును, అంగభూతమును, అగు శృంగారముచేత పోషింపఁబడిన (రిపుస్త్రీగతమగు) కరుణము—ప్రధాన వ్యంగ్యమును, వర్ణనీయమునునగు మహారాజ ప్రభావాతిశయమునే (తదాలంబనకమగు వీర రసమునే) పోషించుచున్నది కాని విరుద్ధమగుటలేదుగదా!

మూలము :— (ముగించుచున్నాఁడు) కావున వాక్యార్థీభూతమగు (ప్రధానమై ప్రస్తుతమగు) రసమునకుఁగాని, భావమునకుఁగాని విరోధియగు రసము (మాత్రమే) రస విరోధియని తెలుపుట న్యాయము. కాని అంగభూతమగు రసమునకుఁగాని భావమునకుఁగాని విరోధియగు రసము "రసవిరోధి" అని తెలుపుట న్యాయముకాదు.

ప్రభామతి :— । 'భావమునకు' అను పదమునకు ప్రకృత రసమునందలి స్థాయికిని, ప్రధానభూతమగు వ్యభిచారి భావమునకును, అను నర్థమును గ్రహింప వలయును.

ఇట్లనుటచేత ప్రస్తుతమగు 'కరమంటన్' అను పద్యమున ప్రధానీభూతమగు భావమునకుఁగాని, శాంకర ప్రభావాతిశయమునకుఁగాని, విరుద్ధము కానివగు శృంగారమును, కరుణమును నిబంధించినను రసవిరోధము లేకుండుటవలన దోషము కలుగ నేరదను నంశము ప్రదర్శింపఁబడినది.

మూలము :— (అవ :— "కరమంటన్" అనుపద్యము నందలి విరోధము నిపుడింకొక తీరున పరిహరించుచున్నాఁడు)

అథవా (మఱియు) వాక్యార్థీ భూతమగు నొకానొక కరుణ రసవిషయమునకు (విభావాదిరూపమగు కరుణాంగమునకు) భంగి విశేషాశ్రయమగు తాదృశ శృంగార వస్తువుతోడి (విరోధియగు శృంగారాంగముతోడి) సమావేశము రస పరిపోషకమే యగును.

ప్రభామతి :— ఇందలి భావమిట్లు గ్రహింపవలయును. ఇంతకుముందు విప్రలంభ-కరుణములు, ఇంకొకదానికి (త్రిపురరిపు ప్రభావాతిశయమునకు) అంగము లగుటవలన విరుద్ధములు కావనిచెప్పఁబడినది. ఇప్పుడట్లుగాక యిందలి విప్రలంభము-కరుణమునకే యంగత్వము నొందుచున్నదనియు ఆ కరుణమునకే యంగమగు (పోషకమగు) విప్రలంభము దానికి విరోధి కానేరదనియు వ్యవస్థాపింపఁబడుచున్నది.

అదెట్లనిన :— ఇష్టజన వినిపాతాదికమగు విభావమువలన కరుణరసము వ్యంజితమగునని భరతముని ప్రవచించియున్నాఁడు. రమణీయతయే మూలముగా గలది యిష్టతయని చెప్పఁబడును.

"అర్ద్రాపరాధ-రతుంబోలు" (అర్ద్రమగు నపరాధముగల కాముకునివంటి) అను నుత్ప్రేక్ష (ఉపమ)చేత క్రిందఁజెప్పఁబూనిన యర్థము ప్రకాశింపఁజేయఁబడు చున్నది.

"శాంభవశరాగ్ని చేష్టితముల నవలోకించుటచేత (తత్ సాదృశ్యమువలన త్రిపుర స్త్రీలచే) స్మరింపఁబడుచున్నప్రాక్తన (పూర్వామభూత) ప్రణయ కలహ వృత్తాంతము-ప్రియుఁడు పాణిని స్పృశించునపుడీర్ష్యచే సహింపక దానిని విదలించుట మున్నగు విషయము-ఇప్పుడు విధ్వస్తమగుటవలన (ప్రకృష్టమగు) శోక విభావత్వము నొందుచున్నది" (ప్రణష్టమగు ప్రణయకలహ వృత్తాంతము శోకము నుద్దీపించుచు కరుణ విభావమగుచున్నది) (కాఁగా నిట్లు విప్రలంభముచేఁబోషింపఁ

బడుచున్న కరుణము-త్రిపురరిపు ప్రభావాతిశయమునుగాని తదాలమ్బితమగు రతి భావమును (భక్తి భావమును)గాని పోషించుచున్నదని యభిప్రాయము.)

బా - పి 377 పేజీ.

భంగి విశేషాశ్రియమగు శృంగార వస్తువనఁగా :— విభావాది రూపత్వ మును బొందించునదియు, గ్రామ్యోక్తి రహితమగునదియు నగు వంగభంగి భేద మాశ్రియముగాఁగల శృంగారాంగము.

మూలము :— ప్రకృతి మధురములగు పదార్థములు (వినష్టములగుటచేత) శోచనీయత నొంది-ప్రాగవస్థాభావులగు విలాసములు స్మరింపఁబడునపుడు, అత్యధికమగు శోకావేశము నుద్భవింపఁజేయుటయే దీనికి హేతువు.

(రణభూమియందుఁబడిన భూరిశ్రవసుని బాహువును జూచి, వానికాంతలు శోకించుచున్నారు)

గీ॥ కమనీయమేఖలోత్కర్షి, పీనస్త
నవిమర్దనోద్యోగి, నా, భ్యూరు, జఘన
విషయ (విభవ) సంస్పర్శి. నీవీ విమోచకము
అగు, నిది-అకట! ఆ హస్తమ్మగాదె॥

ఇత్యాదికము దీని కుదాహరణము.

ప్రభామతి :— మహాభారతమునందలి స్త్రీపర్వమునందీపద్యమున్నది. "సురతారంభమున కాంచిని మీది కెత్తునదియు, పీనములగు వక్షోరుహములను మర్దించునదియు, క్రమక్రమముగా, నాభి-ఊరు-జఘన-విషయములను-అనఁగా ప్రదేశములను స్పృశించునదియు, వస్త్రగ్రంధిని విడిపించునదియు, పూర్వానుభూత మైనదియునగు భూరిశ్రవసుని హస్తమిదియేగదా" అని దీని యర్థము - ఏతన్మూల శ్లోకము.

"అయంసరశనోత్కర్షీ పీనస్తన విమర్దనః ।
నాభ్యూరు జఘన స్పర్శీ నీవీ విస్రంసనః కరః"॥ అనునది.

[మీఁది పద్యమున శోకస్థాయికమగు కరుణము ప్రకృతమగుటవలన ప్రధానము. "మేఖల నాకర్షించుట" మొదలగు పూర్వానుభూతములగు విలాసములను స్మరించుటచేత వ్యంగ్యమగు శృంగార మప్రస్తుతమగుటవలన నప్రధానము. ఏతన్నాయక కృత విలాస స్మరణము శోకాతిశయోద్దీపకమగుటవలన తద్విలాస స్మరణ

వ్యంగ్యమగు శృంగారము-కరుణమున కంగమగుచున్నది., కావున విరుద్ధము కానేర దని గ్రహించునది.

(మీఁది పద్యమున నాయకగతమగు శృంగారము-నాయికా గతమగు కరుణ మున కంగమగుటవలన విరుద్ధము కానేరదని భావము.)

మూలము :— [అవ :— ప్రకృతమగు "కరమంటన్ విదలించి" అనుపద్యము నందీయంశమును గుదుర్చుచున్నాఁడు]

కావున నిచట "శాంభవమగు బాణాగ్ని అర్ద్రాపరాధుఁడగు ప్రణయివలె త్రిపుర యువతుల విషయమున వ్యవహరించెను" అను నీప్రకారము చేతఁగూడ విరోధరాహిత్యమే సిద్ధించుచుండును.

ప్రభామతి :— సమరభూమియందుఁబడిన భూరిశ్రవుని బాహువును జూచునపుడు, పూర్వానుభూతమగు ప్రియ విలాసాదిస్మరణము, తత్కాంతల కెట్లు శోకోద్వేగము నుదయింపఁజేసెనో, అట్లే శాంభవ బాణాగ్ని యొనర్చిన కరగ్రహ ణాది వ్యవహారము, స్వభర్తృవ్యవహారమును (పూర్వానుభూతమగు స్వకర-గ్రహ ణాదికమును) స్మరింపఁజేసి, శోకావేగము నత్యుల్బణముగాఁజేయుచున్నది. కావున పరస్పర విరుద్ధములగు రసములకుఁగల అంగాంగిభావము-కనివైదగ్ధ్య సంబద్ధమగు నపుడు విరోధము నుత్పాదింపఁజేయునది కానేరదని భావము.

(మీఁది వృత్తి వాక్యమునందలి యుపమానోపమేయ భావోపన్యాసమువలన శృంగారము-కరుణమున కెట్లంగమగుచున్నదియు తెలియఁజేయఁబడినది. ఇందు-అప్యర్థకమగు కూడ అనుశబ్దము త్రిపురరిపు ప్రభావాతిశయాంగత్వ ప్రాప్తి లక్షణ మగు నింకొక విరోధాభావ ప్రకారమునుగూడ సముచ్చయ రూపమునఁదెలుపు చున్నది.) దీధితి 271 పేజీ.

మూలము :— అవ :— (పూర్వోక్తమగు "కరమంటన్" ఇత్యాది పద్యవిషయకమగు దోషాభావ ప్రదర్శనము నింతటితో ముగించుచున్నాఁడు) కావుననేయేవిధమున నిరూపించిన నాయా విధమున నిచట దోషాభావము సిద్ధించుచున్నది.

(అవ :— ఇట్లుగ్గడింపఁబడిన విరోధోద్ధరణ ప్రకారము చేత బహుంతరమగు లక్ష్య మపపాదిత మగుననను నభిప్రాయమునఁ జెప్పుచున్నాఁడు.)

ఇట్లనుటవలన

గీతమాలిక॥ అంకురాభిక్షత సుకుమారాంగుళులను
రక్తము స్రవింప, పాతితాలక్తకంబు
లట్లగు పదంబుల సదర్భలగు స్థలముల
దాటుచును, పతద్బాష్పధౌతాస్యలగుచు,
భీతలై, భర్తృహస్త గృహీత పాణు,
లగుచు తిరుగ నుద్యద్వివాహలగు తీరు
నను పరిభ్రమణంబు నొనర్త్రు దావ
వహ్నిచుట్టును నీవైరి వనిత, లధిప!

ఇత్యాదులందన్నింటను నిర్విరోధిత్వము నెఱుంగునది.

ప్రభామతి :— హనుమత్కవికృతమగు ఖండప్రశస్తి యందే తన్మూలమగు శ్లోకమున్నదని దీధితి సాక్ష్యమిచ్చుచున్నది.

ఒక చాటుకారుఁడొక మహారాజునిట్లు స్తుతించుచున్నాఁడు. (ఓ మహాప్రభూ! మహాపరాక్రమశాలివగు నీవు నీ శత్రువగు నరపాలుని జయించితివిగదా!)

ఇప్పుడా శత్రునరపాలుని భార్యల యవస్థ యెట్లున్నదో వినుము. ఇప్పుడా కాంతలరణ్యములకుఁ బారిపోవుచున్నారు. అచట వారి కోమల పదాంగుళులు దర్భాంకుర (కంటక) విద్ధములగుటవలన వానినుండి రక్తము స్రవించుచున్నది. రక్తసిక్తములగు నా పాదములు లత్తుకపూసినట్లున్నవి. ఆ పాదములతో వారు-సదర్భములగు (కంటకమయములగు) స్థలములను (దుర్గమారణ్య ప్రదేశములను-సదర్భములగు వివాహ వేదికలను) దాటుచున్నారు. (నిజబంధువులను, గృహములను విడిచి పోవుచుండుటవలనఁగలిగిన దుఃఖముచేత-హోమాగ్నిధూమము తమ విశాల నయనములయందుఁ బ్రసరించుటవలనఁగలిగిన వ్యథచేత) వారి నయనాంబుజముల నుండి యెడతెగని కన్నీరొలుకుచున్నది. అకన్నీటిచేత నా చంద్రాననల ముఖమండలములు ప్రక్షాళితము లగుచున్నవి. (పగతుఁడవగు నీవు తమ్మెక్కడ గుర్తించునో యను నభిప్రాయమున - కుమారీజనోచితమగు స్వభావమున) వారు భయపడుచున్నారు. (కావుననే) స్వభర్తృహస్త గృహీతపాణులగు నా రమణీమణులు తిరుగ పెండ్లిజరుగుచున్న పెండ్లికూతుండ్రవలె దావాగ్నిచుట్టును (వన వహ్నిచుట్టును వివాహసంబంధి హోమాగ్నిచుట్టను) తిరుగుచున్నారు. (ప్రదక్షిణము చేయుచున్నారు) శత్రుస్త్రీలు పలాయితలగుచున్నారనియు పునః పరిణీతలు లాజహోమపరాయణలై సంచరించుచున్నారనియు సర్థద్వయము నెఱుంగునది.

వివాహాంగభూతమగు లాజహోమము జరుగునపుడు వధువుల (పెండ్లి కూతుండ్రి) కిది సముదాచారము గదా!

మీఁది పద్యమున కవి సుభాషితమగు ప్రియవచనమున రాజవిషయకమగు రతిభావము ప్రధానము, సాంప్రతికమగు శోచ్యావస్థవలన (అంశతః) ప్రతీయమానమగు కరుణము, పునర్జాయమాన వివాహావస్థవలన (అంశతః) ప్రతీయమానమగు శృంగారము, ప్రధానభూతమగు రాజవిషయక రతిభావమునకు (రాజునకు సేనాపతి ద్వయమువలె) సాక్షాదంగములు. కావున 'కరమంటన్' అనుపద్యమునందువలె నిచటఁగూడ నిర్విరోధిత్వము నెఱుఁగవలయును.

మూలము :— (అవ :— ఇంతవఱకును దెలుపఁబడిన గ్రంథముచేత "తద్వివక్షితరసము.... ...దోషవర్జితమగు" అను కారికాద్వయమున కనుకూలమగు నర్థముమాత్రము నిరూపితమని ముగించుచున్నాఁడు)

ఇట్లు రసాదులు విరోధి రసాదులతోఁగూడి యుండుటకును, కూడకుండుటకును, నర్హమగు విషయము మాత్రము విభజించి ప్రదర్శింపఁబడినది.

ఇప్పుడేక ప్రబంధమున వాని నుంచుటకు న్యాయ్యమగు రసాదుల క్రమమును ప్రతిపాదించుటకుగాను దెలుపుచున్నాఁడు.

మ॥ నానారస నిబంధనము ప్రబంధముల ।
యందు ప్రఖ్యాతమై యలరుచుండినను ।
అంగిగానొక రసంబంగీకరింపఁ
దగువాని కుత్కర్షము గడించు సుకవి॥

"ప్రబంధములగు (ప్రకృష్టమగు బంధము=కూర్పు,గల) మహాకావ్యాదులయందును, నాటకాదులయందును, అనేక రసములు విప్రకీర్ణముగాను, (సం)కీర్ణముగాను, అంగాంగులుగాను-ఉపనిబంధింపఁబడు" ననునంశము ప్రసిద్ధమైయున్నను, ప్రబంధ సౌందర్యాతిశయము నభిలషించువాఁడగుకవి, అందు దేనినైన నొకరసము నంగిగా వివక్షించుట యుక్తతరమగు మార్గము.

ప్రభామతి:— ప్రసిద్ధమైయున్నను = భరతముని ప్రభృతులచే నిరూపింపఁబడినను "మహాకావ్యాదులయందును" అనుచోనున్న ఆదిశబ్దము ప్రకారవాచకము. కావున దానిచేత అనభినేయములగు శ్రవ్యకావ్యములనన్నింటిని గ్రహింపఁదగును. నాటకాదులయందును, అనుచోనున్న ఆదిశబ్దముచేత, అభినేయములగు దృశ్యకావ్యములనెల్ల గ్రహింపనగును. ప్రబంధనాయక, తత్ ప్రతినాయక, పతాకానాయక-ప్రకరీనాయక నిష్ఠము (ఆలంబనకము) లగుటచేత రసములకు విప్రకీర్ణతయు, ప్రబంధనాయక మాత్రాలంబనకములగుటచేత అంగాంగిభావమును సిద్ధించునని యెఱుంగునది.

భరతముని ప్రభృతులగు నాలంకారికులు. శ్రవ్యకావ్యములందును, దృశ్యకావ్యములందును అనేకములగు రసములు మిశితములుగా నుండవచ్చునని యంగీకరించియున్నారు. పర్యాయబంధము-సమవకారము మొదలగు వానియందొకే రసమంగిగా నుండదు. అయిన నవి అయుక్తములుకావు. కాని యుక్తతరములుకావు. మహాకావ్య-నాటకములవలె-ఏప్రబంధము, నానారస నిబద్ధమైనను, ఒకే రసమునంగిగాఁ గలిగియుండునో అదియే ఉత్కృష్టతరమని తరబర్థము.

మూలము :— 1 "అనేకములగు రసాంతర (రసభేద) ములు పరిపోషము నొందియుండునపుడు-ఒకరసమంగియగుటయేల విరోధింపకుండును?" అనియాశంకించి క్రింది కారిక నుగ్గడించుచున్నాఁడు.

2 గీ॥ ప్రస్తుతంబయి, స్థాయియై, భాసమాన
మగుచునుండు రసమ్ము-తదన్య వివిధ
రససమన్వితమయ్యును, ప్రముఖమగుటఁ
దనకుఁగలిగిన యంగిత్వమును విడువదు॥

ప్రబంధములయందు మిగుల ప్రధానమగుటచేత ప్రస్తుతమై, మాటిమాటికిని అనుసంధింపఁబడుచుండుటచేత స్థాయియై, సకలబంధ (సంధి-రస) వ్యాపియగు రసమునకు-అంతరాళవర్తులగు (నడుమనున్న) తదితర రసములతో నగు సమావేశము-దాని యంగిత్వమును దుడిచి వేయఁజాలదు.

ప్రభామతి :— (1) "రసము-విగళిత వేద్యాంతరము-స్వప్రకాశాఖండ స్వరూపము.

అట్టిరసమునకు - రసాంతరసముపబృంహణముగూడ-దుర్ఘటమగునపుడు-అంగాంగిభావ మెట్లుకలుగును?

ఒకరసము స్వయముగా పరిపోషము నొందియుండునపుడని, తదితర రసముల కంగమెట్లగును? అది పరిపోషము నొందనియెడల రసము కాఁగలదా? రసమగునది యంగమగుటయు, అంగమగునది రసమగుటయు పరస్పర విరుద్ధము. రసమంగముకాని యెడల ససహాయమగు నొక రసమంగియగునని చెప్పుట యనుచితముకాదా?'' అని యాశంకించి-యీ కారికచెప్పఁబడినది.

(2) ప్రధానమగు రసము సమస్తమగు నితివృత్తమునందును వ్యాపించియుండుటచేత ప్రస్తుతమై, విస్తృతమగు వ్యాప్తిగలదగుటచేత అంగాంగిభావమున కుచితమై యుండును.

ఇతివృత్తవశమున నాయాతములై, పరిమితములగు కథాశకలములయందు వ్యాపించియున్న రసాంతరములతోడి సమావేశము-స్థాయియై, యితివృత్తమునందంతటను వ్యాపించి ప్రభాసించుచున్న ప్రధానరసమునకుఁగల అంగిత్వమునకు భంజకము కాఁజాలదు. సరిగదా తత్పోషకమే యగును'' అనునిది పూర్వోక్తమగు నాశంకకు సమాధాన రూపమగు ఏతత్కారికార్థమని యెఱుంగునది.

ఇందలి పరమార్థమిది :— సత్కావ్యమునందు అంగభూతములగు తదితర రసములుకూడ స్వవిభావాది సామగ్రిలబ్ధ పరిపోషములై చమత్కారగోచరములగుచుండును. అయినను - తచ్చమత్కార గోచరత-తన్మాత్రమున నే విశ్రమింపదు. ఆ చమత్కార గోచరత-పరితుష్టినొందని దానివలె చమత్కారాంతరము నార్జించుటకు ప్రబంధవ్యాపకేతివృత్తవ్యంగ్యమగుటచేత అంగిభూతమగు ముఖ్యరసమునను ధావించును. కావున నా రసములు తదుపకారములగు నంగములే యగును. కావుననే ఈ యంగాంగిభావము.

శ్లో॥ గుణః కృతాత్మసంస్కారః ప్రధానం ప్రతిపద్యతే
ప్రధానస్యోపకారే హి తథా భూయసి వర్తతే॥

అను మీమాంసా సిద్ధాంతమునకు అనురూపమగుచున్నది.

మూలము:— అవ :— ఈ యంశము నుపపాదించుటకై తెలుపుచున్నాఁడు.

గీ॥ వ్యాపకంబగుచుండు కార్యమ్మొకటి ప్ర
బంధమున కంతకును విధింపఁబడునట్లె
వ్యాపియగు రసమును విధింపఁబడునెడల
నిర్విరోధంబు సిద్ధించు నిశ్చయముగ॥

ప్రభావతి :— (అధికారిక వస్తురూపమగుటచేత వ్యాపకమగు కార్యము (బీజబిందు స్వరూపము) నొక్కదానినే మహాకవి తన ప్రబంధమున విధించునట్లు, వ్యాపకమగు రసమునుగూడ నొక్కదానినే నిబంధించు నపుడు ప్రధానమగు నా రసమునకు-అంగభూతములగు రసములతోడి విరోధము కలుగనేరదనితాత్పర్యము.)

లోచనము :— "సముచితమగు దృష్టాంతమును ప్రదర్శించి యీ యంశ మునే తెలుపుచున్నాఁడు. న్యాయముగా నిదియే యుపపన్నమగును. అధికారికము, వ్యాపకము, ప్రాసంగిక కార్యాంతరోపక్రియమాణము, అగు కార్య మొక్కటియే, అవశ్యమంగీకరింపఁదగినది. తత్ పృష్ఠవర్తి (తత్ కార్యానువర్తము)లగు నాయ కోపనాయకాదులచిత్తవృత్తులకు, తద్బలమువలననే అంగాంగిభావము ప్రవాహోపతిత మగును. కావున నిందపూర్వమేదియులేదని తాత్పర్యము. 'అస్తే' 'రసమును' అనుటచేఁ గ్రింది యర్థము లభించుచున్నది. అంగాంగిభావ రూపమగు ఆ దేప్రకా రము నందు (రసాంగములచే నుపకరింపఁబడుచున్న) రసము నొక్కదానినే విధించు నపుడు) ఆరసములకుఁగూడ నంగాంగిభావము (తద్రస) బలమువలననే ప్రవాహో పతితమగును."

నాట్య శాస్త్రీయమగు విషయము నిట్లెఱుంగునది :— వస్తురూపమగు నితి వృత్తము-ద్వివిధము. అందు మొదటిది-అధికారికము, రెండవది-ప్రాసంగికము. ఫలస్వామ్యము = అధికారము, తత్ప్రభువు = అధికారి, తత్ప్రభువునకు సంబంధించిన 'కథ = అధికారికము.

ప్రస్తుతమగు నాధికారికమునకు-ఉపకరించు నర్థము (కథ)-ప్రాసంగికము. బీజము-బిందువు-పతాక-ప్రకరి-కార్యము అను నీయైదును వస్తు విశేషరూపములగు అర్థ ప్రకృతులు. అల్పమాత్రముగా సముద్దిష్టము, బహుధా విసర్పణశీలము, ఫలమునకు ప్రథమకారణము, అగునది-బీజము. అవాంతరములగు నర్థములచేత పరమప్రయోజనమునకు విచ్ఛేదము కలుగునపుడు-అవిచ్ఛేదహేతువగునది (విచ్ఛే దము కలుగకుండఁజేయునది) బిందువు.

వ్యాపకమగు ప్రాసంగిక వృత్తము-పతాక
ప్రదేశస్థమగు ప్రాసంగిక చరిత్రము-ప్రకరి
ప్రధాన ఫలనిర్వాహకమగు
అంతిమ కథావయవము-కార్యము

ఇందు బీజ-బిందురూపమగు అధికారిక వృత్తము, పతాకా ప్రకరీ కార్య రూపములగు ప్రాసంగికవృత్తములచే ప్రబంధమధ్యమున నించుకించుక సాంకర్యము నొందింపఁబడును. కాని యీ పతాకాదులు ప్రబంధమధ్యమునందే విశ్రమించును.

కావున, వీనిచేనది (ఆధికారికవృత్తము) సర్వధా వ్యాప్తముకాదు. అట్లే ప్రబంధ వ్యంగ్యమగుటచే ప్రధానీభూతమగురసము, అవాంతరిక ప్రబంధకించిదంశ వ్యంగ్యములగు తదితర రసములచేత సంకీర్ణమయినను సర్వథావ్యాప్తముకాదు. కావున నంగిత్వరూపమగు తన ప్రాధాన్యమును విడువదు, సరిగదా! వానిచే నుపస్కరింపఁబడునదియే యగును. కావున విరోధము కలుగదని భావము.

మూలము :— సంధ్యాదిమయమగు (పంచ సంధులను, ఉపక్షేపాదులగు సంధ్యంగములరువదియైదును స్వరూపముగాఁగల) ప్రబంధశరీరమునకు ఎల్లు-అనుయాయియు, (నిర్వహణసంధి పర్యంతము-అనుసరించునదియు) వ్యాపకమును, అగు కార్యమొకటి విధింపఁబడి, కార్యాంతరములచేత సాంకర్యమునొందింపఁబడక, ఒకప్పుడు వానిచే సాంకర్యము నొందింపఁబడినను, తన ప్రాధాన్యమును గోల్పోక, యుండునో, అట్లే రసముగూడ నొక్కటియే (ప్రధానముగా) సన్నివేశింపఁబడునపుడు విరోధమేదియుఁగలుగ నేరదు. (ప్రత్యుత) సరిగదా వివేకోదయసహితులు, అనుసంధానవంతులునగు సహృదయులకు తథావిధమగు విషయమున ప్రహ్లాదాతిశయమే ప్రవృత్తమగును.

ప్రభామతి :— కార్యపదముచే నిచట వివక్షితమగు నర్థము-బీజము, అది ముఖ్య ప్రయోజన విచ్ఛేదము కలుగకుండఁజేయుటకు హేతువగు బిందురూపార్థ ప్రకృతితోఁగూడి-నిర్వహణ సంధిముగియువఱకును వ్యాపించుచుండునని "అనుయాయియు" అను పదము చెప్పుచున్నది. కార్యాంతరములు = పతాకా, ప్రకరీ, కార్యలక్షణములు. వానిచేననగా, ఆకార్యాంతరములచేతనని యర్థము. తథావిధమగు విషయమున కుదాహరణముగా తాపస వత్సరాజమును గ్రహింపవలయును.

ఇట్లు పూర్వోక్తమగు కారికచే అఁగాంగిభావమున దృష్టాంతము-రసాంగాంగిభావము ఇతి వృత్త బలముచే నాపతితమగుట-అను నంశద్వయము నిరూపింపఁబడినది.

మూలము :— (రస సమావేశవిషయమున నాశంకించుచున్నాఁడు.)

"వీర-శృంగారములు, శృంగార-హాస్యములు, రౌద్ర-శృంగారములు, వీర-అద్భుతములు, రౌద్ర-కరుణములు, శృంగారాద్భు

తములు, పరస్పర విరోధ రహితములు. కావున వానియందేదైన నొకటి యంగముగాను, వేరొకటి యంగిగాను ఉండవచ్చును. కాని-శృంగార-భీభత్సములు, వీర-భయానకములు, శాంత-రౌద్రములు, శాంత-శృంగారములు పారస్పరికమగు బాధ్య, బాధక భావముగల రసములు. (ఒకటి బాధింపఁబడునదియు, వేరొకటి బాధించునదియు. నగు రసములు) కావున వానికీయంగాంగిభావ మెట్లు కలుగును" అని యాశంకించి క్రింది సమాధానమును దెలుపుచున్నాఁడు.

కం॥ అవిరోధియొ, సువిరోధియొ
యవురస, మన్యరసమంగి యగునెడ, పరిపో
ష వియుక్తముగాఁదగు, నటు
లవునెడ తద్రస విరోధమడరక యుండున్॥

"శృంగారము" మొదలగు రసములలో నేదైన నొకరసము, అంగియు, ప్రబంధవ్యంగ్యమును, అగుచుండునపుడు,అవిరోధియగు రసముగాని, విరోధియగు రసముగాని పరిపోషము నొందింపఁబడఁదగినదికాదు.

ప్రభామతి :— యుద్ధ-నయ పరాక్రమాదులచేత కన్యారత్నాదిలాభము గలుగునపుడు శృంగార వీరములేకాశ్రయములగుట విరుద్ధముకానేరదు.

హాస్యము-శృంగారాంగమగుట స్పష్టమే.హాస్యము స్వయముగా పురుషార్థము కాదు, అయినను సమధిక రంజనోత్పాదనమున - తదంగమై, పురుషార్థమగుచుండును. "శృంగారశ్చతైః ప్రసభంసేవ్యతే" రౌద్ర ప్రకృతులగు, రాక్షసుల చేతను, దానవులచేతను, ఉద్ధతులగు మనుష్యులచేతను శృంగారముకూడ బలత్కారమున సేవింపఁబడును, అని భరతమునిచేఁ జెప్పఁబడియెను, కావున రౌద్రమునకుఁ గూడ శృంగారముతోడి యవిరోధమును ఎట్లో సాధింపవచ్చును, కేవలమును నాయికా విషయకమగు నౌగ్ర్యము (ఉగ్రత) వదల పరిహరింపవలయును,

"వీరస్యచైవయత్కర్మ సోఽద్భుతః" "వీరరస సంబంధియగు కర్మయే అద్భుతము" అని భరతముని ప్రవచనము, కావున లోక విస్మాయక పరాక్రమాతిశయ శాలియగు వీరపురుషుఁడు-నాయకుఁడగునపుడు, విస్మయోత్సాహ స్థాయికములగు, అద్భుత-వీరముల సమావేశముకూడ-అవిరుద్ధమే యగును,

ధీరోద్ధతుఁడగు "భీమసేనుడు" మున్నగు వ్యక్తి-నాయకుఁడగునపుడు, క్రోధోత్సాహములు విరుద్ధములు కాకుండుటవలన నచట రౌద్ర-వీర రస సమావేశము విరుద్ధము కానేరదు.

"రౌద్రస్యైవచయత్కర్మ సజ్ఞేయః కరుణోరసః" "రౌద్రసంబంధియగు కర్మయే కరుణరసమని తెలియవలయును." అని భరతమునియే, రౌద్ర-కరుణముల యవిరోధము నంగీకరించెను. క్రూర స్వభావుఁడగు నొకవ్యక్తి యొనర్చిన దారుణ కృత్యముచేత శోకోత్పత్తి కానిపించుచున్నది. కావున రౌద్ర-కరుణములు సాపేక్షములే యగునుగదా!

రత్నావళీ నాటికాగతమగు నైంద్రజాలిక వృత్తాంతమువలె, రత్యుత్పాదకమును ఆశ్చర్యజనకమును నగు నితివృత్తముతోడి సంబంధమువలన, శృంగారాద్భుతములు గూడ ప్రతికూలములు కానేరవు. కాని పరస్పరోన్మూలనాత్మకమగు నుద్భవము గల-శృంగార-భీభత్సాదుల కంగాంగిభావ మెట్లుకలుగును? (శృంగారమును, భీభత్సమును ఒకదాని నొకటి నిర్మూలింపక జనింపవు. కావున అంగాంగులు కానేరవు.) శృంగార స్థాయియగు రతి నుచ్ఛేదింపక-జుగుప్స-ప్రవృత్తముకాదు. ఉత్సాహము నున్మూలింపక-భయముదయించునదికాదు. శాంతము-తత్త్వ జ్ఞాన-సముత్థిత సమస్త సంసార విషయ నిర్వేద (వైరాగ్య) ప్రాణము. కావున (సర్వభోగ) నిరీహాస్వభావమగు (నివృత్తిమయ స్వభావమగు) నది, విషయాసక్తియేజీవితముగాఁగల రతి-క్రోధములను గలియునది కాదుగదా! (శమము నడంపక రతి-క్రోధములుదయింపవు గదా!) ఇది-ఆశంకాస్వరూపము. (మీది యాశంకకు సమాధానము నిచ్చుచున్నాఁడు)అవిరోధియో, సువిరోధియో=అవిరోధిగాని, విరోధిగాని, అనియర్థము. ఇట్లుక్తమగు వికల్పముచేఁ గ్రింది యభిప్రాయము నెఱుంగునది.

"అవిరుద్ధము నయిననుగూడ నొకరసమును (అంగరసమును) అంగిరసము కంటె నుత్కర్షింపఁజేయఁ (పరిపోషింపఁ)గూడదు. అట్లొనర్చుట దోషావహమగును. అంగిరస విరుద్ధమునైననుగూడ నొకరసమును, యుక్తిచేత నంగమగునట్లు వక్ష్యమాణ విషయ భేదాదియోజనముచేత నుపనిబంధింపవచ్చును. అప్పుడది దోషావహము కానేరదు. విరోధావిరోధములు-అకించిత్కరములు. కానివినివేశన ప్రకారమే-అవధాతవ్యము" అంగిరసమునవాదరించి, (తిరస్కరించి) అంగభూతమగు రసమును పరిపోషింపఁగూడదని భావము.

మూలము :— (అవ :— అంగరస పరిపోష పరిహారమున ప్రకారత్రయమును జెప్పుటకుపక్రమించి, మొదట, ప్రథమ ప్రకారమును జెప్పుచున్నాఁడు.)

"అందు (పరిపోషపరిహార ప్రికారములయందు) అవిరోధి యగు (అంగ) రసము నంగిరసముకంటె మిగుల నధికమగునట్లు పరిపోషింపఁగూడదు" అనునది ప్రథమమగు పరిపోష పరిహారము. ఉత్కర్షము సమమైనను గూడ వానికి—(అంగాంగిరసములకు) ః రోధము సంభవింపదుగదా!

ప్రభామతి :— ప్రశ్న :— "అయ్యా! అంగరసము నంగి రసముకంటె న్యూనమగునట్లు పరిపోషింపవలయును" అని చెప్పిన యెడల, అధికమగునట్లు పరి పోషింపఁగూడదను నర్థముపపన్నమగునుగదా! అధికమగునట్లు పరిపోషింపఁగూడ దని యేల చెప్పఁబడియెను?

ఉ :— అవిరోధియగు నంగరసమును అంగిరసముతో సమానమగునట్లు గూడ పరిపోషింపవచ్చునను నర్థము లభించుట కిట్లు చెప్పఁబడినది. అధికమగు పరిపోషము మాత్రమే విరుద్ధమగుటవలన నిరాకరింపఁబడినది.

మూలము :— (అవ :— ఉత్కర్ష సమత్వము నుదాహ రించు చున్నాఁడు) దీని కుదాహరణము. (ఒక వీరుని యవస్థ చెప్పఁబడుచున్నది.)

గీ॥ ఒకెడఁ బ్రేయసి విలపించుచుండ, నిఁకొక
వంక భండనతూర్య నిస్వాన మొలయ;
స్నేహమున-సంగర రసంబు చేత-భటుని
మానసంబప్డు డోలాయమానమయ్యె॥

ప్రభామతి :— ఒకెడన్ = స్వగృహమునందు, ప్రేయసి = ప్రియురాలు. ఈ ప్రియురాలు భార్యయే కావలయునని తలంపనక్కరలేదు. కాని భార్యకూడ ప్రేయసి కావచ్చును. డోలాయమానము = ఊయలవలె నూపఁబడుచున్నది = ఏమి చేయుటకును దోచకుండునది. ఇందు-ప్రేయసి విలపించుచుండెన్, అను పదము చేత రత్యుత్కర్షమును, భండనతూర్య-భట - పదములచేత ఉత్సాహోత్కర్షమును, స్ఫురింపఁజేయఁబడినవి. కాఁగా, రతి స్థాయికమగు శృంగారమునకును-ఉత్సాహ స్థాయికమగు వీరమునకును, డోలాయమానపదముచే అన్యూనాధికమగు సామ్యము నిర్దేశింపఁబడినది. ఆయినను తత్పరిపోషసామ్యము-సామాజిక హృదయ వైరస్యకారి యగుటలేదు.

ఇచట ప్రస్తుతమగు రసము వీరము. తదవిరోధియగు శృంగారము ప్రకృతముకాదు. ఇచ్చట నిట్లు వీర-శృంగారములకు ఉత్కర్ష సామ్యముండినను, శృంగారము-వీరమున కంగమై యవిరుద్ధమగుచున్నట్లు విద్వదనుభవము-కాన్పించు చున్నదని తెలియునది. "ముక్తకము నందే-అంగాంగిరసములకు ఉత్కర్ష సామ్య ముండును, కాని ప్రబంధములయందుండదు" అని కొందఱనిరి. కాని, ఆధి కారికములగు నితి వృత్తముల యందుఁగూడ త్రివర్గ (ధర్మార్థకామరూప) ఫలము నకు సమప్రాధాన్యము-సంభవించుటవలన, వారి యభిప్రాయము సమంజసము కానేరదు.

అదెట్లనిన :— రత్నావళియందు నాయకుఁడగు నుదయనుఁడు సచివాయత్త మగు సిద్ధినిగలిగియున్నాఁడు. సచివాయత్తసిద్ధిత్వాభి ప్రాయమున నీనాటికాప్రబం ధమున నాధికారికమగు ఫలము - పృథివీరాజ్యలాభము. నాయకాభిప్రాయమున మాత్రము-ఇందు ప్రాసంగికమగు ఫలము-తద్భిన్నమగు కన్యారత్నలాభము.

"స్వామ్యమాత్య బుద్ధ్యైకత్వమువలన-ఒకే ఫలము కలుగును" అను నీతి ననుసరించి-రత్నావళియందు మంత్రి-నాయక బుద్ధుల కేకీకరణము సంభవించుట వలన-ఇందు వీర శృంగారములకు సమప్రాధాన్యమే పర్యవసితమగుచున్నది.

మూలము :— ఇంకొక యుదాహరణము :—

మ॥ మొలనూలౌ నురగేంద్రుఁడాసనముగా,ముత్యాలపేరూడ్చి,తద్
వలయంబున్ స్ఫటికస్రజంబువలెచేతన్ద్రిప్పుచున్,కల్ల వా
క్కుల మంత్రంబుజపించుమోవి-స్మితమాగూఢంబుగా,సంధ్య
యం, దలియీర్ష్యన్ విభునవ్వు దేవి-శివసంధ్యాదృష్ట,
మిమ్మేలుతన్॥

ప్రభామతి :— శివుఁడొకానొకప్పుడు ప్రమదాకృతియగు సంధ్యను పరి గ్రహించెనను ప్రాచీన గాథ యొకటియున్నది. మీఁది పద్యమునందలి యభిప్రాయ మిది :- "శివుఁడు సంధ్యయందాసక్తుఁడగుటచేత పార్వతీదేవికామెయెడ నసూయ కలిగెను. ప్రణయ కుపితయగు నా మహాదేవి, రశనా సూత్రముగానున్న సర్ప రాజును (వాసుకిని) తనకాసనముగాఁజేసికొని, కంఠాభరణమగు ముక్తాహారమును, రుద్రాక్షమాలవలె, చేతఁద్రిప్పుచు, బిగ్గరగా మిథ్యామంత్రజపము నొనరింపఁదొడఁ గెను. తన్మంత్ర జపోచ్చరితమగు నా జగన్మాత యధరపుటమునుండిట్టి అవ్యక్త (గూఢ) మగు హాసము (ప్రణయకోపజనితమగు నవ్వు) బయల్వెడలుచుండెను. మహాయోగియగు పశుపతిని-ఆసాధ్వి కపట యోగినీ వేషధారణముచేత నిట్లనుకర

రించి హసించెను. శివసంధ్యోపాసన స్థలము నందిట్లు నిగూఢహాసవదనయై సాక్షాత్క రించిన యా త్రిభువనమాత మిమ్ములను రక్షించునుగాక।"

ఇందు-ఈర్ష్యా విప్రలంభ శృంగార-హాస్యములకు, ఉత్కర్షసామ్య ముండి నను నిర్విరోధిత్వము సిద్ధమని యెఱుంగునది.

(ఇందు-ఈర్ష్యా విప్రలంభ శృంగారమునకును-సపరికరమంత్ర జపాది వ్యంగ్యమగు శాంతమునకును-ఉత్కర్షసామ్యము చెప్పఁబడినదని దీధితి 280 పేజీ యందు చెప్పుచున్నది. ఏతద్ వ్యాఖ్యా ప్రదర్శితమగు నిరూపణము సంగతము కానేరదు. శృంగార-శాంతములు విరోధిరసములు. ప్రకరణము ననుసరించి అవిరోధి రసములకే యిచట నుత్కర్ష సామ్యము చెప్పవలయును. మిధ్యాయోగిని యగు జగదంబ ప్రవృత్తి శమ ప్రధానము కానేరదు. కావున నిచట నాసనాది యోగా భ్యాస పరికరము-అనుకరణ రూపమగుటవలన హాస్య వ్యంజకమే, కాని శాంత వ్యంజకము కానేరదని సహృదయులు గుర్తింతురుగాక) అంగభూతమగు విరోధి రసమునకు మాత్రను-అంగిరసముకంటె న్యూనతనే సంపాదింప వలయును. శాంత మంగి యగునపుడు-శృంగారమునకును, శృంగారమంగియగునపుడు శాంతము నకును న్యూనత సంపాదింపవలయును. అనియుం చెప్పఁబడు నంశమునకిది విరుద్ధము కాఁదగదు।

మూలము :— (అవ :— ద్వితీయమగు పరిహార ప్రకార మును దెలుపుచున్నాఁడు.) 1 అంగిరస విరుద్ధములగు వ్యభిచారు లను (అంగభూతమగు రసమున) ప్రచురమగునట్లు (బహుళముగా) నివేశింపఁగూడదు. 2 ఒకానొకప్పుడు వానిని ప్రచురముగా నివే శించినను, శీఘ్రముగానే (వెనువెంటనే) అంగిరస వ్యభిచారుల ననువర్తింపఁజేయ (అనుసంధింప) వలయును. అనునిది-ద్వితీయ పరిహారము.

ప్రభామతి :— అంగభూతరస వ్యభిచారులను బహుళముగా నివేశించిన యెడల ప్రధాన రసాస్వాదమునకు భంగముకలుగునని భావము. 2 "అంగరస వ్యభి చారులను బహుళముగా నివేశింపని యెడల నది (అంగరసము) పరిపుష్టముకాదు" అని యాశంకించి యీ 2వ వాక్యము చెప్పఁబడినది. కావున నీవాక్యద్వయముచేత జెప్పఁబడిన పరిహార ప్రకారమొక్కటియే కాని రెండుకావని గ్రహించునది.

అంగరస వ్యభిచారులను బహుళముగా నివేశించినను వెనువెంటనే అంగిరస వ్యభిచారుల ననుసంధించుట కుదాహరణము-పూర్వోక్తమగు "బలిమిన్ గోమల లోల" అను పద్యము. (చూ-ఆంధ్రధ్వన్యాలోక ప్రథమ భాగమునందలి 135 పేజీ.)

ఈ పద్యమున-అంగిభూతము-శృంగారస్థాయియగు రతి-రౌద్రరసమునకు స్థాయియగు క్రోధము తత్ప్రతికూలమైనను దీని కంగముగా నుపనిబంధింపఁబడి నది. తత్పోషక వ్యభిచారిభావమగు అమర్షము 'బంధించి, బిట్టుగ కన్' ఇత్యాది పదములచేత నధికముగా నివేశింపఁబడినను, వెనువెంటనే, 'ఏడ్చుచున్, స్మేరాస్యన్' ఇత్యాది పదములచేత రత్యుచితములగు, ఈర్ష్య-ఔత్సుక్యము-హర్షము, అను వ్యభిచారు లనుసంధింపఁబడినవి. కావున ప్రధాన రసాస్వాదమున కపకర్షము కలుగుట లేదు.

మూలము :— (అవ :– తృతీయ ప్రకారమును జెప్పుచున్నాఁడు.) 1 "అంగభూతమగు రసము-పరిపోషము నొందింపఁబడినను దాని నంగముగా నుండుసట్లు మాటిమాటికిని ప్రత్యవేక్షింప వలయును" అనునది తృతీయమగు పరిహారము.

2 ఈ మార్గమున మఱికొన్ని ప్రకారములనుగూడ నుత్ప్రేక్షించునది.

ప్రభామతి :— 1 ప్రకరణ ప్రభావముచేత నొకప్పుడు-అంగభూతమగు రసము-స్వగతమగు పరిపోషము నొందినను, దానిని ముఖ్యరస పరమగునట్లు నిరంతరమును సమీక్షించు చుండవలయును. మీఁది వాక్యము "నిర్వహణేచ్ఛ జనించియున్న యప్పుడంగపౌరీతి ప్రయత్నమునను ప్రత్యవేక్షణ మొనరింప వలయును" అనుద్వితీయోద్ద్యోతస్థిత కారికార్థమును స్మరింపఁజేయుచున్నది. ఇచట తాపస వత్సరాజమునందలి వత్సరాజ సంబంధియగు పద్మావతీ విషయ సంభోగ శృంగార ముదాహరణీ కర్తవ్యము.

2 విరోధ పరిహార ప్రకారము లింతను సమాప్తము కాలేదను నభిప్రాయమునఁజెప్పుచున్నాఁడు. అంగిరస విరోధిరససంబంధులగు విభావానుభావములను గూడ నుత్కర్షింపఁజేయఁగూడదు. లేదా తద్విభావానుభావనివేశమునే జరుపఁగూడదు. ఒకప్పుడు విరుద్ధరస విభావానుభావములను నివేశించినను, వాని నంగిరస విభావానుభావములతోఁజేర్చి యంగిరసమునే పరిపోషింపవలయును. (అ)విరుద్ధ రస విభావాను భావములు-పరిపోషితములైనను-అవి ప్రధాన రసమున కంగము లగునట్లు పరీక్షించుచుండ వలయును." అనునివి-కవులు స్వయముగా నుత్ప్రేక్షింపఁదగిన మఱికొన్ని విరోధ పరిహార ప్రకారములని గ్రహింపవలయును.

మూలము :— (అవ :– ఇట్లు విరోధ్యవిరోధి సాధారణమగు, విరోధ పరిహార ప్రకారమును దెలిపి, విరోధి విషయమగు

అసాధారణ దోష పరిహార ప్రకారమునకు మాత్రమే సంబంధించు నట్లు విశేషాంతరమునుగూడఁ దెలుపుచున్నాఁడు.)

(అంగభూతమగు) విరోధి రసమునకు మాత్రము దేని కైనను అంగిరసముకంటె న్యూనత (అపరిపుష్టత) సంపాదింప వలయును. అదెట్లనిన :— శాంతమంగి యగునపుడు శృంగా రమునకును, శృంగారమంగియగునపుడు శాంతమునకును న్యూనత (అపరిపుష్టత) సంపాదింపవలయును.

ప్రభామతి :— అంగభూతమగు విరోధిరసము దేనినైనను, అంగిరస మును పరిపోషించునట్లు పరిపోషింపఁగూడదు. అంగభూతమగు విరోధిరసము నల్ప ముగా పోషించునెడల నది బలీయమగు నంగిరసమును బాధింపనేరదు.

మూలము :— ప్రశ్న :— పరిపోష రహితమగునది, రస మగునా ?

ఉత్తరము :— అంగిరసముకంటె నధికముగా నంగ రసమును పరిపోషింపఁగూడదని మీఁదఁజెప్పియుంటిమి. కాని అంగరసమును సర్వథా పరిపోషింపఁగూడదని చెప్పియుండ లేదు గదా!

అంగియగు రసము నెంత పరిపోషింపవలయునో, అంగ రసము నంత పరిపోషింపఁగూడదు. కాని స్వగత సంభవియగు పరి పోషము నెవఁడు నివారింపఁగలఁడు?

ప్రభామతి :— అంగిరస ప్రతికూలము కాని అంగరస పరిపోషము విద్వేషావహము కాదని భావము.

మూలము :— బహురసములగు (అనేక రసములుగల) ప్రబంధములయందు ఒక రసమున కాపేక్షికమగు ప్రకర్షయోగి త్వము-రసముల కంగాంగిభావము నంగీకరింపని వానిచేఁగూడ ప్రతిక్షేపింపఁబడుటకు శక్యముకానేరదు. కావున నిట్లుక్తమగు ప్రకారమున, అవిరోధి - విరోధి రసముల కంగాంగిభావముచేత ప్రబంధములయందగు సమావేశము-విరుద్ధము కానేరదు.

ప్రభామతి :— కాని మఱికొందఱు-ఇట్లు చెప్పుచున్నారు. స్థాయిగా పఠింపఁబడిన రసము-వేరొక రసమునకు వ్యభిచారియగుచుండును. క్రోధము, వీరమునకు, వ్యభిచారియగుట యిందుల కుదాహరణము. వ్యభిచారిగా పఠింపఁబడిన రసముగూడ వేరొక రసమునకు స్థాయియగుచుండును. తత్త్వజ్ఞాన విభావక మగు నిర్వేదము శాంతమునకు వ్యభిచారియగుట యిందులకుదాహరణము. వ్యభిచారి కూడ (స్వతః) తదితర వ్యభిచారుల నతిశయించి స్థాయియగు చుండును. విక్రమోర్వశీయము నందలి చతుర్థాంకమున-ఉన్మాదమను-భావము వితర్కాదుల నతిశయించి, స్థాయియగుట యిందులకుదాహరణము. కావున ఏ యర్థమును బోధించుటకే (భావములే-స్థాయులును-సంచారులును, అయి అంగాంగిత్వము నొందునను నభిప్రాయమును దెలుపుటకే) ''బహూనాం సమవేతానాం" అను శ్లోకము-ప్రవృత్తమయినది. అశ్లోకమునకు ''చిత్తవృత్తి రూపములగు, అనేకభావములలో, ఏ భావమునకు అత్యధికమగు రూప ముపలభ్యమగుచుండునో అది స్థాయి భావమును, రసమును, (రసీకరణ యోగ్యమును) అగుచుండును. తదితరభావములు సంచారులగును'' అనియర్థము. కాని ప్రధానరసము స్థాయియు, తదితర రసములు, వ్యభిచారులును, అయి, అంగాంగిత్వము నొందుననునది అర్థముకాదు. కావుననే మఱికొందఱు (వారు) 'రసస్థాయీ' అనుచోట, తత్పురుషము నాశ్రయించి, 'రస సంబంధియగు స్థాయిభావ, మగును అను నర్థమును జెప్పుదురు.

(రసముల కంగాంగిభావము నంగీకరింపని వారిమతమున-భావము-ఉపచారము వలనఁ రసమని వ్యవహరింపఁబడును. వారు స్థాయులును, వ్యభిచారులును అగు భావములకే అంగాంగిత్వము నంగీకరింతురు. కావున ''ప్రస్తుతంబయి'' అను కారిక యందలి రస పదములుగూడ వా మతమున భావార్థకములే యగునని భావించి సందర్భసంగతి నొనర్పఁదగును.)

మూలము :— (అవ :- ఇట్లు-విరోధ్యవిరోధి సాధారణ మగు అవిరోధోపాయ ప్రకారమును వివరించి, విరోధిమాత్ర విషయకమగు, అసాధారణ - అవిరోధోపాయ ప్రకారమును - ఆ సూత్రించుచున్నాఁడు.)

ఇట్లు-అవిరోధులును-విరోధులును, అగురసములు-ప్రబంధస్థ మగు నంగిరసముతోఁ గలిసి యుండునపుడు సాధారణమగు అవిరోధోపాయమును ప్రతిపాదించి-ఇపుడు విరోధి విషయమేయగు అవిరోధోపాయమును ప్రతిపాదించుటకీక్రింది కారిక నుగ్గడించుచున్నాఁడు.

గీ॥ ఆశ్రియ మొకండగుట, ముఖ్యమైన స్థాయి
రసమునకు-విరోధియయిన రసము, వ్యధిక
రణముగాఁ జేయవలయు, నా రసముగూడ
పోషితంబయ్యెనపుడు నిర్దోషమగును॥ 25

ఐకాధికరణ్య-విరోధి-నైరంతర్య విరోధి అని విరోధి-ద్వివిధము. అందు, ప్రబంధస్థమును, స్థాయియు, నంగియునగు రసముతోఁడి ఏకాశ్రయత్వ మనుచితమగుటచేత విరుద్ధమగు విరోధి రసము-ఐకాధికరణ్య విరోధి. వీరముతోఁగూడ నొకేయాశ్రయము నందుండు భయానకము-దీని కుదాహరణము. ఇట్లేకాశ్రయత్వము చేత విరుద్ధమగు విరోధిరసమును-విభిన్నాశ్రియము నొనరింప వలయును.వీరమునకు కథానాయకుఁడాశ్రయుఁడగునప్పుడు తచ్ఛత్రు విషయమున భయానకమును ప్రదర్శింపవలయును. అట్లయినచో తద్విరోధి రసమునుగూడ పరిపోషించుట దోషముకానేరదు.

విపక్షవిషయమున భయాతిశయము వర్ణింపఁబడినయెడల నాయకుని నయ-పరాక్రమాది సంపత్తి-విస్తారముగా ఉద్ద్యోతింపఁ జేయఁబడినదగును. (ఉదాహరణము నిచ్చుచున్నాఁడు.)

ఇదియు మదీయమగు-అర్జున చరితమునందు-అర్జునుఁడు పాతాలావతరణ మొనర్చు సందర్భమున స్పష్టముగా ప్రదర్శింపఁ బడినది.

ప్రభామతి :— ఐకాధికరణ్యము = ఏకాశ్రియముతోఁడి సంబంధమాత్రము. దానిచేత విరోధించునది = ఐకాధికరణ్య విరోధి. విరోధులగు రసములు, వీర-భయానకములవలె, ఏకాశ్రియము నందుండుట సంభవింపదు. కావున విరోధియగు స్థాయి రసముతోఁగూడి యొకే యాశ్రియమునందుండని విరోధియగు స్థాయి రస మును వ్యధికరణముగా = విభిన్నాశ్రియముగా-చేయవలయును. పృథగాశ్రియమగు విరోధి రసముయొక్క పరిపోషణమపుడు నిర్దుష్టమేయగును. స్థాయియగు వీరము-భయానకముతోఁగూడి యేకాశ్రియమునందుండుట సంభవింపదు, ఉత్సాహయుక్తుఁడగు వ్యక్తి (మహావీరుఁడు) భయగ్రస్తుఁడు కాఁడుగదా!, కావున నాయకునియందు వీరము నిబంధింపఁబడినప్పుడు, తత్ ప్రతినాయకునియందు భయానకమును నిబం

యందు రాగాత్మకమగు చిత్తవృత్తి ఉదయించినట్లు నిబంధించి-కృతకృత్యుఁడయ్యెను.

నాయకుని కిచట మొదట విరక్తమగు చిత్తవృత్తియు, తదుపరి విస్మయాత్మకమగు చిత్తవృత్తియు, తరువాత-రాగాత్మకమగు చిత్తవృత్తియు, క్రమముగా ప్రసరింపఁజేయఁబడినవి. కాఁగా అద్భుతము-శృంగారమునకు నిమిత్తమగుచున్నది. పురుషార్థవశమున-అద్భుత-శృంగారములకు నిమిత్త-నైమిత్తికభావ మేర్పడుచున్నది. (ఈశ్వర కృష్ణ విరచితమగు సాంఖ్యకారిక యుదాహరింపఁబడుచున్నది.)

విషయములయందు రాగాది చిత్తవృత్తులు ప్రసరించును. చిత్తవృత్తి ప్రసరము గల విషయములయందు దోషమును దర్శించుటయే ధనముగాఁగల వారు-సంఖ్యులు-(సాంఖ్యులు) వారిట్లుచెప్పుచున్నారు.

శ్లో॥ పురుషార్థ హేతుకమిదం నిమిత్త నైమిత్తిక ప్రసఙ్గేన
ప్రకృతేర్విభుత్వయోగాన్నటవద్ వ్యవతిష్ఠతే లిఙ్గమ్॥

సాంఖ్య కారిక 42.

"నిమిత్తములగు ధర్మాదులకును'నైమిత్తికములగు స్థూలదేహాదులకును'గల సంబంధముచేత, పురుషార్థము కొఱకు ఈ సూక్ష్మశరీరము-నటుని వలె వ్యవహరించును. ఒకే నటుఁడు అనేకములగు రూపములను గ్రహించి వ్యవహరించినట్లు ఒకే సూక్ష్మశరీరముకూడ ప్రకృతియొక్క విభుత్వయోగమువలన వివిధములగు దేవాదిశరీరములను పరిగ్రహించి వ్యవహరించును." నిమిత్త-నైమిత్తిక సంబంధము కామాది పురుషార్థవశమున క్రమముగా కలుగుననుటకు-మీఁది వచనమువష్టంభకముగా నీయఁబడినది.

ఇట్లు-అద్భుత నిమిత్తమున నేర్పడిన నైమిత్తికమగు శృంగారము-తదుపరి-శేఖరక వృత్తాంతముచేత నిబద్ధమగు హాస్యముచేత నలంకరింపఁబడినది. అటు పిమ్మట వైరాగ్యశవములను పోషించునదియు, శృంగారమునకు విరుద్ధమును అగు నాగక శేబరాస్థి సమూహ దర్శనాదివృత్తాంతము-నిబంధించునంతలోనే, మలయవతీ నిర్గమనమును సంఘటించి ప్రవేశించిన మిత్రావసుని వాక్కులలో-క్రోధ వ్యభిచారి సమలంకృతమగు వీరరసము-నిబంధింపబడినది. నాగానందమునందలి విరుద్ధ రస సమావేశము-ఇట్లు-అవిరుద్ధ రస వ్యవధానముచేత పరిహరింపఁబడినదని తెలియునది.

**మూలము :— తృష్ణాక్షయసుఖ - పరిపోష లక్షణమగు శాంతరసము-ప్రతీయమానమే యగును.**

(ప్రాచీన సమ్మతిని ప్రదర్శించి యీ యర్థమును దృఢీక రించుచున్నాఁడు)

గీ॥ భూమిలోకంబునందున్న కామసుఖము,
దివ్యలోకంబునందున్న భవ్యసుఖము,
సకటః తృష్ణాక్షయాహ్వాయంబగు సుఖమునఁ
గ్రాలు షోడశ కళనైనఁబోలఁగలవె?

అని పెద్దలు వాకొని యున్నారు. [శాంతము-తృష్ణాక్షయ సుఖపరిపోష రూపమని భావము.

ప్రభామతి :— "శాంతమను నొకరసము ప్రసిద్ధమైయున్నయెడల పూర్వోక్త మగు విరోధ పరిహార వివేచనము సంగతమగును, 'శాంతమను రసములేదు' శాంతమున్నయెడల భరతముని దానికి స్థాయిభావము నేల యుపదేశింపకుండును?" అని యాశంకించి చెప్పుచున్నాఁడు. తృష్ణలనఁగా; విషయాభిలాషములు, తృష్ణాక్షయ మనఁగా; విషయాభిలాషములనుండి సంపూర్ణముగా మనస్సును నివర్తింపఁజేయుట (మరలించుట) తన్నివృత్తిరూపమగు (నిరోధరూపమగు) నిర్వేదమే (తత్త్వజ్ఞానము వలన విషయములను హేయములుగా స్ఫురింపఁజేసినబుద్ధియే) తృష్ణాక్షయసుఖము, స్థాయిభూతమగు ఈతృష్ణాక్షయ సుఖమునకు (నిర్వేదమునకు) పరిపోషము-రస్య మానతాకృతమగును.

(ఇట్లు) తృష్ణాక్షయసుఖ (నిర్వేద) పరిపోషలక్షణ (రూప)మగు రసము-శాంతము, అది-ప్రతీయమానమేయగును.-భోజనాది సమస్త విషయేచ్ఛాప్రసరము నివర్తింపజేయబడిన సమయమున స్వానుభవముచేతఁగూడఁదెలియఁజేయఁబడుచున్న దని భావము.

కొందఱు శాంతమున స్థాయియగు భావము శమమే కాని నిర్వేదముకాదని చెప్పుచున్నారు. శమమనఁగా సర్వచిత్తవృత్తి ప్రశమము, కావున సర్వచిత్తవృత్తి ప్రశమమే (రత్యాదిరూపములగు చిత్తవృత్తులన్నియు ప్రకృష్టముగా శాంతించుటయే) శాంతమునకు స్థాయియని తలంచుచున్నారు. వారి మతమున చిత్తవృత్తి ప్రశమమే తృష్ణాక్షయ సుఖమగుచున్నది.

సర్వచిత్తవృత్తి ప్రశమమనఁగా ప్రసజ్యప్రతిషేధము-అనఁగా చిత్తవృత్తి ప్రసరము లేకుండుట' అగునెడల, అది-"చిత్తవృత్తి కానేరదు, కావున నది (చిత్తవృత్తి రూపమగు) భావము కాఁజాలదు, కావున నది స్థాయి కానేరదు, కావున

సర్వచిత్తవృత్తి ప్రశమపదమునకు ప్రసజ్యప్రతిషేధమును = సర్వచిత్తవృత్తి ప్రాస రాత్యంతాభావమును = చిత్తవృత్తి యేదియునుగూడ బొత్తిగా లేకుండుటను అర్థముగా వివక్షింపఁగూడదు.

పర్యుదాసన్యాయమున నర్థమును వివక్షించునపుడు అధర్మపదమునకు-ధర్మ విరోధియగు పాపాదిక మర్థమగునట్లు తృష్ణాక్షయ పదమునకుగాని, సర్వచిత్తవృత్తి ప్రశమపదమునకుఁగాని-సర్వచిత్తవృత్తి (రత్యాది సర్వభావ) విరోధియగు, చిత్త వృత్తి విశేషము (వేరొక భావము) అర్థముగాఁ వివక్షింపఁబడినయెడల - అప్పుడది మేము చెప్పిన నిర్వేదమే యగుటవలన నది అస్మత్పక్షమే యగును. [“ప్రశమ మనఁగా, చిత్తవృత్తులు లేకుండుట” అను నర్థమును జెప్పునెడల-ప్రశమము నకు స్థాయిత్వము సంభవింపదు. ప్రశమమనఁగా, “విషయాలాభిషముకంటె భిన్నమగు చిత్తవృత్తి” అని చెప్పునెడల-అది-మాపక్షమేయగునని తాత్పర్యము.]
వేరొక కొందఱు శ్లో॥ స్వంస్వం నిమిత్తమాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయేతు శాంత ఏవ ప్రలీయతే॥

“స్వీయమగు కాంతాది నిమిత్తము నాశ్రయించి, నిర్వికారమును, అంతః కరణ రూపమును, ప్రకృతియునగు శాంతమునుండి రత్యాదిరూపమగు భావముద యించుచుండును, తిరుగ కాంతాదిరూపమగు నా నిమిత్తమున కపాయము గలుగు నపుడు, రత్యాది రూపమగు నాభావము, ప్రకృతియగు శాంతమునందేలయించు చుండును” ఏతదర్థకమగు నింకొక పూర్వశ్లోక మీయర్థము నింతకంటెను స్పష్ట ముగా ప్రవచించుచున్నది.

శ్లో॥ భావావికారా రత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవలీయతే॥

“రత్యాదిభావములు-వికారములు, శాంతము-ప్రకృతి. ప్రకృతినుండి జనిం చిన వికారము ప్రకృతియందే లీనమగును.” అని భరతనాట్యశాస్త్రమునందలి భావాధ్యాయాంతిమ భాగమునందున్న మీఁది భరతవాక్యములను ప్రమాణముగా స్వీక రించి, శాంతము-సర్వరససామాన్య స్వభావమనిచెప్పి, అనుపజాత-విశేషాంతర-చిత్త వృత్తి రూపమును (బాహ్యవనితాది విషయ విశేషము నాశ్రయింపని అంతరాత్మ విషయకమగు చిత్తవృత్తిని) శాంతమునకు స్థాయిభావమని తలంచుచున్నారు.

ఏతన్మతముగూడ నంతగా మామతమునకు దూరమగునది కాదు (ఇదికూడ-అస్మత్పక్ష-సన్నికృష్టమేయగును) వారి మతమునకును మామతమునకును-ప్రాగ భావ-ప్రధ్వంసాభావకృతమగు భేదముమాత్రమున్నది. (వారి మతమున శాంతము సర్వచిత్తవృత్తి ప్రాగభావరూపము. మా మతమున నది-సర్వచిత్తవృత్తి ప్రధ్వంసా భావరూపము.)[ప్రధ్వంసాభావరూపము] తృష్ణాప్రధ్వంసపక్షమే యుక్తమగుచున్నది.

(ఆత్మనిత్యత్వమును సాధించుటకు) న్యాయసూత్రకారుఁడు "వీతరాగజన్మాదర్శనాత్" అనుసూత్రమును (తృతీయాధ్యాయ ప్రథమాహ్నికమున) ప్రవచించెను. "సరాగునకే జన్మముగాని విరాగునకు = రాగాదిరహితునకు-జన్మము కాన్పింప కుండుటవలన ఆత్మ-నిత్యుఁడే యగును" అని యర్థము. దీనివలన తృష్ణా (సర్వ చిత్తవృత్తి) ప్రధ్వంసపక్షమే-ప్రధ్వంసాభావరూపమగు అన్మత్పక్షమే యుక్తము. భరతమునికూడ 'క్వచిచ్ఛమః' అని దీని నంగీకరించియే యున్నాఁడు.

("శాంతము-ప్రతీయమానమగుటకు-చేష్టోపరమాదులగు ననుభావములుగదా ప్రదర్శింపఁదగినవి; కాని యవిప్రయోగ యోగ్యములు కానేరవు. కావున నాయను భావములచే నది ప్రతీయమానము కానేరదు" అను వారి మతమును నిరాకరింపఁ దలఁచి చెప్పుచున్నాఁడు.) శాంతసంబంధివియగు పర్యంతావస్థ (నిరీహావస్థ) మాత్రము వర్ణింపఁదగినది కానేరదు. అప్పుడు చేష్టలన్నియు-ఉపరమించుట (ఉడుగుట) వలన, అనుభావములేవియు నుండవు. కావున శాంతము ప్రతీయమానము కాకపోవలసివచ్చును. శృంగారాదులగు రసములుగూడ ఫలభూమియందు (సురతాద్యవస్థలందు) అవర్ణనీయములే (వర్ణింపఁదగనివే) యగును. పూర్వభూమి (పూర్వావస్థ) యందు మాత్రము "తస్య ప్రశాంతవాహితా సంస్కారాత్" 2 "తచ్ఛిద్రేషు ప్రత్యయాన్తరాణి సంస్కారేభ్యః" [1 "మీఁదఁ దెలుపఁబడిన నిరోధ సంస్కారము వలన విక్షేపరహితమగుటచేత చిత్తము-ప్రశాంతవాహి (సదృశప్రవాహ పరిణామి) యగును" 2 "ఆ సమాధియందున్న యోగికి, పూర్వసంభవములును, వ్యుత్థానానుభవ సంజాతములును, అగు సంస్కారములు (నేను, నాది, ఇత్యాదిరూపములు) క్షీణించినను, క్షీయమాణములగు నా సంస్కారములవలనఁ గూడ వ్యుత్థానరూపములగు ప్రత్యయాంతరములు ('నేను-నాది' ఇత్యాదిజ్ఞానములు) అంతరాళచ్ఛిద్రములయందు (నడుమ నడుమ నుదయించిన యవకాశములయందు) కలుగుచుండును" అను నర్థముగల] యోగ సూత్రద్వయము ననుసరించి, చిత్రాకార (విస్మయావహ)మగు, యమ నియమాదిచేష్టగాని, రాజ్యధురోద్వహనాదిచేష్టగాని, (మహాయోగులు గావున) శాంతులయినను జనకాదులయందుఁగూడ కాన్పించుచున్నది.

కావున యిట్లు, (చేష్టారూప) అనుభావ సద్భావము వలనను యమనియమాది యోగాంగమధ్య సంభావ్యమాన బహుళ వ్యభిచారి (మతి-ధృతి-స్మృత్యాది) సద్భావము వలనను శాంతము ప్రతీయమానమే యగును. జనకాదులయెడ సమాధియందు యమాదిచేష్టయు, జాగ్రదవస్థయందు రాజ్యపరిపాలనాదిచేష్టయు, కాన్పించు చున్నదిగదా!

"శాంతమునకు విభావములు లేకుండుటవలన నది ప్రతీయమానము కానేర" దని యాశంకించి సమాధానము నిచ్చుచున్నాఁడు.

ప్రాక్తనకుశల,(సత్కర్మ) పరిపాకము, పరమేశ్వరానుగ్రహము, అధ్యాత్మ రహస్య (వేదాంత) శాస్త్ర విచారము. వీతరాగ (ప్రవృత్తి) పరిశీలనము, మొదలగు విభావములుండుటవలన శాంతము ప్రతీయమానమేయగును. ఇట్లు శాంతమున నగు-విభావానుభావ - వ్యభిచారిభావ-సద్భావమును, స్థాయిభావమునుగూడ, ప్రదర్శితము. (ఇట్లు-విభావాది సద్భావమున్నను) "శాంతము (జ్ఞాతృ) హృదయ సంవాద వంతము (హృదయ ప్రతీతి గోచరము) కాకుండుటవలన రస్యమానము మాత్రము కాదని చెప్పఁగూడదు.

(సహృదయ శిరోమణియగు వృత్తికర్త) శాంతము ప్రతీయమానమే (జ్ఞాతృ హృదయ ప్రతీతి గోచరమే) అని చెప్పునపుడు-ఇట్లు (శాంతము-సహృదయ హృదయ ప్రతీతి గోచరము కాదని) చెప్పఁగలిగిన వాఁడెవ్వఁడున్నాఁడు?

"శాంతము ప్రతీతమైనను (జ్ఞాతృ హృదయ ప్రతీతికి గోచరించినను) సర్వ జన శ్లాఘాస్పదముకాదు" అనునెడల, వీతరాగులకు (వైరాగులకు) శృంగారము శ్లాఘాస్పదము కాకుండుటవలన నది (శృంగారము) కూడ, రసత్వము నుండి భ్రష్టము కావలసివచ్చును.

మూలము :— "శాంతరసము-సర్వజనానుభవగోచరము కాదు" అను నింతమాత్రముచేత, దానిని అలోక సామాన్య-మహానుభావ - చిత్తవృత్తి విశేషమును వలె త్రోసివేయుటకు శక్యముకాదు.

ప్రభామతి :— [లోకాతిశాయియగు మహాపురుష చిత్తవృత్తి విశేషము-బహుజనానుభవగోచరముకాకున్నను, అది - లేదని చెప్పుటకు వలను పడనట్లు, శాంతము-బహుజనానుభవ గోచరముకాకున్నను, శాంతరసము లేదనుటకు వలను పడదు. అట్లనినయెడల బహుజనానుభవగోచరుఁడుకాకుండుటవలన నీశ్వరుఁడు కూడ లేఁడని చెప్పవలసివచ్చును.

ఇచట :- "అలోకసామాన్య మహానుభావ చిత్తవృత్తి విశేషమగునది లేదని చెప్పుటకు వలనుపడదు" అను పాఠాంతరముకూడనున్నది. దీని వలన "జన్మాంతరీయాపరిమిత సుకృత పరిపాక విజృంభిత నిర్వేద సంస్కారులగు కొందఱికది (శాంతరసము) అనుభవ గోచరమే యగుటవలన, శాంతములేదనుటకు వలను పడదు" అనునర్థమేర్పడుచున్నది.

మూలము :— (అవ :— "వీరరసమునందీ శాంతమం తర్భవింపఁగూడదా?" అను నాశంకను పరిహరించుచున్నాఁడు)

అభిమాన ప్రశమైక రూపమగు శాంతమును-అభిమాన మయమగు వీరము నందంతర్భవింపఁజేయుటకూడ యుక్తము కానే రదు.

శాంత-వీరములకు ఏవంవిధమగు భేదమున్నను అవి యొక్కటియే యగుననునెడల వీర-రౌద్రములుగూడ నొక్కటియే యగుననవలసివచ్చును.

"చిత్తవృత్తి విశేషములు, సర్వాత్మనా, అహంకార రహితములగునప్పుడు,దయాధర్మవీరాదులుగూడ శాంతప్రభేదములగును. అట్లుకానపుడు (అహంకార సహితములగునపుడు) మాత్రము వీర రస ప్రభేదములగును" అను వ్యవస్థ చేయఁబడినయెడల విరోధ మేదియునుండదు. కావున శాంతరసమున్నది.

ప్రబంధమున విరోధి రసముతోడి సమావేశమున్నను, తదవిరుద్ధ రసవ్యవధానముచే నదియు (శాంతముకూడ) నిర్విరోధి యగుచుండును. మీఁదఁబ్రదర్శింపఁబడిన విషయము-(నాగానందమునందలిది) దీని కుదాహరణమై యున్నది.

ప్రభామతి :— "శాంతము-ధర్మప్రధానమగు వీరమే" (ధర్మవీరమే) అని సంభావించి, దానిని పరిహరించుటకై చెప్పుచున్నాఁడు. వీరము-అభిమానమయము. కావున ధర్మవీరమునందీశాంతమంతర్భవించుననుట యుక్తముకాదు. వీరమునకు స్థాయియగు నుత్సాహము-"నేనే సర్వాధికుఁడను. సమస్తమును సాధించుటకు శక్తుఁడను." అను బుద్ధియే ప్రాణముగాఁగలది. శాంతము-అహంకార ప్రశమైక రూపము. (సర్వవిధాహంకార నివృత్తిరూపము.) అహంకార ప్రశమైక రూపమగు శాంతము-అభిమానమయమగు వీరము కాఁజాలదు. నిరీహామయత్వమున అత్యంత విరుద్ధమగు శాంతమును-సమీహామయత్వమున పరిపూర్ణ విరోధియగు వీరమును 'ఏకమే' యగునెడల-వీర-రౌద్రములుగూడ నేకమే కావలసివచ్చును.

ఏలయనిన; శాంతవీరములకువలెవీనికి, అత్యంతమగు విరోధముకూడలేదు. ధర్మార్థకామార్జనమునందుపయోగింపఁ సమానమగు రూపముగూడమున్నది.

ఇట్లు శాంత-వీరములకు భేదము నంగీకరించుటవలన శాంతము-దయా వీరము గాని, ధర్మవీరముగాని, దానవీరముగానికాదు. భరతముని "దానవీరం, ధర్మవీరం యుద్ధవీరం తథైవచ। రసవీరమపి ప్రాహబ్రహ్మా త్రివిధ సమ్మితమ్" 'దానవీరము-ధర్మవీరము-యుద్ధవీరము. అని వీరరసమును బ్రహ్మదేవుఁడు త్రివిధ సమ్మితము గాఁ జెప్పెను' అవి ఆగమ పురస్సరముగా త్రైవిధ్యమునే చెప్పుటవలన దయా వీరము-దాన ధర్మవీరములుకాక శాంతమునకు నామాంతరమేయగును. (దయావీర) ధర్మవీర-దానవీరములు గూడ నాయకుఁడహంకార రహితుఁడగునపుడు శాంతరస ప్రభేదములే యగును. కాని నాయకుడహంకార సహితుడగు నపుడు మాత్రము వీరరస ప్రభేదములే యగును.

"జుగుప్స అను భావము-భీభత్సమునకు స్థాయిగదా॥ శాంతమునకుఁగూడ-విషయ జుగుప్సయే(శబ్ద-స్పర్శ-రూప-రస-గంధముల నేవగించునదియగు బుద్ధియే) స్థాయియగు భావముగాఁదోఁచును. కావున, శాంతము భీభత్సమునందంతర్భవించునని (శాంతము-వేరొక రసముకాక భీభత్సమేయగునని) యేల చెప్పఁగూడదు॥" అని కొందఱుశంకింతురని సంభావించి, తదాశంకను నిరాకరించుచున్నాఁడు.

శాంతమును పరిపూర్ణముగా నిర్వహించునపుడీజుగుప్స - సమూలముగా విచ్ఛిన్నమగును. కాని స్థాయియగు (తుదివఱకును నిలిచియుండు) భావము కానేరదు. కావున శాంతమునకిది వ్యభిచారియే-(తాత్కాలికమగు సహకారియే)యగును. "శాంతము నాధికారికముగా (ప్రధాన నాయక కథాశ్రయమగునట్లు) మాత్రము నిబంధింపఁగూడదు" అని చంద్రికా కారుఁడనియెను. అది-వేరొక ప్రసంగ మగును. కావున నిచట మేము దానిని పర్యాలోచింపము. శాంతము-మోక్షమే ఫలము గాఁగలిగి పరను పురుషార్థనిష్ఠమై యున్నది. కావున నదియే సర్వరసములకంటెను ప్రధానతమ మగుచున్నది. అస్మదుపాధ్యాయులగు భట్టతౌతులు (భట్టతౌతాచార్యుఁడు) (స్వవిరచితమగు) కావ్యకౌతుకమునందును, మేము అస్మత్కృతమగు కావ్య కౌతుక వివరణమునందును, శాంతరస విషయకమగు-పూర్వపక్ష-సిద్ధాంత నిర్ణయ మును, బహుతరమగునట్లు కావించియున్నారము.

కావున-విస్తరభీతిచే నిచట మేమా విషయమును పర్యాలోచించు వారలము కాము.

(శ్రీమదాచార్య - అభినవగుప్తపాదులవారు-శ్రీ భట్టతౌతునియొద్దనాట్య వేద తత్త్వార్థమునధ్యయనమొనర్చి, శ్రీభట్టతౌతుఁడు రచించిన కావ్యకౌతుకమను గ్రంథమునకు వివరణము నొనర్చినట్లు దీనివలనఁదెలియుచున్నది)

పరిభామతి :— ఆంధ్రవివరణము :— ఈ యంశమును "శాంతము-ప్రకృతిరసము" అను నొక వ్యాసమున వివరింతును.

ఇచ్చట మీది యభిప్రాయమును పాఠక సౌలభ్యము కొఱకు సంగ్రహముగ నివేదింతును. "శాంతమను రసమొకటి కలదా?" అనునొక వివాద మున్నది. తృష్ణాక్షయ రూపమగు సుఖము పరిపోషము నొందునట్టి స్థితియే శాంతరసమగుచున్నది. తృష్ణాక్షయము అనఁగా కోరికలు నశించుట. ఈ నాశము సుఖరూపమే యగుచున్నది. తృష్ణాక్షయరూపమగు సుఖము పరిపుష్టమగునపుడు తృష్ణాక్షయసుఖ పరిపోష స్వరూపమగు శాంతరసము ప్రతీయమానమగుచునే యున్నది. దీనికి నిర్వేదము-స్థాయిభావము, కొందఱు సర్వచిత్తవృత్తి ప్రశాంతియే శాంతమునకు స్థాయియని చెప్పుదురు. ప్రశాంతి అనఁగా ప్రసజ్యప్రతిషేధము-చిత్తవృత్తులేవియు లేకుండ నశించుట అనుచో అది చిత్తవృత్తిరూపమగు భావరూపము కాదు. కావున నది స్థాయిభావము కానేరదు. ప్రశాంతి అనగా పర్యుదాసము. (విషయతృష్ణలకంటె వేఱొక చిత్తవృత్తి) అనుచో అది-అస్మత్పక్షమే యగును ఏ విధమగు విశేషమును ఉదయింపని చిత్తవృత్తి (ప్రాగభావరూపము) శాంతమునకు స్థాయిభావమని వేఱొకి కొందఱు చెప్పుదురు. ఈ యభిప్రాయముకూడ మా యభిప్రాయముకంటె నెక్కువ భిన్నముకాదు.

ఎట్టి విషయేచ్ఛలనుపుట్టని చిత్తవృత్తియే స్థాయియని వారనుచున్నారు. విషయతృష్ణలన్నియు నశించిన చిత్తవృత్తియే స్థాయియని మేమందుము. కాఁగా, వేఱొక కొందఱి మతమున శాంతరస స్థాయిభావము-చిత్తవృత్తి ప్రాగభావరూపము. మా మతమున నది-చిత్తవృత్తి ప్రధ్వంసాభావరూపము. "విషయాభిలాషలు నశించిన వారికి మఱల జన్మ కనఁబడుటలేదు" అనున్యాయమాత్రమువలన ప్రధ్వంసాభావమే తెలుపఁబడుచున్నది. కావున, తృష్ణలు జనింపని ప్రశాంతి-శాంతమునకు స్థాయిభావమను ప్రాగభావవాదముకంటె తృష్ణలు నశించిన ప్రశాంతి-శాంతమునకు స్థాయిభావమను ప్రధ్వంసాభావవాదమే సముచితమని తెలియునది. "చివరి దశలో శాంతరసము

వర్ణింపఁదగనిదగుచున్నది. కావున శాంతరసము ప్రతీయమానము కాదు" అను పూర్వపక్షము నిలుచునదికాదు. శృంగారాది రసములు గూడ చివరిదశయందు వర్ణింపరానివే యగుచున్నవి.

"ప్రధాననాయక కథాశ్రయమగునట్లు శాంతరసమును నిబంధింపఁగూడదని" ధ్వన్యాలోకమునకు చంద్రిక అను ఒక వ్యాఖ్య నొనరించిన ఒకానొక పండితుఁడు తెలిపియుండెను. ఈ వ్యాఖ్య "లోచనము" కంటె ముందేపుట్టియున్నది. ఈ యభిప్రాయమును అభినవగుప్తుని గురువగు భట్టతౌతాచార్యుఁడు కావ్యకౌతుకమను గ్రంథమునందు ఖండించెను.

దీనిని కావ్యకౌతుక వివరణమునందు అభినవగుప్తుఁడుకూడ ఖండించెను. శాంతరస విషయకములగు పూర్వపక్షముల నన్నింటిని పరిశీలించి వీరిరువురునుగూడ శాంతరసము ప్రతీయమానముగునను విషయమును విపులమగునట్లు నిరూపించియుండిరి. గ్రంథ విస్తర భీతిచేత మరల నీవిషయము నిచట నిరూపించుటకు అభినవగుప్తుఁ డంగీకరింపఁడయ్యెను"అని పాఠకులు గ్రహింపఁగోరెదను.

"శాంతమునకు విభావాదులు లేకుండుటవలన నది ప్రతీయమానము కానేరదు" అనుటకు వీలులేదు. శాంతమునకుఁగూడ-సత్కర్మపరిపాకము, పరమేశ్వరానుగ్రహము, వేదాంతవిచారము, వీతరాగపరిశీలనము, మున్నగు విభావములున్నవి. యమనియమాది చేష్టారూపములగు అనుభావములున్నవి మతి-ధృతి-స్మృత్యాదులగు వ్యభిచారులున్నవి, ధర్మవీరము-అభిమానమయమై యుండును. కావున ధర్మవీరమునందీశాంతమంతర్భవించునది కాదు. నాయకుఁ డహంకార రహితుఁడగునపుడు ధర్మవీర, దానవీరములు శాంత రసమునందంతర్భవించి, శాంతరస ప్రభేదములే యగును. దయావీరము-శాంతరస ప్రభేదమే యగును జుగుప్స-శాంతమునకు వ్యభిచారియగును. కాని స్థాయికానేరదు. ఈ శాంతము-శ్రవ్య కావ్యములయందేకాక దృశ్యకావ్యముల యందుఁగూడ-ప్రతీయమానముకాఁగలదని సహృదయులు గ్రహింపఁగోరెదను. కాఁగా

శాంతరసమున్నది. ప్రబంధమునందు-దీనికిఁగూడ-విరుద్ధరసముతోడి సమావేశము కలుగును.

ఈ శాంతరసమునకును, దీనికి విరోధియగు రసమునకును, అవిరుద్ధమగు వేరొక రసమును వీని నడుమనుంచుటవలన వీనికి గల విరోధముకూడ నివర్తించును.

మూలము :—. అవ :— ఈ యంశమునే (శిష్యబుద్ధియందు) స్థిరీకరించుట కిది (క్రిందికారిక) చెప్పఁబడుచున్నది.

మంజరి॥ అవిరుద్ధమైన రసాంతరం, బంత
రము నందగు విరుద్ధరసములు రెండు
తామేక వాక్యస్థితమ్ములై యుండి
నను, విరోధముఁబాసి తనరారుచుండు 27

ఏకవాక్య స్థితములగు విరుద్ధరసములకుఁగల శత్రుత్వముగూడ (అనుకూల) రసాంతర వ్యవధానముచేత నివర్తించునపుడు, రసాంతర వ్యవహితములై, యేకప్రబంధస్థములగు విరుద్ధరసములకుఁగల విరోధిత్వము నివర్తించుననుటయందు భ్రాంతియేదియు నుండదు. (విరుద్ధములగు రసములు-అనుకూల రసాంతర వ్యవధానములగునపుడు ప్రబంధమునందే కాక వాక్యమునందుఁగూడ-ఎట్లు నిర్విరోధములగునదియు నుదాహరించుచున్నాఁడు)

దీని కుదాహరణము :—

సీ॥ భూరేణు పరిలిప్త మూల-పారిజాతమా
లారజోవాసితోరస్థలులయి
అధిక గాఢముగా శివాలింగితముల-దే
వాంగనాశ్లిష్టభుజాంతరులయి
పలలాశిఖగ-రక్తకలితస్ఫురత్ పక్ష
మండలాభ్యుపవీజ్య-మానములను
చందనవారి సుగంధ బంధుర కల్ప
లతికాదుకూల వీజితులగుచును

గీ॥ సమర పతితములగు స్వదేహముల-ఘనవి
మాన పర్యంకతల సమాసీనులయిన
వీరవరులు, కుతూహలావిష్టులగుటఁ
గాంత లంగుళులనుజూపఁగాంచిరపుడు॥ ఇత్యాదికము.

మీఁది పద్యమునందు - శృంగార - భీభత్సములకుఁగాని, తదంగములకుఁగాని, వీరరస వ్యవధానముచేసగు సమావేశము విరుద్ధము కాదుగదా!

పరిభామతి :— [మీఁది పద్యమునందు-మొదటివి 4-దేహ విశేషణములు, రెండవవి 4-వీరవిశేషణములు.

"బూడిదచేఁగప్పఁబడినవియు, ఆడునక్కలచే (భక్షించుటకై) గట్టిగా, కౌఁగ లించుకొనఁబడినవియు, రుధిరమిళితములగు ఖగపక్షములచే బాగుగా విసరఁబడు చున్నవియు, సమరభూమి యందుఁబడియున్నవియునగు స్వదేహములను-దేవతలైన పిదప, క్రొంగ్రొత్తలగు పారిజాతముల పుష్పాదులచేత పరిమళింపఁజేయఁబడిన వక్ష ములు గలవారును, అచ్చరవెలందులచేఁగౌఁగలించుకొనఁబడిన భుజాంతరాళములు గలవారును, చందనజలముచేఁదడుపఁబడి సుగంధభరితములైన కల్పవృక్ష సంబంధి పట్టు వస్త్రములచే బాగుగా విసరఁబడుచున్నవారును, విమానపర్యంకములయందుఁ గూర్చుండినవారును, అగు (యుద్ధనిహత) మహావీరులు తమకాంతలు తమ మనో హరాంగుళులతోఁజూపుచుండఁగా, కుతూహలమనస్కులై వీక్షించుచుండిరి" ఈ యర్థమంతయు-ఏకవాక్యగతమగుచున్నది.

ఇందు-భీభత్స-శృంగారములనడుమను వీరము నివేశింపఁబడినది. భీభత్స-శృంగారములు పరస్పర విరోధులైనను, వీరరసవ్యవధానమున అవిరోధులయినవి.

ఇందలి దేహ విశేషణములచే భీభత్సమును, వీర విశేషణములచే శృంగారమును వ్యంజితములు. యుద్ధభూమియందుఁబడుట-స్వర్గమునకేగుట, అనునవి యుద్ధోత్సాహ జన్యములు. కావున-ఉత్సాహమూలకమగు వీరరసముగూడ,వాని నడుమనుధ్వనింపఁ జేయఁబడి, తదుభయరసవిరోధమును పరిహరించుచున్నది. ఇందు మొదట భీభత్సము-తముపరి వీరము, తరువాత శృంగారము, పిమ్మట, వీరము, అని యిట్లు వ్యవధానముండుటచేత, నైరంతర్యము లేకున్నది. కావున వానికి (భీభత్స-శృంగా రములకు) విరోధనివృత్తి కలుగుచున్నది.

ఇచట, వీరమున కాలంబనము-ప్రతియోద్ధ. శృంగారమున కాలంబనము

సురాంగనలు. కావున నాలంబన భేదముండుటవలన నిందలి-వీర-శృంగారములకుఁ గూడ వైరుధ్యములేదు.]

(ఒకే సమయమున, నొకేవ్యక్తికి-రతియు, తద్విరోధియగు-జుగుప్సయు, కలుగనేరవు. కావుననేకవాక్యమున, ఏకకాలమున, ఏకాలంబనకములగు శృంగార-భీభత్సములను నివేశించుటమాత్రము విరుద్ధమేయగును. ప్రకృతమున-''భూరేణు పరిలిప్తముల'' ఇత్యాది విశేషణ విశిష్టములగు వీరదేహము లాలంబనముగాఁగలది-భీభత్సము. దివ్యత్వ విశిష్టములగు వీరదేహములాలంబనముగాఁగలది - శృంగారము. కావుననవి-ఏకాశ్రియములుకావు. కావున భిన్నాశ్రియములగునవి విరోధు లెట్లగును? అని యాశంకించి లోచనకర్త ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.)

శవములను, అనిచెప్పక 'స్వదేహములను' అని చెప్పుటచేత ఏకాశ్రియత్వము సిద్ధించుచున్నది. సమరభూమియందుఁబడిన కళేబరములయందు దేహాత్వాభిమానము (స్వదేహాత్వబుద్ధి) వలననే-తాదాత్మ్య సంభావన (శవశరీర-దివ్యశరీరములయందేకత్వ బుద్ధి) నిష్పన్నమగుచున్నది. కావున-ఏకాశ్రియత్వము సిద్ధమేయగును. (భీభత్సము నకును, స్వర్గలనాగతమగు శృంగారమునకును, గూడ-శవశరీర-దివ్యశరీర, ద్వయైక్యము నభిమానించు వీరుఁడొక్కఁడే యాలంబన మగుటవలన-తదాలంబనకములగు, భీభత్స-శృంగారములు విరోధులే యగును.

ప్ర :— ఈ పద్య వాక్యమున వ్యంజితమగునది వీరమే. (అది ''అపూర్వ మగు సాహసమున యుద్ధరంగమధ్యమునందురుకుట'' మున్నగు ననుభావము చేతను, ఆక్షేపలభ్యములగు గర్వాదిసంచారిభావములచేతను ప్రతీయమానమగు చున్నది) శృంగార-భీభత్సములు వ్యంజితములుకావు. కావుననే శృంగార భీభత్సము లకు స్థాయిభూతములగు రతి-జుగుప్సలుమాత్రము-వీరమునకు వ్యభిచారిభావము లగును. కావున మీది యుదాహరణమసంగతము.

ఉ :— అట్లే కానిమ్ము! అట్లయిననుగూడ-ప్రకృతోదాహరణ ముపపన్నమే యగును. రతి-జుగుప్సలుగూడ నిరంతరము లగునపుడు-బాధ్య-బాధకములగును. కావున రసాంతర వ్యవధానము లేనియెడల నవికూడ-నిర్విరోధములుకానేరవు. అట్లగుటవలన, శృంగార-భీభత్సములకు అంగములగు = స్థాయిభావములగు, రతి-జుగుప్సలకుఁగూడ వీరరస వ్యవధానముచే నగు సమావేశము విరుద్ధము కానేర దనుట కిది యుదాహరణమే యగును.

ప్ర :— భీభత్స - శృంగారములనడుమ - వీరరసము నివేశింపఁబడినదని యెట్లు చెప్పఁగలరు?

ఉ :— ''వీరవరులు-స్వదేహములను (కాంచిరి') అనుటచేత వీరసంబంధి యగు నుత్సాహాదికమవగతమగుచున్నది. తదవగతిచేతనే (''భూరేణు'' ఇత్యాది)

సమస్త వాక్యాన్వయితచేత కర్మలగు దేహములును, కర్తలగు వీరులును, బోధింపఁబడుచున్నారు. కావున వాని నడుమ పఠింపఁబడకున్నను వీరరసము-భీభత్స-శృంగారములకు తెలపిని గలిగించునదియే (వ్యవధానము నిచ్చునదియే) అగును.

మూలము :— (మీఁదివిషయము నుపసంహరించుచు-ఉపదేశించుచున్నాఁడు.)

గీ॥ స్థలములన్నిటియందు నీ చందముననె,
రసవిరోధావిరోధనిర్ణయము తగును
కరము సుకుమారమగుట శృంగారమందు
మాత్రి మధిక నిర్ణయము సంభావ్యమగును॥ 28

పూర్వోక్తమగు లక్షణముననుసరించి,సహృదయుఁడు-(కవి) సర్వరసములయందును నేర్పడు విరోధావిరోధములను ప్రబంధమునందును, తదితరమునందును, నిరూపింపవలయును. శృంగార రసము(తదితరములగు) రసములన్నిటికంటెను సుకుమారతమము. అది రతి పరిపోషాత్మకమగుటవలన నందత్యల్పమగు నిమిత్తముచేతఁగూడ రతికి భంగము సంభవించును. కావున, నా రసమునవిరోధావిరోధ నిర్ణయము నధికముగాఁగావింపవలయును.

(రసము లన్నిటికంటెను సుకుమార తమమగు) అది-విరోధి రససమావేశము నించుకయు సహింపకుండును.

ప్రభామతి :— (1) తదితరమునందును = పూర్వాపర సందర్భ శూన్యమగు ముక్తకాదికమునందును, (నిరూపించునది.) ‘‘రసజాతీయమంతయుఁగూడ సుకుమారమే. ఆ రసములలోఁగూడ, తదితరములకంటె కరుణము-సుకుమారతరము. దానికంటెనుగూడ శృంగారము - సుకుమారతమము’’ అని తమప్రత్యయార్థము నెఱుఁగునది.

(రసములను, కావ్యాదులయందు నివేశించునపుడు-సహృదయుఁడగుకవి-వానికేవి విరోధులో-ఏవి-అవిరోధులో-పూర్వోక్తప్రకారమున పరికించి నిరూపింపవలయును. రసములు-సుకుమారములు. కరుణము సుకుమారతరము. శృంగారము. సుకుమారతమము. కావున, శృంగారము ప్రతిపాద్యమగునపుడు, తద్విరోధావిరోధ నిరూపణ మత్యావశ్యకమనిభావము.)

మూలము :—

కం॥ అధికానధానమును జే
యఁదగున్ సత్కవివరేణ్యుఁడందె ప్రమాదం
బొదవునెడల నారసముం
దది శీఘ్రంబుగనె లక్ష్యమగుచుండుఁగదా! 29

రసములన్నిటికంటెనుగూడ సౌకుమార్యాతిశయ యుక్తమగు శృంగారమునందే, సత్ కవి-ప్రయత్నవంతుఁడు కావలయును. అందు ప్రమాదమునొందిన కవికి సహృదయ మధ్యమునందతి శీఘ్రముగనే యవమానము సంభవించును.

శృంగారము - సంసారులకు తప్పక యనుభవ విషయమగుటవలన, రసములన్నిటికంటెను కమనీయము. కావున ప్రధాన భూతము. కావుననే (శృంగారము - సర్వసంసార్యనుభవ విషయమగుటవలననే)

గీ॥ కృతి, వినేయుల కున్ముఖస్థితి ఘటించు
టకుఁ బ్రబంధము భూషించుటకునుగూడ
రంగొసంగు (సంగతమగు) శృంగార రసాంగములకు
తద్విరుద్ధరసస్పర్శ-తప్పుగాదు॥

శృంగార రసాంగములకు-శృంగార విరుద్ధములగు (శాంతాది) రసములతోడి సంస్పర్శ (సంబంధము) (పూర్వోక్తమగు) అవిరోధలక్షణయోగమున్నప్పుడు మాత్రమే-దోషముకానిది-కాదు. (నిర్దుష్టమని తలఁపనక్కరలేదు) ఇంకేమనిన :— వినేయులగు (శిష్యులగు) జనుల నభిముఖులుగాఁజేయుటకొఱకు కావ్యమును శోభింపఁజేయుటకొఱకు కాఖింపఁబడిన తద్విరుద్ధరస సంబంధముకూడ-నిర్దుష్టమే యగును. [వినయోపదేశముచేత శిక్షింపఁదగిన సుకుమారహృదయులను - అభిముఖుల నొనర్చునదియగు కావ్యశోభను గలిగించుటకుఁగూడ-శృంగారాంగములకు - విరుద్ధరసములతోడి కలయిక-దుష్టముకానిదియే యగును.]

ప్రభామతి :— (లోచనము) శృంగారము-సర్వానుభవవిషయము. కావున శృంగార రసమునకు విరుద్ధములగు శాంతాదుల యందుఁగూడ శృంగారాంగములగు విభావాదుల సంస్పర్శము దుష్టముకాదు.

ఏ విధమగు వర్ణనమున-విభావాదులు, శృంగారమున కంగములగునో, ఆ విధమున నవి-రసాంతర(శాంతాది)గతములగునపుడుగూడ వర్ణింపఁదగినవేయగును. శృంగారభంగీ నిరూపితమగు శాంతాదికమే సర్వజనాస్వాదయోగ్యమగును. ఇందుల కుదాహరణము. మదీయ (అభినవగుప్తకృత)మగు స్తోత్రమునందలిది :—

శ్లో॥ త్వాంచన్ద్రచూడం సహసాస్పృశన్తీ
ప్రాణేశ్వరం గాఢవియోగతప్తా
సాచన్ద్రకాంతాకృతిపుత్రికేవ
సంవిద్, విలీయాపి విలీయతేమే॥

"గాఢవియోగతప్త (నీతోడిగాఢసంస్పర్శము లేకుండుటచేత సంసారతాపము ననుభవించుచున్నది) యగు, నాయంతఃకరణవృత్తి-ప్రాణేశ్వరుడగు చంద్రచూడుని నిన్ను (ఇప్పుడు) హఠాత్తుగా స్పృశించి=సందర్శించి, (ధ్యాతృ-ధ్యాన-ధ్యేయ-రహితమగు భవత్సాక్షాత్కారజ్ఞానమునొంది) చంద్రకాంతాకృతిపుత్రిక (చంద్రకాంతపుబొమ్మ) వలె విలయనము (ద్రవీభావము) నొందియు, మరల నత్యధికమగు ద్రవీభావము నొందుచున్నది." అని యర్థము. చంద్రికరస్పర్శమున-చంద్రకాంత పుత్రిక, యించుక కరఁగి, తదుపరి సంపూర్ణముగా, కరఁగునట్లు, పరమేశ్వర సాక్షాత్కారమున, నాయంతఃకరణవృత్తి, యించుక లీనమై (కొంచెముపసంహరింపఁబడి) తదుపరి సంపూర్ణముగా నుపసంహరింపఁబడుచున్నదని తాత్పర్యము.

చంద్రునితోడి గాఢవియోగమున తపించుచున్న చంద్రకాంతపుబొమ్మ-తత్కరస్పర్శమున ద్రవీభవించునట్లు, ప్రాణేశ్వర విరహతప్తయగు నాయంతఃకరణ వృత్తి-(సంవిదాఖ్యయగు నాయిక) చంద్రచూడుఁడను పేరుగల ప్రాణేశ్వరుని నిన్ను స్పృశించి-నీయందు క్రమక్రమముగా విలయము నొందుచున్నదని భావము.

మీఁది పద్యమున, సంవిత్తు=అంతఃకరణవృత్తి-విరహతప్తనాయికగా ప్రతీతమై, శృంగార విభావమగుచున్నది. చంద్రచూడుఁడు, నాయకుఁడుగా, ప్రతీతుఁడై, శృంగార విభావమగుచున్నాఁడు.

ఇందు-ప్రతీయమానము శాంతము-అయినను తద్విభావానుభావములు-శృంగార భంగిచే నిరూపింపఁబడినవి. పూర్వోక్తమగు-పరిపోషపరిహారాదికమున్నప్పుడేకాక ఇట్లు-వినేయులను = జ్ఞానముచే ప్రబోధింపఁదగినవారిని, ఉన్ముఖులనొనర్చుట కావశ్యకమైన కావ్యశోభను సంపాదించుటకుఁగూడ-విరుద్ధ రసములయందు, శృంగార విభావాదిసంబంధము - దుష్టము కానేరదనిభావము. ఇది "అవిరోధియో నువిరోధి

యో'' ఇత్యాదికారికలచేత వెనుక చెప్పఁబడిన రసవిరోధ పరిహారోపాయముకంటె భిన్నమగు వేరొక పరిహారోపాయమని గుర్తింపవలయును. కొందఱు ''వినేయుల నున్ముఖులనొనర్చుటకుఁగాని, కావ్యశోభకొఱకుఁగాని,'' అని మీఁది కారికకు, వికల్పపరమగు నర్థమును జెప్పుచున్నారు. అది సరికాదు. వినేయులను (శిష్యులను) ఉన్ముఖులనొనర్పఁజాలనిది కావ్యశోభయే కానేరదు గదా.

(శాంతాదులగు రసములు విరుద్ధములయినను-వానియందగు, శృంగార విభావానుభావ సంచారి-స్పర్శము-కావ్యశోభాపాదకమగు నంగమగుటవలన, సహృదయులకు వైరస్యమును గలిగించునది కానేరదని భావము)

మూలము :— శృంగార రసాంగములచేత-ఉన్ముఖీకరింపఁ జేయఁబడియేగదా వినేయులు 1 సుఖముగా వినయోపదేశమును గ్రహింతురు!

ప్రభామతి :— 1 సుఖముగా = రంజనపురస్సరముగా

శ్లో॥ స్వాదుకావ్యరసోన్మిశ్రం, వాక్యార్థముపభుఞ్జతే
ప్రథమాలీఢమధవః పిబన్తికటుకౌషధమ్॥

''తీయనగు కావ్యరసముతోఁగూడిన వాక్యార్థమును (సుకుమారహృదయులు) ఉపభోగింతురు. తేనెతోఁగూడిన చేదుమందునైనను (రోగులు) త్రాగుదురుగదా!'' అను. అభియుక్తోక్తిననుసరించిచూడ, సుకుమార ప్రకృతులగు రాజకుమారులు, మున్నగువారు-శుష్కములగు శాంతాదివ్యంజక వృత్తాంతములను తెలిసికొనుటకు, తఱుచుగా నభిముఖులుకారు-కాని శృంగార విభావాది యుక్తములగు నాయుపదేశ్య విషయములను పరమానందమున స్వీకరింతురు. కావున ప్రస్తుతోపయోగులగు, శృంగార విభావాదులు విరోధులు కావని తాత్పర్యము.

మూలము :— (అవ :— కావ్యము - క్రీడారూపము. (ఆనందము మాత్రమే ఫలముగాఁగలది) వేదాది గోచరమగు ఉపదేశమున కిందు ప్రసక్తి లేదని యాశంకించి-చెప్పుచున్నాఁడు.)

సదాచారోపదేశరూపమగు నాటకాదిగోష్ఠి వినేయ జనహితార్థమే. 1 మునులచే నవతారితముగదా!

ప్రభామతి :— 1 భరతాదులచే (స్వర్గమునుండికొనివచ్చి) ప్రచారమొనర్పఁబడినదిగదా! ప్రభుసమ్మిత శాస్త్రోపదేశముకంటెను, మిత్రసమ్మితేతిహాసోపదేశముకంటెనుగూడ, కాంతాసమ్మితమగుటచేత, ప్రీతి పూర్వకమగు నాట్య-కావ్యగతోపదేశము ప్రధానమను నంశము నింతకుముందే మేము నిరూపించియున్నాము. కావున

పునరుక్తిభయమున మరల లిఖించువారలముకాము. 'నాటకాది' అనుచోనున్న, ఆదిపదముచే, ప్రకరణాది దృశ్యకావ్యములును, తదితర శ్రవ్యకావ్యములును గ్రహింపఁబడును. (లోచనము)

మూలము :— [అవ :— శృంగారాంగ (విభావాను భావతా) భంగిచే విభావాదులను నిరూపించినంత మాత్రముననే వినే యోన్ముఖీకారము కాదని వేఱొక ప్రకారమును జెప్పుచున్నాఁడు.]

మఱియు, "శృంగారము-సకలజనమనోఽభిరామము కావున దాని యంగములతోడి సమావేశము (1) కావ్యశోభాతిశయమును పోషించును" అను నీప్రకారముచేనయినను-విరోధి రసమునందగు శృంగారాంగ సమావేశము-విరోధించునది కానేరదు.

ప్రభామతి :— శృంగారాంగ సమావేశము-కావ్యమున శోభాతిశయమును పోషించును. (1) కావ్యశోభయొక్క-అతిశయ ముదేనిచేనగునో, ఆయలంకార విశేష మగు నుపమాద్యలంకారమును సుందరీకరించునను నర్థమును గ్రహించునది.

ఉపమాద్యలంకారములు - కావ్యశోభాతిశయహేతువులనుటకు "కావ్యశోభా కర్తలగు ధర్మములు-గుణములు. తదతిశయహేతువులు - అలంకారములు" అని వామనోక్తమగు ప్రమాణము నమసంధించునది.

[ 'శోభాతిశయమును పోషించుట' అనుమాటకు లోకోత్తర చమత్కారమును పుష్టీకరించునని యర్థము. కాని, కావ్యమున సమావేశితమగు శృంగారాంగము-ఉపమాద్యలంకారమును సుందరీకరించునని యర్థముకానేరదు. అట్లదియుపమాదికము నలంకరించినయెడల, ఆ శృంగారాంగమే-అలంకారము కావలసివచ్చును. ఇంకే మనిన, కటకాదికము స్వభావసుందరమగు మనుష్యాంగమునువలె, శృంగారాంగము కూడ-కావ్యమును సుందరీకరించునని యర్థము.

(దీధితి వ్యాఖ్య 293 పే)

మూలము :— కావుననే (ఒక విరాగియనుచున్నాఁడు)

కం॥ రమణులు మనోరమలు స
త్యము, రమణీయములు సంపదలు
సత్యము, కాని, మనుష్య జీవితము మా
త్రము ప్రమదాపాంగభంగ తరళమ్మె గదా!

ఇత్యాదులయందు రసవిరోధ దోషములేదు.

ప్రభామతి :— ‘‘సత్యము’’ ‘‘సత్యము’’ అనునవి-అర్థాంగీకారమునందు ప్రయుక్తములు.

(‘‘విలాసినులగు రమణీమణులు-మనోహారిణులనునది నిజమే! విభూతులు (సంపదలు) రమణీయములు-అను మాటకూడ సత్యమే, కాని, తదనుభూతిక్షమ మగు జీవితము మాత్రము, యౌవనాదిమదయుక్తయగు నంగనామణియొక్క కటాక్షమువలె చంచలమేగదా! అనిభావము.

[ఇందు ‘‘జీవితము స్థిరముకాదు’’ అను శాంతవిభావము ప్రధానమైయున్నది. ‘రమణులు’ అను శృంగారాలంబన విభావమును, ‘‘సంపదలు’’ అను తదుద్దీపన విభావమును, దీనికి విరుద్ధములైనను దీనినే పోషించుచున్నవి. ‘‘ప్రమదాపాంగభంగతరళమ్మే’’ అనునది కూడ శృంగారమునెల్లో ప్రకాశింపఁజేయుచు, తుదకు జీవితానిత్యత్వమును బోధించుటచేత శాంతమునే పోషించుచున్నది.]

విరాగికి స్వమతాను సరణమున రమణులు మనోరమలుకారు. సంపదలుకూడ రమ్యములు కానేరవు. అనిత్యములగు వానిని, అతఁడు సత్యములని యంగీకరింపఁడు. అయినను, మృదుస్వభావులును, భోగవిషయసుఖ సత్యత్వము నభిమానించువారును, అగు వినేయులను (ప్రబోధింపఁదగిన రాజకుమారాదులను) వైరాగ్యాభిముఖులనుగాఁజేయుటకు, వారి మతమునుగూడ కొంతవఱకును దానంగీకరింపనియెడల, వారు తనయుపదేశము నంగీకరింపరని, వారి హృదయమునను ప్రవేశించి (అవివేకి జనాభిమతమగు నభిప్రాయము నంగీకరించి) విరాగియగు నతఁడిట్లు వినయము నుపదేశించుచున్నాఁడు.

‘‘నాయనలారా! మేము-అలీకమగు (అసత్యమగు) వైరాగ్యకౌతుకమునం దభిరుచిని ప్రకటించు వారలముకాముసుఁడీ! ఏ జీవితము కొఱకు - సత్యముగా మనోహారిణులగు ఈ రమణీమణులును, యథార్థముగా, అతిరమణీయములగు నీ విభూతులను, మహానందపారవశ్యము నొందింపఁజేయునవియగు ఈ మదవతీ కటాక్షములను-అభ్యర్థింపఁబడుచున్నవో, ఆ జీవితమే చంచలముగదా! అనుతలంపే మేమిట్లనుటకు హేతువు’’.

‘‘ప్రమదాపాంగభంగతరళమ్మే’’ అను నీవాక్యమున, ప్రమదలు, (నాయకునకు) విభావము. నాయికలగు ప్రమదల, అపాంగభంగము-అనుభావము, ఇట్లు శృంగారాంగమగు ప్రమదాపాంగభంగము-తారళ్యమునందు (చంచలతయందు) జీవితమున కుపమానముగాఁజెప్పఁబడినది కావునను, ప్రియతమాకటాక్షము - సర్వ (రసిక) జనాభిలషణీయము కావునను, తత్ ప్రీతిచేత (తత్ ప్రతీతిచేత) గుడజిహ్వికాన్యాయము ననుసరించి, ప్రవృత్తుఁడగు వినేయుఁడు (రాజకుమారాదివ్యక్తి ప్రసక్త-అను ప్రసక్త-వస్తు తత్త్వ-సంవేదముచేత వైరాగ్యమున పర్యవసించును.

ప్రసక్తము - ప్రేయసీ కటాక్షము. అనుప్రసక్తము-జీవితాస్థిరత్వము. "ప్రస క్తానుప్రసక్తవస్తు తత్త్వసంవేదనముచేత - వైరాగ్యమున పర్యవసించును" అను వాక్యాభిప్రాయమిది :— "సరాగికి, విరాగకథానురక్తి కలుగదు. సుకుమార ప్రకృతియగు వ్యక్తి-రాగమయ కథాసక్తుఁడగుచుండును. కావున మొట్టమొదట, "రమణులు, మనోరమలు" అను ప్రసక్త విషయమునందుత్సుకుడగు నతఁడు, పిమ్మట, అను ప్రసక్తమగు, జీవితానిత్యత్వము నెఱిఁగి-క్రమముగా భోగ విష యాభిలాష నిరర్థకమని తెలిసికొని తుదకు తానుగూడ వైరాగ్య సంపన్నుఁడగును"

మూలము :— అవ :- ఈ యంశమును ముగించుచు, పూర్వోక్తమగు ప్రకరణమునకు ఫలమును జెప్పుచున్నాఁడు.

కం॥ సరసకవి-రసగతంబగు
విరోధవిషయ, మవిరోధవిషయముఁ,దానీ
సరణిఁబరికించి-కావ్యము
విరచించిననెందుమోహవికలతఁగనునే?॥ 31

ఇట్లు పూర్వోక్తమగు ప్రకారమున రసాదులకు అనఁగా, రసభావ తదాభాసాదులకు సంబంధించిన విరోధ విషయమును, అవిరోధ విషయమును, విశేషముగాఁదెలిసికొని, ప్రతిభాతిశయ యుక్తుఁడగు సత్కవి-కావ్యమును రచించునెడలను, తత్కావ్య విషయమునందెచ్చటనుగూడ వ్యామోహము నొందఁడు.

అవ :— రసవ్యంజక-వాచ్య-వాచక నిరూపణము కూడ, కావ్యోపకారకమను నభిప్రాయమున తన్నిరూపణముకొఱకు కారి కావతరణము నొనర్చుచున్నాఁడు.

ఇట్లు - రసాది విషయమునందగు విరోధావిరోధ నిరూప ణమున, కుపయోగిత్వమును ప్రతిపాదించి, రసాది విషయకమగు వ్యంజక - వాచ్య, వాచక, నిరూపణమునకుఁగూడ-ఆయుపయోగి త్వమును ప్రతిపాదించుచున్నాఁడు,

ప్రభామతి :— రసాదులయందగు విరోధావిరోధ నిరూపణమున కుపయో గిత్వమును ప్రతిపాదించి, రసాది వ్యంజకములగు విభావాది వాచ్యములయు, సుప్ - తిఙాదివాచకములయు నిరూపణమునకుఁగూడ తదుపయోగిత్వమును ప్రతి పాదించుచున్నాఁడు.

మూలము :—

కం॥ రస భావ విషయకౌచి
త్య సమాశ్రియణమ్ముఁగొని-మహాకవి-వాచ్యో
ల్లసనము, వాచక శబ్ద
ప్రసరణము, స్వముఖ్యకృతిగ. పాటింపఁదగున్॥ 32

ఇతివృత్త విశేషములగు వాచ్యములను, తద్విషయములగు వాచకములనుగూడ, రసాది విషయకమగు నౌచితి నాశ్రియించి నివేశించుట-మహాకవికి ముఖ్యమగు పనియైయున్నది. రసాదులను ప్రధానముగా కావ్యార్థీకరించి. తద్వ్యక్త్యనుగుణములగునట్లు శబ్దార్థముల నుపనిబంధించుటయే-మహాకవి కావింపవలసిన ముఖ్య వ్యాపారము.

ప్రభామతి :— ("ప్రబంధసంబంధి వృత్తాంతములను, సుప్తిఙాదులను గూడ, పూర్వోక్తమగు కావ్యౌచిత్యము ననుసరించి రసాదివ్యంజనోపయోగులగు నట్లు నివేశించుటయే-మహాకవి ముఖ్యముగాఁజేయఁదగినపని" అనిభావము.)

(లోచనము) "వస్తుసందర్భనార్థి దీపశిఖకొఱకు నైప్రయత్నించు" అని (ప్రథమోద్ద్యోతమున) పూర్వోక్తమగు నంశమే-ఇచటను నుపసంహరింపఁబడినది. 'మహాకవి' అను పదముచేత, రసాదివ్యంజకశబ్దార్థ నిర్మాణమే కవికి సిద్ధవత్సల మను నంశము నిరూపితము. అట్టి నిర్మాణము లేనియెడల మహాకవిత్వ సంప్రాప్తి సంఘటింపదు. ఇతివృత్తము - ప్రబంధవాచ్యముగదా. తద్విశేషములు "ప్రథమంబున విభావభావానుభావ సంచార్యౌచితీ మనోజ్ఞమగు దానివృత్తమ్మునైన కల్పితము నైన కథాశరీరంబు నొకటి పరిగ్రహించుట".

ఇత్యాదికముచేత-పూర్వమే (68వ పేజీయందు) చెప్పఁబడినవి. కావ్యార్థీక రించుట-అనఁగా; కావ్యాత్మ స్వరూపములగు రసాదులను - ప్రధాన వ్యంగ్యముల నొనర్చుట. రసాదులను కావ్యార్థముల నొనర్పనియెడల లౌకికవాక్యములకంటెను శాస్త్రీయవాక్యములకంటెను, కావ్యార్థమునందలి విశేషమేదియు నుండదు. ఈ యంశము "ఆరసధ్వనియొకఁడెకావ్యమునకాత్మ" అని ప్రథమోద్ద్యోతమునందే నిర్ణయింపఁబడినదిగదా!

మూలము :— కైశిక్యాదివృత్తి విచారము :—

"రసాది తత్పరముగా కావ్యమును నిబంధింపవలయునను నీ

యంశము-భరతాదులయందుఁగూడ సుప్రసిద్ధమే" అని ప్రతిపాదించుటకు చెప్పుచున్నాఁడు.

గీ॥ అర్థమును, శబ్దమును, రసాద్యనుగుణముగ
నౌచితివహించి కృతులందు వ్యవహరింప
వృత్తియగునది, అట్టి యీవృత్తులెల్ల
ద్వివిధములుగ కావ్యముల సంస్థితములయ్యె 33

వ్యవహారము వృత్తియని చెప్పఁబడునుగదా! అందు, రసానుగుణమును, ఔచిత్యవంతమును వాచ్యాశ్రయమును, అగునే వ్యవహారముకలదో, "ఆ" వ్యవహారములే-కైశిక్యాదులగు "ఈ" వృత్తులు-ఉపనాగరికాదులగు వృత్తులు-వాచకాశ్రియములు.

రసాదితాత్పర్యమున సన్నివేశితములగు వృత్తులేగదా నాట్యమునకును, కావ్యమునకునుగూడ నొకానొక (అనిర్వచనీయమగు) శోభనాపాదించుచుండును, రసాదులారెండింటికిని (వృత్తిలక్షణములగు ద్వివిధవ్యవహారములకును)గూడ జీవభూతములు. ఇతివృత్తాదికము మాత్రము-శరీరభూతమే.

ప్రిభామతి :— 'రసాదితత్పరమగునట్లు కావ్యమును నిబంధించుట'-వ్యవహారము. వ్యవహారమనినను, వృత్తియనినను, ఒకటే యర్థమగును. కావున "భరతాదులందుఁగూడ" అనుచోఁగల, ఆదిగ్రహణమువలన-అలంకార శాస్త్రములయందగు పరుషాద్యములు వృత్తులని చెప్పఁబడినట్లగుచున్నది. ఇవివ్వివిధములు. (వాచ్యాశ్రియములగు వ్యవహారములు=వృత్తులు - కైశికి, మొదలయినవి. వాచకాశ్రియములగు వృత్తులు-'ఉపనాగరిక' మొదలయినవి.)

వృత్తులనుపేరుగల, శబ్దార్థవ్యవహారములు రెండింటికినిగూడ, రసాదులు జీవభూతములు. భరతముని "వృత్తయః కావ్యమాతృకాః" "వృత్తులు కావ్యమునకు తల్లులవంటివి" అని ప్రవచించెను. దీనిచేత, రసోచితమగు నితివృత్త (కథా) సమాశ్రియణ ముపదేశింపఁబడినది. ఈ యుపదేశముచేత "రసమే జీవితము" అనిచెప్పఁబడినట్లయినది. ఒక్క భరతమునీంద్రుఁడేకాక భామహుఁడు మున్నగు తదితరాలంకారికులుగూడ-

శ్లో॥ స్వాదుకావ్యరసోన్మిశ్రం వాక్యార్థముపభుఞ్జతే
ప్రథమాలీఢమధవః పిబన్తి కటుభేషజమ్॥

"తీయని కావ్యరసముతోఁగూడిన, ఉపదేశ వాక్యార్థమును (సుకుమార హృదయులగు సహృదయులు) ఉపభోగింతురు. మొదట తేనియ నాస్వాదించిన రోగులు దానితోఁజేర్పఁబడిన కటువగు నౌషధమును పానము చేయుదురుగదా!"

ఇత్యాదులచే, శబ్దవృత్తియను పేరుగల వ్యవహారము-రసోపయోగజీవితము (రసోపయోగమే జీవితముగాఁగలది) అనియే చెప్పియున్నారు.

"ఇతివృత్తంహినాట్యస్య శరీరమ్" "ఇతివృత్తమేగదా నాట్యమునకు శరీరము!" అని భరతముని చెప్పియున్నాఁడు. కావుననే నాట్యమే-రసము" అని వెనుక మేముకూడ చెప్పియున్నాము.

(శబ్దాద్యాశ్రితములగుటచేత-తదభిన్నములగు వృత్తులు-రసాదులకు శరీరము-అనియోజించునది. అని దీధితి 296)

మూలము :— "వాచ్యము-రసాదిమయము" అను పూర్వ పక్షము. (అవ :— ఏకదేశిమతము నుపన్యసించుచున్నాఁడు.)

రసాదుల కితివృత్తాదులతోడి వ్యవహారము - గుణ గుణి వ్యవహారముగాని, జీవశరీర వ్యవహారముకాదు. వాచ్యము-రసాది మయముగనే ప్రతిభాసించును కాని రసాదులతో. (కంటె; పృథగ్ భూతమై ప్రతిభాసింపదుగదా!

ప్రభామతి :— పూర్వ రసాదులును-ఇతివృత్తాది రూపమగు వాచ్యార్థమును, అత్యంత సమ్మిశ్రములుగా ప్రతిభాసించుటవలన వానికి ధర్మధర్మి (గుణ-గుణి) వ్యవహారమే యుక్తము. ఇందు రసాదులు-గుణస్థానీయము. ఇతివృత్తాదిరూపమగు వాచ్యార్థము-గుణిస్థానీయము. వాచ్య ప్రతీతికిని-రసాదిప్రతీతికిని, క్రమము కానుపింప కుండుట వలన, వాచ్యము రసాదియమేకాని, రసాదులకంటె వేఱగునది కాదు.

(మరణించిన పిమ్మట-జీవునికంటె భిన్నముగా శరీరము కనఁబడును. కావున జీవ - శరీర వ్యవహారము పృథగ్భూతములగు వానికి మాత్రమే యుక్తమగును. గుణములగు రసాదులకంటె పృథగ్భూతమగు గుణి-ద్రవ్యము-లభింపనట్లు, రసాదులకంటె వ్యతిరిక్తమగు ఇతివృత్తము (వాచ్యము) లభింపకుండుటవలనను, అత్యంత సమ్మిశ్రములగు రసాది-వాచ్యములకు భేదమున్నను గ్రహించుటకు శక్యము కాకుండుటవలనను, వాచ్యేతివృత్తమునకును - వ్యంగ్య రసాదులకునుగల ప్రతీతి

క్రిమము - లాఘవముచేఁదెలియకుండుటవలనను, వానికి గుణగుణి వ్యవహారమే యుక్తముగాని, జీవ-శరీర వ్యవహారము యుక్తముగాదు అని పూర్వపక్షము)

మూలము :— వాచ్యము - రసాదిమయముకాదు. అను ఖండనము. (అవ :— ఈయభిప్రాయమును ఖండించుచున్నాఁడు.)

ఈ యంశమునఁజెప్పుచున్నాము. శరీరము గౌరత్వమయ మగునట్లు, వాచ్యము రసాదిమయమే యగునెడల, శరీరము ప్రతిభాసించునపుడు-సర్వజనమునకును, తప్పక గౌరత్వముకూడ ప్రతిభాసించునట్లు, సహృదయునకును-అసహృదయునకునుగూడ వాచ్యముతోఁగూడియే రసాదులుగూడ ప్రతిభాసింపవలయును. (కాని) ఇట్లు ప్రతిభాసించుటలేదు. ఈ యభిప్రాయము ప్రథమోద్ద్యోతమునందు ప్రతిపాదింపఁబడియే యున్నదిగదా!

ప్రభామతి :— (శరీరప్రత్యక్షము కలిగినపుడు-గౌరత్వ గుణ ప్రత్యక్షము కూడ నందఱికిని తప్పకయగునట్లు, వాచ్యవిభావాది జ్ఞానము కలిగినప్పుడు, వ్యంగ్య రసాది జ్ఞానముగూడ, సహృదయునకేగాక, అసహృదయుఁడగు కేవలవైయాకరణునకుఁగూడ కలుగవలసివచ్చును. గావున మహోపప్లవము సంభవించును. కావున వానికి గుణగుణి వ్యవహారము యుక్తముకాదని ఫలితము.)

వ్యంగ్యరసాద్యవగతి - సహృదయునకేగాని సహృదయేతరునకుఁగలుగదను నంశము "గీ॥ శబ్దమర్థము బోధించు శాస్త్ర మెఱిఁగి నంతమాత్రముచేతనే యది గ్రహింపఁబడదు" అని ప్రథమోద్ద్యోతమునందుఁజెప్పఁబడినది. (ఆంధ్ర ధ్వన్యాలోక ప్రథమ భా 20 పేజీ.)

మూలము :— (అవ :— పూర్వపక్షి - మరల శంకించుచున్నాఁడు.)

[పూర్వ] "రత్నముల-జాత్యత్వము (ఉత్కృష్టజాతి విశిష్టత)వలె వాచ్యములకుఁగల రసాదిరూపత్వము-జ్ఞాతృవిశేష సంవేద్యము"; రత్నములకుఁగలజాతి-కొందఱు విశేషజ్ఞులకు తెలియునట్లు వాచ్యమునకుఁగల రసమయత-కొందఱు సహృదయులకు మాత్రమే తెలియవచ్చును. అంతమాత్రమున, రసాదులు-వాచ్యములకంటె భిన్నములుకావు. అని పూర్వపక్షము.]

[సిద్ధాంతము] ఇది యుక్తమగు నభిప్రాయముకాదు.

ఏలయనిన :— రత్నములకు సంబంధించిన, జాతివిశిష్టత-రత్నస్వరూపముకంటె వేఱుగాకయే ప్రతిభాసించునట్లు, రసాదులు గూడ విభావానుభావాదిరూపమగు వాచ్యముకంటె వేఱుగాకయే ప్రతిభాసింపవలయును. కాని యట్లు ప్రతిభాసింపక వేరుగానే ప్రతిభాసించుచున్నవి. "విభావానుభావ వ్యభిచారిభావములే రసములు" అను జ్ఞానము (అభిప్రాయము) ఎవ్వరికిని లేదుగదా!

ప్రభామతి :— పూర్వపక్షము :- ఏది - ఏవస్తువునకు ధర్మరూపమో, అది-ధర్మియగు ఆ వస్తువు భాసించునపుడందఱకును తప్పక భాసించునను మీ నియమము-వ్యభిచారవంతమై యున్నది. గౌరత్వము-శరీరమునకు ధర్మము. ఆ గౌరత్వము, శరీరము, భాసించునపుడందఱికిని భాసించును. కావున మీఁదఁబ్రదర్శింపఁ బడిన వ్యాప్తి యచటఁగుదిరినను, మాణిక్యధర్మమగు జాత్యత్వమున వ్యభిచరించును. మాణిక్యధర్మమగు, ఉత్కృష్టజాతి విశేషము-మాణిక్యము ప్రతిభాసించునపు డందఱికిని ప్రతిభాసించుటలేదు.

[పూర్వ జనసామాన్యమునకు మాణిక్యము ప్రతిభాసించునుగాని తద్ధర్మమగు ఉత్కృష్టజాతి విశిష్టతమాత్రము రత్నపరీక్షకునకు మాత్రమే తెలియును. అట్లే యిచ్చటఁగూడ, వాచ్యార్థజ్ఞానమందఱికిని గలిగినను, వాచ్యార్థధర్మమగు, రసాదిమయత్వముయొక్క జ్ఞానముమాత్రము, కావ్యార్థ తత్త్వవేత్తయగు సహృదయునకు మాత్రమే కలుగును.అయినను అభిన్నములగు నవి వేరుకావు.కావున రసాది-వాచ్యములకు-గుణగుణిభావము నంగీకరించుట-అయుక్తముకాదు" [సిద్ధాంతము] "అత్యంతోన్మగ్నభావమను ఏది-దేనికి ధర్మమో" అని విశేషణము నుంచుదుము. రూపము - ఉన్మగ్న (పైకి వ్యక్తముగా గాన్పించు) స్వభావము గలది. కావున నుదాహరణమగును. జాత్యత్వము-ఇట్టున్మగ్న స్వభావముగలదికాదు. కావున మీఁది నియమమునకు-అనైకాంత్యము కలుగదు. రసాదులు-ఉన్మగ్నస్వభావములే యగుటవలన నిచట సమన్వయము సిద్ధించునని కొందరీగ్రంథమును సమన్వయించిరి.

దీధితి-ఇట్లనుచున్నది. జాత్యత్వమునకును - రసాదులకును సామ్యము సంభవించునదికానేరదు. రత్నసంబంధియగు జాత్యత్వము వానియందు లీనమయినట్లుండుట వలన నా రత్నములకంటె వేఱుగాఁబ్రకాశింపదు. కావున రత్నములను జూచిన వారి కందఱికిని తదీయజాత్యత్వ గ్రహణము కలుగకుండుట సముచితమే యగును. కాని వాచ్యములగు విభావాదుల ధర్మములని మీరన్నరసాదులుమాత్రము,గౌరత్వాదులవలె, (అత్యంత) ఉన్మగ్న స్వభావములగుటవలన నింపక వేఱుగాఁబ్రకాశించును ......

......కాఁగా 'రసాదులు గౌరత్వాదిరూపమువంటివిగాని, జాత్యత్వమువంటివిగాని కావు. రసాదులు - గౌరత్వాదిరూపమువంటివగు నెడల వానిని కావ్యతత్త్వవేత్తలు

మాత్రమే గాక సర్వజనులును గూడ గ్రహింపవలసివచ్చును. అవి జాత్యత్వము వంటివగు నెడల, వాచ్య విభావాద్యేకరూపములే (అభిన్నములే) కావలసివచ్చును. ఇంకేమనిన; విభావాది ప్రతీతి ప్రయోజ్యాస్వాద రూపములగు రసాదులు-విలక్షణ ములే. కావున వాని కితివృత్తములతోడి వ్యవహారము-జీవ-శరీరభావమే యగునని తాత్పర్యము.'' [దీధితి పేజీ 298.]

[స్వాశ్రయముకంటె వేఱుగా ప్రతీయమాన మగుచున్నను తద్ ధర్మమగు రూపము - (గౌరత్వాదికము) ఉన్మగ్న స్వభావము. (పైకి వ్యక్తముగా కాన్పించు స్వభావము గలది) జాత్యత్వము-అనున్మగ్న స్వభావము. (అత్యంత లీన స్వభావము) ఇది స్వాశ్రయముకంటె భిన్నముగా ప్రతీయమానముకాదు. ఇది కొందఱి యభి ప్రాయము అని లోచనము చాటొనుచున్నది.]

(స్వమతమును జెప్పుచున్నాఁడు) [లోచనము] అస్మద్గురువులు ఇట్లని చెప్పిరి.

''ఈ యంశమునఁజెప్పుచున్నాము" ఇత్యాదికముచేఁగ్రింది యంశము వివ రింపఁబడుచున్నది. రసాదులు-వాచ్యధర్మములగు నెడల, పక్షద్వయమేర్పడును.

అందు - 'రసాదులు రూపాది సదృశములు' అనునది ప్రథమ పక్షము. ''రసాదులు, మాణిక్యాదిగత జాత్యత్వ సదృశములు" అనునది ద్వితీయపక్షము.

ఈ పక్షములు రెండునుగూడ యుక్తములుకావు. ఏలయనిన :— రసా దులు-రూపాది సదృశములగు నెడల, రూపాదులవలె రసాదులుగూడ నందఱికిని భాసింపవలసివచ్చును. శరీర ధర్మములగు రూపములు వానికంటె భిన్నములు కానట్లు, వాచ్యధర్మములగు రసాదులు వాచ్యార్థముకంటె భిన్నములు కాకపోవలసి వచ్చును. ద్వితీయపక్షమున జాత్యత్వమువలె, రసాదికము, వాచ్యముకంటె భిన్నము గాక పోవలసివచ్చును. కావున ధర్మధర్మిభావము-యుక్తము కాదు.

మూలము :— కావుననే విభావాది ప్రతీతిలేనిదే రసాది ప్రతీతి కలుగదు. కనుకనే ప్రతీతులు రెండింటికిని, [విభావాది ప్రతీతి - రసాది ప్రతీతికి కారణమను] కార్యకారణ భావ వ్యవ స్థానమువలన. అవశ్యంభావియగు క్రమమున్నది. కాని యా క్రమము-లాఘవమువలన (విభావాది ప్రతీతి-రసాది ప్రతీతులొకే సారి కల్గినట్లు తోపింపఁజేయునదియగు శీఘ్రతవలన) కాన్పింప కుండుటవలననే వ్యంగ్యములగు రసాదులు-అసంలక్ష్యక్రమములు" అని చెప్పఁబడినది.

[విభావాది ప్రదర్శనమునకును, వ్యంగ్యములగు రసాదులకును, తప్పనిసరియగు క్రమమున్నను, శీఘ్రతవలన-ఆక్రమము అసంలక్ష్యమగుట [చక్కగా కాన్పింపకుండుట]వలన- రసాదులు- అసంలక్ష్య క్రమధ్వనులని చెప్పఁబడుచున్నవి.]

ప్రభామతి :—(లో) ఈరసాదులు-విభావాది వాచ్య ధర్మములుగా ప్రతీతము లగుటలేదు. ఈ రసప్రతీతియందు విభావాది ప్రతీతి-ఉపయోగింపకుండుటలేదు. కావుననే, వాచ్య విభావాది ప్రతీతి-రసాది ప్రతీతికి కారణమగుచున్నది. కావున వాని కవశ్యంభావియగు క్రమమున్నదని చెప్పకతప్పదు. "విభావాది ప్రదర్శనమే - రసాది ప్రదర్శనము" అని ఈ ప్రతీతుల కైక్యము నంగీకరించినయెడల-అప్పుడు రసాది ప్రతీతికి విభావాది ప్రతీతి-ఉపకారకము కానేరదుగదా!

ఈ క్రమము సంలక్ష్య క్రమాదులయందుఁగాన్పించుచున్నది. కావున రసాదులయందుఁగూడ నున్నదనియే నిశ్చయింపఁదగును. కాని, విభావాది ప్రతీతి-రసాది ప్రతీతులకుఁగల-ఆక్రమము (పౌర్వాపర్యము) శీఘ్రతవలన కాన్పించుట లేదు. కావుననే రసాదులు-అ + సం + లక్ష్య + క్రమ + వ్యంగ్యములని [లెస్సగా కనిపింపని క్రమముగల వ్యంగ్యముగలవని] వెనుక (సంలక్ష్యక్రమవ్యంగ్య నిరూపణ ప్రకరణమున) చెప్పఁబడినవి.

మూలము :— [ప్రశ్న]:– ప్రకరణాది విశిష్టమగు శబ్దమే- వాచ్య-వ్యంగ్య ప్రతీతులను-ఒక్కసారియే - కలిగించుచుండును. కావున నచ్చట క్రమకల్పనచేతనగు ప్రయోజన మేమున్నది?

శబ్దము వ్యంజకమగుటకు వాచ్యప్రతీతియొక్క పరామర్శయే నిబంధనము కాదుగదా! [శబ్దము-వాచ్యప్రతీతి నొదవింపకున్నను వ్యంజకము కావచ్చును] అదెట్లనిన :— గీతాది శబ్దములవలనఁ గూడ రసాద్యభివ్యక్తియగుచుండును. కాని వాని(గీతాది శబ్దముల) నడుమ వాచ్య పరామర్శలేదుగదా!

[వాచ్య ప్రతీతిలేకున్ననుగూడ-గీతాది శబ్దమువలన రసాద్యభివ్యక్తి కలుగుచున్నది. కావున వాచ్య పరామర్శలేనియెడల శబ్దము-వ్యంజకము-కాఁజాలదనుట-యుక్తముకాదు.]

ప్రభామతి :— [లోచనము] రసాదులు వాచ్యముకంటె భిన్నములే యగుఁగాక! అయినను, వాని క్రమము సంలక్ష్యముకాదని నీవేచెప్పితివి. సంలక్ష్యము

కాని క్రమమును గల్పించుటకు ప్రమాణములేదు. ఏలయనిన :— వాచ్య (అర్థ) ప్రతీతిలేకున్నను,పదవిరహిత స్వరాలాప గీతాదికమునందు శబ్దమాత్రోపయోగకృత మగు రసజ్ఞానోదయము కాన్పించుచున్నది. కావున ఒకే సామగ్రిచేతనే (అభిధా వ్యాపారముచేత, ఒకేసారి (కలిసియే) వాచ్యమును, అభిమత వ్యంగ్యమగు రసాదికమునుగూడ భాసింపఁజేయఁజాలుటవలన, పదన-వ్యంజన వ్యాపారద్వయము, అనావశక్యమని మరల శంకించుచున్నాఁడు.

(కొన్నిగీతశబ్దములు, వాచ్యార్థమును బోధింపకయే స్వరాది విశేషబలముచేతనే రసములను బోధించుటవలన, ప్రకరణాది విశిష్టమగు శబ్దమే, తదుభయార్థ ప్రతీతి జనకమనుట లాఘవమని పూర్వపక్షము)

గీతశబ్దముల కర్థమున్నచోటఁగూడ,ఆయర్థ ప్రతీతి యుపయోగించునదికాదు ఏలయనిన; అచ్చట రసోదయము-వాచ్యార్థ ప్రతీత్యనుసరణము నాదరింపక-గ్రామ రాగముల ననుసరించును. ఆయర్థప్రతీతికూడ గీతశబ్దములందంతటను గాన్పింపదు. "గీతాది శబ్దములవలన" అనుచోటనున్న ఆది శబ్దము-వీణాది వాద్యశబ్దములను, విలపితాది (రోదనాది) శబ్దములను నిర్దేశించునని గ్రహించునది.

(గీత-వాద్య-విలపితాది శబ్దములవలన, విభావాదివాచ్య పరామర్శలేకయే, రసాద్యభివ్యక్తి, కాన్పించుచుండుటవలన, శబ్దము వ్యంజకమగుటకు వాచ్యప్రతీతి పరామర్శము కారణముకాదని తాత్పర్యము).

మూలము :— [అవ :— మీఁది యాక్షేపమునందుఁ గొంతభాగము నంగీకరించి ఖండించుచున్నాఁడు.] దీనికిఁగూడ ప్రత్యుత్తరము నిచ్చుచున్నాము.

"ప్రకరణాది విశిష్టములగు శబ్దములు వ్యంజకములు" అనునది మా కభిమతమే. కాని (ప్రకరణాది సహకృతమగు) ఆ శబ్దముల వ్యంజకత్వము, ఒకప్పుడు, (శబ్ద) స్వరూప విశేష నిబంధనమును,ఒకానొకప్పుడు వాచకశక్తి నిబంధనమును, అగుచుండును.

అందు (ఆ రెండింటను) ఏ శబ్దములకు-వాచ్య (అర్థ) ప్రతీతిలేకయే, స్వరూప ప్రతీతిచేతనే వ్యంజకత్వము నిష్పన్నమగునో, వాని వ్యంజకత్వము-వాచకశక్తి నిబంధనముకాదు.

ఆ వ్యంజకత్వము, వాచకశక్తి నిబంధనమగునపుడు మా త్రము-వ్యంగ్యప్రతీతి - వాచ్యవాచకభావ ప్రతీతి కలిగినపిమ్మట నుదయించుట-తప్పనిసరియే యగును.

[ అది-వాచకశక్తి ప్రయోజ్యమగునపుడు మాత్రము-అభిధా ప్రయోజ్యమగు వాచ్యార్థబోధము కలిగిన తరువాతనే వ్యంగ్య ప్రతీతి కలుగక తప్పదు.] ఆ క్రమము మాత్రము లాఘవము వలనఁగాన్పించుటలేదు. దానికేమి చేయుదుము?

ప్రభామతి :— [లోచ] "అర్థమైన శబ్దంబైన" అనుకారికయందియంశ మును (శబ్దముగూడ వ్యంజకమను విషయమును) మేమింతకుముందే సిద్ధాంతీకరించి యున్నాము.

వ్యంజకము-వాచకశక్తి నిబంధనము కానియెడల, గీతశబ్దమువలన, అర్థావగమ లేమున్నను, రసావభాసము [రసోదయము] కలుగునట్లు కావ్యశబ్దమువలనఁ గూడ నర్థ ప్రతీతిలేకయే,రసప్రతీతి కలుగవలసివచ్చును. కాని యట్లు కలుగుటలేదు. కావున కావ్య శబ్ద విషయమున వాచకశక్తి కూడ నపేక్షణీయము. అది వాచ్యనిష్ఠమే కావున ముందు వాచ్యార్థ ప్రతీతి కలుగునని యంగీకరింపకతప్పదు. [కావున క్రమమున్నదనుట స్పష్టము. ఆక్రమము-శీఘ్రప్రతీతివలన కాన్పించుటలేదు.]

[ప్రకరణాది విశిష్టములగు శబ్దములు కొన్ని స్వరూపముచేతను (శ్రావణ ప్రత్యక్షముచేతను) కొన్నివాచకశక్తిచేతను రసవ్యంజకములగుచుండును, ఎచ్చట గీత, వాద్య, విలాసాత్మకమగు ధ్వన్యాత్మక శబ్దమున-స్వరూప ప్రతీతి మాత్రము చేత-రస ప్రతీతియగునో, అచ్చట, వాచ్య ప్రతీతి-రసాది ప్రతీతికి కారణముకాదు. అచ్చటనగు రసప్రతీతికి స్వరూప ప్రతీతియే-శ్రావణ ప్రత్యక్షము-లేక శ్రావణ ప్రత్యక్ష విషయ శబ్దము కారణము. ఎచ్చట విభావాది వాచ్య ప్రతీతిచేతనే రసాది ప్రతీతియగునో, అచ్చట మాత్రము, రసాదివ్యంగ్య ప్రతీతికి, విభావాది వాచ్య ప్రతీత్యుత్తరకాలీనత్వము ప్రాప్తమేయగును.

కావుననే మొదట వాచక శబ్దమువలన విభావాది వాచ్య ప్రతీతియు, తదుపరి రసాది ప్రతీతియు, నగును. అయినను లాఘవమువలన తత్ప్రతీతి క్రమము, లక్షింపఁబడకున్నదని తాత్పర్యము.

[ఇందలి భావార్థమేమనిన :— "వాచ్యము - రసాదివ్యంజకముకాకపోవీ శబ్దమువలననే రసాది ప్రతీతికానీ, అయినను రసాది ప్రతీతి-ఉత్పాదయితవ్యమగు నపుడు వాచకశక్తి-సహకారిగ అపేక్షింపఁబడకతప్పదు. కావున వాచ్యప్రతీతి-వ్యంగ్య రసాదిప్రతీతికి పూర్వభావియగుట తప్పని సరియేయగును" అని. (వాచ్య ప్రతీతి కలిగిన వెనువెంటనే వ్యంగ్యరసాదిప్రతీతి కలుగుచుండుటవలన-సహస్రపత్ర-పత్ర భేదనమునకువలె-తత్ క్రమము కానుపింపకున్నది. కాని వానికి పౌర్వాపర్య రూపమగు క్రమమున్నది. కావుననే రసాదులు అసంలక్ష్య క్రమ-వ్యంగ్యములగుచున్నవని తాత్పర్యము.]

**మూలము** :— [అవ :— గీతశబ్దమునందువలె, కావ్య శబ్దమునందుఁగూడ వాచకశక్తి యుపయోగించునదికాదు. ఏ కావ్యమున-శబ్దము వినఁబడినను రస ప్రతీతి కలుగదో, ఆ కావ్యమున ప్రకరణ జ్ఞానము-సహకారియై యుండుటలేదని చెప్పవచ్చును అని యాశంకించి చెప్పుచున్నాఁడు.]

రసాది ప్రతీతి-వాచ్య ప్రతీతిలేకయే ప్రకరణాది విశిష్టమగు శబ్దమాత్రముచేతనే సాధ్యమగు నెడల నపుడు, ప్రకరణ జ్ఞానము గలవారును (సందర్భము నెఱింగినవారును, అయినను) వాచ్య వాచకభావమును స్వయముగా నెఱుఁగనివారునునగు శ్రోతలకు ఈ రసాది ప్రతీతి-కావ్య (శబ్ద) మాత్ర శ్రవణము వలననే కలుగవలసివచ్చును.

ప్రభామతి :— (రసాది ప్రతీతి కంతటికినిగూడ ప్రకరణాది సహకృత శబ్ద శ్రవణ ప్రత్యక్షమే కారణమగునెడల-ప్రకరణము నెఱిఁగినను తత్తద్వాచక శబ్దమునకు-తత్ తద్ వాచ్యార్థమును స్వయముగా నెఱుఁగని శ్రోతలకుఁగూడ, కావ్య శబ్దమును విన్నంత మాత్రముచేతనే రసాది ప్రతీతి కలుగవలసివచ్చును. కాని యట్లు కలుగుటలేదు. కావున కావ్య జన్య వ్యంగ్యరసాదిప్రతీతికి, తద్వాచ్యార్థ ప్రతీతియే-కారణమని యవశ్యముగా నంగీకరింపవలయును.)

ప్రకరణ జ్ఞాన సహకృతమగు కావ్యశబ్దమాత్రమును వినుటచే రసోదయ మెట్లగును?

ప్రకరణ జ్ఞానమనునది యేది ?

వాక్యాంతర సహాయత్వమా? లేక, వాక్యాంతర-సంబంధివాచ్యమా?

వాక్యాంతర-తద్వాచ్య-ఉభయ పరిజ్ఞానమున్నను-ప్రకృతవాక్య ఘటకములగు తత్తత్పదముల యర్థము తెలియనియెడల రసోదయము కానేరదు.

[“వాక్యము రసాది ప్రతీతిని కలిగించునపుడు అదృష్టవిశేషముగూడ సహకారి కావలయును. ఆయదృష్టవిశేషము లేకుండుటవలననే వాచ్యప్రతీతివిరహ(రహిత) కాలమునందు రసాది ప్రతీతి కలుగుటలేదు” అను శంకనుపరిహరించుచున్నాఁడు.]

వాచ్యప్రతీతి కలుగునపుడు రసాదిప్రతీతి కలుగుట, అదిలేనపుడు రసాది ప్రతీతి లేకుండుట, అను, అన్వయమును, వ్యతిరేకమును వాచ్య ప్రతీతికిఁగలవు.

వాని నపలాపించి-మాత్సర్యముచేత, రసప్రతీతి-తదభావ-ప్రయోజకముఁగా నాశ్రయించిన, అదృష్టసద్భావ-తదభావములు, ప్రయోజనకారులు గానేరవు.

["అదృష్టమున్నయెడల రసప్రతీతియగుననియు, అదృష్టములేనియెడల రస ప్రతీతి కాదనియుఁ జెప్పుట-ప్రయోజనకారిగాదు" అనిభావము.]

మూలము :— [అవ :— "వాచ్యప్రతీతి యుపయోగించిన నుపయోగించునుగాక! క్రమాశ్రయణముచే నగు ప్రయోజనమేమి?

ఉపయోగమనఁగా: ఏకసామగ్ర్యధీనతాలక్షణమగు సహభావ మాత్రమేగదా!" అని యాశంకించి చెప్పుచున్నాఁడు.]

వాచ్య-వ్యంగ్య ప్రతీతులకు సహభావముండునెడల-వాచ్య ప్రతీతి కుపయోగముండదు. (వానికి) ఉపయోగమున్నయెడల సహభావ ముండదు.

ప్రభామతి :— పూ :— రసాది ప్రతీతి విషయమున వాచ్యప్రతీతి కుపయోగమున్న నుండునుగాక!

వాచ్య-రసాది ప్రతీతులకు పౌర్వాపర్యక్రమము నాశ్రయించుట యెందులకు?

సి :— అట్లయిన నీయభిప్రాయమున నుపయోగమనునది యేది?

పూ :— వాచ్యప్రతీతి సంబంధియగు నుపయోగము-రసాది ప్రత్యాయక సామగ్ర్యధీనత్వరూపమగు రసాది సహభావమే" [అని యాశంకించి చెప్పుచున్నాఁడు.]

(వాచ్య-వ్యంగ్యప్రతీతులు సమకాలీనములని చెప్పునెడల, కార్య కారణ భావ కల్పనారూపలాఘవముండునని యాశంకించి ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.)

వాచ్య-వ్యంగ్య ప్రతీతుల కుపకార్యోపకారకభావము స్వీకరింపఁబడునపుడు సహభావశంక నిరవకాశమగును.

అనుపకారకమునందగు నుపయోగము-సంజ్ఞాకరణమాత్రమే-అనఁగా వస్తుశూన్య (ఉపకారకత్వరూప పదార్థశూన్య)మే యగునుగదా!

(కుడి-యెడమకొమ్ములకు వలె, వాచ్య-వ్యంగ్య-ప్రతీతులకు సహభావమగు నపుడు, వాచ్య ప్రతీతి-వ్యంగ్యప్రతీతికి జనకముఁగాదు. కావున దానికనుపయోగము ప్రసక్తించును. అది యుపయోగించునపుడు-వాచ్య-వ్యంగ్యప్రతీతులకు-కారణ-కార్య భావమును జెప్పవలసివచ్చును. కార్యకారణభావము నంగీకరించునపుడు సహభావము (యౌగపద్యము) నంగీకరించుట కవకాశము కలుగదు. కావున వాని కవశ్యముగా క్రమము స్వీకరింపఁదగినది.) (దీధితి 301.)

మూలము :— (అవ :- ఇచ్చట మాత్రమే కాదు. గీతాది శబ్దజాతమగు రసాది ప్రతీతియందుఁగూడ క్రమమున్నదని చెప్పుచున్నాఁడు.)

స్వరూప విశేష ప్రతీతి నిమిత్తమగు వ్యంజకత్వముగల గీతాది శబ్దముల స్వరూప ప్రతీతికిని-వ్యంగ్యప్రతీతికినిగూడ నియమ భావియగు క్రమమున్నది.

ప్రభామతి :— "ఉపకారి-పూర్వభావి" అని (పూర్వపక్షివగు) నీవుకూడ నంగీకరించితివిగదా? అని చెప్పుచున్నాఁడు. "స్వరూప విశేష నిమిత్తమగు" అని. ఉపకారియగు గీత శబ్ద స్వరూప విశేష ప్రతీతి-రసాది ప్రతీతికి, పూర్వభావియని నీవుకూడ నంగీకరించితివి. మేముకూడ నీ దృష్టాంతముచేతనే "వాచ్యప్రతీతి-రసాది ప్రతీతికి, పూర్వభావి" అని సమర్థించెదము.

(గీతాది శబ్దములవలన మొదట స్వరూప ప్రతీతి అనఁగా; శ్రావణ ప్రత్యక్షము కలిగి, పిమ్మట, రసాది ప్రతీతి కలుగుచుండుటచేత వానికిఁగూడ పౌర్వాపర్యము నంగీకరింపక తప్పదని భావము.)

మూలము :— [సంఘటనలు - క్రమమును - ప్రకాశింప నీయవు] [అవ :- క్రమమున్నయెడల నేల సంలక్షితముకాదు? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.]

కాని శబ్ద క్రియాసంబంధియగు అపౌర్వాపర్యము (వాచ్య-వ్యంగ్యముల క్రమము, లేక, అభిదావ్యంజనలక్రమము) వాచ్యావిరుద్ధము-వాచ్య విశేష విలక్షణము-అగు రసాదికము ప్రతీయమానమగునపుడు అనన్య సాధ్యములును-తత్ ఫలములును (రసాది ప్రతీతియే ఫలముగా గలవియు) అగు (మాధుర్యాదిలక్షణ) (సం) ఘటనలు-ఆశుభావినులు కాఁగా, (ఆశుభావినులగుటవలన) సంలక్ష్యము గాకుండును. [కాన్పింపకుండును.]

ప్రభామతి :—"క్రియేతే + ఇతి = క్రియే" అను వ్యుత్పత్తి ననుసరించి,శబ్ద జన్యములగు క్రియలిచట, వాచ్య-వ్యంగ్య ప్రతీతులని గ్రహింపవలయును. లేక-అభిధా వ్యాపారమును - వ్యంజనాపరపర్యాయమగు ధ్వననవ్యాపారమునుగూడ క్రియలేయగును. కావున వానినిగూడ గ్రహింపవచ్చును. తత్ క్రియల పౌర్వాపర్యము = పూర్వాపరభావరూపము క్రమము-కనఁబడకున్నది.

ప్రశ్న :— అక్రమమెచ్చటఁగాన్పించుటలేదు?

ఉ :— రసాది విషయమునఁగాన్పించుటలేదు. (వాచ్యప్రతీతి - రసాది వ్యంగ్యప్రతీతుల-పౌర్వాపర్యము కాన్పించుటలేదని భావము.)

ప్రశ్న :— అరసాదిక మెటువంటిది?

ఉ :— వాచ్యముతోడి విరోధములేనిది-అయినను, అభిధేయ (వాచ్య) విశేషముకంటె భిన్నమైనది.

వాచ్యముతోడి విరోధముగల వ్యంగ్యమునందగు క్రమము సంలక్ష్యమే యగును. అభిధేయముకంటె భిన్నమైనదనుటచేత-రసాదిప్రతీతి, సర్వథా, అనభిధేయమే యనియు (అభిధచేఁదెలుపఁబడనిదియేయనియు) కావుననే క్రమము గలదియే యనియుఁజెప్పఁబడినదగుచున్నది.

ప్రశ్న : — అక్రమము ఏల కాన్పించుటలేదు?

ఉదా :— ఇంతకుముందే గుణ నిరూపణావసరమున మాధుర్యాది లక్షణములగు ఘటనలు ప్రతిపాదింపఁబడినవి-అవి-'అనన్య సాధ్యములు, తత్ఫలములు' అగుచున్నవి. అనఁఘటనలు ద్రుతతరభవన శీలములు. (వడివడిగా ప్రవర్తించుచుండును) కావున వాని క్రమము కాన్పించుటలేదు.

ప్రశ్న :— అనన్య సాధ్యములు-తత్ఫలములు అనఁగానేమి?

ఉ :— ఆయా సంఘటనలచే నాయారసములు ప్రకాశింపఁజేయఁబడును. కావున రసాదిప్రతీతియే (వేఱొకటికాదు) సాధింపఁదగినదిగాగలవి = అనన్య సాధ్యములు. ఆ రసాది ప్రతీతియే (ప్రత్యాయనమే) ఫలముగాఁగలవి = తత్ఫలములు. ఈ రెంటును సంఘటనలకు విశేషణములు. ఓజోఘటనవలన రౌద్రాదిప్రతీతియే సాధ్యమగును గాని కరుణాదిప్రతీతి సాధ్యముకాదుగదా! సంఘటనా ఫలము రసాది ప్రతీతియే యగును.

దీనిభావమేమనిన :— గుణవంతమగు కావ్యమున-ఒక సంఘటన-స్వవిషయమున వేఱొక సంఘటనతోడి సంకీర్ణత నొందకుండునట్లు ప్రయోగింపఁబడును. కావున క్రమము కాన్పింపదు.

ప్రశ్న :— సంఘటనల స్థితి - యట్లుండుగాక! వాచ్య-రసాది ప్రతీతుల క్రమమేల కాన్పించుటలేదు?

ఉ :— సంఘటనలాకుభావినులగుటయే, అనఁగా, వాచ్య ప్రతీతి కాలమును ప్రతీక్షింపకయే, యీ సంఘటనలు-అధిక శీఘ్రమున రసాదులను భావింపఁజేయుటయే = రసాస్వాదమును గలిగించుటయే-కారణము. ఇందలి పరమార్థమిది.

(ఈ యంశమునే సదృష్టాంతముగా వివరించుచున్నాఁడు)

రసాదులు-సంఘటనా వ్యంగ్యములగుటవలన-అర్థ విజ్ఞానమున కుపయోగము లేకున్నను, వాచ్యార్థజ్ఞానముకంటె ముందుగానే-ఉచితమగు సంఘటనయొక్క- శ్రవణము నందే ఇంచుక రసాస్వాదము కలుగును. అల్పమగు రసాస్వాదము-వాచ్య ప్రతీతి కలిగిన పిమ్మట మిగుల స్ఫుటమగు నాస్వాదముతోఁగూడుకొనును. ఆయాస్వాదము-వాచ్య ప్రతీతికలిగిన పిమ్మట నుదయించినట్లు కన్పింపదు. అభ్యస్తమగు [మాటిమాటిని తెలియఁబడుటవలన చిరపరిచితమగు] విషయమునందు-అవినాభావ [వ్యాప్తి] ప్రతీతి క్రమము-ఇట్లే గుర్తింపఁబడునది కానేరదు.

సమానమగు విషయమున జ్ఞానముల యభ్యావృత్తియే-అభ్యాసము. సంస్కారము-బలవంతము. కావున విషయమునందు జ్ఞాతకు-ఏకాగ్రతలేకున్నను ఈ యభ్యాసమే-స్మృతి రూప ప్రబోధమును గలిగించుచు-నిరంతరమగునట్లు అతని హృదయమును నిలుపును.

ఎచ్చట నెచ్చట - ధూమముండునో-అచ్చట నచ్చట అగ్నియుండును. అను వ్యాప్తి-సంస్కారరూపముచేత హృదయము (అంతఃకరణము) నందుండుటవలన-పర్వతమున ధూమ దర్శనము [ధూమము-పర్వతాదివృత్తి అనుజ్ఞానము, అనఁగా, పక్ష ధర్మతాజ్ఞానము] మాత్రమే-పర్వతమునందు-అగ్నియున్నదను అనుమితి యందుపయోగించి-అదియే (అపక్షధర్మతాజ్ఞానముమాత్రమే) పరామర్శస్థానము నాక్రమించు చుండును. ధూమాదిజ్ఞానము-ఎంత శీఘ్రముగా గలిగినను, ఆ ధూమాదికము నందు-వహ్నివ్యాప్తియొక్క- స్మృతి-ఉపకరింపకతప్పదు. అయినను ధూమాదిజ్ఞాన-వ్యాప్తి-స్మృతులకంటె వేరగు ప్రణిధానానుసరణము మొదలగు ప్రతీతిభేదములు వాని నడుమను అనుప్రవేశింపవు. కావున మిక్కిలి శీఘ్రముగానే అగ్నిప్రతీతి (పర్వతాదులయందు - అగ్నియొక్క- అనుమితి) కలుగును అప్పుడు, వ్యాప్తి-స్మృతి-అనుమితుల క్రమము-గుర్తింపఁబడునది కానేరదు. అట్లే యిచ్చటఁగూడ-అభ్యాసబలముచేత వాచ్య-రసాది-ప్రతీతుల క్రమము గుర్తింపఁబడునది కానేరదు. కావుననే "రసాదులు-అసంలక్ష్య క్రమవ్యంగ్యములు" అని పేర్కొనఁబడుచున్నవి.

కాని యీ రసాదికము-వాచ్యావిరోధి కానప్పుడును, అనఁగా: వాచ్యమునకు విరోధియగునప్పుడును, అభ్యస్తమగు సంఘటన-సముచితముగానప్పుడును,వాచ్య-వ్యంగ్య-ప్రతీతిక్రమము గుర్తింపఁబడును. [సంలక్ష్యమేయగును.]

మాకంటె ముందుగానే-ఈ గ్రంథమునకు "చంద్రిక" అను వ్యాఖ్యను గావించిన ఒక వ్యాఖ్యాత-"అనన్యసాధ్య తత్ఫలఘటనలు" అను నిచ్చట-"పతిత మను పఠతి" అను న్యాయమున గజనిమీలికతో—

"తస్యఫలమ్ = తత్ఫలమ్, తద్వాఫలమ్ = తత్ఫలమ్, వాచ్య - వ్యంగ్య ప్రతీతాత్మకమ్. తస్య-ఘటనా = నిష్పాదనా, యతోఽనన్యసాధ్యా-శబ్దవ్యాపారైక జన్యా" అని వ్యాఖ్యావించియున్నాఁడు. ఆ వ్యాఖ్యయందున్న అర్థ సతత్త్వమును మేము-ఇంచుకయుఁగూడ గ్రహింపఁజాలకున్నాము. అయినను మా పూర్వవంశ్యులతో మాకియధిక వివాదమెందుకు? [లోచనము].

["శబ్దఫలనిష్పాదనము, లేక వాచ్యవ్యంగ్య ప్రతీత్యాత్మకమగు ఫల నిష్పాదనము-శబ్దవ్యాపారైకజన్యము. అనునిందలి యర్థము-సంగతముకాదు" అని అభినవ గుప్త పాదాచార్యుల యభిప్రాయము. లోచనకర్తకు పూర్వవంశ్యుఁడగు నొక వ్యాఖ్యాత-ధ్వన్యాలోకమునకు "చంద్రిక" అనువ్యాఖ్యను, లోచనముకంటె ముందుగానే రచించినట్లు-దీనివలన స్పష్టపడుచున్నది.]

మూలము:— [అవ :— సంఘటనావ్యంగ్యము కానిచోట-(అను రణనరూప సంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనియందు) ఈ క్రమము కాన్పించుచునే యుండునని చెప్పుచున్నాఁడు.]

కొన్నిచోటులందీక్రమము సంలక్ష్యమగుచునే యుండును.

దీని కుదాహరణములుగా - అనురణనరూప వ్యంగ్య (సంలక్ష్య క్రమరూపవ్యంగ్య) ప్రతీతులను జూపునది. అచ్చటఁగూడ నెట్లది కాన్పించుననినఁజెప్పుచున్నాము.

ప్రథమతి :— (సంలక్ష్య క్రమవ్యంగ్యరూప ధ్వని యందగు-వాచ్య-వ్యంగ్య ప్రతీతి క్రమము-స్పష్టమే అనిభావము.)

వ్యంగ్యత్వము తుల్యమగుచుండునపుడీభేదమెట్లు కలిగినదని యాశంకించుచున్నాఁడు.

(ఆయాశంక యెట్టిదనిన :— "రసాదికమువలె-తదితరమగు ననురణన వ్యంగ్యముగూడ వ్యంగ్యమేగదా? అట్టిచో, వ్యంగ్యరసాదికము-అసంలక్ష్య + క్రమమగు నెడలను, అనురణనరూప వ్యంగ్యము మాత్రము-సంలక్ష్య + క్రమమగుట యెట్లు")

ప్రశ్న :— రసాదికమువల్లె నీయనురణన వ్యంగ్యార్థముగూడ సంఘటన చేత వ్యంజింపఁజేయఁబడునది కాదా? (సంఘటనా వ్యంగ్యము కాదా?)

ఉ :— కాదు-అనురణనరూప (సంలక్ష్యక్రమ) వ్యంగ్యము-సంఘటనచేతఁ బ్రకాశితముకాదు. అవివక్షితవాచ్యమువలె నీ యనురణన వ్యంగ్యముగూడ, పద-వాక్య-ప్రకాశితమే యగును. ఈ యంశము పూర్వమే యిట్లు చెప్పఁబడినది.

కం॥ అవివక్షిత వాచ్యంబు, ప
ద వాక్యములచేఁ బ్రకాశితమగు, తదన్యం
బవుచు-ననురణన రూపం
బవు ధ్వనియును నట్లె ద్వివిధమై వెలుఁగొందున్॥

కాఁగా, అవివక్షితవాచ్యధ్వనివలె, సంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనికూడ-సంఘట నాదులచేత వ్యంజింపఁజేయఁబడక-పద-వాక్యములచేతనే వ్యంజింపఁజేయఁబడును.

మూలము :— (అనురణన వ్యంగ్యమెట్లు సంలక్ష్యక్రమ వ్యంగ్యమగుచున్నదో ప్రదర్శించుచున్నాఁడు)

అర్థశక్తిమూలమగు ననురణన ధ్వనియందు - అభిధేయ (వాచ్యార్థ)మునకును-తత్సామర్థ్యాక్షిప్తమును (కావుననే) వాచ్యాంతర విలక్షణమును నగు వ్యంగ్యమునకును-అత్యంత విభిన్నములగు ప్రతీతులు కలవు. వానికిఁగల కార్యకారణభావము నపలాపించుటకు శక్యముకాదు, కావున నచ్చటనున్న పౌర్వాపర్యము స్పష్టమేగదా!

ప్రథమోద్ద్యోతమునందు వ్యంగ్యార్థసిద్ధికై యుదాహరింపఁబడిన గాథలిందుల కుదాహరణములు.

ప్రభామతి :— (అర్థశక్త్యుద్భవమగు సంలక్ష్య క్రమవ్యంగ్యధ్వనియందు, కారణీభూతమై యభిధేయమగు వాచ్యార్థప్రతీతికిని-తత్సామర్థ్యముచే వ్యంజనీయమగు వ్యంగ్యార్థప్రతీతికినిగల క్రమము స్పష్టమేయగుచున్నది. కావున-నదిలేదనుటకు వీలుకలుగదు)

[వాచ్యార్థముకంటె వేఱగు, వ్యంగ్యార్థమును సిద్ధింపఁజేయుటకై ప్రథమోద్ద్యోతమునందుదాహరింపఁబడిన "సంచరింపు ధార్మికుఁడ" ఇత్యాదికములగు గాథలిందుల కుదాహరణమని గ్రహింపునది. అవియచ్చటనే వ్యాఖ్యానింపఁబడినవి. (ఆం-ధ్వ-ప్రథమోద్ద్యోతము పరిశీలింపునది. ప్రథమ భా 10వ పేజీ].

మూలము :— విషయము-తథావిధమై (పౌర్వాపర్యక్రమవంతమై) యుండగా, వాచ్య వ్యంగ్యములత్యంత విలక్షణములగుటవలన - వాచ్యప్రతీతియే-వ్యంగ్యప్రతీతియని చెప్పుటకు శక్యము కాదు.

ప్రభామతి :— (అత్యంతభిన్నములగు - వాచ్య-వ్యంగ్య ప్రతీతులను-ఏకీక రించుట-సాధ్యేతరమని భావము.)

అనురణన వ్యంగ్యధ్వని - సంలక్ష్య క్రమము. ఈ సంలక్ష్యక్రమధ్వని, ధ్వనికారమతమున ద్వివిధము. ఈ యంశము "అనురణనతుల్యమగుచు" అను పద్యముచే ద్వితీయోద్యోతమునఁదెలియఁజేయఁబడినది. (చూ ప్రథమ భా 140 పేజీ) అందొకటవది-శబ్ద శక్తి మూలము. రెండవది-అర్థశక్తి మూలము. "శబ్ది శక్తి వలన" "ఉక్తిలేకయె" అనుపద్యములు వాని లక్షణములను దెలియఁజేయు చున్నవి. (చూ- ప్రథమ భా 141-163. పేజీలు). ఏతద్ ధ్వనిభేదములయంద త్యంతమును స్పష్టమగునట్లు వెలయుచున్న వాచ్య-వ్యంగ్య ప్రతీతుల కార్యకారణ భావము-దురపహ్నవము. కావున తదేకీభావము సంభవము కానేరదని తాత్పర్యము.

మూలము :— (సంలక్ష్య క్రమవ్యంగ్యధ్వని ప్రభేద మింకొకదానియందుఁగూడ నీక్రమమును వ్యవస్థాపించుచున్నాఁడు)

"శబ్ద శక్తి మూలానురణనరూప వ్యంగ్యమగు ధ్వనియందో-
"సముచిత కాలాక్లిష్టసముత్ స్పృ
ష్టపయస్సులఁబ్రియమిడి ప్రజకెల్లన్
........భాస్వద్గోతతి యామోదముఁగూర్చెడు
ననఘులయిన మీకునన్:"

ఇత్యాదులయందగు నర్థద్వయప్రతీతి-శాబ్ది (శబ్దనిష్ఠాభిధా మూలిక)యైనను ఉపమావాచక పదవిరహ మొదవునపుడు - ఈ యర్థద్వయమునకగు నుపమానోపమేయభావ ప్రతీతి-అర్థ సామర్థ్య ముచే నాక్షిప్తయగును. కావున నచ్చటనైతము అభిధేయ(వాచ్య)-వ్యంగ్యాలంకార-ప్రతీతుల పౌర్వాపర్యము-సులక్షితమే యగును.

ప్రభా :— సంస్కృతమున 'యథా, ఇవ' ఇత్యాదిక ముపమావాచకపదము. ఆంధ్రమున, అట్టు,వలెన్,(పోలెన్) ఇత్యాదికము. అర్థ సామర్థ్యముచేన్ = వాక్యార్థ సామర్థ్యముచేత—

ప్ర :— మయూరకవి కృతమగు మీఁది పద్యమున ప్రస్తుతమగు సూర్య కిరణరూప వాచ్యమును-అప్రస్తుతమగు ధేనురూప వ్యంగ్యమునుగూడ సాక్షాత్తుగాను పరంపరాగాను శబ్దనిష్ఠాభిధామూలకములే. కావున పౌర్వాపర్యక్రమునుదటలేదని చెప్పఁదగదా:

ఉ :— అట్లు చెప్పఁదగదు - ఇందలి ప్రథమార్థము - అభిధచేతను-ద్వితీయము-అభిధామూలమగు వ్యంజనచేతను-ప్రకాశింపఁజేయఁబడుటవలన నీయుభయమును శబ్దసాధ్యమేయయినను, తదుపరి-ఈయర్థద్వయము-అసంబద్ధముగాకుండునట్లు చేయుటకు - అప్రస్తుత - ప్రస్తుతార్థములకు-ఉపమాన-ఉపమేయ భావమును గల్పింపవలయును.

ఆర్థియగు తత్ప్రతీతి-వ్యంజనాలభ్యమే యగును. కాగా నిట్లు-అర్థద్వయ ప్రతీతికిని-ఉపమాప్రతీతికిని-మొదటను-తరువాతను గలిగిన క్రమ ప్రతీతి-అచ్చటఁ గూడ స్ఫుటమేయగును. బాలప్రియ యిట్లనుచున్నది :— "ద్వితీయార్థముకాద-అభిధేయమే-తదుపమ మాత్రము వ్యంగ్యము" అనునభిప్రాయమున నిట్లు చెప్పఁబడినది.

మూలము :— (అవ :— ఇట్లు వాక్య ప్రకాశ శబ్ద శక్తి మూలమగు ధ్వనియందగు వాచ్య-వ్యంగ్యప్రతీతుల, పౌర్వాపర్యమును విచారించి, ఇప్పుడు పదప్రకాశ శబ్దశక్తి మూలమగు ధ్వనియందగు, తత్క్రమమును విచారించుచున్నాఁడు.)

పదప్రకాశ శబ్దశక్తిమూలానురణన వ్యంగ్యమగు ధ్వనియందుఁగూడ, ఉభయార్థ సంబంధయోగ్యమగు విశేషణ పదమునకు (అట్లు, వలె ఇత్యాదిరూపమగు) యోజక, పదములేకుండ (ఉభయార్థ సామానాధికరణ్యముచేనగు) యోజనము-అశాబ్దము. (శబ్దముచేత ప్రతిపాదింపబడనిది.) అయినను-అది (తద్యోజనము) అర్థమువలన (వ్యంజనాత్మకమగు నర్థశక్తిచేత) సులక్షిత మగుచుండును.

కావున నచ్చటఁగూడ పూర్వమునందువలె అభిధేయ(వాచ్య) ప్రతీతికిని, తత్ సామర్థ్యాక్షిప్తమగు నలంకార మాత్ర ప్రతీతికిని, గల పౌర్వాపర్యము-సుస్థితమే (సులక్షితమే).

ప్రభామతి :— పూర్వముదాహరింపఁబడిన "ధనములొసంగి యర్థిజనతా సుమనోరథ పూరణంబొనర్చు నియతిఁగూర్చుకున్న....... జలాశయంబుగనొనన్ను జడాకృతి నూతిఁగానొ.......అను నుదాహరణమును మనస్సునందునిచికొని-వ్యాఖ్యానింపుచున్నాఁడు. యోజనమనఁగా; ఇందు 'జడాకృతిన్' అనుపదమును-నూతికిని-

అస్మత్పదార్థమగు 'నన్నున్' అనుదానికిని,(ఉభయమునకును) అభేదసంబంధముచే విశేషణమగునట్లు సంఘటించుటయే, అభిధేయమగు వాచ్యాలంకారమును, (వాచ్యమును) వాచ్య సామర్థ్యాక్షిప్తమగు వ్యంగ్యాలంకారమును, పౌర్వాపర్యక్రమవంతములే-అనిభావము, "అభిధేయ అలంకారమాత్ర" అనుచోనున్నమాత్ర గ్రహణముచేత మీఁది పద్యమునందు (శబ్దశక్తిమూలస్థలములనందు)గూడ, ప్రతీయమానమగు రసాదికము-సంలక్ష్యముకాక-అసంలక్ష్యమేయగు ననునంశము ప్రవర్తితము.

(ఇందు "జడాకృతి" అనుపదము దారిద్ర్యముచేత నిర్విణ్ణుఁడగు నొకనిచే నుచ్చరింపఁబడినది. కావున నీ పదము, మొదట నభిధచే వక్తృ విశేషణార్థమును బోధించును. తరువాత, 'వలెన్' ఇత్యాది సాదృశ్యవాచక పదములేకుండినను, అభిధామూలమగు వ్యంజనచేత కూడ, విశేషణార్థమును బోధించును. పిమ్మట వ్యంజనారూపమగు నర్థశక్తిచే, తదధికమగు స్వాపకర్ష సూచనమువలన వ్యతిరేకమును వ్యంజింపఁజేయును. కావున పూర్వోదాహరణమునందువలె నిచటఁగూడ వాచ్య-వ్యంగ్యాలంకార ప్రతీతుల పౌర్వాపర్యము సంలక్షితమే యగునని భావము).

[జడత్వము ఉభయత్ర-అన్వయించుటవలన ఇందభిధేయమగు నలంకారము-దీపకము. తత్ సామర్థ్యాక్షిప్తమగు నలంకారము-ఉపమ. మీఁది పద్యమునందు సంలక్ష్యక్రమమగు వ్యంగ్యము-నిర్వేదము.] బాలప్రియ 411 పేజీ.

(మాత్రశబ్దము-ఇచటఁగూడ శాంతరసప్రతీతి-అసంలక్ష్యక్రమమే యగునని సూచించుచున్నది) దీధితి 304.

మూలము :— (అవ :– ఒక్కటియే యగు వైయంజనిక ప్రతీతికి - శబ్దశక్త్యుద్భవత్వరూపమగు శాబ్దత్వమును-అర్థశక్త్యుద్భవత్వరూపమగు ఆర్థత్వమును విరుద్ధమని యాశంకించి చెప్పుచున్నాఁడు.)

ఇచ్చట-అర్థియగు ప్రతిపత్తి (వ్యంజన)కూడ "ఉభయార్థ (వాచ్య-వ్యంగ్య) సంబంధయోగ్య-శబ్ద సామర్థ్య-ప్రభావిత" కావున శబ్దశక్తిమూలమని కల్పింపఁబడును.

ప్రభామతి :—, "ఉభయార్థ" అను విశేషణముండుటవలన నిచట విరోధమేదియు లేదు. ఇందలి యభిప్రాయము నిట్లుండగునది. 'ధనములొసంగి' అను నిచట వాచ్య ప్రతీతికిని-అలంకార ప్రతీతికినిగల క్రమము వివక్షింపఁబడినది.

ఇందలి యలంకార ప్రతీతి-అర్థశక్తిచేత (అర్థవ్యంజనచేత) కలిగినది. ఈ యలంకార ప్రతీతికి సాక్షాత్తుగాఁగాని,పరంపరగాఁగాని అభిధ-కారణముకాదు. కావున నిందలి వ్యంగ్యాలంకార ప్రతీతి - వాస్తవముగా శబ్దశక్తిమూలముకాదు. అయినను

అదిలేనిదే కలుగని దగుటవలన శబ్దశక్తి మూలమని కల్పితము. కాఁగా తృతీయ ప్రతీతియందగు నార్థత్వము వాస్తవికమును, శాబ్దత్వము-కల్పితమును నగును. కావున నీరెంటికిని నెట్లో కలిగిన సమావేశము విరుద్ధనుకాదు. (ధీధితి 305.)

మూలము :— (అవ :— వివక్షితాన్యపరవాచ్య ధ్వని ప్రకారములు రెండింటనుగూడ నిట్లు క్రమవ్యవస్థాపనము నొనర్చి-అవివక్షితవాచ్యధ్వనియందుఁగూడ-ఈ క్రమమును వ్యవస్థాపించు చున్నాఁడు.)

అవివక్షితవాచ్యధ్వనియందగు వ్యంగ్యార్థ ప్రకాశనముగూడ-ప్రసిద్ధమగు స్వవిషయమునందలి (స్వశక్యార్థమునందలి) వైముఖ్య ప్రతీతిని తొలుతఁగలిగియుండునదియే. కావున నందును క్రమము నియమముగానే యున్నది.

ప్రభామతి :— అభిధామూలమగు వివక్షితాన్య పరవాచ్యమునందగు వ్యంగ్య వ్యంజకముల క్రమమును ప్రతిపాదించి యీ క్రమమంతటను గలదని ప్రదర్శించు టకై చెప్పుచున్నాఁడు.

లక్షణా మూలధ్వనియగునవివక్షితవాచ్య ధ్వనియందుఁగూడ వ్యంగ్యార్థ బోధనమునకు ముందు వాచ్యార్థబాధగ్రహరూపమగు ప్రతీతిగలదు. కావున నచటఁ గూడ వాచ్య వ్యంగ్యప్రతీతులకు పౌర్వాపర్యమున్నది.

[లోచనము] వాచ్యమునకును, వాచ్య సామర్థ్యాక్షిప్తమగు అలంకారమాత్ర ప్రతీతికిని, అనుచోటనున్న మాత్రపద గ్రహణముచేత "శబ్దశక్తిమూలమగు స్థలమునందుఁగూడ-రసాది ప్రతీతి-అలక్ష్యక్రమమే" అగునను నర్థము ప్రద ర్శితము. "ధనములొసంగి" అనుచోట వ్యంజితమగు నిర్వేదము-అసంలక్ష్య క్రమవ్యంగ్యమే యగునని గ్రహించునది.

పూర్వ :— అర్థత్వము, శబ్దశక్తిమూలత్వముకూడనగు ననునది విరుద్ధము కాదా? సిద్ధాం :— "ఉభయార్థ" ఇత్యాది విశేషణ ముంచుటవలన నిచ్చట విరోధ మేమియులేదు. ఈ యంశమును శబ్దశక్తి మూలానురణన ధ్వని నిరూపణమునందు ముందే విపులముగాఁజెప్పియుంటిమి. కావున మరల వివరింపము.

మూలము :— [అవ :— "అవివక్షితవాచ్య ధ్వనియందగు నా క్రమమును సంలక్ష్యమని కాని, అసంలక్ష్యమనికాని, నామధేయ నిరూపణ ద్వారమున నేల విచారింపలేదు" అని యాశంకించి ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.]

అవివక్షిత వాచ్యధ్వనియందు వాచ్యము వివక్షింపఁబడదు. కావుననే (గ్రంథకర్త) యచట వాచ్య-వ్యంగ్య ప్రతీతులయందగు క్రమము విచారింపఁడయ్యెను.

ప్రభామతి :— వాచ్యము-వివక్షితమగునెడల వాచ్య-వ్యంగ్యప్రతీతి-క్రమమును విచారింపవలయును. అవివక్షిత వాచ్యధ్వనియందు వాచ్యము-వివక్షితము కాదు. కావున నచటఁగల క్రమము-"సంలక్ష్యము" (చక్కఁగా గ్రహింపఁదగినది) అని కాని "అసంలక్ష్యము" (రసాది ప్రతీతియందువలె చక్కఁగా గ్రహింపఁదగనిది) అని కాని విచారింపఁబడదయ్యెను. ఇట్లనుటచేత నచట క్రమములేదని చెప్పుటకు వీలుకలుగదు. ఇచ్చట వాచ్యార్థమున కసంగతి ప్రతీతి కలిగినతరువాత వ్యంగ్యార్థ ప్రతీతి కలుగుటవలన, వాచ్య-వ్యంగ్య ప్రతీతులకు సహభావమునుగూడ శంకించుటకు వలనుపడదుగదా!

ప్రభామతి :— [లోచనము] "అయాః కైశిక్యాదులగు వృత్తులకు రసాదులు జీవితము" అను నంశము నుపక్రమించి ఇట్లసంగతముగ వాచ్య-వ్యంగ్య ప్రతీతి-క్రమమును విచారించి-ఉపసంహరించుచున్నాఁడేల?" అని యాశంకించి క్రింది యవతారిక-లోచనకర్తచేత ప్రసాదింపఁబడినదని గ్రహించునది.)

మూలము :— (అవ:— కైశిక్యాదులు, ఉపనాగరికాదులు, అగువృత్తులకు రసాదులు-జీవితమనియు, తన్నియంత్రిణ హేతువులనియు, ప్రస్తుతమై తెలుపఁబడిన ప్రసంగమున "రసాదులు-వాచ్య వ్యతిరిక్తములు" అను నంశమును సమర్థించుటకు వాచ్య-వ్యంగ్య-ప్రతీతి, క్రమము-విచారింపఁబడినది. అది యిప్పుడు-ఉపసంహరింపఁబడుచున్నది.)

కావున అభిధాన-అభిధేయ ప్రతీతులకువలె (శబ్దార్థ ప్రత్యక్షములకువలె) వాచ్య-వ్యంగ్యప్రతీతులకు నిమిత్త-నిమిత్తి భావము వలన క్రమము తప్పకున్నది.

శబ్దరూపమగు నభిధానముయొక్క జ్ఞానము కలిగినపిమ్మట నర్థరూపమగు నభిధేయముయొక్క జ్ఞానము కలుగును.

"విషయత్వమనాపన్నైః శబ్దైర్నార్థః ప్రకాశ్యతే"

"శ్రవణాది జ్ఞాన గోచరములు కాని (శ్రోతలబుద్ధికి తెలియఁబడని) శబ్దములచేత అర్థము ప్రకాశింపఁజేయఁబడదు"

ఇత్యాదికమగు నభియుక్తోక్తి కలదు. కావుననే ఒకఁడు ఒకానొక పదమును సరిగా విననపుడు-అనఁగా శబ్దరూప నిశ్చయము కలుగనపుడు "ఏమనుచున్నావు" అని శబ్దార్థజిజ్ఞాసచేతనితరుని ప్రశ్నించును. కావున నిట్లు పదప్రత్యక్షము అర్థబోధమునకు కారణమగుట వలన శబ్దార్థ ప్రతీతులకు క్రమమున్నట్లు, వాచ్య, ప్రతీతి-వ్యంగ్యార్థ ప్రతీతికి కారణమగుటవలన - వాచ్యవ్యంగ్య ప్రతీతులకుఁగూడ-పౌర్వాపర్యము (క్రమము) గలదని గ్రహింపవలయును.

అయినను తత్క్రమము-పూర్వోక్తమగు యుక్తిననుసరించి యొక్కొకచోటఁగానుపించు చుండును. వేఱొకచోటఁగాన్పింపకుండును.

ప్రభామతి :— (సంలక్ష్యక్రమవ్యంగ్య ధ్వనియందు, తత్ప్రతీతులకు విలంబముండుటవలన, తత్ క్రమము కాన్పించుననియు, రసాది రూపమగు నసంలక్ష్య క్రమవ్యంగ్యధ్వనియందు, విలంబములేకుండుటవలన-క్రమము కాన్పింపదనియు తెలియఁగునది. తృతీయోద్ద్యోత ప్రారంభమున "ధ్వనిస్వరూప నిరూపణము-వ్యంజకముఖముసఁగావింపఁబడును" అని తెలుపఁబడినది. ఆయంశమిక్కడికి పరిసమాప్తి నొందింపఁబడినది. దీని తరువాత-విపక్షమతములన్నియు ఖండింపఁబడి ధ్వనివాదము-ప్రస్థాపింపఁబడును" అని అంతేవాసులమగు మేము ధ్వన్యాలోకమును 1931వ సంవత్సరమున శ్రీవారియొద్ద అధ్యయనము నొనర్చునపుడు-అస్మద్గురువరేణ్యులగు మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు, శాస్త్ర రత్నాకరులు, శ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రులవారు ప్రవచించి యుండిరి. కావున-ఈ ద్వితీయభాగము నిచ్చటికి ముగించుచున్నాము. పాఠకులు తరువాతి విషయమును తృతీయభాగము నందు పరిశీలింపఁగోరెదను. 1-10-1938 తేదీ నాటికి ఈ గ్రంథమును సమగ్రముగా-ఆంధ్రీకరించి దీనిని 2-2-1942 తేదీ నాటికి శ్రీ సద్గురువరేణ్యులకు సమగ్రముగా వినిపించి సంస్కరించుకొంటిని. 1-10-1944 తేదీకి ప్రథమ-ద్వితీయ-ఉద్ద్యోతములు గల ప్రథమ భాగము-శ్రీ భారతీ దేవతాప్రసాదమున ప్రకటింపఁబడినది. ఇప్పుడిది-ఇట్లు ప్రకటితమైనది. తృతీయభాగము త్వరలో ప్రకటింపఁబడునట్లు భారతి యనుగ్రహించుఁగాక!

ఓమ్, తత్, సత్.

ఇది శ్రీ భారతికి సమర్పితము.

---

శ్రీ వేదవ్యాస ప్రెస్ — విజయనగరము.

# కృతి సమర్పణ సమయ సందేశములు

శ్రీమత్పరదేవతాయైనమః.

* ఆ శీ ర్వ చ న ము

౧

శ్లో॥ యశ్శివో నామ రూపాభ్యాం
యా దేవీ సర్వమంగళా
పాయాస్తాం, తావిమం
లక్ష్మీనారాయణ కవీశ్వరమ్.

౨

పంతుల బ్రహ్మన్న పండిత సత్కవీ
        శ్వరుని పేరెఱుఁగని వారు లేరు
అత్యాశుకవితకు నా విజ్ఞుఁ బోలిన
        విద్వత్కవీంద్రులు పృథివిలేరు
నలువదేండ్లకు మున్ను పలువు రమ్మహనీయు
        చిత్ర చరిత్రంబు చెప్పవింటిఁ
బిమ్మటఁదద్వంశ్యుఁ బిన్నవయ్యును బుద్ధి
        మత్తచే పెద్దవై మలయు నిన్నుఁ

---

* 1944 సం॥రం సెప్టెంబరు 24 తేదీని విజయనగరమందు మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారి అధ్యక్షత క్రింద వాగ్దేవతకు ఆంధ్రధ్వన్యాలోక కృతి సమర్పణ మహోత్సవము జరుపఁబడినది. ఆ సందర్భమున బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు గ్రంథకర్తయందుఁగల వాత్సల్యముచే పంపిన "ఆశీర్వచనము" ఇచట ప్రకటితము.

2

గాంచి యమ్మహితాత్మని గనని కొఱఁతఁ
దీర్చికొంటివి నీ కబ్బ దీర్ఘమైన
మంచి జీవిత; మీవు రచించు పొత్త-
మలరుఁగాక ధ్వన్యాలోక మిలఁజిరంబు.

౩

శాఖవాఁడవు నాకన్నఁ జాలఁ జిన్న
వాఁడ వాశీస్సు లందెడి వాఁడ వౌట
వర్ణనీయంబు నీ బుద్ధి వైభవంబు
నించుక స్పృశించియును విస్మరించనైతి.

౪

భగవంతుం డిడుఁగాక నీకుఁగవితా
వంశంబుతో పాటు హే
చ్ఛగు సద్వంశపు వృద్ధి; భూపతుల దీ
వ్యద్దివ్య సంస్థానముల్
సుగుణు న్నిన్ను బహూకరించుత; బుధ
శ్లోక్యంబు నీ శ్లోకమై
నెగడుం గావుత నీవు మేల్మి సిరులన్
దీపింతు గాకెల్లెడన్;

౫

ఇప్పుడనుకొన్న నేమగు నీవు నల్వ
దేఁడులకు మున్ను జనియించి తేని అల్ల

శ్రీ మదానంద గజపతి శ్రీమహేశుఁ
జూచి యందు వాతండు భోజుండు ధ్రువము.

క్షీరసాగరం బిల్డింగ్సు,
గవర్నరు పేట,
బెజవాడ.
తే 15—9—44 ది.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
శ్రేయోభిలాషి,
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.

★

* Andhra University
Vice-Chancellor :
Sri C. R. Reddy, K.T.,
Hon. D. Litt., M.L.C.

Guntur,
D/ 18th Sept'44.

*My Dear Sir,*

I am glad to hear that the Dedication and Rangadhirohanam cermonies of the well-known Pandit, Sri Lakshminarayana Sastry's Telugu Translation of Dhvanyalokam will be celebrated on the 24th Sept. The Pandit is a scholar of first-rate capacity and I am sure that the Telugu Dhvanyalokam will be a clossic in its line. My greetings, congratulations and best wishes for the occasion.

*Yours Sincerely,*
C. R. Reddy.

---

* ఇది ఏతత్ సందర్భమున శ్రీ కట్టమంచి రామలింగరెడ్డిగారు ప్రసాదించిన సందేశము.

# అభిప్రాయములు.

★

["ఆంధ్ర ధ్వన్యాలోకము" – ప్రథమభాగముపై సహృదయుల అభిప్రాయములలో కొన్ని]

1

"........................" బీజం యస్య పురార్జితం సుచరితమ్.......................................................................
అనుచెప్పున ఉదయించిన కవితకు నెన్నింటితో చుట్టరిక ముండవలయునని ఆ శ్లోకములో జయదేవుఁడు చెప్పెనో అవియన్నియు నితనికి సమకూరిన వనినచో సూత్రప్రాయముగా నితని ప్రజ్ఞను నుడివి నట్లగును.........

........"వత్సే మాగా విషాదమ్" లోనైన శ్లోకముల యనువాదము నాకు మిక్కిలి సంతృప్తిని కల్గించినది........

........ఆయీ అనువాదము-సర్వథా ఉభయభాషా ప్రవీణాది పరీక్షలకుఁజదువు విద్యార్థులకేగాక, యఫ్. ఏ., బి. ఏ. లకు జదువు విద్యార్థులకుఁగూడ మిక్కిలిగా నుపయోగించునని నా యాశయము.

"విద్యా శాఖాధికారు లీయన పరిశ్రమకు సార్థక్యము కలిగింతురని నమ్మెదను........"

బెజవాడ,
1—1—1942. } శతావధాని, చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు.

2

C. R. REDDY,
Vice-Chancellor,
Andhra University.

Camp, Chittoor,
Dated 11—10—'44.

*Dear Sir,*

I have read your Telugu Translation of Dhvanyalokam with great pleasure. You deserve the warmest congratulations of the Telugu Public on our successful rendering of a classical treatise.

*Yours Sincerely,*
C. R. REDDY,

3

"..........మూలాన్ని లేశమాత్రమూ అతిక్రమించకుండా ధారాశుద్ధితో, పద్యరచనలో శాస్త్రీయవిషయకమైన జటిలత్వాన్ని నిరూపించేరు.........."

—కళా ప్రపూర్ణ, రావు సాహెబు,
హిందూకేసరి,
గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు.

4

"..........ధ్వన్యాలోకము..........చక్కని శైలితో నిర్దుష్టముగా సరసముగా వ్రాసియున్నారు..........వీరి కవిత్వము మిక్కిలి చక్కని పాకమునఁబడి యున్నది. వీరి కవిత్వమునందు తెలుఁగు పదములకన్న సంస్కృతపదము లధికములై యున్నవి. శైలి మృదుమధురముగా నుండి పాఠకుల నాకర్షింపఁగలదని నా యభిప్రాయము.

30—12—41. }

—కవి సార్వభౌమ, ఆంధ్రాస్థానకవి,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

5

"........, తర్క-వ్యాకరణ శాస్త్రవై దుష్యమును, అలంకార శాస్త్రాఽసాధారణ పాండిత్యమును, సంస్కృతాంధ్రభాషా సునిశిత సాహిత్యమును, నిరర్గళాంధ్ర కవితా చాతురియుఁ గలవారికి మా త్ర మే ధ్వన్యాలోకాంధ్రీకరణము సాధ్యమగును. అట్టి వివిధ కళా సామగ్రికలంకారము గ-నీయన కవిత సుప్రసన్న మధుర మగుటయు, నీతని ఛందోరీతి-సంగీత ప్రసాదిత శ్రావ్యతా పరి మిళితమగుటయుఁ బ్రశంసనీయములు. "ఆంధ్రవాగ్దేవత 'యేతా దృశ గ్రంథరత్నమును వెలయింపనెంచియే యిట్టి దుర్లభసామగ్రి కేకత్రావస్థానమును బ్రసాదించె"నని నా యభిప్రాయము.

ఆంధ్రమున నలంతిగ నున్న "కావ్యాలంకార సంగ్రహా"ది గ్రంథములు విద్యార్థుల కలంకారశాస్త్ర పరిచయ మాత్ర మొదవింపఁజాలునే కాని, లోచనాది వ్యాఖ్యాన విషయములతో సైతము విస్తరముగ వివరింపఁబడియున్న యీ "ఆంధ్ర ధ్వన్యాలోకము" వలె నలంకార శాస్త్ర పాండిత్యము నొదవింపఁజాలవు.

ఆంధ్రభాషామతల్లి నిట్టి యపూర్వామూల్యాలంకారముచే న లం క రిం చి న యీతఁడాంధ్రుల కృతజ్ఞతకుఁబాత్రుఁడగు చున్నాడు........"

విజయనగరము, 3—3—1944. — 'క ళా ప్ర పూ ర్ణ' వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు.

"........................................

నాటు తెలుగున-వేలుపు మాట గుట్టు .
తెలుపఁజాలిన చదువరి కలుగఁ డరుదు;

ఈ నదుల కూడుపడి-పిన్నయైనఁగాని
పెద్దపనిచేసె, మిక్కిలి పేరు పొందు,

—హరికథా పితామహులు,

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు.

7

“........ఈ రీ[illegible]ంగ్ల శాస్త్రమును మున్నెవ్వరును తెనిఁగింపలేదు. దీని నాంధ్రీకరించుట మిక్కిలి కష్టము, అయిన నీ గ్రంథము రసవంతమై, సుబోధకమై యున్నది........”

రాజమహేంద్రవరము, 30—12—41. } చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు.

8

“........మహా పండితైక సాధ్యమగు నిట్టి కార్య మొనరించి బుధజనోపకారము చేయుట మీ యట్టి........విద్వత్కవులకుఁదక్కఁదక్కవారికి నిక్కముగా సాధ్యపడని పనియని చెప్పుట సాహసము కానేరదు........”

— “విద్వత్కవి”

ఆకుండి వేంకట శాస్త్రిగారు.

9

“........శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి కృతి సర్వాంధ్రలోక శిరోధార్యమైనది. అచ్చముగా మాతృకానువాదము ధ్వన్యాలోకమునకుఁ గావలసియే యున్నది. శ్రీ అవ్వారివారు సూత్రములను పద్యములలో వ్రాసిరి. బందరువారు గద్యవ్యాఖ్యగా వ్రాసిరి.

అట్లుగాక శ్రీ శాస్త్రులవారు చేసినది నిజముగా సత్యుత్తమమైన కార్యము........మీ రచన నాకు శిరసా గ్రాహ్యముగా నున్నది"

—కవి సమ్రాట్
విశ్వనాథ సత్యనారాయణగారు.

10

"....ఆంధ్రవిద్యార్థి లోక[illegible] "ఆంధ్ర[illegible]ము చేసిన మహోపకారము సూరిజనస్తవనీయమై యున్నది. అందులకుఁ గృతజ్ఞతావందనము లందుకొను భారము తమకిఁకముందు తీఱనిదిగా నుండఁగలదు. జగన్నియంత యట్టితరుణము నేర్పాటు చేయఁగలఁడు........"

సంద్యాల,
31—3—45.

'కావ్యతీర్థ' విద్వాన్,
మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

11

"...తమ ధ్వన్యాలోకము...మిక్కిలి సరళముగాను, మృదుమధురముగను, హర్షదాయకముగను, మనోహరముగనున్నది. ఇట్టి యుత్కృష్టాలంకార గ్రంథము తమరాంధ్రీకరించుటెంతయు నాంధ్రుల మహాభాగ్యోదయము......పద్యములు హృదయంగమములు. ఆంధ్ర వివరణమును మిక్కిలి యుపయోగకరము......మూలానుసారముగా భావశబలత, అర్థగాంభీర్యము, రసౌచిత్యము మొదలగు విషయములు బీరువోకుండ నాంధ్రీకరించితిరి......తమ కృషి యెంతయు శ్లాఘనీయము"

బెజవాడ,
20—3—1954.

—కవిరాజ, కవిరత్న
చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిగారు.